## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120020599

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నీతివాక్యామృతం

## (సోమదేవుని నీతిసూత్రాలు)

ఆంధ్రవ్యాఖ్య

**డా. పుల్లెల శ్రీరామచంద్రుడు**




ప్రచురణ

**సంస్కృత భాషా ప్రచార సమితి**

హైదరాబాదు - 500 001

శ్రీః

# కృతిసమర్పణ

శ్రీ ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారికి

తత్త్వశాస్త్రైకనిధయే విశ్వసంచారికీర్తయే,
సమర్ప్యతే కృతిరియం సచ్చిదానందమూర్తయే.

శ్రీ కొత్తవంశదుగ్ధాబ్ధిరాకాపూర్ణసుధాకర,
'నీతివాక్యామృతం' భూయాద్భవతో మానసామృతమ్.

పుల్లెల శ్రీరామచంద్రుడు

# విషయసూచిక

శ్రీః

# ప్రస్తావన

మహాదర్శనికుడు అసాధారణ కవితాశక్తి సంపన్నుడూ అయిన సోమదేవుడు రచించిన 'నీతివాక్యామృతం' సార్థక నామధేయమైనది. దీనిలోని ఒక్కొక్క వాక్యం, ఏకకాలంలో అనేకులకు బుద్ధివైశద్యాన్ని కలిగించే అమృత సిక్తమైన ఔషధగుళిక వంటిది. నేటి కర్ణాటరాష్ట్రంలోని ధార్వాడ ప్రాంతానికి చెందిన సోమదేవుడు దేవసంఘజైనసంప్రదాయ పాలకుడు. యశోదేవుని శిష్యుడైన నేమిదేవుని శిష్యుడు. 'స్యాద్వాదాచలసింహ', 'తార్కికచక్రవర్తి' 'వాదీభపంచానన' 'వాక్కల్లోలపయోనిధి,' 'కవికులరాజ' మొదలైన ఇతని బిరుదాలు జైనమహాపండితుడుగా, అత్యుత్తమకవిగా ఇతనికున్న యశస్సును చాటుతున్నాయి. 'యశస్తిలకచంపువు' అనే నామాంతరం గల 'యశోధర మహారాజచరితం,' 'షణ్ణవతి ప్రకరణం,' 'మహేంద్ర మాతలి జల్పం,' 'యుక్తి చింతామణి సూత్రం' లేదా 'యుక్తి చింతామణి స్తవం' మొదలైనవి సోమదేవుని ఇతరరచనలు. రాష్ట్రకూటరాజైన కృష్ణరాజదేవుడు పాండ్య - చోల - చేర - సింహళదేశాలను వశం చేసికొని మాన్యఖేటం రాజధానిగా ఏర్పరచుకొని రాజ్యం ఏలుతూన్న కాలం అది. ఆ కృష్ణరాజదేవుని సామంతుడూ అరికేసరి కుమారుడూ అయిన వాగరాజు రాజధాని అయిన గంగాధారా నగరంలో నివసిస్తూ సోమదేవుడు యశస్తిలకచంపువును రచించి క్రీ.శ. 959 వ సంవత్సరంలో దానిని పూర్తి చేశాడు.

యశస్తిలకచంపూరచనానంతరమే సోమదేవుడు ఈ నీతివాక్యామృతాన్ని నిర్మించాడు. మైసూర్ విశ్వవిద్యాలయానికి సంబంధించిన ఓరియంటల్ రిసర్చి ఇన్స్టిట్యూట్ వారు దీనిని 1957 వ సంవత్సరంలో 'సోమదేవ రాజనీతి సూత్రాణి' అనే పేరుతో ప్రచురించారు. 'నీతివాక్యామృతం' అనే పేరుకు అంతగా ప్రాధాన్యం ఇవ్వకుండా ప్రారంభంలో మాత్రమే బ్రాకట్లలో ఆ పేరు ఇచ్చి ఉన్నారు. మేము కూడా వారినే అనుసరించి ఈ గ్రంథంలో అంతటా

'రాజనీతిసూత్రాణి' అనే పేరే ఉపయోగించడం జరిగింది గాని 'నీతి వాక్యామృతం' అనే పేరే యుక్తమైనది. "ఏ పేరు పెట్టినా గులాబీ పువ్వు పరిమళం ఒకే విధంగా ఉంటుంది కదా?" అనే ఇంగ్లీషు సామెత భావాన్ని స్మరించి సరి పెట్టుకోవాలి.

నీతివాక్యామృతంలో 32 ప్రకరణాలు మొత్తం 1550 సూత్రాలు ఉన్నాయి. ప్రకరణాలకి సముద్దేశా లని పేరు. ప్రతిపాదించే విషయాలను పట్టి ఆ యా సముద్దేశాలకు 'ధర్మసముద్దేశం' 'అర్థసముద్దేశం' ఇత్యాది విధంగా నామ దేయాలు ఇవ్వబడ్డాయి. ఈ సూత్రా లన్నీ అతిసులభమైన భాషలో మనోహర ములైన లోకోక్తులతో నిండి ఆహ్లాదకరంగా ఉంటాయి. 'నీతి' శబ్దానికి నడవడిక అని అర్థం. ఒక వ్యక్తి కుటుంబంలోని ఇతర సభ్యులతోను, సమాజంలో ఉన్న వివిధ ప్రవృత్తులు గల మనుష్యులతోను, అధికారులు మొదలైన వాళ్ళతోను ఎలా ప్రవర్తించాలి, అధికారులు తమ విధులను ఎలా నిర్వహిస్తూ ఇతరులతో ఏవిధంగా ప్రవర్తించాలి అనే విషయాన్ని బోధించేదే నీతిశాస్త్రం. అందుచేత దీని పరిధిలోనికి రాని మనిషి అంటూ ఉండడు. అత్యున్నతాధికారినుంచి అతి సామాన్యుడైన మనిషి వరకూ ప్రతి ఒక్కరూ ఈ విషయాలను తెలిసికొనవలసినదే. అలాంటి అనేకమైన నీతిశాస్త్రగ్రంథాలలో ఈ నీతివాక్యామృతం ఒక్కటి. జాగ్రత్తగా పరిశీలించి సమన్వయించుకుంటే దీనిలోని విషయాలు నూటికి ఎనభై ఈనాడు కూడా అందరికీ ఉపయోగిస్తాయి.

ఐదవ తరగతి పాఠ్యపుస్తకాలు మొదలు యమ్.ఏ. పాఠ్యపుస్తకాల వరకు మనకు ఆధునిక విద్యావేత్త లందరూ నూరిపోస్తున్న దానిని పట్టి "బౌద్ధ జైనమతాలు హిందూమతం అని చెప్పబడే సనాతనమతానికి పూర్తిగా విరుద్ధ మైనవి. అవేవో భారతావనిలో హటాత్తుగా ఆవిర్భవించిన కొత్త మతాలు" అనే అభిప్రాయం కలుగుతుంది. అందుచేతనే ఏవేవో వైయక్తికరాజకీయాది కార ణాలచేత సనాతనమతంలోని కొన్ని అంశాలు నచ్చనివారు కొందరు దానిని దూషిస్తూ బౌద్ధ జైనమతాలని ప్రశంసిస్తూ ఉంటారు. ఈ రెండు మతాలకీ సంబంధించిన వాఙ్మయంతో ఏ మాత్రం పరిచయం ఉన్నా ఈ మతాలలోని నియమాలు సనాతనమతంలోని నియమాలకంటె కూడ ఎంత కఠోరంగా ఉంటాయో తెలుస్తుంది. శమదమాదుల ద్వారా చిత్తశుద్ధి సంపాదించుకొనకుండా

'అహం బ్రహ్మాస్మి' అంటూ అర్ధనిమీలితనేత్రాలతో కూర్చుంటే ఎంత ప్రయోజనమో, ఆ మతాలలో చెప్పిన నియమాలు పాటించకుండా, కనీసం అవేవో తెలుసుకొనకుండా, "బుద్ధం శరణం గచ్ఛామి," "ధర్మం శరణం గచ్ఛామి" అంటూ కూర్చున్నా అంతే ప్రయోజనం. మతస్వరూపం తెలియనివాడు, తెలిసికొని కొంచెమైనా కార్యరూపంలో పెట్టనివాడు ఏ మతంలో ఉన్నా ఒకటే.

జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ రెండు మతాలూ కూడా సనాతనమతంలోని కొన్ని అంశాలను వ్యతిరేకించినా కర్మసిద్ధాంతం మొదలైన చాలా అంశాలను తమలో ఇముడ్చుకొన్న తన్మతైకదేశాలే అని స్పష్టం అవుతుంది. ఈ సందర్భంలో సనాతనమతానికి సంబంధించిన కొన్ని ఆచారాలు, కొన్ని సిద్ధాంతాలు క్రొత్తగా వేరుపడిన బౌద్ధాది సంప్రదాయాలలోనికి ఏ విధంగా సంక్రమించాయో వినయపిటకాలను ఆంగ్లభాషలోనికి అనువదించిన T.W. రేస్‌డేవిడ్స్, H. ఓల్డెన్‌బర్గ్ అనే పండితులు తదితరులు వ్రాసినవి ఉద్ధరించడం అప్రస్తుతం కాదు.

"The Patimokkha ....... seems to have owed its existence to the ancient Indian custom of holding sacred two periods in each month, the times of the full-moon and the new moon. The Vedic ceremonies of the Darsapurnamasa sacrifice, and of feast or sacred day (Upavasatha) connected with it are known to have been very old, and the custom of celebrating these days would naturally handed on from the Brahmans to the different Samanas and be modified and simplified (though as it seems, sometimes increased in number) by them, in accordance with their creeds and their views of religious duty............ The monks of others, that is, of non-Buddhistic sects, used to meet together at the middle and at the close of every half month and were accustomed then to proclaim their new teachings in public............ The Buddhists also adopted the custom of these periodical meetings but confined themselves to meeting twice in each month." (Vinaya Texts, Part I, Introduction.P.X.)

"As is well-known, this Ignorance (Avidya) plays a great part also in the Brahmanical philosophy of the Upanisads; and the Buddhist's belief is no doubt founded to a considerable extent on older theories."

(V. T. Part I. P. 76.)

J. G. Jennings writes in 'The Vedantic Buddhism of Buddha' - "It should never be forgotten that Buddhism is a reformed Brahmanism as is evidenced by the invariably honorific use which Gautama makes of the title 'Brahmin' and it therefore takes for granted certain Vedic or Vedantic postulates. The background of Buddhism, as that of Brahmanism, is Brahman, the impersonal divine unity underlying and harmonising all individualities, all egoism, all differences, and all strifes."

నీతివాక్యామృతంలో సోమదేవుడు రాజ్యపరిపాలనావిధానాన్ని గూర్చి ముచ్చటించే సందర్భంలో సనాతనమతానికి చెందిన వర్ణాశ్రమవిధానాన్ని నిర్దేశిస్తూ రాజ్యపాలనం తదనుసారం నడవాలని అంటాడు (చూ. త్రయీ సముద్దేశం మొ.) పురాణాది ప్రసిద్ధ దేవతలనందరినీ అక్కడక్కడ పేర్కొంటాడు. వర్ణాశ్రమభేదాన్ని వ్యతిరేకించేదిగా ప్రసిద్ధమైన జైనమతానికి సంబంధించినవాడూ ఆ దర్శనంలో మహాపండితుడూ అయిన రచయిత నిర్మించిన గ్రంథంలో ఇలాంటి విషయాలు ఉండడం కొంత విడ్డూరంగానే కనబడి, రెండు సందేహాలకి దారి తీస్తుంది. ఈ సోమదేవుడు జైనుడు కాదేమో అనేది మొదటి సందేహం. జైనుడే అయినా చాలా వరకు కౌటిల్యుని అర్థశాస్త్రం మొదలైన ప్రాచీన గ్రంథాలను అనుసరించి వ్రాసిన గ్రంథం అవడం చేత ఆ విషయాలు యథాతథంగా దీని లోనికి తీసికొని ఉంటాడు అనేది రెండవ సందేహం. అయితే పునఃపరిశీలనలో ఈ రెండు సందేహాలకీ తావు లేదని స్పష్టం అవుతుంది. 'నీతివాక్యామృతం' పుష్పికలో (గ్రంథాంతగద్యంలో) సోమదేవుడు జైనుడని చెపుతూ అతని బిరుదావళి పేర్కొనబడింది. (చూ. Yasastilaka and Indian culture by K. K. Handiqui, p. 1.). ఎందుచేతనో మైసూర్ ప్రతిలో ఈ పుష్పిక ఇవ్వ

లేదు. యశస్తిలక చంపువులో ఉన్న విషయాలు కొన్ని చోట్ల యథాతథం గానూ, కొన్ని చోట్ల స్వల్పమైన మార్పులతోను 'నీతివాక్యామృతం'లో చేర్చబడి ఉన్నాయి. దీనిని పట్టి వీటి ఏకకర్తృకత్వం, నిశ్చితం. ఈ క్రింది ఉదాహరణలు ఈ విషయాన్ని స్పష్టీకరిస్తాయి.

| | యశస్తిలకచంపు | నీతివాక్యామృతం |
|---|---|---|
| 1 | "దుర్ధర్మో హి రాజా కార్యాకార్య విపర్యాసమాసన్నైః కార్యతేఽతి సందీయతే చ ద్విషద్భిః న హి నియోగినామసతీనామివ భర్తృవ్యసనాదపరః ప్రాయేణాస్తి జీవనోపాయః" పేజి. 373 <br> "వ్యాధివృద్ధౌ యథా వైద్యః శ్రీమతామహితోద్యతః. వ్యసనేషు తథా రాజ్ఞః కృతయత్నా నియోగినః" పేజి. 374. | "దుర్ధర్షో హి రాజా కార్యాకార్య విపర్యాసమాసన్నైః కార్యతేఽతి సందీయతే చ ద్విషద్భిః. వైద్యేషు శ్రీమతాం వ్యాధివర్ధనాదివ నియోగిషు భర్తృవ్యసనవర్ధనాదపరో నాస్తి జీవనోపాయః" (17. 36, 37) |
| 2. | "ఏకామాత్యే మహీపాలే నాలం లక్ష్మీర్విజృంభతే, లతాయాస్తత్ర కా వృద్ధిః శాఖైకా యత్ర శాఖినః" పే. 455 | "బహుసహాయే రాజ్ఞి ప్రసీదన్తి సర్వ ఏవ మనోరథాః" (10. 78) "కిమేక శాఖస్య శాఖినో మహతీ భవతి చ్ఛాయా" (10. 80) |
| 3. | అన్తఃపురే భూమిపతిర్మదాన్ధః కరోతి యః సంగతి మఙ్గనాభిః, తస్య ధ్రువం స్యాదచిరేణ మృత్యుర్బిలప్రవేశాదివ దర్దురస్య (నాల్గవ ఆశ్వాసం. పేజి. 153) | "దర్దురస్య సర్పగృహప్రవేశ ఇవ స్త్రీ గృహప్రవేశో రాజ్ఞః" (24. 31) |
| 4. | "స్వభావ సుభగావేశోఽపి చ శాస్త్రోపదేశః స్త్రీషు శస్త్రీష్వివ పయోలవః పరం పరోపఘాతాయైవ భవతి" (నాల్గవ ఆశ్వాసం. పే. 152) | "నాతీవ స్త్రియో వ్యుత్పాదనీయాః; స్వభావసుభగోఽపి శాస్త్రోపదేశః స్త్రీషు పయోలవ ఇవ విషపుతాం భజతే" (24. 43) |

5. "స్త్రియో హి నామ భవన్తు భర్తృషు శయ్యావిషయే పుత్రేషు చ ప్రతిపాలనసమయే ప్రకామం నిసృష్టార్థాః నిరఙ్కుశాచరణ సమర్థాశ్చ; న పునః పౌరుషేయేషు కర్మసు యస్మాత్కమలినీదలేషు జలకణస్యేవ నారీణాం మనసశ్చఞ్చలత్వాదతీవ నిఃసారత్వాచ్చ పురుషోఽపి గృహకార్యాదన్యత్ర స్త్రియం ప్రమాణయన్ నదీప్రవాహపతితః పాదప ఇవ న చిరం నన్దతి. స్త్రీ తు పురుషముష్టిస్థితా ఖడ్గయష్టిరివ సాధయత్యభిమతమర్థమ్" (నాల్గవ ఆశ్వాసం. పేజి. 135)

"అపత్యపోషణే, గృహకర్మణి, శరీరసంస్కారే శయనావసరే స్త్రీణాం స్వాతన్త్ర్యం నాన్యత్ర," (24. 39) "స్త్రీవశపురుషో నదీప్రవాహపతితః పాదప ఇవ న చిరం నన్దతి" (24. 41) "పురుషముష్టిస్థా స్త్రీ ఖడ్గయష్టిరివ కముత్సవం న జనయతి" (24. 42)

6. యశోధరచంపువులో ఒక గూఢచారి ఒక మంత్రి చేస్తూన్న దుష్టాచార్యాలను గూర్చి రాజుకు చెపుతూ ఆ మంత్రి "లంచలుంచానిశాచరుడు" అని వర్ణిస్తాడు.

"కార్యార్థినః పురుషాన్ లఞ్చలుఞ్చానిశాచరాణాం భూతబలీన్ న కుర్యాత్. లఞ్చలుఞ్చా హి సర్వపాతకానామాగమనద్వారమ్" (17.38,39)

7. యశస్తిలకచంపు ఏడవ ఆశ్వాసంలో పింతాస్థానం వర్ణన ఉన్నది. ఇది అతి విశాలమైన, నాలుగు మైళ్ళ వైశాల్యం గల అంగడి (Market place). దీనిలో లభించని వస్తువు ఉండదు. పశువులు మొదలైనవి కూడా అమ్మకానికి ఉంటాయి. దీనిని రాజ్యమే నిర్వహిస్తుందన్నట్లు కనబడుతుంది.

వర్తకం నగరమైన పింతాస్థానాన్ని చక్కగా నడిపితే అది కామధేనువు వలె ఉపకరిస్తుంది అని నీతివాక్యామృతంలో చెప్పబడింది. "న్యాయేన రక్షితా పణ్యపుటభేదినీ పిణ్డా రాజ్ఞాం కామధేనుః" (19.21)

8 ద్వాదశవర్షా స్త్రీ షోడశవర్షః "ద్వాదశవర్షా స్త్రీ, షోడశవర్షః పుమాన్ పురుషః, తయోరన్యోన్యమనన్య ప్రాప్తవ్యవహారౌ భవతః (31.1)
సామాన్యస్నేహరసోత్సేకప్రాదు
ర్భూతిః ప్రీతిః....స్వర్గః. (పే. 317)

ఈ విధంగా యశస్తిలకచంపువులో ఉన్న ఇంకా ఎన్నో భావాలు నీతి వాక్యామృతంలో కనబడుతున్నాయి అందుచేత ఈ రెండింటి రచయితా ఒకడే అనడంలో ఏమాత్రం సందేహం లేదు. యశస్తిలకచంపువు జైనసంప్రదాయానికి చెందిన సిద్ధాంతాలను బోధించడంకోసం ఉద్దిష్టమైనదనే విషయం లోకప్రసిద్ధం.

యశస్తిలకచంపువులో కూడా అనేక స్థలాలలో వర్ణభేదాదుల్ని సమర్థిస్తూన్న వాక్యాలు ఉండడం గమనార్హం. "నృపతిప్రతిష్ఠాని చ ఖలు దేహినాం వ్యవహారతన్త్రాణి వర్తన్తే. నృపత్యాయత్తాః పుణ్యపాపహేతవో వర్ణాశ్రమాచార వ్యవస్థాశ్చ" (నాల్గవ ఆశ్వాసం), "దీక్షాయోగ్యాస్త్రయో వర్ణాశ్చత్వారశ్చ విధోచితాః'' (ఎనిమిదవ ఆశ్వాసం). దీనిని పట్టి జైనులు సైద్ధాంతికంగా వర్ణభేదానికి వ్యతిరేకులయినా ఆ యా కాలాలలో సంఘంలో ఉన్న నియమాలని పాటించడానికి సిద్ధంగా ఉండేవారని తెలుస్తూన్నది. అందుచేతనే సోమదేవుడు యశస్తిలకచంపువు ఎనిమిదవ అధ్యాయంలో—"జాతులూ, వాటి ఆచారాలూ అనాదిగా వస్తున్నాయి. వాటికి ప్రమాణం వేదాలు కావచ్చు; ఇతర శాస్త్రాలు ఏవైనా కావచ్చు. దానివల్ల మాకేమీ నష్టం లేదు. వ్రతానికి లోపం రానంతవరకు, సామాజిక వ్యవహారం అంతా సక్రమంగా నడుస్తూన్నంతవరకూ జైనులమైన మాకు లౌకికాచారా లన్నీ ప్రమాణమే" అని అంటాడు.

"జాతయోఽనాదయః సర్వాస్తత్క్రియాపి తథావిధా,
శ్రుతిః శాస్త్రాన్తరం వాస్తు ప్రమాణం కాత్ర నః క్షతిః."
"సర్వ ఏవ హి జైనానాం ప్రమాణం లౌకికో విధిః,
యత్ర సమ్యక్త్వహానిర్న యత్ర న వ్రతదూషణమ్."

జైన గ్రంథాలలో లభించే ఈ విషయా లన్నీ దృష్టిలో ఉంచుకొని K.K. హాండికి అనే పండితుడు (ఈయన గౌహతి విశ్వవిద్యాలయానికి వైస్‌ఛాన్సలర్‌గా ఉండేవారు) "యశస్తిలక అండ్ ఇండియన్ కల్చర్" (1949) అనే గ్రంథంలో ఇలా వ్రాశాడు:

"Jaina writers often attack the Hindu caste - system and we need refer only to the strictures of Jatasimhanandi on the theory of castes in his Varangacarita, 25, 2. ff. It is, however, well - known that the caste system is present among the present day Jains almost to the same extent as among the Hindus; and it has been said that "in practice the modern Jaina is as fast bound as his Hindu brother in iron fetters of caste" (331). "In Dharwar, for example, Jain Kshatriyas have disappeared, but Jain Brahmins. Vaisyas and Sudras remain Jain Sudras are also called Jain Caturthas. There are various restrictions on inter dining. If Karnataka Jains go to Gujarat they do not dine with Gujarat Jains, nor when they come to Dharwar the Gujarat Jains dine with local Jains" (Foot - note, P. 331) "Evidence recorded by Somadeva in Yasastilaka goes to show that conditions were not far different in the tenth century. He says for instance, that the three higher castes are alone eligible for religious initiation." (331)

"We are told that in Tamil the term 'Velvi' is always used to denote fire-ritual while the expression 'Veda-velvi' is used in ancient Tamil literature in the sense of Vedic sacrifice. Whenever the term 'Velvi' is used alone it merely means fire ritual without involving animal sacrifice. Such a fire ritual has never been condemned by Jains while they were staunchly opposed to Vedic sacrifice on the ground of Ahimsa. Even now, among the Tamil Jains fire ritual is a common thing. During their marriages they do have the characteristic marriage-Homa with all its necessary detail. Even in temple-worship it is a common practice among the south Indian Jains."-(P. 333)

జైనమతస్థులు కూడా వర్ణవిభేదాదుల్ని పాటించేవారు, ఇప్పటికి కూడ పాటిస్తున్నారు అని దీని సారాంశం. అయితే ఇక్కడ వర్ణాశ్రమాదివిభాగాల యుక్తాయుక్తత్వపరిశీలన ప్రస్తుతవిషయం కాదు. హిందూసమాజంలో ఇప్పటికే ఉన్న భేదాలు చాలక స్వలాభాపేక్షతో కొత్త విభేదాలు సృష్టించడం మంచిది కాదని చెప్పడమే మా లక్ష్యం. అంత గట్టిగా కొట్లాడుకున్న శైవవైష్ణవ సంప్రదాయాదులు ఎలా హిందూమతాంతర్గతాలో అలాగే జైనబౌద్ధమతాదులు కూడా హిందూమతానికి సంబంధించినవే కాని వేరు మతాలు కాదు అని చెప్పడానికే ఇంత వ్రాయవలసివచ్చింది. సనాతనమతంలోని కొన్ని అంశాలను గ్రహించి కొన్నింటిని తిరస్కరించిన ఆర్యసమాజ - బ్రహ్మసమాజాదులు హిందూమతబహిర్భూతాలనడం ఎంత సత్యదూరమో బౌద్ధజైనమతాలు అత్యంత భిన్నములైన మతాలు అని చెప్పడం కూడా అంత సత్యదూరమే. ప్రొటెస్టెంట్- కాథలిక్ సంప్రదాయాలవారు క్రిష్టియన్లు కారని గాని, షియా-సున్నీ - అహమ్మదీయాదులు ముస్లింలు కారని గాని అంటామా? మేమే అసలైన క్రిష్టియన్లం, మేమే అసలైన ముస్లిములం అని ఎవరికి వారు అనుకొన్నట్లే మేమే నిజమైన ధార్మికులం అని ఆ యా సంప్రదాయాలవాళ్ళు అనుకొన్నా అంతా హిందువులే.

ఒక్కొక్క సంప్రదాయంవారు తమ సంప్రదాయాన్ని గొప్పదని చాటడం కోసం ఇతర సంప్రదాయాల మీద లేనిపోని అభాండాలు వేసి దూషిస్తూ ఉంటారు. భారతీయులు అతిశయోక్తిప్రియులు. ఎవరినైనా దూషించినా, భూషించినా కూడా అతిశయోక్తిభరితాలైన శబ్దాలు ప్రయోగిస్తారు. ఒక మతానికి చెందిన దార్శనికులలో కొందరు చేసే ఇతరదార్శనికుల అధిక్షేపణం చూస్తే, వాళ్ళు చెప్పినవీ చెప్పనివీ కూడా కలిపి దూషించడం చూస్తే, సామాన్యునికి "ఔను, వీళ్ళకి (ఆ అధిక్షేపించబడే ఇతర దార్శనికులకి) ఇంత మాత్రం కూడా తెలియదా?" అనే తేలిక బుద్ధి కలుగుతుంది. జాగ్రత్తగా, పూర్తిగా పరిశీలిస్తేనే కాని ఏ నిర్ణయానికి రాకూడదు.

మన దేశంలోని ఈనాటి పరిస్థితులనే ఉదాహరణంగా తీసికొనవచ్చు. సమసమాజం నిర్మిస్తాం అని చాటుతూనే ఆర్థికక్షేత్రాదులలో వైషమ్యాలు పెంచుతున్నాం. మత - జాతి - భేదరహితసమాజం నిర్మిస్తాం అని ఉద్ఘోషిస్తూనే ఎప్పుడో మరచిపోయిన అవాంతరజాత్యాదిభేదాలు కూడా తవ్వి వెలికి తీస్తున్నాం. ఒక వెయ్యి సంవత్సరాల తరవాత ఈ భిన్న ప్రవృత్తులను గూర్చి తెలుసుకొనబోయేవానికి ఏది నమ్మాలో తెలియక ఎంత చిత్తవిభ్రమం కలుగుతుందో

మనం ఊహించుకొనవచ్చు. "న కదాచిదనీదృశం జగత్." లోకం పోకడ ఎప్పుడూ ఇదే విధంగా ఉంటుంది. ఏవేవో మార్పులు తీసికొని రావాలని అను కొంటూ ఏమో చేస్తే ఏదో అవుతూ ఉంటుంది. అందుచేత L. P. Jacks అనే ధీమంతుడు - "ఈనాడు కొందరు చేసే సామాజిక సంస్కరణలు రేపు సామాజి కంగా రాబోయే చిక్కులకు నాంది పలకడమే"అని అన్నాడు. ఈయనే మరొక చోట "మద్యపాననిషేధం అమలులో ఉన్న కాలంలో నాకు కనబడినంత మంది తాగుబోతులు అది లేనప్పుడు కనబడలేదు" అన్నాడట.

"L. P. Jacks in 'Near the Brink' remarks - Social reform might be defined as the process of creating the social problems of tomorrow by acts of Parliament designed to solve the social problems of to - day" (116) and on P. 18 he says that he never saw so many drunken people as during the years when prohibition was in force."

(Quoted in History of Dharmasastra, Vol. V, Part II, P. 1675)

అలాగని, కొన్ని సత్ఫలితాలు ఇవ్వడానికై ఉద్దిష్టమైన వ్యవస్థ ఆ సత్ఫలి తాలు ఇవ్వకపోగా దుష్ఫలితాలు కూడా ఇస్తూంటే ఊరుకోకుండా దానిలో మార్పులూ చెయ్యనూ చేయాలి. ఆ ప్రక్రియలో ఏవైనా అసౌకర్యాలు కలిగితే అనుభవించనూ అనుభవించాలి. సాంఘిక - రాజకీయ - మతరంగాలలో ఈ ప్రక్రియ సర్వదా కొనసాగుతూనే ఉంటుంది. ఇంక ధర్మశాస్త్రగ్రంథాలైనా, 'నీతివాక్యామృతం' వంటి నీతిశాస్త్రగ్రంథాలైనా సంఘశ్రేయస్సుకు అవసరమైన నైతికప్రవర్తన మొదలైన శాశ్వతములైన కొన్ని విలువలను మనకు చూపించి వాటిని మాత్రం జాగ్రత్తగా కాపాడుకోవాలని బోధిస్తాయి. వాటిని మరచిపోయి చేసిన ఏ మార్పులైనా విషమంగానే పరిణమిస్తాయి అనేది ఈ గ్రంథాలవల్ల మనం తెలుసుకొనవలసిన విషయం.

తనకు తెలిసిన మంచి విషయాలు పదిమందికీ చెపితే వాళ్ళల్లో ఏ కొద్ది మందైనా లాభం పొందకలుగుతే అదే చాలు అనుకొనేవాళ్ళు కొంతమంది ఉంటారు. అలాంటివాళ్ళ కోవకి చెందినవాడు సోమదేవుడు. అతిబృహత్ప్రమాణ మైన యశస్తిలకచంపువులో రాజ్యపాలనకీ, ప్రజాధర్మాలకీ, ఆరోగ్యాదులకూ

సంబంధించిన ఎన్నో విషయాలు, ఏదో విధంగా వాటి ప్రసంగం తీసికొనివచ్చి చెప్పాడు. ఆ విషయా లన్నీ ఒక చోట చేర్చి ఈ నీతివాక్యామృతం మనకు అందజేశాడు. దీనిలో మంచి విషయా లెన్నో ఉన్నాయి. వాటిని గ్రహించవచ్చు. ఈ కాలానికి సరిపడనివాటిని ఉపేక్షించవచ్చు.

సాధారణంగా 'మంత్రి' 'అమాత్య శబ్దాలను పర్యాయశబ్దాలుగా వాడుతూ ఉంటాం. కాని మంత్రి వేరు, అమాత్యుడు వేరు. రాజ్యపాలనకు సంబంధించిన మంతనాలలో పాల్గొనకలిగినవాడు మంత్రి. రాజ్యంలో వీళ్ళ సంఖ్య పది,పదిహేను మందికి మించి ఉండదు. మంత్రి అనగా కాబినెట్ హోదా గల మినిస్టర్ వంటి వాడు. ఆ యా శాఖల అధిపతులు అమాత్యులు-నేటి సెక్రటరీలవంటివాళ్ళు. వీళ్ళు ఎంతమందైనా ఉండవచ్చును. వీళ్ళనీ చిన్న ఉద్యోగుల్నీ కూడా సాధారణంగా నియోగులు (Officers) అని అంటారు. ఈ భేదం 'మంత్రి సముద్దేశం' 'అమాత్యసముద్దేశం' అనే రెండు సముద్దేశాలని పట్టి, కౌటిల్యార్థశాస్త్రాదులనుండీ తెలుస్తుంది. ఇది రామాయణాదులలో కూడా ఉంది కాని, కొన్ని చోట్ల మంత్రి అన్న వానినే అమాత్యుడనడం, అమాత్యుడన్న వానిని మంత్రి అనడం వల్ల వాటిలో ఈ విభేదం స్పష్టంగా నిర్వహించడం జరగలేదు. మంత్రులు, అమాత్యులు అని ఇద్దరినీ కూడా పేర్కొన్నచోట మాత్రం ఈ భేదం గ్రహించాలి.

'సెక్యులరిజం' అనేది మన కేదో పాశ్చాత్యులు నేర్పిన విషయం అనే అపోహ కొందరిలో ఉంది. భారతీయుల మత - సాంఘిక చరిత్ర పరిశీలిస్తే ఇది ప్రతీ భారతీయుని రక్తంలోనూ ఉన్న దనే విషయం స్పష్టం అవుతుంది. జైన మత సంప్రదాయాదుల మీద ఇంత శ్రద్ధ ఉన్న సోమదేవుడు కూడా "ఐహిక (secular) వ్యవహారాలు చక్కగా నడవాలంటే, దేశంలో ఉపద్రవం సృష్టించే దుష్టశక్తుల్ని అణగద్రొక్కాలంటే రాజుకు లోకాయతమతంలో మంచి ప్రావీణ్యం కావాలి" అని అంటాడు — "ఐహికవ్యవహారప్రసాధనపరం లోకాయతికం మతమ్, అధీతలోకాయతమతో హి రాజా రాష్ట్రకణ్టకానుచ్ఛేత్తుం కల్పతే" (అన్వీక్షికీ సముద్దేశం 33, 34). లోకాయతమతం అనగా ఈ లోకానికి సంబంధించిన బాగోగులను గూర్చి మాత్రమే చర్చించే మతం అని స్థూలంగా చెప్పవచ్చు. పాలకుని దృష్టి ఎల్లప్పుడూ ఈ లౌకిక పాలనా వ్యవహారం మీదనే లగ్నం అయి వుండాలి కాని, తన కున్న మతవిశ్వాసాదులచేత ప్రభావితం కాకూడదు అనేదే సోమదేవుడు ఇక్కడ చెప్పేది. అయితే రాజు తాను వైయక్తి

కంగా చేసుకొనే వ్రతనియమాదులు సాగిస్తూనే ఉండాలని అక్కడక్కడ సోమదేవుడు ప్రతిపాదిస్తూనే ఉన్నాడు. ప్రాచీన భారతదేశంలోని సెక్యులరిజానికి ఇంతకు మించిన ఉదాహరణం ఏమి కావాలి? ఇలాంటి ఎన్నో విషయాలున్న ఈ 'నీతివాక్యామృతం' ఆలోచనామృతమే.

సంస్కృత భాషా ప్రచారసమితి చేపట్టిన సంస్కృత వాఙ్మయ ప్రచారానికి అంగంగా కొన్ని గ్రంథాలను ఆంధ్రానువాదవ్యాఖ్యానాలతో తెలుగువారికి అందజేయడానికి ప్రయత్నం జరుగుతున్నది. ఇంతవరకు పంచతంత్ర - హితోపదేశాలు, సంస్కృతసూక్తి రత్నకోశం రెండు భాగాలు, చాణక్యనీతిసూత్రం మొదలైనవి ప్రచురించబడ్డాయి. సమితికి ఈ శక్తిని, ప్రోత్సాహాన్ని ఇస్తూన్న సమితిస్థాపకాధ్యక్షులు శ్రీ జి. పుల్లారెడ్డిగారు సంస్కృతజ్ఞుల కృతజ్ఞతకు సర్వథా పాత్రులు.

ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారు విశ్వవిఖ్యాత తత్త్వశాస్త్ర పండితులు. ప్రాచ్యపాశ్చాత్య తత్త్వశాస్త్రాలలో సమానమైన ఉత్తమాధికారం ఉన్నవారు. చాలామంది తత్త్వశాస్త్రాచార్యుల వలె వేదాంత గ్రంథాలన్నీ ఆంగ్ల భాషానువాదాలలో మాత్రమే పఠించినవారు కారు; సంస్కృత భాషలోని మూల గ్రంథాలు చదువుకున్నవారు. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గాను, యు.జి.సి. వైస్ చైర్‌మన్‌గాను, అనేక కార్యనిర్వాహక విద్యాసంబద్ధ సంఘాలలో అధ్యక్షులుగాను, సభ్యులుగాను సంస్కృత భాషా తత్త్వశాస్త్రాలకు ఎనలేని సేవ చేసినవారు. ఇంకా అనేక విధాల చేస్తున్నారు. సార్‌నాథ్‌లోని బౌద్ధ విశ్వవిద్యాలయానికి ఛాన్సలర్‌గా ఉన్నారు. పద్మభూషణులు. శ్రీ శృంగేరీ శారదా పీఠాధిపతులైన జగద్గురు శ్రీ భారతీతీర్థ స్వాములవారు ఇచ్చిన 'విద్యావారిధి' బిరుదముచేత అలంకృతులు. దేశవిదేశాలలోని ఎన్నో విశ్వవిద్యాలయాల నుండి గౌరవం పొందినవారు. వారు నాపై ఉన్న అత్యధిక సౌహార్దం చేత ఈ గ్రంథాన్ని కృతిగా స్వీకరించడానికి అంగీకరించినందుకు వారికి కృతజ్ఞత తెలుపుచున్నాను.

పుల్లెల శ్రీరామచంద్రుడు

శ్రీరస్తు శుభమస్తు

శ్రీ మహాగణాధిపతయే నమః

# సోమదేవీయాని రాజనీతిసూత్రాణి

## (నీతివాక్యామృతమ్)

**డా. పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన "బాలానందిని"తో**

## 1. ధర్మ సముద్దేశః

1. ధర్మార్థకామమోక్షరూపసర్వపురుషార్థఫలమిదం రాజ్యమ్.

అ. ధర్మము, అర్థము, కామము, మోక్షము అనే సకలపురుషార్థాలే రాజ్యానికి ఫలం. ఇది రాజుకూ ప్రజలకూ కూడ.

2. యతోఽభ్యుదయనిఃశ్రేయససిద్ధిః స ధర్మః.

అ. ఐహికమైన అభ్యుదయాన్నీ, పారలౌకికమైన శ్రేయస్సునూ కలిగించేదే ధర్మం.

3. అధర్మః పునరేతద్విపరీతఫలః.

అ. దీనికి విపరీతమైన ఫలం ఇచ్చేది అధర్మం.

4. ఆత్మవత్ సర్వత్ర కుశలవృత్తిచిన్తనం శక్తితస్త్యాగతపసీ చ ధర్మాధిగమోపాయాః.

అ. తనకు వలెనే ఎదుటివానికి కూడా క్షేమం కలగాలని ఆలోచించడము, యథాశక్తిగా దానమూ తపస్సూ చేయడము - ఇవే ధర్మప్రాప్తికి ఉపాయాలు.

5. సర్వసత్త్వేషు హి సమతా సర్వాచారాణాం పరమమాచరణమ్.

అ. సకలప్రాణులనూ సమంగా చూడడం అనేది అన్ని ఆచారాలలోకీ ఉత్తమమైన ఆచారం.

6. న ఖలు భూతద్రుహాం కాపి క్రియా ప్రసూతే శ్రేయాంసి.

అ. ప్రాణులకు ద్రోహం చేసేవాడు తలపెట్టిన ఏ పనీ కూడా శ్రేయస్సును ఇవ్వజాలదు.

7. పరత్రాజిహ్మాంసుమనసాం వ్రతరిక్తమపి చిత్తం స్వర్గాయ జాయతే.

అ. ఇతరులకు హింస తలపెట్టనివారి చిత్తం, వారు ఏ వ్రతాదులూ ఆచరించకపోయినా స్వర్గాన్ని ఇస్తుంది.

8. స ఖలు త్యాగో దేశత్యాగాయ యస్మిన్ కృతే భవత్యాత్మనో దౌఃస్థిత్యమ్.

అ. తనకు దుస్థితిని కల్పించే త్యాగం చేస్తే చివరికి దేశాన్ని త్యజించవలసి వస్తుంది. (అలాంటి త్యాగం మంచిది కాదు.)

9. స ఖల్వర్థీ పరిపన్థీ, యః పరస్య దౌఃస్థిత్యం జానన్నపి తస్మిన్నభిలషత్యర్థమ్.

అ. ఎదటివాడు కష్టపరిస్థితులలో ఉన్నాడని తెలిసి కూడా అతనినుంచి ఏదో పొందాలని కోరేవాడు నిజంగా శత్రువే.

10. తద్వ్రతమాచరితవ్యం, యత్ర న సంశయతులామారోహతః శరీరమనసీ.

అ. శరీరానికి గాని మనస్సుకు గాని ఏమి అనర్థం కలుగుతుందో అనే సంశయానికి తావులేని వ్రతమే ఆచరించాలి.

11. ఐహికాముత్రికఫలార్థమర్థవ్యయః త్యాగః.

అ. ఇహలోకంలోను పరలోకంలోనూ లభించే ఫలంకొరకై ధనం వ్యయం చేయడం త్యాగం.

12. భస్మని హుతమివాపాత్రేష్వర్థవ్యయః.

అ. అపాత్రుల (అయోగ్యుల) కోసం ధనం వ్యయం చేయడం బూడిదలో హోమం చేయడం వంటిది.

13. పాత్రం చ త్రివిధం - ధర్మపాత్రమ్, కార్యపాత్రమ్, కామ పాత్రం చేతి.

అ. ధర్మపాత్రమూ, కార్యపాత్రమూ, కామపాత్రమూ అని పాత్రం మూడు విధాలు.

14. కిం తయా కీర్త్యా యా ఆశ్రితాన్న బిభర్తి; న ప్రతిరుణద్ధి వా అధర్మమ్.

అ. ఆశ్రితుల్ని పోషించని, అధర్మాన్ని ఎదిరించని కీర్తి ఉండి ఏమి ప్రయోజనం?

15. భాగీరథీ శ్రీపార్వతీవత్ భావానామన్యదేవ ప్రసిద్ధేః కారణమ్; న పునస్త్యాగః; యతో న ఖలు గృ(గ్ర)హీతారో వ్యాపినః సనాతనాశ్చ.

అ. 'శ్రీపర్వతవత్' అని పాఠాంతరం. గంగకు, లక్ష్మికి, పార్వతికి (లేదా) శ్రీ పర్వతమునకు వలె పదార్థాల ప్రసిద్ధికి కారణం వేరే ఏదో ఉంటుంది; త్యాగం మాత్రం కాదు. ఎందుచేతననగా, గ్రహించే వాళ్లు అంతటా ఉండరు; ఎప్పుడూ ఉండరు. (భావం అస్పష్టంగా ఉంది. త్యాగంవల్ల ప్రసిద్ధి లభిస్తే లభించవచ్చును గాని ప్రసిద్ధికి అదొక్కటే హేతువు కాదు. ఎందుచేతననగా, ఇద్దామని అనుకున్నా తీసికొనేవాళ్ళు ఉండాలి: ఎప్పుడో లభించినా, ఎల్లప్పుడూ లభించాలి అని భావం అయి ఉంటుంది.)

16. న ఖలు కస్యాపి మా భూదర్థః, యత్రాసంవిభాగః శరణాగతానామ్.

అ. శరణాగతులకు పంచి ఇవ్వని ధనం ఎవ్వరికీ లేకుండు గాక.

17. అర్థిషు సంవిభాగః స్వయముపభోగశ్చార్థస్య హి ద్వే ఫలే.

అ. యాచకులకు ఇవ్వడము, తాను అనుభవించడమూ అనేవి రెండూ ధనం ఉన్నందులకు ప్రయోజనాలు.

18. నాస్త్యౌచిత్యమేకాన్తలుబ్ధస్య.

అ. పరమలోభికి ఔచిత్యమనేది ఉండదు.

19. దానప్రియవచనాభ్యామన్యస్య హి సన్తోషోత్పాదనమ్ ఔచిత్యమ్.

అ. ఏదైనా ఇచ్చి, మంచి మాటలాడి ఇతరులకు సంతోషం కలిగించడమే ఔచిత్యం.

20. స ఖలు లుబ్ధః, యః సత్సు వినియోగాదాత్మనా సహ జన్మాన్తరేషు నయత్యర్థమ్.

అ. తన ధనాన్ని సత్పురుషులకోసం వినియోగించి, దాన్ని జన్మాంతరాలకు కూడా తనతో తీసికొనిపోయేవాడు నిజమైన లుబ్ధుడు.

21. అదాతుః ప్రియాలాపః అన్యస్య లాభస్యాన్తరాయః.

అ. దానం చెయ్యనివాడు పలికే తియ్యని మాటలు మరి ఎవరినుండైనా సంపాదించుకోవడానికి అంతరాయం.

22. సదైవ దుఃస్థితానాం కో బన్ధుః?

అ. ఎల్లప్పుడూ కష్టాలలో ఉండేవారిని ఎవరు ఆదుకోగలరు?

23. నిత్యమర్థయమానాత్ కో నామ నోద్విజతే?

అ. ఎప్పుడూ ఏదో ఒకటి అడుగుతుండేవానిని చూసి ఎవరు విసుగు చెందరు?

24. ఇన్ద్రియమనసోర్నియమానుష్ఠానం తపః.

అ. ఇంద్రియాలనీ, మనస్సునీ అదుపులో ఉంచుకోవడమే తపస్సు. లేదా ఇంద్రియాలు మనస్సు నియమాన్ని అనుష్ఠించడమే తపస్సు.

25. విహితాచరణం నిషిద్ధపరివర్జనం చ నియమః.

అ. విధించబడిన కర్తవ్యాలు చేయడం, నిషేధింపబడినవాటిని చేయకుండా ఉండడం - ఇదే నియమం.

26. విధినిషేధావైతిహ్యాయత్తౌ.

అ. ఇది చెయ్యాలి, ఇది చేయకూడదు అనేది సంప్రదాయసిద్ధంగా వచ్చే వినికిడిమీద ఆధారపడి ఉంటుంది.

27. తత్ ఖలు సద్భిః శ్రద్ధేయమైతిహ్యం, యత్ర న ప్రమాణబాధా, పూర్వాపరవిరోధో వా.

అ. ప్రమాణాలకి (శాస్త్రాదులకి) బాధ కాని, పూర్వాపరవిరోధంగాని లేని ఐతిహ్యాన్ని (వినికిడిమీద వచ్చే విషయాన్ని) మాత్రమే సత్పురుషులు విశ్వసించాలి

28. హస్తిస్నానమివ విఫలం సర్వమనుష్ఠానమనియమితేన్ద్రియ మనోవృత్తీనామ్.

అ. ఇంద్రియాల ప్రవృత్తినీ మనఃప్రవృత్తినీ అదుపులో ఉంచుకోలేని వారు చేసే అనుష్ఠానం అంతా గజస్నానం వంటిది. (ఏనుగు గంటల కొలది నీటిలో స్నానం చేసి, బైటకు వచ్చి దుమ్ము తొండముతో తీసి ఒళ్ళంతా చల్లుకుంటుంది.)

29. దుర్భగాభరణమివ కేవలం దేహఖేదావహమేవ జ్ఞానం స్వయమనాచరతః.

అ. తాను ఆచరణలో పెట్టనివాని జ్ఞానం భర్తృవిహీనురాలి ఆభరణాల వలె, కేవలం శరీరానికి బరువుచేటు.

30. సులభః ఖలు కథక ఇవ పరస్య ధర్మోపదేశే లోకః.

అ. పౌరాణికుల వలె, ఇతరులకు మాత్రమే ధర్మోపదేశం చేసేవాళ్ళు చాలామంది ఉంటారు.

31. ప్రత్యహం కిమపి నియమేన ప్రయచ్ఛతస్తపస్యతో వా భవన్త్యవశ్యం మహీయాంసః పరే లోకాః.

అ. ప్రతిరోజూ ఏ కొంచెమో దానం చేసేవానికి, ఏ కొంచెమో తపస్సు చేసేవానికీ ఉత్తమలోకాలు తప్పకుండా లభిస్తాయి.

32. కాలేన సంచీయమానః పరమాణురపి హి జాయతే మేరుః.

అ. పోగు చేయగా చేయగా పరమాణువులు కూడా కొంత కాలానికి మేరుపర్వతం అంత అవుతాయి కదా?

33. ధర్మశ్రుతధనానాం లవోఽపి ప్రతిదినం సంగృహ్యమాణః భవతి సముద్రాదప్యధికః.

అ. ధర్మ - విద్యా - ధనాలను ప్రతిరోజూ కొంచెం కొంచెం సంగ్రహించు కున్నా అవి సముద్రంకంటె కూడా పెద్దవి అవుతాయి.

34. ధర్మాయ నిత్యమజాగ్రతామ్ ఆత్మవఞ్చనం భవతి.

అ. సర్వదా ధర్మం విషయంలో జాగర్త వహించనివాళ్ళు చివరికి ఆత్మ వంచన చేసుకున్న వాళ్ళవుతారు.

35. కస్య నామైకదైవ సంపద్యతే పుణ్యరాశిః.

అ. ఒక్కమారుగా పెద్ద పుణ్యరాశిని ఎవరు సంపాదించుకొనగలరు?

36. స్వయమనాచరతాం మనోరథాః స్వప్నరాజ్యసమాః.

అ. స్వప్రయత్నం లేనివాళ్ళ కోరికలు స్వప్నరాజ్యాల వంటివి.

37. ధర్మఫలమనుభవతోఽప్యధర్మానుష్ఠానమనాత్మజ్ఞస్య.

అ. ఎప్పుడో చేసిన ధర్మం ఫలాన్ని ఈనాడు అనుభవిస్తున్నా తెలివి తక్కువవాడు అధర్మం ఆచరిస్తూ ఉంటాడు.

38. కః సుధీః భేషజమివాత్మహితం ధర్మం పరోపరోధా దనుతిష్ఠతి.

అ. ఔషధం వలె తనకు హితకరమైన ధర్మాన్ని, బుద్ధిమంతు డెవ డైనా, ఇతరుల నిర్బంధంమీద ఆచరిస్తాడా?

39. ధర్మానుష్ఠానే భవత్యప్రార్థితమపి ప్రాతిలోమ్యం లోకస్య.

అ. ధర్మం చేస్తూన్నప్పుడు, వద్దనుకున్నా ఇతరులు ఏవో అడ్డంకులు కల్పిస్తూ ఉంటారు.

40. అధర్మకర్మణి కో నామ నోపాధ్యాయః పురశ్చారీ వా.

అ. అధర్మం విషయంలో ముందు నడిచి దారి చూపేవాళ్ళూ, ఉపదేశాలు చేసేవాళ్ళూ కోకొల్లలు.

41. కణ్ఠగతైరపి ప్రాణైర్నాశుభం కర్మ సమాచరన్తి కుశల మతయః.

అ. ప్రాణాలు పోతున్నా, మంచి బుద్ధి కలవారు చెడ్డపనులు చెయ్యరు.

42. - స్వవ్యసనతర్పణాయ ధూర్తైః దురీహితవృత్తయః క్రియన్తే శ్రీమన్తః.

అ. తమ దుర్వ్యసనాలు తీర్చుకోవడం కోసం మోసగాళ్ళు ధనవంతుల్ని తప్పుదారి పట్టిస్తూ ఉంటారు.

43. ఖలసఙ్గః కిం నామ న కరోత్యనర్థమ్.

అ. దుష్టుల సహవాసం ఎంతటి అనర్థమైనా చేస్తుంది.

44. అగ్నిరివ స్వాశ్రయమేవ దహన్తి దుర్జనాః.

అ. అగ్నివలె దుర్జనులు తమ ఆశ్రయాన్నే కాల్చివేస్తారు.

45 వనగజ ఇవ తదాత్వసుఖలుబ్ధః కో నామ న భవత్యాస్పదమాపదామ్.

అ. అడవియేనుగ వలె తాత్కాలికసుఖంమీద మాత్రమే దృష్టికలవాడు ఆపదలలో చిక్కుకొనకుండా ఉండడు.

(అడవి ఏనుగులను పట్టుకొనేవారు ఒక పెద్ద గొయ్యి తవ్వి, దానిని ఆకులతో కప్పి, దాని అవతల ప్రక్క ఒక ఆడ ఏనుగును నిలబెడతారు. వనగజం ఆ ఆడ ఏనుగును చూసి, తాత్కాలికసుఖం కోసం పరుగెత్తి ఆ గోతిలో పడిపోతుంది.)

46. ధర్మాతిక్రమాల్లబ్ధిం పరేఽనుభవన్తి, స్వయం తు పాపస్య భాజనం సింహ ఇవ సిన్ధురవధాత్.

అ. అధర్మంవల్ల లభించిన ధనాదులను ఇతరులు (భార్యా పుత్ర మిత్రాదులు) అనుభవిస్తారు. పాపం మాత్రం తనకు చుట్టుకుంటుంది. ఏనుగను చంపిన పాపం సింహానికి; దాని మాంసం తినేవి మాత్రం ఇతరజంతువులే.

47. బీజభోజినః కుటుమ్బిన ఇవ నాస్త్యధార్మికస్యాయత్యాం కిమపి శుభమ్.

అ. అధార్మికునికి శుభమైన భవిష్యత్తు ఉండదు. వాడు విత్తనాల ధాన్యం తినేసిన గృహస్థు వంటివాడు.

48. యః కామార్థావుపహత్య ధర్మమేవోపాస్తే, స పక్వం క్షేత్రం పరిత్యజ్యోషరం కృషతి.

అ. కామార్థాలు విడిచిపెట్టి ధర్మాన్ని మాత్రమే సేవించేవాడు పక్వమైన క్షేత్రాన్ని విడచి చవట భూమిని దున్నుతున్నాడు.

49. న ఖలు సుఖీ, యోఽముత్రసుఖావిరోధేన సుఖమనుభవతి.

అ. పరలోకసుఖానికి భంగం కలగకుండా ఐహికసుఖాలు అనుభవించేవాడే నిజమైన సుఖవంతుడు.

50. ఇదమిహ పరమాశ్చర్యం యదన్యాయసుఖలవాదిహాముత్ర చ అనవధిర్దుఃఖానుబన్ధః.

అ. చాలా ఆశ్చర్యకరమైనది ఏమంటే - అన్యాయంగా కలిగే సుఖలేశం కోసం ఆశపడితే ఇహపరలోకాలలో నిరంతరంగా దుఃఖం అనుభవించవలసి వస్తుంది.

51. సుఖదుఃఖాదిభిః ప్రాణినాముత్కర్షాపకర్షౌ ధర్మాధర్మయోర్లిఙ్గమ్.

అ. సుఖదుఃఖాదులను పట్టి ప్రాణులలో కనబడే ఉత్కర్షాపకర్షలే ధర్మాధర్మాలకు లింగం.

(ప్రాణులలో కొంతమంది సుఖవంతులు, కొంతమంది దుఃఖవంతులు. ఈ సుఖ-దుఃఖ-ధనదారిద్ర్యాదులను పట్టి, వారిలో గొప్పవారు తక్కువవారు అనే భేదాలు ఏర్పడుతున్నాయి. ధర్మాధర్మా లనేవి ఉన్నాయి అని చెప్పడానికి ఈ భేదాలే గుర్తు )

52. కిమపి హి నాస్తి తద్వస్తు, యత్ర నైశ్వర్యమదృష్టాధిష్ఠాత్ర్యాః.

ఇతి ధర్మ సముద్దేశః.

అ. ప్రపంచాన్నంతనీ వశంలో ఉంచుకొని పాలించేది అదృష్టం. దాని అధికారం చెల్లని వస్తువు ఏదీ లేదు.

'బాలానందిని' అను సోమదేవనీతిసూత్రాంధ్రవ్యాఖ్యలో ధర్మ సముద్దేశం సమాప్తం.

## 2. అర్థ సముద్దేశః

1. యతః సర్వప్రయోజనసిద్ధిః సోఽర్థః.

అ. అన్ని ప్రయోజనాలనూ సమకూర్చేది అర్థం.

2. సోఽర్థస్య భాజనం యోఽర్థానుబన్ధేనార్థమనుభవతి.

అ. అర్థానుబంధముచేత (అర్థానికి సంబంధించిన విషయాలలో జాగర్త వహించి) అర్థాన్ని అనుభవించేవాని దగ్గరకే అర్థం చేరుతుంది.

3. అలబ్ధలాభః, లబ్ధపరిరక్షణమ్, రక్షితవివర్ధనమ్, వృద్ధస్య తీర్థేషు ప్రతిపాదనం చ అర్థానుబన్ధః.

అ. లేనిదానిని సంపాదించుకోవడము, సంపాదించినదానిని రక్షించుకోవడము, రక్షించినదాన్ని వృద్ధిచేయడము, వృద్ధిచెందినదానిని తీర్థాలకు (తగు వ్యక్తులకు) ఇవ్వడము అనేది అర్థానుబంధం.

4. తీర్థమర్థే నాసంభావయన్ మధుచ్ఛత్రమివ సర్వాత్మనా వినశ్యతి.

అ. అర్థం ఇచ్చి తీర్థాన్ని గౌరవించనివాడు (ఇవ్వవలసిన చోట ఇవ్వనివాడు) తేనెపట్టు వలె పూర్తిగా నశిస్తాడు.

5. ధర్మసమవాయినః కార్యసమవాయినశ్చ పురుషాః తీర్థమ్.

అ. ధర్మానికి ఉపకరించేవాళ్ళూ, పనులకు ఉపకరించేవాళ్ళూ తీర్థం.

6. తాదాత్వికమూలహరకదర్యేషు నాసులభః ప్రత్యవాయః.

అ. తాదాత్వికునికీ, మూలహరునికీ కదర్యునికీ ఉన్న అర్థం అప్రయత్నంగా అనర్థాన్ని తెచ్చిపెడుతుంది.

7. యః కిమప్యసంచిత్య ఉత్పన్నమర్థమపవ్యయతి స తాదాత్వికః.

అ. ఏమీ కూడబెట్టకుండా వచ్చిన దల్లా దుబారా ఖర్చు చేసేవాడు తాదాత్వికుడు.

8. యః పితృపైతామహమర్థమ్ అన్యాయేన భక్షయతి స మూలహరః.

అ. తండ్రి తాతల ధనాన్ని అన్యాయంగా భక్షించేసేవాడు మూలహరుడు.

9. యః భృత్యాత్మపీడాభ్యామర్థం సంచినోతి స కదర్యః.

అ. పోష్యవర్గాన్నీ, తననూ కూడా పీడిస్తూ ధనం కూడబెట్టేవాడు కదర్యుడు (లోభి).

10. తాదాత్వికమూలహరయోః ఆయత్యాం నాస్తి కల్యాణమ్.

అ. తాదాత్వికమూలహరులకు భవిష్యత్తులో శుభం కలగదు.

11. కదర్యస్యార్థసంగ్రహః రాజదాయాదతస్కరాణామన్యతమస్య నిధిః.

ఇత్యర్థ సముద్దేశః.

అ కదర్యుడు కూడబెట్టిన ధనం రాజుకో, దాయాదులకో, చోరులకో చెందబోయే నిధి.

''బాలానందిని'' అను సోమదేవనీతిసూత్రాంధ్రవ్యాఖ్యలో అర్థ సముద్దేశం సమాప్తం.

## 3. కామ సముద్దేశః

1. అభిమానికరసానువిద్ధా యతః సర్వేన్ద్రియప్రీతిః స కామః.

అ. అభిమానము (నాది-నేను అనే బుద్ధి) వల్ల కలిగే ఆనందంతో కూడిన సర్వేంద్రియ ప్రీతి దేనివల్ల కలుగుతుందో అది కామం.

2. ధర్మార్థావిరోధేన కామం సేవేత, న నిఃసుఖః స్యాత్.

అ. ధర్మానికీ అర్థానికీ విఘాతం కలుగకుండా కామాన్ని సేవించాలి. సుఖం అనుభవించకుండా ఉండకూడదు.

3. సమం వా త్రివర్గం సేవేత.

అ. లేదా ధర్మార్థకామాలు మూడింటినీ సమంగా సేవించాలి

4. ఏకో హ్యత్యాసేవితో ధర్మార్థకామానామాత్మానమితరౌ చ పీడయతి.

అ. ధర్మార్థకామాలలో ఏదో ఒక్కదానినే అధికంగా సేవిస్తే అది తనకూ మిగిలిన రెండింటికీ కూడా బాధ కలిగిస్తుంది.

5. పరార్థం భారవాహిన ఇవ ఆత్మసుఖం నిరున్ధానస్య ధనోపార్జనమ్.

అ. సుఖపడనివాడు చేసే ధనసంపాదన ఇతరులకోసం బరువు మోయడం వంటిది.

6. ఇన్ద్రియమనఃప్రసాదనఫలా హి విభూతయః.

అ. ఐశ్వర్యం ఉన్నందుకు ప్రయోజనం ఇంద్రియాలకూ మనస్సుకూ ఆనందం కలిగించుకొనడమే.

7. నాజితేన్ద్రియస్య కాపి కార్యసిద్ధిః.

అ. ఇంద్రియాలు అదుపులో పెట్టుకోలేనివాడు ఏ పనీ సాధించలేడు.

8. ఇష్టేఽర్థేఽనాసక్తిః విరుద్ధే చార్థేఽప్రవృత్తిః ఇన్ద్రియజయః; అర్థశాస్త్రాధ్యయనం వా.

అ. ఎంత ఇష్టమైన వస్తువునందైనా ఎక్కువ ఆసక్తి లేకపోవడమూ, చెడు కార్యములందు ప్రవర్తించకపోవడమూ అనేవి ఇంద్రియజయము. లేదా అర్థశాస్త్రం చదివితే కూడా ఇంద్రియజయం అలవడుతుంది

9. యోఽనఙ్గేనాపి జీయతే స కథం పుష్టాఙ్గానరాతీన్ జయేత్.

అ. అనంగుని (శరీరం లేని మన్మథుడు) చేతిలోనే ఓడిపోయినవాడు పరిపుష్టమైన శరీరాలు గల శత్రువులను ఎలా జయించకలుగుతాడు?

10. న కామసక్తస్యాస్తి చికిత్సితమ్.

అ. కామాసక్తునికి మందు లేదు.

11. న తస్య ధనం, ధర్మః, శరీరం వా యస్యాస్తి స్త్రీష్వత్యాసక్తిః.

అ. కాంతలపై అధికమోహం కలవానికి ధనమూ లేదు, ధర్మమూ లేదు; శరీరం కూడా దక్కదు.

12. విరుద్ధకామవృత్తిః సమృద్ధోఽపి న చిరం నన్దతి.

అ. విపరీతమైన కామవృత్తి కలవాడు ఎంత ఐశ్వర్యం ఉన్నా చాలా కాలం ఆనందించలేడు.

13. ధర్మార్థకామానాం యుగపత్సమవాయే పూర్వః పూర్వో గరీయాన్.

అ. ధర్మార్థకామాలకు ఒక్కచోట పోటీ ఏర్పడినపుడు పూర్వపూర్వము గొప్పది. (దానికి ప్రాధాన్యం ఇవ్వాలి. కామం కంటె అర్థానికి, అర్థం కంటె ధర్మానికి ప్రాధాన్యం ఇవ్వాలి.)

14. కాలసహత్వే పునరర్థ ఏవ; ధర్మకామయోరర్థమూలత్వాత్.

ఇతి కామ సముద్దేశః.

అ. (ధర్మకామాలు) కొంత కాలం వేచి ఉండగలిగే పక్షంలో అర్థానికే ప్రాధాన్యం; ఎందుచేతననగా ధర్మకామాలకి మూలం అర్థం.

"బాలానందిని" అను సోమదేవనీతిసూత్రాంధ్రవ్యాఖ్యలో కామసముద్దేశం సమాప్తం.

## 4. అరిషడ్వర్గ సముద్దేశః

1. అయుక్తితః ప్రణీతాః కామక్రోధలోభమదమానహర్షాః క్షితీశానామన్తరఙ్గోఽరిషడ్వర్గః.

అ. యుక్తిహీనంగా అనుసరింపబడే కామ - క్రోధ - లోభ - మద - మాన - హర్షాలే రాజులకు ఆరుగురు అంతరంగ (పక్కనే ఉన్న) శత్రువులు.

2. పరపరిగృహీతాసు అనూఢాసు చ స్త్రీషు దురభిసన్ధిః కామః.

అ. పరభార్యలయందూ, అవివాహితలైన స్త్రీలయందూ కలిగే చెడు అభిప్రాయం కామం.

3. అవిచార్య పరస్యాత్మనో వా అపాయహేతుః క్రోధః.

అ. ఆలోచన లేకపోవడంచేత కలిగేదీ, పరునకు గాని తనకు గాని అపాయం కలిగించేదీ క్రోధం.

4. దానార్హేషు స్వధనాప్రదానం, అకారణం వా పరధనగ్రహణం లోభః.

అ. దానం చెయ్యదగినవారికి తన ధనం ఇవ్వకపోవడమూ, ఏ కారణమూ లేకుండా ఇతరుల ధనాన్ని తీసుకోవడమూ లోభం.

5. కులబలైశ్వర్యరూపవిద్యాభిః ఆత్మాహఙ్కారకరణం పరప్రధర్షణనిబన్ధనం వా మదః.

అ. కులము, బలము, ఐశ్వర్యము, రూపము, విద్య - వీటిచేత తనకు అహంకారం కలిగించేది, లేదా ఇతరులను అవమానించడానికి హేతువైనది మదం.

6. దురభినివేశామోక్షః యథోక్తాగ్రహణం వా మానః.

అ. పెద్ద పట్టుదలను విడవకపోవడం లేదా చెప్పినది గ్రహించకపోవడం మానం.

7. నిర్నిమిత్తమన్యస్య దుఃఖోత్పాదనేన స్వస్యార్థసఞ్చయేన వా మనఃప్రతిరఞ్జనః హర్షః.

ఇత్యరిషడ్వర్గ సముద్దేశః.

అ. నిష్కారణంగా ఇతరులకు దుఃఖం కలిగించడంచేత గాని, తనకు ధనం కూడబెట్టుకోవడంచేత గాని మనస్సును రంజింపచేసేది హర్షం.

''బాలానందిని'' అను సోమదేవనీతిసూత్రాంధ్రవ్యాఖ్యానంలో
అరిషడ్వర్గ సముద్దేశం సమాప్తం.

## 5. విద్యావృద్ధ సముద్దేశః

1. యోఽనుకూలప్రతికూలయోరిన్ద్రయమస్థానం స రాజా.

అ. అనుకూలుల విషయంలో ఇంద్రుడూ, ప్రతికూలుల విషయంలో యముడూ అయినవాడే రాజు.

2. రాజ్ఞో హి దుష్టనిగ్రహః శిష్టపరిపాలనం చ ధర్మః, న పునః శిరోముణ్డనం జటాధారణాదికం వా.

అ. దుష్టశిక్షణా, శిష్టరక్షణా అనేది రాజధర్మం; శిరోముండనం చేయించుకోవడం గాని, జటాధారణాదికం గాని రాజధర్మం కాదు.

3. రాజ్ఞః పృథివీపరిపాలనోచితం కర్మ రాజ్యమ్.

అ. రాజు చేసే, పృథివీపాలనోపయుక్తమైన కర్మయే రాజ్యం.

4. వర్ణాశ్రమవతీ ధాన్యహిరణ్యపశుకుప్యవిష్టిఫలదా చ పృథ్వీ.

అ. వర్ణాశ్రమము లున్నదీ, ధాన్యమును, బంగారమును, పశువులను, లోహములనూ, జీవికను, ఇతరఫలాలను ఇచ్చేదీ పృథివి.

5. బ్రాహ్మణాః క్షత్రియాః విశః శూద్రాశ్చ వర్ణాః.

అ. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు - వీరు వర్ణాలు.

6. బ్రహ్మచారీ, గృహస్థో, వానప్రస్థః, యతిరిత్యాశ్రమాః.

అ. బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సంన్యాసి-ఇవి ఆశ్రమాలు.

7. స ఉపకుర్వాణకో బ్రహ్మచారీ యో వేదమధీత్య స్నాయాత్.

అ. వేదాధ్యయనం చేసి స్నానం చేసిన బ్రహ్మచారి ఉపకుర్వాణకుడు.

8. స్నానం వివాహదీక్షాభిషేకః.

అ. వివాహదీక్షకోసం చేసే అభిషేకం స్నానం.

9. స నైష్ఠికో బ్రహ్మచారీ యస్య ప్రాణాన్తికమదారకర్మ.

అ. జీవితాంతం వరకూ వివాహం చేసికొననివాడు నైష్ఠికబ్రహ్మచారి.

10. యః ఉత్పన్నః పునీతే వంశం పుత్రః.

అ. పుట్టి కులాన్ని పవిత్రం చేసేవాడు పుత్రుడు.

11. అపుత్రః పుమాన్ పితౄణామృణభాజనమ్; అనధ్యయనో బ్రహ్మణః; అయజనో దేవానామ్, అహన్తకారో మనుష్యాణామ్.

అ. పుత్రులు లేనివాడు పితృదేవతలకు అప్పుపడి ఉంటాడు. వేదాధ్యయనం చేయనివాడు బ్రహ్మకు అప్పుపడి ఉంటాడు. యజ్ఞాలు చేయనివాడు దేవతలకు అప్పుపడి ఉంటాడు. మనుష్యులకు దానాదులు చేయనివాడు వారికి (మనుష్యులకు) అప్పుపడి ఉంటాడు.

12. ఆత్మా వై పుత్రో నైష్ఠికస్య. అయం హ్యాత్మనాత్మానమాత్మని సన్దధానః పరాం పూతతాం ప్రతిపద్యతే.

అ. నైష్ఠికబ్రహ్మచారికి ఆత్మయే పుత్రుడు. ఎందుచేత ననగా, అతడు తననే తనయందు తాను చూచుకొంటూ గొప్ప పవిత్రతను సంపాదించుకొంటున్నాడు.

13. నిత్యనైమిత్తికానుష్ఠానస్థో గృహస్థః.

అ. నిత్య - నైమిత్తిక కర్మల నాచరించేవాడు గృహస్థుడు.

14. బ్రహ్మదేవపిత్రతిథిభూతయజ్ఞా హి నిత్యమనుష్ఠానమ్; దర్శ పౌర్ణమాసాది నైమిత్తికమ్.

అ. బ్రహ్మయజ్ఞ - దేవయజ్ఞ - పితృయజ్ఞ - అతిథియజ్ఞ - భూత యజ్ఞాల అనుష్ఠానం నిత్యానుష్ఠానం. దర్శపౌర్ణమాసాదియాగాల అనుష్ఠానం నైమిత్తికానుష్ఠానం.

15. (వైవాహికః శాలీనః జా(యా)యావరోఽఘోర ఇతి గృహస్థాః.)

అ వైవాహికుడు, శాలీనుడు, యాయావరుడు, అఘోరుడు, అని గృహస్థులలో నాలుగు విధాలు.

16. యః ఖలు యథావిధి జానపదమాహారం సంసారవ్యవహారం చ పరిత్యజ్య సకలత్రోఽకలత్రో వా వనే ప్రతిష్ఠతే స వానప్రస్థః.

అ. గ్రామాలలో లభించే ఆహారాన్ని, సాంసారికవ్యవహారాలనూ యథా విధిగా పరిత్యజించి, భార్యాసమేతుడై కాని, భార్యారహితుడై గాని అరణ్యానికి వెళ్ళి నివసించేవాడు వానప్రస్థుడు.

17. (వాలఖిల్యాః ఔదుమ్బరః వైశ్వానరః సద్యఃప్రక్షల్యకశ్చేతి వానప్రస్థాః)

అ. వాలఖిల్యుడు, ఔదుంబరుడు, వైశ్వానరుడు, సద్యఃప్రక్షల్యకుడు అని వానప్రస్థులలో భేదాలు.

18. యః సమ్యగ్విద్యానౌలాభేన తృష్ణాసరిత్తరణాయ యోగాయ యతతే స యతిః.

అ. చక్కగా విద్య అనే నావను సంపాదించి ఆశ అనే నదిని దాటడం అనే యోగంకోసం ప్రయత్నించేవాడు యతి.

19. (కుటీరక బహో్వ(హూ)దకహంస పరమహంసాః యతయః.)

అ. యతులలో కుటీరకులు, బహూదకులు, హంసలు, పరమహంసలు అని నాలుగు విధాలు.

20. రాజ్యస్య మూలం క్రమో విక్రమశ్చ.

అ. పితృపైతామహక్రమము, పరాక్రమము ఈరెండూరాజ్యానికిమూలం.

21. ఆచారసంపత్తిః క్రమసమ్పత్తిం కరోతి.

అ. ఆచారసంపద క్రమసంపదను కలిగించును. పితృపితామహాదుల నుండి వచ్చినా రాజ్యం ఆచారసంపద లేకపోతే, అనగా నైతికప్రవర్తన లేకపోతే, దృఢంగా ఉండదని భావం.

22. అనుత్సేకః ఖలు విక్రమస్యాలఙ్కారః.

అ. గర్వం లేకపోవడమే విక్రమానికి అలంకారం.

23. క్రమవిక్రమయోరన్యతరమాత్రపరిగ్రహేణ రాజ్యస్య దుష్కర పరిణామః.

అ. క్రమవిక్రమాలలో ఏదో ఒక్కదానిని మాత్రమే గ్రహిస్తే రాజ్యపరిణామం దుష్కరం అవుతుంది.

24. క్రమవిక్రమయోరధిష్ఠానం బుద్ధిమానాహార్యబుద్ధిర్వా.

అ. క్రమ - విక్రమాలు ఉన్నవాడు బుద్ధిమంతుడు కావచ్చు, ఆహార్యబుద్ధి (బుద్ధిని ప్రయత్నపూర్వకంగా సంపాదించుకొన్నవాడు) కావచ్చును.

25. యో విద్యావినీతమతిః స బుద్ధిమాన్.

అ. విద్యచేత బుద్ధికి తగు శిక్షణ ఇచ్చినవాడు బుద్ధిమంతుడు.

26. సింహస్యేవ కేవలం పౌరుషావలమ్బినః న చిరం కుశలమ్.

అ. సింహం వలె కేవలం పౌరుషం మీదనే ఆధారపడ్డవాడు, ఎక్కువగా పౌరుషం చూపించేవాడు, చాలాకాలం కుశలంగా మనలేడు.

27. అశస్త్రః శూర ఇవ అశాస్త్రః ప్రజ్ఞావానపి భవతి విద్విషాం వశః.

అ ఎంత బుద్ధిమంతుడైనా శాస్త్రజ్ఞానం లేనివాడు, ఆయుధాలు లేని శూరుడు వలె, శత్రువులకి లొంగిపోతాడు.

28. ఆలోచనగోచరే హ్యర్థే శాస్త్రం తృతీయం లోచనం పురుషాణామ్.

అ. కంటికి కనబడని విషయాలు తెలుసుకోడానికి మనుష్యులకు శాస్త్రం మూడవ కన్ను.

29. అనధీతశాస్త్రః చక్షుష్మానపి పుమాన్ అన్ధ ఏవ.

అ. శాస్త్రాభ్యాసం చెయ్యనివాడు కళ్ళున్నా గ్రుడ్డివాడే.

30. న హ్యజ్ఞానినోఽన్యః పశురస్తి.

అ. బుద్ధిహీనుడికంటె వేరుగా పశువనేది ఏదీ లేదు కదా?

31. వరమరాజకం భువనం, న తు మూర్ఖో రాజా.

అ. మూర్ఖుడు రాజుగా ఉండడంకంటె దేశానికి రాజులేకపోవడమే మేలు.

32. అకృతసంస్కారం రత్నమివ సుజాతమపి రాజపుత్రం న నాయకపదాయానయన్తి సాధవః.

అ. సత్పురుషులు సానపట్టి సంస్కరించని రత్నాన్ని నాయకమణిగా (హారంలో మధ్యమణిగా) ఎలా ఉపయోగించరో మంచి వంశంలో పుట్టినవాడైన రాజపుత్రుణ్ణి విద్యాది సంస్కారాలు లేకుండా ప్రభుస్థానానికి తీసికొనిరారు.

[నాయక = హారమధ్యలో ఉన్న రత్నం; ప్రభువు అని రెండర్థాలు.]

33. న దుర్వినీతాద్రాజ్ఞః ప్రజావినాశాదపరోఽస్త్యుత్పాతః.

అ. వినయవిహీనుడైన (దుర్మార్గుడైన) రాజువలన కలిగే ప్రజావినాశం కంటె వేరుగా ఉపద్రవం లేదు.

34. యః యుక్తాయుక్తయోరవివేకీ విపర్యస్తమతిర్వా స దుర్వినీతః.

అ. ఎవనికి యుక్తాయుక్త వివేకం ఉండదో, ఎవని బుద్ధి విపరీతంగా ఆలోచిస్తుందో వాడు "దుర్వినీతుడు."

35. యత్ర సద్భిరాధీయమానా గుణాః, సంక్రామన్తి తత్ ద్రవ్యమ్.

అ. సత్పురుషులు ఉంచే గుణాలు దేనియందు, ఎవనియందు, సంక్రమిస్తాయో అదే "ద్రవ్యం".

36. ద్రవ్యం హి క్రియా వినయతి నాద్రవ్యమ్.

అ. శిక్షణము, ఉపదేశము మొదలైన క్రియ ద్రవ్యాన్నే బాగుచేస్తుంది. కాని, అద్రవ్యాన్ని బాగుచేయజాలదు.

37. ద్రవ్యాద్రవ్యప్రకృతి రపి కశ్చిత్ పురుషః సంకీర్ణగజవత్.

అ. ఒక్కొక్కడు, సంకరజాతి ఏనుగు వలె ద్రవ్యప్రకృతిగాను, అద్రవ్యప్రకృతిగానూ కూడా ఉంటాడు.

38. శుశ్రూషాశ్రవణగ్రహణధారణవిజ్ఞానోహాపోహతత్త్వాభినివేశాః బుద్ధిగుణాః.

అ. శుశ్రూషా, శ్రవణం, గ్రహణం, ధారణం, విజ్ఞానం, ఊహ, అపోహ, తత్త్వాభినివేశం - ఇవి బుద్ధిగుణాలు.

39. శ్రోతుమిచ్ఛా శుశ్రూషా.

అ. వినాలనే కోరిక "శుశ్రూష."

40. శ్రవణమ్ ఆకర్ణనమ్.

అ. వినడం "శ్రవణం."

41. గ్రహణం శాస్త్రార్థోపాదానమ్.

అ. శాస్త్రవిషయాలను చక్కగా గ్రహించడం గ్రహణం.

42. ధారణం కాలాన్తరేష్వప్యవిస్మరణమ్.

అ. కొంతకాలం తరవాత కూడా మరవకపోవడం ధారణం.

43 మోహసందేహవిపర్యాసవ్యుదాసేన జ్ఞానం విజ్ఞానమ్.

అ. అర్థం చేసుకోకపోవడము, సందేహము, విపరీతంగా అర్థంచేసికోవడమూ లేకుండా సరిగా తెలుసుకోవడం 'విజ్ఞానం.'

44. విజ్ఞాతమర్థమవలమ్బ్య అన్యేషు వ్యాప్త్యా తథావిధానాం వితర్కణమ్ ఊహః.

అ. బాగా తెలిసిన విషయాన్ని ఆధారంగా చేసికొని, ఆ పద్ధతినే ఇతర విషయాలలో సమన్వయించుకొని అలాంటివిషయాలన్నీ ఊహించి తెలిసికోవడం 'ఊహ.'

45. ఉక్తియుక్తిభ్యాం విరుద్ధాదర్థాత్ ప్రత్యవాయసంభావనయా వ్యావర్తనమ్ అపోహః.

అ. ప్రమాణవాక్యాలు చూపి, యుక్తి ప్రదర్శించి ఒక విషయాన్ని ఆ విధంగా గ్రహిస్తే ప్రత్యవాయం (అపకారం) జరుగుతుందని ఊహించి, అలాంటి విరుద్ధవిషయం (తగని విషయం) నుంచి మరలడం 'అపోహ.'

46. అథవా సామాన్యజ్ఞానమ్ ఊహః, విశేషజ్ఞానమ్ అపోహః.

అ. లేదా సామాన్యజ్ఞానం (స్థూలంగా గ్రహించడం) ఊహ, విశేష జ్ఞానం అపోహ.

47. విజ్ఞానోహాపోహానుగమవిశుద్ధమిదమిత్థమేవేతి నిశ్చయః తత్త్వాభినివేశః.

అ. విజ్ఞానము, ఊహ, అపోహ ఇవన్నీ సరిపోతున్నాయి కాబట్టి 'ఈ విషయం ఇంతే' అనే నిశ్చయం 'తత్త్వాభినివేశం.'

48. యాః సమధిగమ్యాత్మనో హితమవైతి అహితం చాపోహతి తాః విద్యాః.

అ. వేటిని నేర్వడంచేత తనకేది హితమో తెలుసుకుంటాడో, అహితాన్ని విడిచిపెడతాడో అవి 'విద్యలు.'

49. ఆన్వీక్షికీ, త్రయీ, వార్తా, దణ్డనీతిరితి చతస్రో రాజవిద్యాః.

అ. ఆన్వీక్షికి, వేదత్రయం, వార్త, దండనీతి అనే నాలుగూ రాజవిద్యలు.

50. అధీయానో హ్యాన్వీక్షికీం కార్యాకార్యాణాం బలాబలం హేతుభిర్విచారయతి, వ్యసనేషు న విషీదతి, నాభ్యుదయేన వికార్యతే, సమధిగచ్ఛతి చ ప్రజ్ఞావాక్యక్రియావైశారద్యమ్.

అ. (ఆన్వీక్షికి అనగా తర్కశాస్త్రం, ఇతర దర్శనాలు) ఆన్వీక్షికి అధ్యయనం చేసినవాడు హేతువులు చూపి కార్యాకార్యాల బలాబలాలను ఆలోచిస్తాడు. కష్టాలు వచ్చినప్పుడు క్రుంగిపోడు. అధికారైశ్వర్యాదులలో అభివృద్ధి కలిగినప్పుడు వికారాలు చెందడు. ఆలోచనలలోను, మాటలలోను, పనులలోను సమర్థత్వాన్ని పొందుతాడు.

51. త్రయీం పఠన్ వర్ణాచారేష్వతీవ ప్రగల్భతే, జానాతి సమస్తామపి ధర్మాధర్మసంస్థితిమ్.

అ. వేదత్రయం చదివినవానికి ఆ యా వర్ణాల ఆచారాలలో మంచి సామర్థ్యం ఏర్పడుతుంది. అతడు సమస్తమైన ధర్మాధర్మాలకి సంబంధించిన కట్టుబాట్లు తెలుసుకొనగలుగుతాడు.

52. యుక్తితః ప్రవర్తయన్ వార్తాం సర్వమపి జీవలోకమభినన్దయతి; లభతే చ స్వయం సర్వానపి కామాన్.

అ. (వార్త అనగా వ్యవసాయం, వర్తకం). వార్తను యుక్తిపూర్వకంగా నడిపించినవాడు సమస్తమానవుల్నీ సంతోషపెడతాడు. తాను కూడా అన్ని కామాలూ పొందగలుగుతాడు.

53. యమ ఇవాపరాధిషు దణ్డప్రణయనే రాజ్ఞి న ప్రజాః స్వమర్యాదామతిక్రామన్తి, ప్రసీదన్తి చ త్రివర్గఫలాః విభూతయః.

అ. అపరాధుల్ని దండించడంలో రాజు యముడులాగ ఉంటే ప్రజలు తమ కట్టుబాట్లు దాటరు. ధర్మార్థకామా లనే త్రివర్గాన్ని పోషించే ఐశ్వర్యాలు పెరుగుతాయి.

54. ఆన్వీక్షికీ అధ్యాత్మవిషయా; త్రయీ వేదయజ్ఞాదిషు; వార్తా కృషికర్మాదిషు; దణ్డనీతిః సాధుపాలనే దుష్టనిగ్రహే చ.

అ. ఆత్మకు సంబంధించిన విషయాలు చెప్పేది "ఆన్వీక్షికి". వేదాలకు, యజ్ఞాదులకు సంబంధించిన విషయాలు తెలిపేది త్రయి. దండనీతి దుష్టులను నిగ్రహించడానికి, మంచివాళ్ళని పాలించడానికి ఉపయోగపడుతుంది.

55. విద్యావృద్ధసేవాయాముత్సహేత.

అ. విద్యావృద్ధుల (విద్యచేత వృద్ధులైనవాళ్ళ) సేవయందు ఆసక్తితో ఉండాలి.

56. అజాతవిద్యావృద్ధసంయోగో హి రాజా నిరఙ్కుశో గజ ఇవ సద్యో వినశ్యతి.

అ. విద్యావృద్ధుల సంబంధం లేని రాజు అంకుశం లేని గజము వలె వెంటనే నశిస్తాడు.

57. అనధీయానోఽప్యాన్వీక్షికీం విశిష్టజనసంసర్గాత్ పరాం వ్యుత్పత్తిమాప్నోతి.

అ. తాను ఆన్వీక్షికి అధ్యయనం చేయకపోయినా విశిష్టులైన వాళ్ళతో సంబంధంవల్ల గొప్ప వ్యుత్పత్తిని (విషయజ్ఞానాన్ని) పొందుతాడు.

58. అన్యైవ ఖలు ఛాయా ఉపజలతరూణామ్.

అ. నీటికి దగ్గర ఉన్న చెట్ల నీడ తరహాయే వేరు గదా!

59. వంశవృత్తవిద్యాభిజనవిశుద్ధా హి రాజ్ఞాముపాధ్యాయాః.

అ. వంశంచేత, చరిత్రచేత, విద్యచేత, బంధుజనంచేత పరిశుద్ధమైన వారే (పరిశుద్ధమైన వంశాదులు గలవారే) రాజులకు ఉపాధ్యాయులుగా ఉండాలి.

60. విశిష్టేషు నీచైరాచరన్నరపతిః ఇహలోకే స్వర్గే చ మహీయతే.

అ. శిష్టుల విషయంలో (సత్పురుషుల విషయంలో) వంగి (వినయంతో) ప్రవర్తించే రాజు ఇహలోకంలోను స్వర్గలోకంలోనూ కూడా గౌరవం పొందుతాడు.

61. రాజా హి పరమం దైవతమ్, నాసౌ కస్మైచిత్ ప్రణమతి అన్యత్ర గురుజనేభ్యః.

అ. రాజు గొప్ప దేవత. అతడు గురువు (పెద్ద) లకు తప్ప ఇతరులకు నమస్కరించడు.

62. వరమజ్ఞానం; నాశిష్టజనసేవయా విద్యా.

అ. శిష్టులు కానివాళ్ళని సేవించి విద్య సంపాదించడం కంటె అజ్ఞానమే మేలు.

63. అలం తేనామృతేన, యత్రాస్తి విషసంసర్గః.

అ. విషం కలిసిన అమృతం వద్దు.

64. గురుజనశీలమనుసరన్తి ప్రాయేణ శిష్యాః.

అ. సాధారణంగా శిష్యులు గురుజనుల శీలాన్ని అనుసరిస్తారు.

65. నవేషు మృద్భాజనేషు లగ్నః సంస్కారః బ్రహ్మణాప్యన్యథా కర్తుం న శక్యతే.

అ. క్రొత్త మట్టికుండలకి లగ్నమైన (రంగు మొదలైన) సంస్కారాన్ని బ్రహ్మదేవుడు కూడా మార్చజాలడు.

66. అన్ధ ఇవ వరం పరప్రణేయో రాజా, న జ్ఞానలవదుర్విదగ్ధః.

అ. మిడి మిడి జ్ఞానంతో మిడిసిపడే రాజు కంటె గ్రుడ్డివాడివలె ఇతరుల చేత నడిపించబడే రాజు మేలు.

67. నీలీరక్తే వస్త్రే ఇవ కో నామ దుర్విదగ్ధే రాజ్ఞి రాగాన్తర మాధత్తే.

అ. నీలిరంగు వేసిన వస్త్రానికి ఎవడూ మరొక రంగు ఎలా వేయలేడో అలాగే మూర్ఖశిఖామణి యైన రాజుకు ఎవడూ నచ్చ చెప్పలేడు.

68. యథార్థవాదో విదుషాం శ్రేయస్కరః యది న రాజా గుణ ప్రద్వేషీ.

అ. రాజు గుణద్వేషం కలవాడు కాకపోతే విద్వాంసులు యథార్థం చెప్పడమే శ్రేయస్కరం.

69. వరమాత్మనో మరణం నాహితోపదేశః స్వామిషు.

ఇతి విద్యావృద్ధసముద్దేశః

అ. ప్రభువుకు అహితం ఉపదేశించడం కంటె తాను చావడమే మేలు.

''బాలానందిని'' అను సోమదేవ నీతిసూత్రాంధ్రవ్యాఖ్యలో
విద్యా వృద్ధ సముదేశం సమాప్తం.

## 6. ఆన్వీక్షికీసముద్దేశః

1. ఆత్మమనోమరుత్తత్త్వసమసమాయోగలక్షణో హ్యాధ్యాత్మయోగః.

అ. అధ్యాత్మయోగానికి లక్షణం ఆత్మ, మనస్సు, ప్రాణవాయువు అనే మూడు తత్త్వాలు సమంగా కలిసి ఉండడం. ఇది ఆన్వీక్షికి ద్వారా, యుక్తులచేత తెలియ దగిన, ఆచరణలో ఉంచదగిన విషయం.

2. అధ్యాత్మజ్ఞో హి రాజా సహజశారీరమానసాగన్తుభిర్దోషైః న బాధ్యతే.

అ. పైన చెప్పిన శరీరానికి సంబంధించిన తత్త్వాన్ని తెలుసుకొన్న రాజు సహజంగా ఉన్న దోషాలకీ, శారీరక దోషాలకీ, మానసిక దోషాలకి (లేదా సహ

జంగా ఉన్న శారీరక మానసిక దోషాలకీ) అప్పుడప్పుడు కలిగే దోషాలకి బాధ పడడు.

3. ఇన్ద్రియాణి మనో విషయాః (జ్ఞానం) భోగాయతనమిత్యాత్మా రామాః.

అ ఇంద్రియాలు, మనస్సు, భోగ్యవస్తువులు, భోగాలకు స్థానమైన శరీరము - ఇవి ఆత్మ రమించే స్థానాలు.

4. యత్రాహమిత్యనుపచరితః ప్రత్యయః స ఆత్మా.

అ. దేని విషయంలో ఉపచరితం కాని, అనగా లాక్షణికం కాని "నేను" అనే జ్ఞానం కలుగుతుందో, అ "నేను" అనే జ్ఞానానికి గోచరమైనదే ఆత్మ.

ఆత్మ బాహ్యాలైన దారపుత్రాదుల కంటె, మనఃశరీరేంద్రియాదుల కంటె భిన్నమైనది. కాని, అవే ఆత్మ అనుకొని వాళ్ళ లేదా వాటి సుఖదుఃఖాదులను, లేదా వాటి వ్యాపారాలను తన మీద ఆరోపించుకొంటున్నాడు మానవుడు. దారపుత్రాదులు సుఖంగా ఉంటే తానే సుఖంగా ఉన్నట్లు, కష్టాలలో ఉంటే తానే కష్టాలలో ఉన్నట్లు భావిస్తున్నాడు కన్ను చూస్తుంటే, మనస్సు ఆలోచిస్తూంటే తానే చూస్తున్నట్లు, ఆలోచిస్తున్నట్లు భావిస్తున్నాడు. శరీరమే తాను అని అనుకొంటూ ఉంటాడు. కాలు,చెయ్యి తాను అనుకొంటూ ఉంటాడు. కాని, జాగ్రత్తగా పరిశీలిస్తే ఇవేమీ తాను కాదు. ఏదైనా ఇంద్రియం లోపించినా, మనస్సు ఆలోచించడం మానేసినా, శరీరంలో ఉన్న ఏ అవయవమైనా లోపించినా ''తాను'' అని చెప్పబడేది చెక్కుచెదరకుండా ఉంది. దారపుత్రాదుల విషయం చెప్పనవసరమే లేదు. అలాగే శరీరం కూడా తాను కాదు. శరీరం క్షణక్షణం మారిపోతున్నది. నిన్నటి శరీరం వేరు, ఈనాటి శరీరం వేరు. బాల్యంలో ఉన్న శరీరం వేరు, యౌవనంలో ఉన్నది వేరు, వార్ధక్యంలో ఉన్నది వేరు. అయినా"నేను" అనేది అనుస్యూతంగా, అవిచ్ఛిన్నంగా వస్తూనే ఉన్నది. దీనినిపట్టి శరీరం "నేను" అనగా 'ఆత్మ' కాదు అని తేలింది. శరీరాదుల్ని ఆత్మ అనుకోవడం ఆరోపించుకోవడం వల్ల వచ్చింది. ఈ ఆరోపణకే 'ఉపచారం' అని పేరు. ఈ ఆరోపితవస్తువులు అన్నీ ఒకదాని తరువాత ఒకటి "ఇది కాదు, ఇది కాదు" అని తొలగించుకొంటూ పోతే మిగిలినది, ఉపచరితం కానిది, 'నేను' అనే జ్ఞానానికి గోచరించేది 'ఆత్మ' అని భావం.

5. అసత్యాత్మని ప్రేత్యభావే విదుషా విఫలం ఖలు సర్వ మనుష్ఠానమ్.

అ. నశ్వరాలైన శరీరాదుల కంటె వేరుగా నిత్యమైన ఆత్మ లేకపోతే, మరణానంతరం కూడా అది ఉండకపోతే, విద్వాంసులు చేసే, బోధించే సత్కార్మానుష్ఠానం అంతా వ్యర్థమే కదా!

6. యతః స్మృతిః, ప్రత్యవమర్శనమ్, ఊహాపోహా శిక్షాలాప క్రియాగ్రహణం చ భవతి తన్మనః.

అ. పూర్వం అనుభవించినదాన్ని స్మరించడం, ఆలోచించడం, ఊహ, అపోహ గురువులు మొదలైనవారు నేర్పిన విషయాలు, మాటలు, ఆ యా పనులు గ్రహించడం దేనివల్ల జరుగుతాయో అదే మనస్సు.

7. ఆత్మనః విషయానుభవద్వారాణి ఇన్ద్రియాణి.

అ. ఆత్మ ఆ యా విషయములను అనుభవించే ద్వారాలు ఇంద్రియాలు.

8. శబ్ద స్పర్శ రూప రస గంధాః విషయాః.

అ. శబ్దం, స్పర్శ, రూపం, రసం (రుచి), గంధం (వాసన) - ఇవి విషయాలు.

9. సమాధీన్ద్రియాభ్యాం విప్రకృష్ట సంనికృష్టావబోధః జ్ఞానమ్.

అ. మనస్సును ఏకాగ్రం చేసి యోగంచేత, దూరంగా, అప్రత్యక్షంగా ఉన్న వస్తువునూ, ఇంద్రియాలచేత దగ్గరగా ఉన్న వస్తువులనూ గ్రహించడం జ్ఞానం.

10. సుఖం ప్రీతిః.

అ. ఇష్టంగా ఉండడం సుఖం.

11. తత్ సుఖమపి న సుఖం యత్ర నాస్తి మనోనిర్వృతిః.

అ. దేనిలో మనస్సుకు ఆనందం (విశ్రాంతి) లేదో ఆ సుఖం కూడా సుఖం కాదు.

12. అభ్యాసాభిమానసంప్రత్యయవిషయాః సుఖస్య కారణాని.

అ. అభ్యాసము, అభిమానము, సంప్రత్యయము, విషయము-ఇవి సుఖానికి కారణాలు.

13. క్రియాతిశయః పరిపాక హేతుః అభ్యాసః.

అ. పరిపక్వతకు కారణమైన (Leading to Perfection) క్రియలోని అతిశయం అభ్యాసం.

14. ప్రశ్రయసత్కారాదిలాభేన ఆత్మనః ఉత్కర్షసంభావనమ్ అభిమానః.

అ ఇతరులు తన ఎదుట చూపే వినయం చేత, ఇతరులు చేసే సత్కారాదులచేత తానేదో గొప్పవా డనుకోవడం అభిమానం.

15. అతద్గుణే వస్తుని తద్గుణత్వేన అభినివేశః సంప్రత్యయః.

అ. అలాంటి గుణాలు లేని వస్తువులో అలాంటి గుణాలు ఉన్నట్లు ఒక విధమైన పట్టుదలతో భావించడం సంప్రత్యయం.

16. ఇన్ద్రియమనఃసంతర్పణో భావో విషయః.

అ. ఇంద్రియాలకీ మనస్సుకూ సంతృప్తి కలిగించే పదార్థం విషయం.

17. దుఃఖం అప్రీతిః.

అ. అనిష్టంగా ఉండడం దుఃఖం.

18. తద్దుఃఖమపి న దుఃఖం యత్ర న సంక్లిశ్యతే మనః.

అ. మనస్సులో క్లేశం కలిగించని దుఃఖం దుఃఖం కాదు.

19. దుఃఖం చతుర్విధం - సహజం, దోషజమ్, ఆగన్తుకమ్, అన్తరఙ్గజం చేతి.

అ. సహజము, దోషజము, ఆగంతుకము, అంతరంగజము అని దుఃఖం నాలుగు విధాలు.

20. సహజం క్షుత్తృషామనోభూభవమ్.

అ. ఆకలి, దప్పిక, మన్మథుడు - వీటివల్ల కలిగినది సహజం.

21. దోషజం వాతపిత్తకఫవైషమ్యసంభూతమ్.

అ. వాత - పిత్త - కఫా లనే శరీరంలో ఉండే త్రిదోషాల వైషమ్యంవల్ల కలిగినది దోషజం.

22. ఆగన్తుకం వర్షాతపాదిజనితమ్.

అ. వర్షాలు, ఎండ మొదలైన వాటివల్ల వచ్చేది ఆగంతుకం,

23. న్యక్కారావజ్ఞేచ్ఛావిఘాతాదిసముత్థమ్ అన్తరఙ్గజమ్.

అ. ఇతరులు తిరస్కరించడం, అవమానించడం, అనుకొన్నదానికి విఘాతం రావడం మొదలైనవాటివల్ల కలిగిన దుఃఖం అంతరంగజం.

24. న తస్య ఐహికమాముష్మికం వా ఫలమస్తి యః క్లేశాయా సాభ్యాం భవతి విక్లవప్రకృతిః.

అ. ఏవైనా క్లేశాలు వచ్చినా, శ్రమ కలిగినా కంగారుపడిపోయే స్వభావం గలవానికి ఇహలోకానికి సంబంధించిన ఫలం గాని పరలోకానికి సంబంధించిన ఫలం గాని లేదు.

25. స కింపురుషః యస్య మహాభియోగేషు సువంశధనుష ఇవ అధికం న జాయతే బలమ్.

అ. పెద్ద కష్టాలలో (మహాయుద్ధాలలో) మంచి వెదురుతో చేసిన ధనుస్సు బలంవలె ఎవని బలం పెరగదో వాడు ఏం పురుషుడు? (లేదా చెడ్డ పురుషుడు.)

26. ఆగామిక్రియాహేతుః అభిలాషో వా ఇచ్ఛా.

అ. రాబోవు క్రియకు (మున్ముందు పని చేయడానికి) కారణం అయినది ఇచ్ఛ లేదా ఏదైనా ఒకదానిపై కోరిక ఇచ్ఛ.

27. ఆత్మనః ప్రత్యవాయేభ్యః ప్రత్యావర్తనహేతుః అనభిలాషో వా ద్వేషః.

అ. ప్రత్యవాయం (అపకారం) ఏదీ జరగకుండా తనను వెనుకకు మరల్చడానికి హేతువైనది ద్వేషం; లేదా అభిలాష లేకపోవడం ద్వేషం

28. హితాహితప్రాప్తిపరిహారహేతురుత్సాహః.

అ. హితమైనది లభించడానికి, అహితమైనది పరిహరించడానికి హేతువైనది ఉత్సాహం

29. పరనిమిత్తకో భావః ప్రయత్నః.

అ. మరొకదానికోసం, అనగా సాధించని అంశాన్ని సాధించడంకోసం, మనఃప్రవృత్తి ప్రయత్నం.

30. అతిశయాధానం సంస్కారః.

అ. అంతకు మునుపు లేని వైశిష్ట్యాన్ని కలిగించడం సంస్కారం.

31. అనేకకర్మాభ్యాసవాసనావశాత్ సద్యోజాతాదీనాం స్తన్యపిపాసాదికం యేన క్రియతే సోఽపి సంస్కారః.

అ. ("అనేకకర్మాభ్యాస"కు బదులు "అనేకజన్మాభ్యాస" అనే పాఠం ఉండి ఉండవచ్చును.) అప్పుడే పుట్టిన పిల్లలు మొదలైనవాళ్ళకు దేనిచేత చనుబాలు త్రాగడానికి ఇచ్ఛ మొదలైనది కలిగింపబడుచున్నదో, అనేకపూర్వజన్మలలో ఉన్న అభ్యాసవశంచేత ఏర్పడే అది కూడ సంస్కారమే.

32. భోగాయతనం శరీరమ్.

అ. సుఖదుఃఖాలు అనుభవించే స్థానం శరీరం.

33. ఐహికవ్యవహారప్రసాధనపరం లోకాయతికం మతమ్.

అ. లోకాయతమతం ఇహలోకానికి సంబంధించిన వ్యవహారాలను చక్కబెట్టటం కోసం ప్రధానంగా ఉద్దిష్టమైనది.

34. అధీతలోకాయతమతో హి రాజా రాష్ట్రకణ్టకానుచ్ఛేత్తుం కల్పతే.

అ. లోకాయతమతాధ్యయనం చేసిన రాజుకు రాష్ట్రంలో ఉన్న ముళ్ళను పెకలించే (శత్రుబాధాదులను తొలగించే) సామర్థ్యం కలుగుతుంది.

35. న ఖల్వేకాన్తతో యతీనామప్యనవద్యాస్తి క్రియా.

అ. యతులు చేసే కార్యాలలో కూడా ఏ మాత్రము దోషాలు ఉండవు అనే మాట లేదు కదా?

36. ఏకాన్తేన కారుణ్యపరః కరతలగతమప్యర్థం రక్షితుం న క్షమః.

అ. ఎక్కువ జాలిగుండె గలవాడు చేతికి చిక్కిన వస్తువును కూడ రక్షించుకోలేడు.

37. ప్రశమైకచిత్తం కో నామ న పరిభవతి?

అ. చిత్తాన్ని పూర్తిగా ప్రశాంతంగా ఉంచుకోవాలి అనుకొనేవాణ్ణి తిరస్కరించకుండా ఎవరుంటారు?

38. అపరాధిషు ప్రశమః యతీనాం భూషణమ్, న మహీపతీనామ్.

అ. అపరాధం చేసినవాళ్ళ విషయంలో కూడా ఓర్పు వహించడం సంన్యాసులకు అలంకారం అవవచ్చునేమో కాని రాజులకు కాదు.

39. ధిక్ తం పురుషం, యస్యాత్మశక్త్యా న స్తః కోపప్రసాదౌ.

అ. స్వశక్తిచేత కోపాన్నీ అనుగ్రహాన్నీ ప్రదర్శింపజాలని మనిషి బ్రతుకు వ్యర్థం (ఛీ! అలాంటివాడు ఎందుకు?)

40. స జీవన్నపి మృత ఏవ, యో న విక్రామతి ప్రతికూలేషు.

అ. తనకు ప్రతికూలంగా ఉన్నవాళ్ళ విషయంలో పరాక్రమం చూపని వాడు జీవించినా మరణించినట్లే.

41. భస్మనీవ నిస్తేజసి కో నామ నిఃశఙ్కం పదం న దదాతి?

అ. తేజస్సు లేనివాణ్ణి చల్లారిన బూడిదను తొక్కినట్లు ఎవడు తొక్క వేయడు?

42. తత్ పాపమపి న పాపం, యత్ర మహాన్ ధర్మానుబన్ధః; అన్యథా పునః రాజ్యమపి నరకాయ భవేత్.

అ. గొప్ప ధర్మంతో సంబంధం ఉన్న (గొప్ప ధర్మానికి దారితీసే) పాపం పాపం కాదు. అలా కాకపోతే రాజ్యం కూడా నరకానికి హేతువని చెప్ప వలసి వస్తుంది.

43. బన్ధనాన్తో నియోగః.

అ. అధికారం బంధనంతో సరి. ప్రతీ ఆఫీసరూ చేసిన ఏదో తప్పుకి చివరికి కారాగారశిక్ష అనుభవించవలసిందే.

44. విపదన్తా ఖలమైత్రీ.

అ. దుర్మార్గులతో స్నేహం ఆపదతో ముగుస్తుంది.

45. మరణాన్తః స్త్రీషు విశ్వాసః.

ఇత్యాన్వీక్షికీసముద్దేశః.

అ. స్త్రీల విషయంలో విశ్వాసం మరణంతో ఆఖరు.

''బాలానందిని'' అను సోమదేవనీతిసూత్రాంధ్రవ్యాఖ్యలో

ఆన్వీక్షికీసముద్దేశం సమాప్తం.

# 7. త్రయీ సముద్దేశః

1. చత్వారో వేదాః, శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యౌతిషమితి షడఙ్గాని, ఇతిహాసపురాణన్యాయమీమాంసాధర్మ శాస్త్రాణి చేతి చతుర్దశ విద్యాస్థానాని (త్రయీ).

అ. నాలుగు వేదాలు, శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము అనే ఆరు అంగాలు, ఇతిహాసపురాణాలు, న్యాయము, మీమాంస, ధర్మశాస్త్రము - ఇవి పద్నాలుగు విద్యాస్థానాలు (వీటికే 'త్రయి' అని పేరు).

2. త్రయీతః ఖలు వర్ణాశ్రమాచారాణాం ధర్మాధర్మవ్యవస్థా.

అ. వర్ణాలకీ, ఆశ్రమాలకీ సంబంధించిన ఆచారాల వ్యవస్థ, ధర్మాధర్మాల వ్యవస్థ త్రయిచేత నిర్ణయించబడుతుంది.

3. త్రయీత ఏవ స్వస్వపక్షానురాగప్రవృత్తాః సర్వేఽపి సమయాః లోకవ్యవహారేష్వధిక్రియన్తే.

అ. తమ తమ పక్షాలమీద ఆసక్తితో ప్రవర్తించే అన్ని మతాలవాళ్ళూ కూడా లోకవ్యవహారం త్రయిలో చెప్పిన విధంగానే జరుపుకోవాలి.

4. ధర్మశాస్త్రాణి స్మృతయశ్చ వేదార్థసంగ్రహరూపత్వాద్వేదా ఏవ.

అ. ధర్మశాస్త్రాలు, స్మృతులూ కూడా వేదాలలోని విషయాలనే సంగ్రహించి బోధిస్తాయి; అందుచేత అవి కూడా వేదాలే.

5. అధ్యయనం, యజనం, దానం చ బ్రహ్మక్షత్రవిశాం సమానో ధర్మః.

అ. వేదాధ్యయనం, యజ్ఞాలు చేయడం, దానం చేయడం - ఈ మూడూ బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్యులకు సమానమైన ధర్మం.

6. బ్రహ్మక్షత్రవిశః త్రయో వర్ణా ద్విజాతయః.

అ. బ్రాహ్మణ - క్షత్రియ-వైశ్య లనే మూడు వర్ణాలవాళ్లూ ద్విజాతులు.

7. అధ్యాపనం యాజనం ప్రతిగ్రహశ్చ బ్రాహ్మణానామేవ.

అ. వేదాలు ఇతరులకు చెప్పడం, యజ్ఞాలు చేయించడం, దానాలు తీసికోవడం - ఈ మూడూ బ్రాహ్మణులకి మాత్రమే.

8. భూతసంరక్షణం, శస్త్రాజీవః, సత్పురుషోపకారః, దీనోద్ధరణం, రణేఽపలాయనం చ క్షత్రియాణామ్

అ. అన్ని ప్రాణుల్ని రక్షించడం, ఆయుధాన్ని జీవనోపాధిగా చేసుకోవడం, సత్పురుషులకు సాహాయ్యం చేయడం, దీనులను కాపాడడం, యుద్ధరంగంనుండి పారిపోకపోవడం - ఇవి క్షత్రియుల ధర్మాలు.

9. వార్తాజీవనమ్, ఆవేశికపూజనం, సత్రప్రపాపుణ్యారామాది నిర్మాపణం చ వైశ్యానామ్.

అ. వార్తను, (అనగా క్రయవిక్రయవ్యవహారం (వర్తకం) వ్యవసాయం, గోసంరక్షణం - వీటిని) జీవనోపాధిగా గ్రహించి అతిథులను పూజించడం, సత్రాలు (నిత్యాన్నదానగృహాలు), ప్రపలు (నిత్యజలదానస్థానాలు) పుణ్యములైన ఉద్యానాలు మొదలైనవాటిని నిర్మింపచేయడం - ఇవి వైశ్యుల ధర్మాలు.

10. త్రివర్ణోపజీవనం, కారుకుశీలవకర్మ, శకటోపవాహనం చ శూద్రాణామ్.

అ త్రివర్ణాలవారి సేవను జీవనవృత్తిగా గ్రహించి, శిల్పుల పనులు చేయడం, స్తోత్రగానాదులు చేయడం, బండ్లు తోలడం-ఇవి శూద్రుల ధర్మాలు.

11. సకృత్పరిణయవ్యవహారాః శూద్రాః.

అ. శూద్రులు వివాహవ్యవహారం ఒక్క పర్యాయమే చేసికోవాలి.

12. ఆచారానవద్యత్వం, శుచిరుపస్కారః, శారీరశుద్ధిశ్చ కరోతి శూద్రానపి దేవద్విజతపస్విపరికర్మసు యోగ్యాన్.

అ. నిర్దుష్టమైన నడవడిక, పాత్రాదులను పరిశుద్ధంగా ఉంచుకోవడం, శరీరాన్ని స్నానాదులచేత శుభ్రంగా ఉంచుకోవడం-వీటివల్ల శూద్రులు కూడా దేవతలను, ద్విజులను, మునులను దగ్గరగా ఉండి సేవించడానికి యోగ్యులవుతారు.

13. ఆనృశంస్యమ్, అమృషాభాషిత్వమ్, పరస్వనివృత్తిః, ఇచ్ఛానియమః, ప్రతిలోమావివాహః, నిషిద్ధాసు స్త్రీషు చ బ్రహ్మచర్యమ్ ఇతి సర్వేషాం సమానో ధర్మః.

అ. క్రూరంగా ప్రవర్తించకపోవడం, అసత్యం పలకకపోవడం, పరుల ధనం నుంచి దూరంగా ఉండడం, కోరికలను ఒక హద్దులో ఉంచుకోవడం, పై వర్ణాల స్త్రీలను పెండ్లాడకపోవడం, నిషేధించబడిన స్త్రీల విషయంలో బ్రహ్మచర్యం అవలంబించడం అనేవి అన్నివర్ణాలవారికీ సమానమైన ధర్మం.

14. ఆదిత్యాలోక ఇవ ధర్మః ఖలు సర్వసాధారణః, విశేషానుష్ఠానే తు నియమః.

అ. సూర్యుడి వెలుతురువలె ధర్మం అందరికీ సమంగా వర్తించేదే. నియమం అల్లా విశేషధర్మాల అనుష్ఠానంలోనే.

15. నిజాగమోక్తమనుష్ఠానం సమస్తయతీనాం ధర్మః.

అ. యతీశ్వరు లందరికీ తమ తమ ఆగమాలలో విధించిన అనుష్ఠానం ధర్మం.

16. ధర్మవ్యతిక్రమే యతీనాం నిజాగమోక్తమేవ ప్రాయశ్చిత్తమ్.

అ. యతీశ్వరులు ఏమైనా ధర్మవిరుద్ధమైన కార్యం చేస్తే వాళ్ళు వాళ్ళ ఆగమాలలో చెప్పిన రీతిగానే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి.

17. యో యస్మిన్ దేవే శ్రద్ధావాన్ స తం దేవం ప్రతిష్ఠాపయేత్.

అ. ఎవనికి ఏ దేవునిమీద భక్తి ఉంటే అతడు ఆ దేవుణ్ణి ప్రతిష్ఠ చేయించాలి.

18. అభక్తైః కృతః పూజోపచారః సద్యః శాపాయ.

అ. భక్తి లేనివాళ్ళు చేసే పూజోపచారాదికం వెంటనే శాపానికి (చెడ్డ ఫలితానికి) హేతువు అవుతుంది.

19. వర్ణాశ్రమాణాం స్వాచారప్రచ్యుతౌ త్రయీతో విశుద్ధిః.

అ. ఆ యా వర్ణాలవాళ్ళు, ఆశ్రమాలవాళ్ళు తమ ఆచారంనుండి తప్పితే వాళ్ళకి త్రయిలో చెప్పిన రీతిగా శుద్ధి చేయాలి.

20. స్వస్వధర్మాసంకరః ప్రజాః రాజానం చ త్రివర్గేణోపసంధత్తే.

అ. తమ తమ ధర్మాల సంకరం లేకుండా చూచుకొంచే ప్రజలకీ రాజుకు కూడా ధర్మార్థకామా లనే త్రివర్గం సిద్ధిస్తుంది.

21. స కింరాజా యో న రక్షతి ప్రజాః?

అ ప్రజలను రక్షించని రాజు ఏం రాజు? లేదా దుష్టరాజు అని అర్థం.

22. స్వధర్మమతిక్రామతాం సర్వేషాం పార్థివో గురుః.

అ. స్వధర్మం అతిక్రమించే వాళ్ళకందరికి రాజే గురువు (వాళ్ళని రాజే మంచి దారిలో పెట్టాలి.)

23. పరిపాలకో హి రాజా సర్వేషాం ధర్మషష్ఠాంశమవాప్నోతి.

అ అందరినీ పరిపాలించే రాజు అందరి ధర్మంనుంచీ ఆరవ భాగం పొందుతాడు.

24. ఉఞ్ఛషడ్భాగప్రదానేన వనస్థా అపి తపస్వినః రాజానం సంభావయన్తి- "తస్యైతత్ స్యాత్ యోఽస్మాన్ గోపాయతి."

అ. "ఇది మమ్మల్ని రక్షించేవానికి చెందుగాక!" అని అంటూ వనాలలో ఉండే మునులు కూడా ఉంఛంలో ఆరవ భాగం ఇచ్చి రాజును గౌరవిస్తారు. (క్షేత్రస్వామి పండిన ధాన్యం అంతా తీసుకొని వెళ్ళిపోయిన తరువాత అక్కడక్కడ రాలిన ధాన్యంగింజలు ఏరుకోవడం ఉంఛం.)

25. తదమఙ్గలమపి నామఙ్గలం యత్రాస్యాత్మనో భక్తిః.

అ. తనకు దేనియందు భక్తి ఉందో అది అమంగళమైనా అమంగళం కాదు.

26. సంన్యస్యాగ్నిం అగ్నిపరిగ్రహాంశ్చాస్పృశన్నుపాసీత.

అ. సంన్యసించిన పిమ్మట అగ్నినీ అగ్నికి సంబంధించిన వాటినీ (?) స్పృశించకుండా అగ్న్యుపాసన చెయ్యాలి. (మానసికంగా చేయాలి.)

27. స్నాత్వా ప్రాగ్దేవోపాసనాత్ న కంచన స్పృశేత్.

అ. స్నానం చేసిన తర్వాత దేవతోపాసన (పూజ) చేసేవరకు ఎవర్నీ స్పృశించకూడదు.

28. దేవాగారగతః సర్వాన్ యతీన్ ఆత్మసంబన్ధినీః జరతీశ్చ పశ్యేత్.

అ. (రాజు) యతీశ్వరు లందరినీ, తనకు సంబంధించిన వృద్ధస్త్రీలను దేవతా (పూజా) గృహంలో ఉండి చూడాలి. (ఇంటర్వ్యూ ఇవ్వాలి.)

29. దేవాకారోపేతః పాషాణోఽపి నావమన్యేత, కిం పునర్మనుష్యః?

అ. దేవతాకారంలో ఉన్న రాయిని కూడ అవమానించకూడదు. మనుష్యుడి మాట చెప్పాలా? (ఏ మనిషినీ అవమానించకూడదు.)

30. రాజశాసనస్య మృత్తికాయామివ లిఙ్గిషు కో నామ విచారః?

అ. మట్టిబెడ్డ విషయంలో రాజశాసనానికి ఏ విధంగా చలామణీ ఉందదో సంన్యాసి విషయంలో కూడా అంతే అని భావం. (మృత్తిక విషయంలో వలెనే సంన్యాస్యాదుల విషయంలో రాజశాసనానికి ఏమి విచారణ ఉంటుంది?)

31. స్వయం మలినోఽపి ఖలః ప్రవర్ధయత్యేవ సితం క్షీరం ధేనూనామ్.

అ. తాను మలినంగానే ఉన్నా తెలకపిండి ఆవుల తెల్లపాలను వృద్ధి పొందిస్తుంది.

32. న ఖలు పరేషామాచారః స్వస్య పుణ్యమారభతే, నాపి మనో విశుద్ధిమ్.

అ. ఇతరులు చేసే సదాచారం తనకు పుణ్యం కలిగించదు. మనఃశుద్ధి కూడా కలిగించదు (సదాచారం విషయంలో తనకు తానే ప్రయత్నం చేసుకోవాలిగాని, పూజాయజ్ఞాదులు ఏ పురోహితాదుల్నో పెట్టి చేయించుకొన్నట్లు ఇతరులచేత చేయిస్తే ప్రయోజనం లేదు.)

33. దీనా ప్రకృతిః ప్రాయేణ బ్రాహ్మణానామ్.

అ. సాధారణంగా బ్రాహ్మణుల స్వభావం దీనంగా ఉంటుంది. (బ్రాహ్మణులు దైన్యం చూపిస్తారు.)

34. బలాత్కారస్వభావః క్షత్రియాణామ్.

అ. బలప్రయోగం చేయడం క్షత్రియుల స్వభావం.

35. నిసర్గతః శాఠ్యం కిరాతానామ్.

అ. కిరాతులు సహజంగానే శాఠ్యంతో (క్రౌర్యంతో) ఉంటారు.

36. ఋజువక్రశీలతా సహజా కృషీవలానామ్.

అ. వ్యవసాయదారులు (రైతులు) సహజంగానే కొన్ని సమయాలలో ఋజువుగా ప్రవర్తిస్తారు. కొన్ని సమయాలలో వక్రంగా ప్రవర్తిస్తారు.

37. దానావసానః కోపో బ్రాహ్మణానామ్.

అ. బ్రాహ్మణుల కోపం దానంతో ఆఖరు.

38. ప్రణామావసానః కోపో గురూణామ్.

అ. గురువుల (పెద్దల) కోపం నమస్కారంతో ఆఖరు.

39. ప్రాణావసానః కోపః క్షత్రియాణామ్.

అ. క్షత్రియుల కోపం ప్రాణాలు తీయడంతోనే ఆఖరు.

40. ప్రియవచనావసానః కోపః వణిగ్జనానామ్.

అ. వర్తకుల (వైశ్యుల) కోపం మంచిమాటలతో ఆఖరు.

41. విశ్వాసైః సహ వ్యవహారః వణిజాం నిధిః.

అ. తమయందు పూర్తి విశ్వాసం ఏర్పడ్డవాళ్ళతో వ్యవహరించడం వర్తకులకు నిధివంటిది. వాళ్ళు విశ్వసించినవాళ్ళనే మోసంచేసి బాగా ధనం సంపాదిస్తారు అని భావం.

42. ఉద్ధారప్రదానేనాపి కోపోపశమో వైశ్యానామ్.

అ. వైశ్యుల కోపం అరువు తీరిస్తే కూడా తగ్గుతుంది.

43. దణ్డభయోపధిభిః వశీకరణం నీచజాత్యానామ్.

ఇతి త్రయీ*సముద్దేశః

అ. నీచజాతివాళ్ళని దండించి గాని, భయపెట్టి గాని, లంచాలు ఎర చూపిగాని వశం చేసుకోవచ్చును.

బాలానందిని అను సోమదేవ నీతిసూత్రాంధ్ర వ్యాఖ్యలో

త్రయీ సముద్దేశం సమాప్తం.

## 8. వార్తా సముద్దేశః

1. కృషిః, పశుపాలనం, వణిజ్యా చ వార్తా.

అ. వ్యవసాయం, పశుపాలనం, వర్తకం - వీటికి 'వార్త' అని పేరు.

2. వార్తాసమృద్ధౌ హి సర్వాః సమృద్ధయో రాజ్ఞామ్.

అ. వార్త అభివృద్ధిలో ఉంటే రాజుకి అన్నివిధాల సమృద్ధి లభించినట్లే.

3. తస్య ఖలు సంసారే సుఖం యస్య కృషిః ధేనవః, శాకవాట్యః, సద్మన్యుదపానం చ.

అ. ఎవరికైతే వ్యవసాయం, ఆవులు, కూర్లతోటలు, పెరట్లో నుయ్యీ ఉంటాయో వానికే ఈ సంసారంలో సుఖం.

4. రాజ్ఞస్తన్త్రపోషణే నియోగినాముత్సవః, మహాంశ్చ కోశక్షయః.

అ. రాజు ఎక్కువగా రాజపరిపాలనాధికారులను పోషించడంలోనే ఆసక్తి చూపితే నియోగులకు (అధికారులకు) ఉత్సవంగానే ఉంటుంది. ధనాగారం మాత్రం కాళీ అయిపోతుంది. (ఆరు మాసాల కొకమాటు జీతాలూ, డి.ఏ.లు పెంచుకొంటూ పోతే అధికారులందరికీ మహానందమే. ప్రజాసామాన్యానికి ఉపకరించే పనులు చేయడానికి శూన్యవాదాలూ, శుష్కహస్తాలూ మాత్రమే మిగులుతాయి. తంత్రమ్ = పాలనం; Administration).

5. నిత్యం హిరణ్యవ్యయేన మేరురపి హి క్షీయతే.

అ. నిత్యమూ బంగారం ఖర్చుపెడుతూ ఉంటే మేరుపర్వతం కూడా తరిగిపోతుంది కదా?

6. తత్ర సదైవ దుర్భిక్షం యత్ర రాజా విసాధయతి.

అ. ఏ రాజ్యంలో రాజు ధాన్యాదులను సంగ్రహించడో, రాబడిని మించిన ఖర్చు చేస్తాడో ఆ రాజ్యంలో ఎప్పుడూ దుర్భిక్షమే ఉంటుంది.

7. సముద్రస్య పిపాసాయాం కుతో హి జగతి జలాని?

అ. సముద్రానికే దాహం వేస్తే ఈ ప్రపంచంలో నీళ్ళెక్కడ దొరుకుతాయి?

8. ప్రజానాం స్వయంజీవధనమదర్శయతో రాజ్ఞః మహతీ హానిః, మనస్తాపః, క్షుత్పిపాసాప్రతీకారాత్ పాపం చ.

అ. ప్రజలకి తమ కాళ్ళమీద తాము నిలబడి జీవించడానికి కావలసినంత ధనం చూపించని రాజుకు హాని (ఆపద) కలుగుతుంది. మనస్తాపం తప్పదు. వాళ్ళ ఆకలిదప్పికలు తీర్చకపోవడంచేత గొప్ప పాపం వస్తుంది

9. వృద్ధబాలవ్యాధితక్షీణాన్ పశూన్ బాన్ధవానివ పశ్యేత్.

అ. ముసలివీ, చిన్నవీ, రోగంతో బాధపడుతున్నవీ, దుర్బలంగా ఉన్నవీ అయిన పశువుల్ని బంధువులను చూచినట్లు చూడాలి. అంతేకాని, పశువధశాలకి పంపకూడదు.

10. అతీవ భారః మహాన్ మార్గశ్చ పశూనామ్ అకాణ్డే మరణకారణమ్.

అ. మోయలేనంత బరువు మోయించడం చేతా, చాలా దూరం నడిపించడం చేతా పశువులు అకస్మాత్తుగా మరణిస్తాయి.

11. శుల్కవృద్ధిః బలాత్పణ్యగ్రహణం చ దేశాన్తరభాణ్డానామ ప్రవేశే హేతుః.

అ. పన్నులు బాగా ఎక్కువ వేసినా, బలాత్కారంగా వస్తువుల్ని లాగికొన్నా ఇతరదేశాలనుంచి సరుకు రాదు.

12. కాష్ఠపాత్ర్యామేకదైవ పదార్థో రధ్యతే.

అ. పదార్థాన్ని కఱ్ఱ గిన్నెలో ఒకమాటే వండడం కుదురుతుంది.

13. తులామానయోరవ్యవస్థా వ్యవహారం దూషయతి.

అ. తూకంలోను, కొలతలోను వ్యవస్థ లేకపోతే వ్యవహారం (వ్యాపారం) చెడుతుంది.

14. వణిక్కృతోఽర్ఘః స్థితాన్ ఆగన్తుకాంశ్చ పీడయతి.

అ. ఖరీదులు వర్తకులే నిర్ణయించడం ప్రారంభిస్తే దానివల్ల (ఆ దేశంలో) స్థిరంగా ఉన్నవాళ్ళకి, బైటనుండి వచ్చేవాళ్ళకి కూడా కష్టం కలుగుతుంది.

15. దేశకాలభాణ్డాపేక్షయా వా సర్వార్ఘో భవేత్.

అ. అన్ని వస్తువుల ఖరీదులూ ప్రదేశాన్ని పట్టి, కాలాన్ని పట్టి, సరుకు లభ్యం అవడాన్ని పట్టి ఉండాలి.

16. పణ్యతులామానవిశుద్ధౌ రాజా స్వయం జాగృయాత్.

అ. అమ్మ చూపిన సరుకులు, తూకాలు, కొలతలు సరిగా ఉండడం విషయంలో రాజు స్వయంగా శ్రద్ధ తీసికోవాలి.

17. న వణిగ్భ్యః సన్తి పరే పశ్యతోహరాః.

అ. పశ్యతోహరులు (చూస్తూండగానే అపహరించేవాళ్ళు) అంటూ మరెవరూ లేరు; వర్తకులే.

18. స్పర్ధయా వృద్ధం మూల్యం భాణ్డేషు రాజ్ఞః; యథోచితం మూల్యం విక్రేతుః.

అ పోటీపడి పెంచిన సరుకుల ధర రాజుకు చెందుతుంది; అమ్మినవానికి తగు విధంగా ఇవ్వాలి, ఎక్కువ ఇవ్వకూడదు.

19. అల్పద్రవ్యేణ మహాభాణ్డం గృహ్ణతః మూల్యావినాశేన తద్భాణ్డం రాజ్ఞః.

అ. చాలా సరుకు ఎవరైనా స్వల్పద్రవ్యం ఇచ్చి తీసికొన్నట్లయితే ఆ సరుకంతా రాజు జప్తు చెయ్యాలి; కొన్నవాడికి వాడెంత ధనం ఇచ్చాడో అది ఇచ్చివేయాలి.

20. అన్యాయోపేక్షయా సర్వే వినశ్యన్తి.

అ. అన్యాయం జరుగుతూండగా చూస్తూ ఊరుకొంటే అందరూ నశిస్తారు.

21. చోరచరటాన్వయధమన - మన్నపధమన - రాజవల్లభాటవిక - తలార - కిరాతాక్షశాలిక - నియోగి-గ్రామకణ్టక-వార్ధుషికా హి రాష్ట్రస్య కణ్టకాః.

అ. దొంగలు ఇతర రాజ్యాలనుండి వచ్చిన గూఢచారులు, వంశస్తుతి చేసే వందిమాగధాదులు, కొలతలు కొలిచేవాళ్ళు, రాజులకు ఇష్టులైన వాళ్లు, ఆటవికులు, సామంతరాజులుగా ఉన్నవాళ్ళు, కిరాతకులు, ద్యూత (జూదం) శాలలకి సంబంధించినవాళ్ళు, అధికారులు, గ్రామకరణాలు, వడ్డీవ్యాపారం చేసే వాళ్ళు రాష్ట్రానికి కంటకాలు; ముళ్ళు; బాధకలిగించేవాళ్ళు.

భారతదేశంలోని అతిప్రాచీనమైన పరిపాలనావిధానానికి సంబంధించిన పారిభాషికపదా లవడంచేత ఈ సూత్రంలోని కొన్ని పదాలకు అర్థాలు తెలియ

లేదు. ఆధునికాలైన నిఘంటువులలో కూడా దొరకలేదు అయితే 1957 లో మైసూరు విశ్వవిద్యాలయంవారు ప్రచురించిన ఈ సూత్రాలకి ఇచ్చిన టిప్పణిని పట్టి వీటి అర్థాలు వ్రాయబడినవి "చరటః గుప్తో దూతః; రాజ్యాన్నిఃసారితో రాజేతి కేచిత్" (చరటుడు=గూఢంగా సంచరించే దూత. రాజ్యం నుంచి వెడల గొట్టబడిన రాజా అని కొందరు చెపుతున్నారు).''అన్వయధమనాః చారణాదయః" (అన్వయధమనులు = చారణులు మొదలైనవారు). "మన్నపాః మాపకాః'' (మన్నపాః=భూములు మొదలైనవిగాని వస్తువులు గాని కొలిచేవాళ్ళు). "ధమనాః భాణ్డపతేః మూల్యనిర్ధాయకాః ''(ధమనాః=ధాన్యాది వస్తువుల యజమాని దగ్గర ఉన్న వస్తువుల ధరలు నిర్ణయించేవారు). "తలారః సామన్తరాజతయావస్థితః'' (తలారాః=సామంతరాజులుగా ఉన్నవాళ్ళు. కాని తెలుగులో 'తలారి' 'తలవరి' అనే పదాలున్నాయి. రాత్రి దొంగలు రాకుండా గస్తీ తిరిగేవాడు అని అర్థం. ఆ పదాలకి ఈ పదానికీ సంబంధం ఉంటే తలారు లని అర్థం చెపితే బాగుంటుంది.) ''నియోగినః తత్తదధికారణః'' (నియోగినః=ఆ యా అధికారస్థానాలలో ఉన్నవాళ్ళు. ఇది ప్రసిద్ధపదమే). ''గ్రామకణ్టకః కపటప్రధానో గణకారః'' (గామకణ్టకః=గ్రామానికి ముల్లు. మోసగించడమే ప్రధానవృత్తిగా గల లెక్కలు చూచే కరణం మొదలైనవాళ్ళు). ''వార్ధుషికః వణిగ్బన్ధుః. యే చ ప్రభూతమన్న సంగ్రహం కృత్వా దుర్భిక్షం వాఞ్ఛన్తి తేఽపి వార్ధుషికాః'' (వార్ధుషికః=వర్తకుల బంధువు. ఆహారపదార్థాలు అధికంగా నిలవచేసి, దేశంలో దుర్భిక్షం వస్తే బాగుండును అని కోరుకునే వాళ్ళు కూడా వార్ధుషికులే). వార్ధుషికశబ్దానికి రెండవ అర్థం కూడా ఉన్నదేమో గాని నిఘంటువులలో "ఎక్కువ వడ్డీ తీసికొనే వడ్డీ వ్యాపారి'' అనే అర్థం ప్రసిద్ధం. ఇది మొదటి అర్థానికి దగ్గరగా ఉన్నది. పైన ఈ అర్థమే తీసికొనబడినది.

22. తే హి ప్రతాపవతి కణ్టకశోధనాధికరణజ్ఞే రాజ్ఞి న ప్రభవన్తి.

అ. రాజు ప్రతాపవంతుడై ఈలాంటి కంటకాల్ని ఎలా తుడిచిపెట్టాలో తెలిసినవాడైతే పైన చెప్పిన రాష్ట్రకంటకా లేమీ చేయజాలవు.

23. అన్యాయవృద్ధితో వార్ధుషికాః తన్త్రం కోశం దేశం చ నాశయన్తి.

అ. వడ్డీవ్యాపారస్థులు అన్యాయంగా వడ్డీలు వసూలు చేసి తమ ధనం పెంచుకొంటూ తంత్రాన్ని (పరిపాలనావిధానాన్ని administration), రాజు ధనాగారాన్ని, దేశాన్నీ కూడా నశింపచేస్తారు.

24. కార్యాకార్యయోర్నాస్తి దాక్షిణ్యం వార్ధుషికాణామ్.

అ. వడ్డీవ్యాపారం చేసేవాళ్ళకి ఈ పని చేయవచ్చు, ఈ పని చేయ కూడదు అనే ఆలోచనా, దయాభావం ఉండవు.

25. అప్రియమప్యౌషధం పీయతే.

అ. ఎంత ఇష్టం కాకపోయినా ఔషధం త్రాగుతారు.

26. అహిదష్టా స్వాఙ్గులిరపి ఛిద్యతే.

ఇతి వార్తా సముద్దేశః.

అ. పాము కరచిన, తన వేలైనా ఛేదించవలసిందే.

"బాలానందిని" అను సోమదేవ సూత్రాంధ్ర వ్యాఖ్యలో

వార్తా సముద్దేశం సమాప్తం.

## 9. దణ్డనీతి సముద్దేశః

1. చికిత్సాగమ ఇవ దోషవిశుద్ధిహేతుర్దణ్డః.

అ. చికిత్సాశాస్త్రం వలె (ముఖ్యంగా శస్త్రచికిత్స వలె) దండం దోషాలను తొలగించి సంఘాన్ని, మానవుల్ని పరిశుద్ధులను చేయడానికి అవసరమైనది.

2. యథాదోషం దణ్డప్రణయనం దణ్డనీతిః.

అ. దోషాన్ని (అపరాధాన్ని) పట్టి దండం విధించడం దండనీతి.

3. ప్రజాపాలనాయ రాజ్ఞా దణ్డః ప్రణీయతే, న ధనార్థమ్.

అ. రాజు ప్రజల పాలనంకోసం దండం విధిస్తాడు కాని, ధనంకోసం కాదు.

4. స కింరాజా వైద్యో వా యః స్వజీవనాయ ప్రజాసు దోషమన్వేషయతి.

అ. దండించి జరిమానాలు వసూలు చేయడం ద్వారా ధనం సంపాదించా లనుకొనే రాజు ఏం రాజు? ధనం సంపాదించడంకోసం లేని జబ్బులు ఉన్నా యని చెప్పే వైద్యుడు ఏం వైద్యుడు?

5. దణ్డ-ద్యూతాహవ-మృత-విస్మృత-చోర-పారదారిక-ప్రజావిప్లవజాని ద్రవ్యాణి న రాజా స్వయముపయుఞ్జీత.

అ. దండించడం (జరిమానాలు వేయడం), జూదం, యుద్ధం, ఎవరైనా మరణించడం - వీటివల్ల వచ్చిన ద్రవ్యాన్ని, ఎవరైనా మరచిన ద్రవ్యాన్ని, దొంగలవల్ల, పరభార్యాలంపటులవల్ల, ప్రజోపద్రవంవల్లా వచ్చిన ధనాన్ని రాజు తనకోసం ఉపయోగించుకోకూడదు.

6. దుష్ప్రణీతో హి దణ్డః కామక్రోధాభ్యామ్ అజ్ఞానాద్వా సర్వజన విద్వేషం కరోతి.

అ. కామంవల్లగాని, క్రోధంవల్లగాని, అజ్ఞానంచేతగాని చెడ్డగా విధించిన దండం (విధించకూడనివాళ్ళకి విధించిన దండం) సమస్తజనులలోను రాజు విషయంలో ద్వేషం కలిగిస్తుంది.

7. అప్రణీతో హి దణ్డః మాత్స్యన్యాయముద్భావయతి.

అ. అసలే దండం విధించకపోతే సమాజంలో మాత్స్యన్యాయం ఏర్పడుతుంది.

8. బలీయానబలం గ్రసతే ఇతి మాత్స్యన్యాయః.

**ఇతి దణ్డనీతి సముద్దేశః.**

అ. (పెద్దచేప చిన్నచేపను మింగినట్లు) బలవంతుడు దుర్బలుణ్ణి మింగివేయడం "మాత్స్యన్యాయం."

"బాలానందిని" అను సోమదేవ నీతి సూత్రాంధ్ర వ్యాఖ్యలో
దండనీతి సముద్దేశం సమాప్తం.

## 10. మన్త్రి సముద్దేశః

1. మన్త్రిపురోహితసేనాపతీనాం యో యుక్తముక్తం కరోతి స అహార్యబుద్ధిః.

అ. మంత్రి, పురోహితుడు, సేనాపతి చెప్పిన యుక్తమైన సలహాలు పాటించే రాజు బుద్ధికి తిరుగు ఉండదు.

2. అసుగన్ధమపి సూత్రం కుసుమసంయోగాత్ కిం నారోహతి దేవశిరాంసి?

అ. సువాసన లేనిదయినా దారం పుష్పాలతో సంబంధం ఉండడంవల్ల దేవతల శిరస్సులమీద ఎక్కడంలేదా?

3. మహద్భిః ప్రతిష్ఠితోఽశ్మాపి భవతి దేవః, కిం పునర్మనుష్యః?

అ. మహాత్ములు ప్రతిష్ఠ చేసిన రాయి కూడా దేవుడు అవుతూంటే మనిషి మాట చెప్పాలా?

4. తథా చానుశ్రూయతే - విష్ణుగుప్తానుగ్రహాత్కిల అనధికృతోఽపి చన్ద్రగుప్తః సామ్రాజ్యపదమవాపేతి.

అ. అందుచేతనే - "రాజ్యాధికారం లేనివాడైనా చంద్రగుప్తుడు విష్ణుగుప్తుని అనుగ్రహంవల్ల సామ్రాజ్యపదం పొందినాడు" అని వింటున్నాం.

5. బ్రాహ్మణక్షత్రియవిశామన్యతమం స్వదేశజమ్ ఆచారాభిజన విశుద్ధమ్ అవ్యసనినమ్ అవ్యభిచారిణమ్ అధీతాఖిలవ్యవహార తన్త్రమ్ అస్త్రజ్ఞమ్ అశేషోపధావిశుద్ధం చ మన్త్రిణం కుర్వీత.

అ. బ్రాహ్మణుణ్ణి గాని, క్షత్రియుణ్ణిగాని, వైశ్యుణ్ణి గాని మంత్రిగా చెయ్యాలి. అతడు తన (రాజు) దేశంలో పుట్టినవాడయి ఉండాలి. నడవడికలోను, వంశ గౌరవంచేత పరిశుద్ధుడై ఉండాలి. వ్యసనాలేవీ ఉండకూడదు. మార్పు లేనివాడై, అనగా పార్టీలు పిరాయించినట్లు కాక రాజు విషయంలోను, రాజ్యం విషయం లోను దృఢమైన భక్తికలవాడై ఉండాలి. రాజ్యపరిపాలనకు సంబంధించిన అన్ని వ్యవహారాలు, పద్ధతులూ తెలిసినవాడై ఉండాలి. అతనికి అస్త్రాల జ్ఞానం ఉండాలి. అన్ని ఉపధలలోను పరిశుద్ధుడు కావాలి. (ధనం, స్త్రీ మొదలైనవి ఎరచూపి రహస్యంగా చేసిన పరీక్ష ఉపధ.)

6. సమస్తపక్షపాతేషు స్వదేశపక్షపాతో మహాన్.

అ. అన్ని పక్షపాతాలలోకీ స్వదేశపక్షపాతం గొప్పది. (అందుచేత స్వదేశీయుణ్ణే మంత్రిగా చెయ్యాలి. ఐదవసూత్రంలో చెప్పిన మంత్రిలక్షణా లన్నిటికీ ఎందుచేత ప్రాధాన్యమో ఆరవ సూత్రంనుంచి కొన్ని సూత్రాలలో చెప్పబడింది).

7. విషనిషేక ఇవ దురాచారః సర్వాన్ గుణాన్ దూషయతి.

అ. చల్లిన విషంవలె దురాచారం అన్ని గుణాలను చెడగొట్టుతుంది.

8. దుష్పరిజనః మోహేన కుతోఽప్యకృత్యాన్న జుగుప్సతే.

అ. చెడ్డ పరిజనం ఉన్నవాడు వివేకరహితుడై ఎలాంటి చెడ్డపని చేయడానికి కూడా ఏవగించుకొనడు. (అందుచేత మాతాపిత్రాదిశుద్ధి చూచుకోవాలి.)

9. సవ్యసనసచివో రాజా ఆరూఢవ్యాలగజ ఇవ సులభాపాయః.

అ. దుర్వ్యసనా లున్న మంత్రి గల రాజుకు, దుష్టగజాన్ని ఎక్కినవానికి వలె అపాయాలు రావడం సులభం.

10. కిం తేన కేనాపి? యో విపది నోపతిష్ఠేత్.

అ. ఆపత్సమయంలో ఆదుకోనివాడు ఎవరైనా వానివల్ల ఏమి ప్రయోజనం? (అందుచేత దృఢమైన రాజభక్తి ఉన్నవానినే మంత్రిగా చేసుకోవాలి.)

11. పాత్రేసమితో హి సులభో లోకః.

అ. ఏ పనీ పాటూ లేకుండా భోజనం వేళకి సిద్ధమయ్యే వాళ్లు సులభంగా దొరుకుతారు కదా?

12. కిం తస్య భక్త్యా యో న వేత్తి స్వామినో హితోపాయమ్, అహితప్రతీకారం వా?

అ. ప్రభువుకు హితం కలిగించే ఉపాయం కాని, అహితానికి ప్రతిక్రియ గాని తెలియనివాడికి ఎంత రాజభక్తి ఉంటే మాత్రం ఏమి ప్రయోజనం? (అందుచేత మంత్రి అఖిలవ్యవహారతంత్రాలు తెలిసినవాడు అయి ఉండాలి)

13. కిం తేన సహాయేనాస్త్రజ్ఞేన యస్యాత్మరక్షణేఽప్యస్త్రం న ప్రభవతి.

అ. ఎవని ఆయుధం ఆత్మరక్షణానికి కూడా ఉపయోగించదో అలాంటి అస్త్రం గూర్చి తెలిసినవాడు సహాయుడుగా ఉంటే మాత్రం ఏమి ప్రయోజనం?

14. ధర్మార్థకామభయేషు వ్యాజేన పరచిత్తపరీక్షణమ్ ఉపధా.

అ. నీకు ఈ పని చేస్తే ఈ ధర్మం కలుగుతుంది. ఈ అర్థం లభిస్తుంది. ఈ కామం ఫలిస్తుంది. చేయకపోతే ఈ భయం ఉంది అని కపటవాక్యాలు పలుకుతూ చేయకూడని పనికై ప్రోత్సహిస్తూ పరుల (ఎవరిని నియోగింపదలచు కొన్నారో వారి) చిత్తాన్ని పరీక్షించడం "ఉపధ". అలాంటి ఉపధలో నెగ్గినవాడు "ఉపధాశుద్ధుడు."

15. అకులీనేషు నాస్త్యపవాదాద్భయమ్.

అ. సత్కులంలో పుట్టనివాళ్ళకి అపవాదం వల్ల భయం (ఎవరు ఏమను కుంటారో అనే భయం) ఉండదు

16. అలర్కవిషవత్ కాలం ప్రాప్య వికుర్వతే విజాతయః.

అ. నీచజాతివాళ్లు, పిచ్చికుక్క కాటు విషం వలె, కాలం వచ్చినపుడు వికృతంగా ప్రవర్తిస్తారు. (పిచ్చి కుక్క కరిచినవాడికి ఆ దోషం తగ్గిపోయినట్లు కనబడినా నెలకీ, రెండు నెలలకీ ఒకసారి ఆ వికారం బయటపడుతూంటుందట.)

17. తదమృతస్య విషత్వం యత్ కులీనే దోషసంభవః.

అ. మంచికులంలో పుట్టినవానిలో కూడా దోషం కనబడినదంటే అది అమృతం విషంగా మారడమే.

18. ఘటప్రదీపవత్ తద్జ్ఞానం యత్ న పరప్రతిబోధాయ.

అ. ఇతరులకు బోధించడానికి ఉపయోగపడని జ్ఞానం కుండలో దీపం వంటిది.

19. తేషాం శస్త్రమివ శాస్త్రమపి నిష్ఫలం యేషాం ప్రతిపక్షదర్శనాత్ భయమన్వయన్తి చేతాంసి.

అ. ప్రతిపక్షుణ్ణి (శత్రువు, ప్రతివాది అని రెండర్థాలు) చూడగానే భయ పడిపోయే మనస్సు కలవాళ్ళ శస్త్రం (ఆయుధం) వలెనే శాస్త్రం కూడా వ్యర్థం.

20. తచ్ఛస్త్రం శాస్త్రం వా ఆత్మపరిభవాయ, యత్ న హన్తి పరేషాం ప్రసరమ్.

అ. ఇతరుల ప్రసరాన్ని (ముందుకు చొచ్చుకుపోవడాన్ని) ఆపలేని శస్త్ర మైనా, శాస్త్రమైనా తనకు పరాభవం ఇవ్వడానికి మాత్రమే ఉపకరిస్తుంది.

21. న హి గలిర్బలీవర్దః భారకర్మణి కేనాపి యుజ్యతే.

అ. గలియైన (మూపు నలగని) ఎద్దును ఎవరూ బరువు లాగడానికి ఉపయోగించరు కదా?

22. మన్త్రిపూర్వో హి సర్వోఽప్యారమ్భః క్షితిపతీనామ్.

అ. రాజులు చేసే ప్రతి పనికీ ముందు మంత్రం (ఆలోచన) ఉండాలి.

23. అనుపలబ్ధస్య జ్ఞానమ్, ఉపలబ్ధస్య నిశ్చయః, నిశ్చితస్య బలాధానమ్, అర్థద్వైధస్య సంశయచ్ఛేదనం, ఏకదేశ దృష్టస్యాశేషోపలబ్ధిరితి మన్త్రిసాధ్యమేతత్.

అ. తెలియనిదానిని తెలుసుకోవడం, తెలుసుకొన్నదాన్ని నిశ్చయించడం, నిశ్చయించినదానికి బలం చేకూర్చడం, ఒక విషయంలో ఇట్లా అట్లా అన్న రెండు పక్షాలు ఏర్పడ్డప్పుడు సంశయాన్ని ఛేదించడం, కొంతవరకే తెలిసిన దానిని పూర్తిగా తెలుసుకోవడం - ఇవన్నీ మంత్రంచేత సాధింపబడతాయి.

24. అకృతస్యారమ్భమ్, ఆరబ్ధస్యానుష్ఠానమ్, అనుష్ఠితస్య వినియోగవిశేషసంపదం చ కర్మసు యే కుర్యుః తే మన్త్రిణః.

అ. చేయని పనిని ప్రారంభించడం, ప్రారంభించిన పని కొనసాగించడం, కొనసాగినదానివల్ల వచ్చిన ఫలాన్ని సక్రమంగా వినియోగించడం అనే వాటిని ఆ యా కర్మల విషయంలో ఎవరు చక్కగా నడిపిస్తారో వాళ్ళే మంత్రులు.

25. కర్మణామారమ్భోపాయః, పురుషద్రవ్యసంపత్, దేశకాల విభాగః, వినిపాతప్రతీకారః, కార్యసిద్ధిశ్చేతి పఞ్చాఙ్గో మన్త్రః.

అ. పనులు ప్రారంభించడానికి తగిన ఉపాయాలు, తగిన మనుష్యుల్ని ద్రవ్యాన్నీ చూచుకోవడం, ఏది తగిన ప్రదేశం, ఏది తగిన కాలం అనేది నిర్ణయించుకోవడం, వచ్చే ఆపదలకు ప్రతిక్రియ చేసుకోవడం, కార్యసిద్ధి అనే ఈ ఐదూ మంత్రానికి అంగాలు.

26. ఆకాశే ప్రతిశబ్దవతి చాశ్రయే మన్త్రం న కుర్యాత్.

అ. ఆకాశంలోను (అనగా ఆవరణలేని ప్రదేశంలోను), ప్రతిధ్వని ఇచ్చే గృహంలోను మంతనాలు చేయకూడదు.

27. ముఖవికారాభినయాభ్యాం ప్రతిధ్వానేన వా మనఃస్థమప్యర్థ మభ్యూహన్తి విచక్షణాః.

అ. ముఖవికారాన్ని పట్టి, కళ్ళు చేతులూ మొదలైనవాటి కదలికను (అభినయాన్ని) పట్టి, ప్రతిధ్వని చేత మనస్సులో ఉన్న అభిప్రాయాన్ని కూడా నేర్పుగల బుద్ధిమంతులు ఊహించి తెలుసుకుంటారు.

28. ఆ కార్యసిద్ధేః మన్త్రో రక్షితవ్యః

అ కార్యం సిద్ధించేవరకు మంత్రాన్ని రహస్యంగా ఉంచాలి.

29. దివా నక్తం వా అపరీక్ష్య మన్త్రియమాణస్య అభిమతః ప్రచ్ఛన్నో వా భినత్తి మన్త్రమ్.

అ. పగలైనా, రాత్రైనా పరీక్షించకుండా (చుట్టుప్రక్కల ఎవరున్నారు అని చూచుకోకుండా) మంత్రం చేసేవాని మంత్రాన్ని, తన కిష్టుడైనవాడే బయట పెట్టవచ్చు. రహస్యంగా దాగి ఉన్నవాడు విని బైట పెట్టవచ్చు.

30. శ్రూయతే కిల రజన్యాం వటవృక్షే ప్రచ్ఛన్నో వరరుచిః "అప్రశిఖ" ఇత్యస్య పిశాచేభ్యో వృత్తాన్తముపలభ్య చతురక్షరైరాద్యైః శ్లోకమేకం చకారేతి.

అ. రాత్రి మఱ్ఱిచెట్టు మీద దాగి ఉన్న వరరుచి అక్కడ మాటలాడు కొంటూన్న పిశాచాల వల్ల "అప్రశిఖ" అన్న అక్షరాలకి సంబంధించిన వృత్తాంతం తెలుసుకొని ఆ నాలుగు అక్షరాలూ నాలుగు పాదాల ప్రారంభంలో ఉంచి శ్లోకం రచించా డని వింటున్నాము కదా!

"అనేన తవ పుత్రస్య ప్రవిష్టస్య వనాన్తరే,
శిఖామాకృష్య పాదేన ఖడ్గేన నిహతం శిరః"
అనేది ఆ శ్లోకం,

31. న తైః సహ మన్త్రం కుర్యాత్ యేషాం పక్షీయేష్వపకుర్యాత్.

అ. ఎవరి పక్షానికి చెందినవాళ్ళకి అపకారం జరగడానికి అవకాశం ఉందో వాళ్ళతో మంతనాలు చేయకూడదు.

32. అనాయుక్తో మన్త్రకాలే న తిష్ఠేత్.

అ. మంతనాలు జరిగేటప్పుడు పిలవకుండా (దానితో సంబంధంలేనివాడు) అక్కడ ఉండగూడదు.

33. శ్రూయతే హి శుకసారికాభ్యామన్యైశ్చ తిర్యగ్భిః మన్త్రభేదః కృత ఇతి.

అ చిలకలు, సారికలు, ఇతర తిర్యగ్జంతువులు మంత్రాన్ని బైటపెట్టి నట్లు కథలు వింటున్నాం కదా?

34. మన్త్రభేదాదుత్పన్నం వ్యసనం దుష్ప్రతివిధేయం స్యాత్.

అ. ఆలోచన బైటపడిపోవడంవల్ల కలిగే ఆపదకు ప్రతిక్రియ ఉండదు.

35. ఇఙ్గితమ్, ఆకారః,మదః,ప్రమాదః,నిద్రా చ మన్త్రభేదకారణాని.

అ. ఇంగితం, ఆకారం, మదం, ప్రమాదం, నిద్ర - ఇవి మంత్రం పైకి తెలిసిపోవడానికి కారణాలు.

36. ఇఙ్గితమ్ అన్యథావృత్తిః.

అ. మనిషి మరొకవిధంగా ఉండడం, (మామూలుగా ఉండకపోవడం) ఇంగితం.

37. కోపప్రసాదజనితా శరీరవృత్తిః ఆకారః.

అ. కోపంచేత, అనుగ్రహంచేత, అనగా అనుకూలత్వం లేదా సంతోషం చేత శరీరంలో కలిగిన మార్పు ఆకారం.

38. పానస్త్రీసంగాదిజనితో హర్షః మదః.

అ. మద్యపానంవల్ల, స్త్రీసంగాదులవల్లా కలిగిన హర్షం మదం.

39. ప్రమాదః గోత్రస్ఖలనాదిహేతుః.

అ. ఒక పేరుకు బదులు మరొక పేరును పెట్టి పిలవడం మొదలైన వాటికి హేతువైనది ప్రమాదం (పొరబాటు).

40. అన్యచ్చికీర్షతః అన్యథావృత్తిర్వా ప్రమాదః.

అ. లేదా ఒకటి చేయబోయి మరొటి చేయడం ప్రమాదం.

41. జల్పాఙ్గవికారహేతుః నిద్రా.

అ. పలవరింతలు, అవయవాలలో వికారం మొదలైనవాటికి హేతువు నిద్ర.

42. ఉద్ధృతమన్త్రో న దీర్ఘసూత్రః స్యాత్.

అ. మంత్రాన్ని నిర్ణయించినవాడు దాని ప్రకారం పని జరపడంలో ఆలస్యం చెయ్యకూడదు.

43. అననుష్ఠానే కేవలేన కిం మన్త్రేణ?

అ. చేతలో చూపనప్పుడు మంత్రం చేసి ఏమి ప్రయోజనం?

44. న హ్యౌషధపరిజ్ఞానాదేవ వ్యాధిప్రశమః.

అ. ఔషధం తెలిసికొన్నంత మాత్రాన వ్యాధి శాంతించదు కదా?

45. నాస్త్యవివేకాత్ పరః ప్రాణినాం శత్రుః.

అ. మానవులకు అవివేకాన్ని మించిన శత్రువు ఉండదు.

46. ఆత్మసాధ్యమన్యేన కారయన్ ఔషధమూల్యాదేవ వ్యాధిం చికిత్సతి.

అ. తాను సాధించవలసిన పనిని ఇతరులచేత చేయించాలనుకొనేవాడు కేవలం ఔషధం కొని (స్వయంగా సేవించవలసిన ఆ ఔషధాన్ని సేవించకుండా) వ్యాధిని పోగొట్టుకొనదలచుచున్నాడు.

47. యో యత్ర్పతిబద్ధః స తేన సహోదయవ్యయీ.

అ. ఎవడు ఎవనితో దగ్గర సంబంధం కలిగి ఉంటాడో వాడి అభివృద్ధి వినాశాలు వాని అభివృద్ధివినాశాలతో ముడివడి ఉంటాయి.

48. స్వామినాధిష్ఠితో మేషోఽపి సింహాయతే.

అ. స్వామి (తన యజమాని) ప్రక్కనే ఉంటే గొఱ్ఱె కూడా సింహం లాగ ప్రవర్తిస్తుంది.

49. మన్త్రకాలే మన్త్రిభిర్వాదః స్వైరాలాపశ్చ న కర్తవ్యః.

అ. మంత్రం చేసే సమయంలో మంత్రులతో వాగ్వాదం కాని స్వేచ్ఛా సంభాషణం (loose talk) కాని చేయకూడదు.

50. లఘునోపాయేన మహతః కార్యస్య సిద్ధిః మన్త్రఫలమ్.

అ. తేలికయైన ఉపాయంచేత గొప్ప కార్యం సిద్ధించడం మంత్రానికి ఫలం.

51. న ఖలు హస్తేనోత్థాప్యతే గ్రావా యథా దారుణా.

అః పెద్ద రాతిబండను కఱ్ఱ సహాయంతో లేవదీసినట్లు చేతులతో లేవ దీయడం కష్టం కదా?

52. స మన్త్రీ శత్రుః, యః నృపేచ్ఛయా అకార్యమపి కార్య రూపతయా అనుశాస్తి.

అ. రాజుకు ఇష్టం కదా అని చేయకూడని పని కూడా చేయదగిన దన్నట్లు సలహా ఇచ్చే మంత్రి శత్రువు.

53. వరం స్వామినో దుఃఖం న పునరకార్యోపదేశేన తద్వినాశః.

అ. కూడని పనిని ఉపదేశించి రాజుకు వినాశం కలిగించడం కంటె (మంచిని ఉపదేశించి) ఆతని మనస్సుకు (తాత్కాలికంగా) కష్టం కలిగించడం మేలు.

54. క్షీరమపిబతో బాలస్య కిం న క్రియతే కపోలహననమ్.

అ పిల్లవాడు పాలు త్రాగకపోతే చెంపమీద కొట్టమా?

55. మన్త్రిణో రాజహృదయత్వాత్ తే న కేనచిత్సహ సంసర్గం కుర్యుః.

అ. మంత్రులు రాజుకు గుండె; అందుచేత వాళ్ళు ఎవరితోనూ సంబంధం పెట్టుకొనకూడదు.

56. రాజ్ఞోఽనుగ్రహనిగ్రహావేవ మన్త్రిణామనుగ్రహనిగ్రహౌ.

అ. రాజు అనుగ్రహ నిగ్రహాలే మంత్రుల అనుగ్రహ నిగ్రహాలు. రాజు అనుగ్రహిస్తే మంత్రులు అనుగ్రహించాలి, ఆతడు నిగ్రహిస్తే వీళ్ళు నిగ్రహించాలి; లేదా రాజుకు ఇతరుల వలన కలిగే అనుగ్రహనిగ్రహాలు మంత్రులకు కూడా అనుగ్రహనిగ్రహాలే

57. న దైవస్యాపరాధః న మన్త్రిణామ్ యత్సుఘటితమపి కార్యం విఘటేత.

అ. బాగా ఆలోచించి చేసిన పని కూడా చెడిపోతే దైవం దోషం కాని మంత్రుల తప్పు కాదు.

58. న ఖల్వసౌ రాజా యో మన్త్రిణోఽతిక్రమ్య వర్తతే.

అ. మంత్రులను కాదని ప్రవర్తించేవాడు రాజు కాడు.

59. సువివేచితాన్మన్త్రాత్ భవత్యేవ కార్యసిద్ధిః యది న స్వామినో దురాగ్రహః స్యాత్.

అ. బాగా వివేచించి చేయబడిన మంత్రంవల్ల కార్యసిద్ధి తప్పక లభిస్తుంది. అయితే ప్రభువు దురభిమానం కలవాడు కాకూడదు.

60. అవిక్రామతో నీతిర్వణిక్ఖడ్గయష్టిరివ.

అ. పరాక్రమం చూపనివాని నీతి వైశ్యుని చేతిలో ఖడ్గం వంటిది.

61. దృష్టిరివ నీతిః యథావస్థితమర్థముపలమ్భయతి.

అ. చూపు వలె నీతి విషయాన్ని ఉన్నదున్నట్లు తెలుపుతుంది.

62. హితాహితప్రాప్తిపరిహారౌ తు పురుషకారాయత్తౌ.

అ. హితాన్ని పొందడం, అహితాన్ని తొలగించుకోడం అనేవి పురుషకారం మీద ఆధారపడి ఉంటాయి.

63. అకాలసహం కార్యమద్యశ్వీనం న కుర్యాత్.

అ. ఏ మాత్రము ఆలస్యం చేయడానికి వీలులేని కార్యం విషయంలో 'ఆనకా', 'రేపూ' అనకూడదు.

64. కాలాతిక్రమాత్ నఖచ్ఛేద్యమపి కార్యం భవతి కుఠారచ్ఛేద్యమచ్ఛేద్యం వా.

అ. ఆలస్యం అవుతే గోటితో తుంపే పని గొడ్డలితో నరకవలసినది అవుతుంది; అసలు నరకడానికే శక్యం కాకుండా పోతుంది.

65. కో నామ సచేతనః సుఖసాధ్యం కార్యం కృచ్ఛ్రసాధ్యమసాధ్యం వా కుర్యాత్?

అ. తెలివైనవాడు ఎవడైనా సుఖంగా సాధించదగిన కార్యాన్ని కష్టంమీద కాని సాధ్యం కానిదిగాను, లేదా సాధించడానికే శక్యం కానిదిగాను అయేటట్లు చేసుకుంటాడా?

66. ఏకో మన్త్రీ న కర్తవ్యః.

అ. ఒక్క మంత్రిని మాత్రమే నియోగించకూడదు.

67. ఏకో హి మన్త్రీ నిరవగ్రహశ్చరతి, ముహ్యతి చ కృచ్ఛ్రేషు కార్యేషు.

అ. మంత్రి ఒక్కడే అయితే ఏ అడ్డూ లేకుండా ప్రవర్తిస్తాడు, ఏవైనా అతికష్టమైన కార్యాలు వచ్చినప్పుడు ఏమి చేయాలో తోచక పొరబడతాడు.

68. ద్వావపి మన్త్రిణౌ న కర్తవ్యౌ.

అ. ఇద్దరు మంత్రుల్ని కూడా నియమించకూడదు.

69. ద్వౌ హి మన్త్రిణౌ సంహతౌ సహ భక్షయతః, గృహీతౌ తం వినాశయతః.

అ. మంత్రులు ఇద్దరు ఉంటే ఇద్దరూ ఐకమత్యంతో ఉన్నారా ఇద్దరూ కలిసి రాజును మింగేస్తారు; విరోధంతో ఉంటారా అతనిని నశింపచేస్తారు.

70. త్రయః పఞ్చ సప్త వా మన్త్రిణః కార్యాః.

అ. ముగ్గురు, లేదా ఐదుగురు లేదా ఏడుగురు మంత్రుల్ని నియోగించాలి.

71. విషమపురుషసంఘే హి దుర్లభమైకమత్యమ్.

అ. బేసిసంఖ్యలో ఉన్న పురుషుల సముదాయంలో ఐకమత్యం కుదరడం కష్టం.

72. బహవో హి మన్త్రిణః పరస్పరం స్వమతీరుత్కర్షయన్తి, స్వచ్ఛన్దాశ్చ న విజృమ్భన్తే.

అ. మంత్రులు చాలమంది ఉంటే వాళ్ళు పోటీపడి తమ బుద్ధిబలాన్ని పెంచుకొంటూ ఉంటారు; స్వేచ్ఛగా విజృంభించరు.

73. యద్ బహుగుణమ్ అనపాయబహులం చ భవతి తత్కార్య మనుష్ఠేయమ్.

అ. ఏ కార్యంలో గుణాలు అధికంగా ఉంటాయో, అపాయాలు తక్కువగా ఉంటాయో అలాంటి కార్యమే చెయ్యాలి.

74. తదేవ భుజ్యతే యదేవ పరిణమతి.

అ. జీర్ణం అయేదే తినాలి.

75. యథోక్తగుణసమవాయిని ఏకస్మిన్ యుగలే వా మన్త్రిణి న కోఽపి దోషః.

అ. చెప్పిన మంత్రి గుణాలన్నీ ఉన్న ఒక మంత్రియే ఉన్నా, ఇద్దరు ఉన్నా కూడా దోషం లేదు.

76. న హి మహానప్యన్ధసముదాయః రూపముపలభతే.

అ. అంధుల గుంపు ఎంత పెద్దదైనా రూపాన్ని చూడజాలదు కదా?

77. అవార్యవీర్యౌ ధౌర్యౌ కిం మహతి భారే న నియుజ్యేతే.

అ. నివారింప శక్యంకాని బలం గల రెండు ఎద్దులను పెద్ద బరువు లాగడానికి ఉపయోగించడం లేదా?

78. బహుసహాయే రాజ్ఞి ప్రసీదన్తి సర్వ ఏవ మనోరథాః.

అ. రాజుకు చాలమంది సహాయులు ఉంటే అన్ని కోరికలూ సఫలం అవుతాయి.

79. ఏకో హి పురుషః కేషు నామ కార్యేష్వాత్మానం విభజతే?

అ. ఒక్క మనిషి ఏ యే పనులమీద తనను పంచుకొంటాడు? (ఒక్క మనిషి ఎన్ని పనులని చక్కబెట్టుకొనగలడు?)

80. కిమేకశాఖస్య శాఖినో మహతీ భవతి చ్ఛాయా?

అ. ఒకే కొమ్మ ఉన్న చెట్టుకు పెద్ద నీడ ఉంటుందా?

81. కార్యకాలే దుర్లభః పురుషసమవాయః.

అ. పనిపడ్డప్పుడు పురుషసముదాయం లభించడం కష్టం. (ముందుగానే మనుష్యబలం చేకూర్చుకోవాలి.)

82. దీప్తే గృహే కీదృశం కూపఖననమ్?

అ. ఇల్లు మండుతూంటే నుయ్యి తవ్వడం ఏమిటి?

83. న ధనం పురుషసంగ్రహాత్ బహుమన్తవ్యమ్.

అ. మనుష్యుల్ని సంగ్రహించడంకంటె (చాలమందిని ఆకట్టుకోవడం కంటె) ధనం అధికమైన దని అనుకోకూడదు.

84. సుక్షేత్రేషూప్తం బీజమివ కార్యపురుషేషు దత్తం ధనం శతశః ఫలతి.

అ. మంచి చేలల్లో నాటిన విత్తనం వలె కార్యపురుషులకి ఇచ్చిన ధనం వందరెట్లు ఫలిస్తుంది.

85. బుద్ధావర్థే యుద్ధే చ యే సహాయాః తే కార్యపురుషాః.

అ. ఆలోచనలలోను, ధనానికి సంబంధించిన విషయాలలోను, యుద్ధం లోను సహాయులుగా ఉండేవాళ్లు "కార్యపురుషులు."

86. ఖాదనవేలాయాం కః కస్య న సహాయః?

అ. భోజనసమయంలో ఎవడు ఎవరికి సహాయుడు కాడు?

87. శ్రాద్ధ ఇవ అశ్రోత్రియస్య న మన్త్రే మూర్ఖస్యాధికారోఽస్తి.

అ. శ్రోత్రియుడు కానివానికి శ్రాద్ధం విషయంలో ఏ విధంగా అధికారం (అర్హత) లేదో అదే విధంగా మూర్ఖుడికి మంత్రంలో (ఆలోచనలో పాల్గొవడంలో) అధికారం లేదు.

88. కిం నామాన్ధః పశ్యేత్?

అ. గ్రుడ్డివాడు ఏమి చూడగలుగుతాడు?

89. న చాన్ధేనాకృష్యమాణోఽన్ధః సమం పన్థానం ప్రతిపద్యతే.

అ గ్రుడ్డివాడు లాగికొని తీసికొని వెడుతున్న గ్రుడ్డివాడు సరియైన మార్గానికి వెళ్ళలేడు.

90. తదన్ధవర్తకీయం కాకతాలీయం వా యన్మూర్ఖమన్త్రాత్ కార్య సిద్ధిః.

అ. మూర్ఖుడి ఆలోచన ప్రకారం ఎప్పుడైనా పని జరుగుతే 'అది అంధ వర్తకీయం' కావాలి లేదా 'కాకతాలీయం' కావాలి. 'అంధవర్తకీయం' 'కాకతాలీయం' అనేవి న్యాయాలు (సామెతలు.) ఎగిరిపోతూన్న వర్తకం అనే పక్షిని గ్రుడ్డివాడు పట్టుకోవడం 'అంధవర్తకీయం.' కాకి ఎగురుతూ తాటిచెట్టు క్రిందికి వచ్చే సరికి ముగ్గిన తాటిపండు పడి ఆ కాకి చావడం 'కాకతాళీయం'. అదేవిధంగా కట్టలో ఉన్న ఘుణం (పురుగు) దొలుస్తూంటే ఒక అక్షరం ఆకారం ఏర్పడ వచ్చు. అది ఘుణాక్షరన్యాయం. రాబోయే సూత్రంలో అది రానున్నది ఈ మూడు న్యాయాలూ ఏదైనా ఒక పని పురుషుని ప్రయత్నంచేత కాకుండా యాదృచ్ఛికంగా జరిగినప్పుడు వాడతారు.

91. స ఘుణాక్షరన్యాయః యన్మూర్ఖేషు మన్త్రకార్యపరిజ్ఞానమ్.

అ. మూర్ఖులు, ఆలోచించదగిన కార్యాలు అర్థం చేసుకోవడం అనేది ఘుణాక్షరన్యాయం.

92. అనాలోకం లోచనమివ అశాస్త్రం మనః కియత్ పశ్యేత్?

అ. వెలుతురు లేని కన్ను వలె శాస్త్రం లేని మనస్సు ఎంతవరకు చూడ కలుగుతుంది?

93. స్వామిప్రసాదః సంపదం జనయతి, న పునరాభిజాత్యం పాణ్డిత్యం వా.

అ. ప్రభువు అనుగ్రహం సంపాదిస్తే సంపద లభించవచ్చును. అంతేకాని, ఉత్తమవంశసంభవంకాని (ఉత్తమసంస్కారంకాని) పాండిత్యంకాని లభించదు.

94. హరకణ్ఠలగ్నోఽపి కాలకూటః కాల ఏవ.

అ. ఈశ్వరుడి కంఠంలో ప్రవేశించినా కాలకూటం నల్లగానే ఉంటుంది.

95. స్వవధాయ కృత్యోత్థాపనమివ మూర్ఖేషు రాజ్యభారారోపణమ్.

అ. మూర్ఖులకు రాజ్యభారం అప్పగించడం తనను చంపుకోవడం కోసం కృత్యను లేవదీయడమే.

అభిచార ప్రయోగం చేసి శత్రువుని చంపే భూతాన్ని (కృత్యను) సృష్టించడం "కృత్యోత్థాపనం."

96. అకార్యవేదినః కిం బహునాపి శాస్త్రేణ?

అ. ఏమి చేయాలో అర్థం చేసుకొనలేనివానికి ఎంత శాస్త్రం (శాస్త్రజ్ఞానం) ఉంటే మాత్రం ఏం ప్రయోజనం?

97. గుణహీనం ధనుః పిఞ్జనాదపి నికృష్టమ్.

అ. నారి (అల్లెత్రాడు) లేని ధనుస్సు దూది ఏకే పింజనం కంటెకూడా హీనం.

98. చక్షుష్మత ఇవ మన్త్రిణోఽపి యథార్థదర్శనమేవ ఆత్మగౌరవహేతుః.

అ. నేత్రాలు ఉన్నవాడు వలె మంత్రి కూడా ఉన్నది ఉన్నట్లుగా చూడ కలుగుతేనే (తెలుసుకో కలిగితేనే) ఆతనికి గౌరవం ఉంటుంది.

99. శస్త్రోపజీవినో న మన్త్రాధికారిణః స్యుః.

అ. శస్త్రాధికారులకు (ఆయుధాల అధికారులు, అనగా సైన్యాధిపతులు మొదలైనవాళ్ళకి) మంత్రాధికారం ఇవ్వకూడదు.

100. క్షత్రియస్య పరిహరతోఽప్యాయాత్యుపరి భణ్డనమ్.

అ. ఎంత వద్దనుకొన్నా క్షత్రియుడి మీద యుద్ధం (కలహం) వచ్చి పడుతుంది.

101. శస్త్రోపజీవినాం కలహమన్తరేణ భక్తమపి భుక్తం న జీర్యతి.

అ. ఆయుధోపజీవులకి (ఆయుధధారణమే జీవనోపాధిగా కలవారికి) కలహం లేకపోతే తిన్న అన్నంకూడా జీర్ణం కాదు.

102. మన్త్రాధికారః, స్వామిప్రసాదః శస్త్రోపజీవనం చేత్యేకైకమపి పురుషముత్సేకయతి, కిం పునః సముదాయః.

అ. మంత్రాధికారం, ప్రభువు అనుగ్రహం, శస్త్రోపజీవనం - వీటిలో ఏ ఒక్కటి ఉన్నా మనిషికి గర్వం కలిగిస్తుంది, ఇంక అన్నీ ఉంటే చెప్పాలా?

103. న లమ్పటోఽధికారీ.

అ. స్త్రీ - ధనాదులయందు అత్యాసక్తి కలవాణ్ణి అధికారిగా నియమించ కూడదు.

104. మన్త్రిణోఽర్థగ్రహణలాలసాయాం మతౌ న రాజ్ఞః కార్యమర్థో వా.

అ. మంత్రి మనస్సులో ధనసంపాదనేచ్ఛ అత్యధికంగా ఉంటే రాజుకి కార్యసిద్ధీ ఉండదు; అర్థలాభమూ ఉండదు.

105. వరణార్థం ప్రేషిత ఏవ యది కన్యాం పరిణయతి తదా వరయితుః తప ఏవ శరణమ్.

అ. "కన్య తండ్రి దగ్గరికి వెళ్ళి నాకోసం కన్యను వరించి వివాహం కుదుర్చు" అని పంపబడినవాడే ఆ కన్యను వివాహమాడితే ఇంక పంపినవానికి తపస్సే శరణం. సెలక్షన్ కమిటీ సభ్యుడుగా వెళ్ళి ఆ పదవి నాకే ఇమ్మన్న వాళ్ళు ఇప్పుడూ ఉన్నారు కదా?

106. స్థాల్యేవ చేద్భక్తమశ్నాతి తతః కుతో భోక్తుర్భుక్తిః.

అ. వండిన అన్నం, గిన్నే తినేస్తే భోజనం చెయ్యవలసిన వాడికి భోజనం ఎక్కడ లభిస్తుంది?

107. తావత్ సర్వోఽపి శుచిర్నిస్పృహో వా యావత్ న పరస్త్రీ దర్శనమ్ అర్థాగమో వా.

అ. అందమైన పరస్త్రీ కనబడనంతవరకూ, ధనం లభించనంతవరకు ప్రతీవాడు సత్ప్రవర్తన కలవాడుగానూ (man of good character and integrity) ధనాశ లేనివాడుగాను ఉంటాడు.

108. అతిప్రవృద్ధః కామః తన్నాస్తి యన్న కరోతి.

అ. చాలా పెరిగిపోయిన కామం చేయని పని ఉండదు.

109. శ్రూయతే కిల కామపరవశః ప్రజాపతిః స్వదుహితరి, హరిర్గోపవధూషు, హరః శన్తనుకలత్రేషు, సురపతిః గౌతమభార్యాయాం, చన్ద్రః బృహస్పతిపత్న్యాం చ మనశ్చకారేతి.

అ. కామపరశుడై బ్రహ్మదేవుడు తన కుమార్తెయైన (తానే సృష్టించిన) సరస్వతిమీద, విష్ణువు (కృష్ణుడు) గోపికల మీద, శివుడు శంతనుని భార్యల మీద, ఇంద్రుడు గౌతముని భార్యమీద, చంద్రుడు బృహస్పతి భార్యమీద మనస్సు నిలిపినట్లు వింటున్నాం కదా?

110. అర్థేషూపభోగరహితాః తరవోఽపి సాభిలాషాః, కింపునర్మనుష్యాః.

అ. ధనాన్ని అనుభవించలేని చెట్లకి కూడా ధనం అంటే అభిలాష ఉంటుంది; మనుష్యుని మాట చెప్పాలా!

111. కస్య నామ ధనలాభాన్న లోభః ప్రవర్తతే?

అ. ధనం లభిస్తూంటే ఆశ పుట్టనివాడు ఎవ డుంటాడు?

112. స ఖలు ప్రత్యక్షం దైవం, యస్య పరస్వేష్వివ పరస్త్రీషు నిఃస్పృహం చేతః.

అ. పరధనాలను వలె పరస్త్రీలను మనసా కోరనివాడు సాక్షాత్తు దేవుడే.

113. అదుష్టస్య దూషణం సుప్తవ్యాలబోధనమివ.

అ. ఏ దోషాలూ లేనివాణ్ణి దూషించడం నిద్రపోతూన్న దుష్టగజాన్ని (లేదా సర్పాన్ని) మేల్కొల్పడమే.

114 సకృద్విఘటితం చేతః స్ఫటికవలయమివ కః సన్ధాతుమీశ్వరః?

అ. మనస్సు ఒక్క-మారు విరిగిపోయిన దంటే, విరిగిన స్ఫటికం గాజును వలె, దాన్ని ఎవరు అతకగలరు?

115. న మహతాప్యుపకారేణ చిత్తస్య తథానురాగః, యథా అల్పే నాపి అపకారేణ విరాగో భవతి.

అ. చిన్న అపకారం చేసినా మనస్సుకు ఎంత వైముఖ్యం కలుగుతుందో-అంత అనురాగం ఎంత గొప్ప ఉపకారం చేసినా కలగదు. (ఎంత ఉపకారం పొందినవాళ్లైనా చిన్న అపకారం జరిగేటప్పటికి స్నేహశూన్యు లైపోతారు.)

116. సూచీముఖసర్పా ఇవ నా(న)పకృత్య విరమన్త్యపరాద్ధాః.

అ. అపరాధానికి గురియైన వాళ్ళు (ఎవరి విషయంలో అపరాధం జరిగిందో వాళ్ళు) చూపులలో విషం ఉన్న సర్పాలు వలె అపకారం చెయ్యకుండా ఉండరు.

117. సమాయవ్యయః కార్యారమ్భో రాభసికానామ్.

అ. తొందరపాటు ఉన్నవాళ్ళు తలబెట్టిన కార్యాల ఆదాయం, వ్యయం సమంగా ఉంటాయి. 'రాభసికానామ్' అనే దానికి తొందరపాటుతో నిర్ణయం తీసికొనేవాళ్లు అని అర్థం.

118. బహుక్లేశేన అల్పఫలః కార్యారమ్భో మహామూర్ఖాణామ్.

అ. మహామూర్ఖులు చేసే పనులలో క్లేశం అత్యధికంగా ఉంటుంది, ఫలం అల్పంగా ఉంటుంది.

119. దోషభయాత్ కార్యానారమ్భః కాపురుషాణామ్.

అ. నీచులు (అల్పబుద్ధులు) ఎక్కడ చెడిపోతాయో అని భయపడి అసలు పనులే ప్రారంభించరు.

120. మృగాః సన్తీతి కిం కృషిర్న క్రియతే?

అ. పశువులు తినేస్తా యని భయపడి వ్యవసాయం చేయడం మానుకుంటామా?

121. అజీర్ణభయాత్ కిం భోజనం పరిత్యజ్యతే.

అ. అజీర్ణం చేస్తుందేమో అని భయపడి భోజనం చేయకుండా ఉంటామా?

122. స ఖలు కిం కోఽపీహాభూదస్తి భవిష్యతి వా యస్య కార్యారమ్భేషు ప్రత్యూహా న భవన్తి?

అ. పనులు తలబెట్టిన తరవాత ఏవో విఘ్నాలు రానివాడు ఎవడైనా ఈ లోకంలో పూర్వం ఉండేవాడా, ఇప్పుడున్నాడా, ముమ్ముందు లేకుండా ఉంటాడా ?

123. ఆత్మసంశయేన కార్యారమ్భో బాలహృదయానామ్.

అ. మందబుద్ధులు పనులు ప్రారంభిస్తారు కాని, వాళ్ళకి తమ శక్తి విషయంలో తమకే సందేహం.

124. దూరభీరుత్వమాసన్నశూరత్వం చ గుణో మహాపురుషాణామ్.

అ. దూరంగా ఉన్న వాటిని గూర్చి భయపడడమూ, దగ్గరగా ఉన్న వాటిని గూర్చి శౌర్యం చూపడమూ మహాపురుషుల లక్షణం. (ఏవైనా కష్టాలు దూరంగా ఉన్నప్పుడు భయపడతారు; దగ్గరకి వచ్చాయా - శౌర్యం చూపి ఎదుర్కొంటారు.)

125. జలవన్మార్దవోపేతః పృథూనపి భూభృతో భినత్తి.

అ. జలం వలె మార్దవం (మృదుత్వం) ఉన్నవాడు, పెద్ద భూభృత్తుల్ని (రాజులు, పర్వతాలు అని రెండర్థాలు) కూడా బ్రద్దలు కొడతాడు.

126. ప్రియంవదః శిఖీవ సదర్పానపి ద్విషత్సర్పానుత్సాదయతి.

అ. ప్రియంగా మాట్లాడేవాడు నెమలి వలె, ఎంత దర్పం ఉన్నవాళ్ళైనా సర్పాలవంటి శత్రువుల్ని నశింపచేస్తాడు.

127. స మహాన్ యో విపత్సు ధైర్య మవలమ్బతే.

అ. ఆపదలలో ధైర్యం అవలంబించినవాడే మహాత్ముడు.

128. ఉత్తాపకత్వం హి సర్వకార్యేషు సిద్ధీనాం ప్రథమోఽన్తరాయః.

అ. ఏ పనులు జరగడానికైనా మొట్టమొదటి విఘ్నం కంగారుపడిపోవడం.

129. శరద్ఘనా ఇవ న ఖలు వృథా ఘనగర్జితం కుర్వన్తి కులీనాః.

అ. సత్కులాలలో పుట్టినవాళ్ళు శరత్కాల మేఘాలు చేసినట్లుగా వ్యర్థంగా ఘనగర్జితం (ఘనంగా ఘర్జించడం, మేఘగర్జన) చెయ్యరు.

130. నావిధాయ పరేషామర్థమనర్థం వా స్వహృదయం ప్రకాశయన్తి మహానుభావాః.

అ. మహానుభావులు పరులకు ఉపకారం కాని, అపకారం కాని చేసే వరకూ తమ హృదయాన్ని ప్రకటించరు.

131. క్షీరవృక్షవత్ ఫలసంపాదక ఏవ మహతా మాలాపః.

అ. మహాత్ముల మాట పాలచెట్టువలె తప్పకుండా ఫలాన్ని ఇస్తుంది.

132. దురారోహపాదప ఇవ దణ్డాభియోగేన ఫలప్రదో భవతి నీచ ప్రకృతిః.

అ. నీచస్వభావం గలవాడు, ఎక్కడానికి శక్యంకాని చెట్టువలె దండ ప్రయోగం చేస్తేనే ఫలం ఇస్తాడు ("దండాభియోగం" అనగా దండించడం, కఱ్ఱతో కొట్టడం అని రెండర్థాలు.)

133. న స్వభావేన కిమపి వస్తు సున్దరమసున్దరం వా, కింతు యద్యస్య ప్రకృతితః ప్రియం భాతి తదేవ తస్య సున్దరమ్.

అ లోకంలో స్వభావసిద్ధంగానే సుందరమైనదీ, సుందరం కానిదీ అంటూ ఏదీ ఉండదు. ఏది ఎవనికి సహజంగా ప్రియంగా కనబడుతుందో అదే వానికి సుందరం.

134. న తథా కర్పూరరేణునా ప్రీతిః కేతకీనాం కీటకానాం వా యథామేధ్యేన.

అ. మొగలిడొంకలకి కాని, పురుగులికి గాని అమేధ్యం అంటే ఎంత ప్రీతి ఉంటుందో అంత ప్రీతి కర్పూరం అంటే ఉండదు. (మొగలి డొంకలికి అది ఎరువుగా ఉపయోగిస్తుందట.)

135. అతిక్రోధనస్య ప్రభుత్వమ్ అగ్నౌ పతితం లవణమివ శతధా విశీర్యతే.

అ. నిప్పులో పడిన ఉప్పు చిటచిటా పేలి చూర్ణం అయిపోయినట్లు ముక్కోపి ప్రభుత్వం వంద ముక్కలైపోతుంది.

136. సర్వాన్ గుణాన్నిహన్త్యనుచితజ్ఞః.

అ. ఔచిత్యజ్ఞానం లేనివాడు అన్ని గుణాల్నీ నశింపచేసుకొంటాడు.

137. పరస్మై మర్మకథనమ్ ఆత్మవిక్రయ ఏవ.

అ. ఇతరులకు తన రహస్యాలన్నీ చెప్పడం తనను తాను అమ్మివేయడమే.

138. తదజాకృపాణీయం యః పరేషు విశ్వాసః.

అ. శత్రువుల్ని విశ్వసించడమే అజాకృపాణీయం.

మేకను నరకడానికి కత్తికోసం చూస్తూండగా ఆ మేక నేలమీద కాలితో త్రవ్వి అక్కడ కప్పిపెట్టిన కత్తి చూపించడం "అజాకృపాణీయం"

139. క్షణికచిత్తః కిమపి న సాధయతి.

అ. క్షణక్షణానికి ఆలోచనలు మారిపోయేవాడు ఏమీ సాధించలేడు.

140. స్వతన్త్రః సహసాకారిత్వాత్ సర్వం వినాశయతి.

అ. స్వతంత్రుడు తొందరపడి పనులు చేస్తే అన్నీ నశింపచేస్తాడు.

141. అలసః సర్వకర్మణామనధికారీ.

అ. సోమరి ఏ పనులూ చేయడానికి తగడు.

142. ప్రమాదవాన్ భవత్యవశ్యం విద్విషాం వశః.

అ. పొరబాట్లు చేసేవాడు లేదా ఏమరిపాటుగా ఉండేవాడు తప్పకుండా శత్రువులకు వశుడైపోతాడు.

143. కమప్యాత్మనోఽనుకూలం ప్రతికూలం న కుర్యాత్.

అ. తనకు అనుకూలంగా ఉన్నవాణ్ణి ఎవర్నీ ప్రతికూలుణ్ణిగా చేసుకో కూడదు.

144. ప్రాణాదపి ప్రత్యయో రక్షితవ్యః.

అ. ప్రాణాలకంటె కూడా ఎక్కువగా పరువు (విశ్వాసాన్ని) రక్షించుకోవాలి.

145. ఆత్మశక్తిమజానతో విగ్రహః క్షయకాలే పిపీలికానాం పక్షోత్థానమివ.

అ. తన శక్తిని సరిగా అంచనా వేసుకొనలేనివాడు విరోధం పెట్టుకోవడం వినాశకాలంలో చీమలకి రెక్కలు మొలవడం వంటిది.

146. కాలమలభమానోఽపకర్తరి సాధు వర్తేత.

అవకాశం లభించనివాడు అపకారం చేసినవాని విషయంలోకూడా మంచి గానే ప్రవర్తించాలి.

147. కిం ను ఖలు లోకో న వహతి మూర్ధ్నా దగ్ధుమిన్ధనమ్.

అ. మనుష్యులు కాల్చడంకోసం కట్టెలను నెత్తిమీద మోసుకొని వెళ్ళరా?

148. నదీరయో హి తీరతరూణామఙ్ఘ్రిన్ క్షాలయన్నప్యున్మూలయతి.

అ. నదీవేగం గట్టుమీద ఉన్న చెట్ల పాదాలు (వ్రేళ్ళు) కడుగుతూనే ఆ చెట్లను పడగొడుతుంది కదా?

149. ఉత్సేకః హస్తగతమపి కార్యం వినాశయతి.

అ. గర్వం చేతికి చిక్కిన పనిని కూడా చెడగొడుతుంది.

150. నాల్పం మహద్వా కార్యముపాయజ్ఞస్య.

అ. ఉపాయం తెలిసినవాడికి చిన్న పనీ, పెద్ద పనీ అంటూ ఉండదు.

151. సరిత్పూరః సమమేవోన్మూలయతి తీరజతృణాన్ ద్రుమాంశ్చ.

అ. నదీప్రవాహం ఒడ్డుమీద ఉన్న గడ్డిని, చెట్లను కూడా సమంగానే పెకలించి వేస్తుంది కదా?

152. యుక్తముక్తం వచో బాలాదపి గృహ్ణీయాత్.

అ. యుక్తంగా పలికిన వచనాన్ని బాలుడినుండైనా గ్రహించాలి.

153. రవేరవిషయం కిం న ప్రకాశయతి దీపః?

అ. సూర్యునికి గోచరం కాని వస్తువును దీపం ప్రకాశింపచేయడం లేదా?

154. అల్పమపి వాతాయనవివరం బహూనప్యుపలమ్భయతి.

అ. కిటికీ రంధ్రం చిన్నదే అయినా గదిలో ఉన్న చాలా వస్తువుల్ని కనబడేటట్లు చేస్తుంది.

155. పతింవరా ఇవ పరార్థాః ఖలు వాచః; తాశ్చ నిరర్థకం ప్రకాశ్యమానాః శపయన్త్యవశ్యం జనయితారమ్.

అ. వాక్కులు పెళ్ళి కావలసిన కన్యలవలె ఇతరులకోసమే ఉద్దేశించబడతాయి. వాటిని (వాళ్ళను) వ్యర్థంగా ప్రకటిస్తే తప్పకుండా జనయితను (పుట్టించినవానిని, మాటలు పలికేవానిని, తండ్రిని అని రెండర్థాలు) తిట్టింపచేస్తాయి.

ఎవరు మాటలాడినా అది పరులకోసమే; అనగా మాటలాడేవాని మనస్సు లోని అభిప్రాయం వినేవాళ్ళకి తెలియడంకోసమే. పెళ్ళి కావలసిన కన్యలుకూడా పరునికోసమే. ఆ కన్యలను అనవసరంగా ఇతరులకు చూపిస్తే తండ్రి నిందా పాత్రుడౌతాడు. అలాగే అనవసరంగా మాటలాడేవాణ్ణి కూడా లోకులు నిందిస్తారు.

156. తత్ర యుక్తమప్యుక్తమ్ అనుక్తసమం, యో న విశేషజ్ఞః.

అ. చెప్పినదాన్లో ఉన్న విశేషాన్ని గుర్తించలేనివాడికి ఏమి చెప్పినా చెప్పనట్లే.

157. స ఖలు పిశాచకీ పాతకీ వా, యః పరేఽనర్థిని వాచముదీరయతి.

అ. ఇతరుడు అనర్థిగా ఉన్నప్పుడు, అనగా కష్టాలలో ఉన్నప్పుడు, లేదా కోరనప్పుడు, మాటలాడేవాడు పిశాచం అవహించినవాడైనా అయి ఉండాలి, పాపాత్ముడైనా అయి ఉండాలి.

158. విద్యాయతః ప్రదీపస్యేవ నయహీనస్య బుద్ధిః (వృద్ధిః).

అ. నీతిలేనివాని వృద్ధి ఆరిపోబోయే దీపం వృద్ధివంటిది.

159. జీవోత్సర్గః స్వామిపదమభిలషతామేవ.

అ. ప్రభువు స్థానం కావాలనుకొనేవాళ్ళకి ప్రాణత్యాగమే.

160. బహుదోషేషు క్షణదుఃఖప్రదోఽపాయః అనుగ్రహ ఏవ.

అ. అనేకమైన దోషాలు ఉన్నప్పుడు (కష్టాలు అత్యధికంగా ఉన్నప్పుడు) క్షణకాలంపాటు దుఃఖం కలిగించే అపాయం కూడా అనుగ్రహమే. నిరంతరంగా దుఃఖాలు అనుభవించేవాడు ఏదో అపాయం కలిగి మరణించడమే మేలు. మరణ దుఃఖం క్షణకాలికమే కదా అని భావం అయి ఉంటుంది.

161. స్వామిదోషస్వదోషాభ్యామపహతవృత్తయః క్రుద్ధభీతలుబ్ధావమానినః కృత్యాః.

అ. ప్రభువు దోషంచేత గాని, తమ పొరబాటువల్ల గాని జీవనోపాధి అపహరింపబడ్డవాళ్లు, (ప్రభువు విషయంలో) కోపం ఉన్నవాళ్లు, భయంతో ఉన్నవాళ్లు, లుబ్ధులు, అవమానింపబడ్డవాళ్లూ ''కృత్యులు.''

162. అనువృత్తిరభయం, త్యాగః, సత్కృతిశ్చ కృత్యానాం వశోపాయాః.

అ. అనువృత్తి (వాళ్ళ అభిప్రాయం ప్రకారం చేయడం), అభయం ఇవ్వడం, ఏమైనా ఇవ్వడం, సత్కరించడం - ఇవి కృత్యుల్ని వశం చేసుకొనే ఉపాయాలు.

163. క్షయలోభవికారకారణాని ప్రకృతీనాం న కుర్యాత్.

అ. ప్రకృతులలో క్షయమూ (వినాశమూ), లోభమూ, వికారమూ కలిగించే పనులేవీ చేయకూడదు.

164. సర్వకోపేభ్యః ప్రకృతికోపో గరీయాన్.

అ. అన్ని కోపాలకంటె ప్రకృతుల కోపం చాలా గొప్పది. (కోపం అనగా తిరుగుబాటు కలిగించే అసంతృప్తి.)

165. అచికిత్స్యదోషదుష్టాన్ ఖనిదుర్గసేతుబన్ధాకరకర్మాన్తేషు క్లేశయేత్.

అ. మాన్పడానికి శక్యం కాని దోషాలతో దుష్టులైన వాళ్ళని (దోషాలున్న వాళ్ళని) ఖనులు (బొగ్గుగనులు మొదలైనవి) దుర్గాలు, సేతువులు (ఆనకట్టలు) గనులు (బంగారం గనులు మొదలైనవి)-వీటి పనులలో నియమించాలి.

166. అపరాద్ధైరపరాధకైశ్చ సహ గోష్ఠీం న కుర్యాత్. తే హి గృహప్రవిష్టసర్పవత్ సర్వవ్యసనానామాగమస్థానమ్.

అ. అపరాధాలు చేసిన వాళ్ళతోను, అపరాధాలు చేయించే వాళ్ళతోనూ కలిసి గోష్ఠి (సంభాషణాదికం) చేయకూడదు. ఎందుచేత ననగా, వాళ్ల ఇంట్లో ప్రవేశించిన సర్పాల వలె అన్ని రకాల కష్టాలూ కలగడానికి మూలం.

167. న కస్యాపి క్రుద్ధస్య పురతః తిష్ఠేత్.

అ. కోపంలో ఉన్నవాడికి ఎవనికీ ఎదుట నిలబడకూడదు.

168. క్రుద్ధో హి సర్ప ఇవ యమేవాగ్రే పశ్యతి తత్రైవ రోషవిషముత్సృజతి.

అ. ఎందుచేత ననగా, కోపంలో ఉన్నవాడు, సర్పం వలె, కోపం అనే విషాన్ని ఎదట ఉన్నవానిమీద విడిచిపెడతాడు.

169. అప్రతివిధాతురాగమనాత్ వరమనాగమనమ్.

ఇతి మన్త్రి సముద్దేశః

అ. వచ్చిన ఆపదకు ప్రతిక్రియ చేయలేని మంత్రి మొదలైనవాళ్ళు రావడంకంటె, వాళ్ళు రాకపోవడమే మంచిది.

'బాలానందిని' అను సోమదేవ నీతిసూత్రాంధ్ర వ్యాఖ్యలో

మంత్రి సముద్దేశం సమాప్తం.

## 11. పురోహిత సముద్దేశః.

1. పురోహితమ్, ఉదితోదితకులశీలం, షడఙ్గే వేదే, దైవే నిమిత్తే, దణ్డనీత్యాం చాభివినీతమ్ ఆపదాం దైవమానుషీణాం చ ప్రతికర్తారం కుర్వీత.

అ. అత్యుత్తమమైన కులమూ, శీలమూ కలవాడు, షడంగసహితమైన వేదంలోను, దైవంవల్ల సంభవించే విషయాలను ముందుగానే సూచించే శకున శాస్త్రాదులలోను, దండనీతిలోను మంచి ప్రవేశం కలవాడు, దైవంవల్ల కలిగే ఆపదలకు, మనుష్యులవల్ల కలిగే ఆపదలకూ ప్రతిక్రియ చేయగలవాడు అయిన వానిని పురోహితుడుగా నియమించాలి.

2. రాజ్ఞో హి మన్త్రిపురోహితౌ మాతాపితరౌ; అతస్తౌ న కేషు చిద్వాఞ్ఛితేషు విదూరయేత్, దుఃఖయేత్, దుర్వినయేద్వా.

అ. రాజుకు మంత్రి పురోహితులే తలిదండ్రులు. అందుచేత వాళ్ళను ఇష్టమైన ఏ పనుల విషయంలోనూ దూరంగా ఉంచకూడదు. (లేదా, వాళ్ళ ఏ కోరికలూ తీరకుండేటట్లు చేయకూడదు.) వాళ్ళకి కష్టం కలిగించకూడదు. వాళ్ళను అలక్ష్యభావంతో చూడకూడదు.

3. అమానుషోఽగ్నిః, అవర్షం, అతివర్షం, మారకః, దుర్భిక్షం, సస్యోపఘాతః, జన్తుసర్గః, వ్యాధిః, భూతపిశాచశాకినీసర్ప వ్యాలమూషకక్షోభాశ్చేత్యాపదః.

అ. మనుష్యులవల్ల కాక ఇతర కారణాలవల్ల కలిగే అగ్ని ప్రమాదం, వర్షాలు లేకపోవడం, అతివర్షాలు, చాలా మందిని చంపివేసే వ్యాధులు మొదలైనవి, దుర్భిక్షం (కరువు), సస్యాలకి నష్టం కలగడం, అరణ్యజంతువులు వృద్ధి పొందడం, వ్యాధి-భూత - పిశాచ - శాకినీ - సర్ప - దుష్టగజ - మూషకాలవల్ల బాధలు - ఇవి రాజ్యంలో కలిగే ఆపదలు.

4. శిక్షాలాపక్రియాక్షమో రాజపుత్రః సర్వాసు లిపిషు ప్రసంఖ్యానే, పదప్రమాణ ప్రయోగ కర్మణి, రత్న పరీక్షాయాం, సంభోగ ప్రహరణోపవాహ్యవిద్యాసు చ సాధు వినేతవ్యః.

అ. విషయాలు నేర్చుకోవడంలోను, మాటలలోను, చేతలలోను నేర్పు గల రాజపుత్రునికి అన్ని లిపులు, లెక్కలు, వ్యాకరణశాస్త్ర - న్యాయశాస్త్రాల ప్రయోగం (application), నీతిశాస్త్రం. వేదాలు, రత్నపరీక్ష, కామశాస్త్రం, ఆయుధశాస్త్రం, వాహనశాస్త్రం - ఈ విద్యలన్నీ నేర్పాలి

5. అస్వాతన్త్ర్యమ్. ఉక్తకారిత్వం, నియమో, వినీతతా చ గురూపాసనకారణాని.

అ. స్వతంత్రంగా ప్రవర్తించకపోవడం, చెప్పిన పని చేయడం, నియమం, వినయం - ఇవి గురుశుశ్రూషకు కారణాలు; అనగా వీటికోసం గురుశుశ్రూష చెయ్యాలి.

6. వ్రతవిద్యావయోధికేషు నీచైరాచరణం వినయః.

అ. వ్రతం (తపస్సు) చేత, విద్యచేత, వయస్సుచేత అధికులైన వాళ్ళ విషయంలో అణిగి మణిగి ప్రవర్తించడం వినయం.

7. పుణ్యావాప్తిః, శాస్త్రరహస్యపరిజ్ఞానం సత్పురుషాభిగమ్యత్వం చ వినయఫలమ్.

అ. పుణ్యప్రాప్తి, శాస్త్రరహస్యాలు తెలియడం, తన దగ్గరికి సత్పురుషులు రావడానికి యోగ్యుడు అవడం - ఇవి వినయానికి ఫలం.

8. అభ్యాసః కర్మసు కౌశలముత్పాదయత్యేవ యద్యస్తి తద్‌జ్ఞేభ్యః సంప్రదాయః.

అ. అభ్యాసం చేసినకొలదీ కర్మలలో నేర్పు కలుగుతుంది; అయితే, ఆ విషయాలలో బాగా ప్రవేశం ఉన్నవాళ్ళదగ్గరినుండి తెలుసుకొని ఉండడం అవసరం. సంప్రదాయము అనగా ఇక్కడ సంప్రదాయసిద్ధంగా వస్తున్నదానిని గ్రహించడం అని అర్థం.

9. గురువచనమనుల్లఙ్ఘనీయం అన్యత్రాధర్మానుచితాచారాత్మ ప్రత్యవాయేభ్యః.

అ. గురువు మాటను జవదాటకూడదు కాని, అది ధర్మసంమతం కాక పోయినా, అనుచితమైన ఆచారమైనా, దానివల్ల తనకు ప్రత్యవాయం కలుగుతుం దన్నా గురువచనం అనుసరించకపోయినా దోషం లేదు.

10. యుక్తమయుక్తం గురురేవ జానాతి యది న శిష్యః ప్రత్యర్థీ వాదీ వా స్యాత్.

అ. శిష్యుడు పోటీపడేవాడు కాని, ఎదిరించేవాడు కాని కాకపోతే ఏది యుక్తమో ఏది అయుక్తమో గురువుకే తెలుసును.

11 గురుజనరోషే అనుత్తరదానమ్ అభ్యుపపత్తిశ్చౌషధమ్.

అ. గురుజనులకు కోపం వస్తే ఏమీ సమాధానం చెప్పకపోవడం, సేవించడం (వాళ్ళు చెప్పినదానిని అంగీకరించడం) ఔషధం.

12. శత్రూణామభిముఖః పురుషః శ్లాఘ్యః న పునర్గురూణామ్.

అ. శత్రువులను ఎదిరించి నిలచిన పురుషుడు శ్లాఘింపతగినవాడు కాని గురువులను ఎదిరించి నిలచినవాడు శ్లాఘ్యుడు కాడు

13. ఆరాధ్యం న ప్రకోపయేత్, యద్యసావాశ్రితేషు కల్యాణాశంసీ.

అ. ఆశ్రయించినవాళ్ళ మంచిని కోరేవాడైతే అలాంటి పూజనీయుడికి కోపం కలిగించకూడదు.

14. బహుభిరుక్తం నాతిక్రమితవ్యం యది నైహికాముత్రిక ఫల విలోపః.

అ. ఐహికఫలానికి గాని పరలోకానికి సంబంధించిన ఫలానికి గాని విఘాతం కలగకపోతే చాలామంది చెప్పే మాట కాదనకూడదు.

15. సందిహానో గురుమకోపయన్ పృచ్ఛేత్.

అ. సందేహం కలిగినవాడు గురువుకు కోపం కలగకుండా చూచుకొంటూ ఆయనని అడగాలి.

16. గురూణాం పురతః న యథేష్టమాసితవ్యమ్.

అ. గురువుల ఎదట ఇష్టం వచ్చినట్లు కూర్చోకూడదు.

17. నానభివాద్యోపాధ్యాయాద్విద్యామాదదీత, యద్యస్తి జాతి వ్రతాభ్యామాధిక్యం సమానత్వం వా.

అ. గురువు జాతిచేత, వ్రతం (నియమాదుల) చేత తనకంటె గొప్పవాడు గాని, సమానుడు గాని అయినప్పుడు అతనికి అభివాదనం చెయ్యకుండా విద్యను గ్రహించకూడదు.

18. అధ్యయనకాలే వ్యాసఙ్గం, పారిప్లవమ్, అన్యమనస్కతాం చ న భజేత్.

అ. విద్యాధ్యయనం చేసే సమయంలో ఇతర కార్యాలలో ఆసక్తి, చాంచల్యమూ, మనస్సు చదువుమీద కాకుండా మరొక విషయాన్ని గూర్చి ఆలోచించడమూ - ఇవి ఉండగూడదు.

19. సహాధ్యాయిషు బుద్ధ్యతిశయేన నాభ్యసూయేత్.

అ. సహాధ్యాయులు తనకంటె ఎక్కువ తెలివిగా ఉంటే అసూయ పడగూడదు.

20. ప్రజ్ఞయాఽతిశయానో న గురుమవజ్ఞాయేత.

అ. ప్రజ్ఞ (బుద్ధిబలం) చేత గురువును మించినవాడైనా గురువును అవమానించకూడదు.

21. సకిమభిజాతః మాతరి యః పరుషః శూరో వా పితరి.

అ. తల్లితో పరుషంగా ప్రవర్తించేవాడూ తండ్రిమీద శౌర్యం చూపించేవాడు ఏమి అభిజాతుడు ? (అభిజాతః—ఉత్తమ వంశంలో పుట్టినవాడు. ఇతరులతో చాలా మర్యాదగా ప్రవర్తించేవాడు )

22. అననుజ్ఞాతో న క్వచిద్వ్రజేత్.

అ. గురువు అనుజ్ఞ లేకుండా ఎక్కడికి వెళ్ళకూడదు.

23. మార్గమచలం జలాశయం చ నైకోఽవగాహేత.

అ. ఒంటరిగా దీర్ఘప్రయాణం చెయ్యకూడదు; పర్వతం ఎక్కకూడదు. చెరువులు, నదులు మొదలైనవాట్లో దిగకూడదు.

24. పితరమివ గురుముపచరేత్.

అ. గురువుకు తండ్రికి చేసినట్లు ఉపచారం చెయ్యాలి.

25. గురుపత్నీం జననీమివ మన్యేత.

అ. గురుపత్నిని తల్లిగా భావించాలి.

26. గురువద్గురుపుత్రం పశ్యేత్.

అ. గురుపుత్రుణ్ణి గురువును చూచినట్లు చూడాలి.

27. సబ్రహ్మచారిణి బాన్ధవ ఇవ స్నిహ్యేత్.

అ. సహాధ్యాయి విషయంలో బంధుప్రేమతో ఉండాలి.

28. బ్రహ్మచర్యమాషోడశాద్వర్షాత్, తతో గోదానం దారకర్మ చ.

అ. పదహారవ సంవత్సరం వరకూ బ్రహ్మచర్యవ్రతం, అటుపైన గోదానం, వివాహమూను.

(గోదానమ్= కేశములను ఖండించడం. బ్రహ్మచారిగా ఉన్నప్పుడు కేశ ఖండనం చేసుకోకూడదు. బ్రహ్మచర్యవ్రతం పూర్తి అయినతరవాతనే చేయించు కోవాలి. దీనిని ఇప్పుడు వివాహానికి ముందు చేసే స్నాతకానికి అంగంగా చేస్తూ ఉంటారు. "గావః = కేశాః, దీయన్తే = ఖణ్డ్యన్తే, అస్మిన్ – గోదానమ్" అని విగ్రహం.)

29. సమవిద్యైః సహాధీతం సర్వదాభ్యసేత్.

అ. చదువుకొన్న దానిని ఎల్లప్పుడూ సమానమైన విద్య కలవాళ్ళతో కలిసి అభ్యసిస్తూ (మననం చేసుకొంటూ) ఉండాలి.

30. గృహదౌస్థిత్యమ్ ఆగన్తుకానాం పురతో న ప్రకాశయేత్.

అ. ఇంట్లో ఉన్న దుఃస్థితిని ఇంటికి వచ్చినవాళ్ళయెదట ప్రకటించకూడదు.

31. పరగృహేషు హి సర్వోఽపి విక్రమాదిత్యాయతే.

అ. ఎందుచేత ననగా, పరుల ఇళ్ళల్లో ప్రతివాడూ విక్రమాదిత్యుడిలాగ ప్రవర్తిస్తాడు.

32. స ఖలు మహాన్ యః స్వకార్యేష్వివ పరకార్యేష్వభ్యుత్సహతే.

అ. ఇతరుల కార్యాల విషయంలో తన కార్యాలవిషయంలో ప్రవర్తించినట్లు ప్రవర్తించేవాడే మహాపురుషుడు.

33. పరకార్యేషు కో నామ న శీతలః.

అ. ఇతరుల పను లనేటప్పటికి చల్లబడిపోనివాడు ఎవడు?

34. రాజాసన్నః కో నామ న సాధుః?

అ. రాజుకు దగ్గర ఉండేవాడు సాధువు కానివా డెవడు? (రాజుకు దగ్గరగా ఉండేవాడు ప్రతీవాడూ సత్పురుషుడులాగే కనబడతాడు.)

35. అర్థపరేష్వనునయః కేవలం దైన్యాయ.

అ. ధనపరులైనవాళ్ళని బ్రతిమాలుకోవడం కైవలం దైన్యాన్ని ప్రకటించడమే.

ధనప్రధానులు పని చెయ్యాలంటే ధనం ఇస్తే చేస్తారే కాని, వాళ్ళని ఎంత బ్రతిమాలినా ప్రయోజనం ఉండదు. కేవలం దైన్యం చూపించడమే అవుతుంది.

36. కో నామ అర్థార్థీ ప్రణామేన తుష్యతి?

అ. నమస్కారం పెట్టినంతమాత్రాన సంతోషించే కార్యార్థి లేదా ధనార్థి ఎవడుంటాడు? వానికి కావలసింది ధనం; నమస్కారం కాదు.

37. ఆశ్రితేషు కార్యతో విశేషకరణేఽపి, ప్రియదర్శనాలాపాభ్యాం సర్వత్ర సమవర్తనం తన్త్రం వర్ధయతి, అనురఞ్జయతి చ ప్రజాః.

అ. ప్రభువు తనను ఆశ్రయించినవారికి క్రియారూపంలో కొంత అధికంగా సాహాయ్యాదులు చేసినా ఇతరులకు కూడా స్నేహపూర్వకంగా దర్శనం ఇస్తూ ప్రియంగా మాటలాడుతూ ఉంటే, అందరి విషయంలోనూ నిష్పక్షపాతంగా ప్రవర్తిస్తే, పరిపాలనా తంత్రాన్ని వృద్ధిపొందించకలుగుతాడు. ప్రజల్ని రంజింపచేస్తాడు.

38. తనుధనార్థగ్రహణం మృతమారణమివ.

అ. దరిద్రుడి దగ్గర ధనం తీసికోవడం చచ్చినవాణ్ణి చంపడం వంటిది.

39. అప్రతివిధాతరి కార్యనిర్వేదనమ్ అరణ్యే రుదితమివ.

అ. తగు ప్రతిక్రియ చేయనివానికి కార్యాలను (తన కష్టాలను) చెప్పుకోవడం అరణ్యరోదనం వంటిది.

40. దురాగ్రహస్య హితోపదేశః బధిరస్యాగ్రతో గానమివ.

అ. మొండి పట్టుదలకలవానికి హితం ఉపదేశించడం చెవిటివాడి ఎదట గానం చెయ్యడం వంటిది.

41. అకార్యజ్ఞస్య శిక్షణమ్ అన్ధస్య పురతో నర్తనమివ.

అ. కార్యజ్ఞానం లేనివాడికి బోధించడం గ్రుడ్డివాని ఎదట నృత్యం చేయడం వంటిది.

42. అవిచారకస్య యుక్తికథనం తుషఖణ్డనమివ.

అ. ఆలోచన చేయనివానికి యుక్తులు చెప్పడం ఊక దంచడం వంటిది.

43. నీచేషూపకృతమ్ ఉదకే విశీర్ణలవణమివ.

అ. నీచులకు ఉపకారం చెయ్యడం నీటిలో కరిగిపోయిన ఉప్పు వంటిది.

44. అవిశేషజ్ఞే ప్రయాసః శుష్కనదీతరణమివ.

అ. విశేషాన్ని గుర్తించనివాని విషయంలో చేసే శ్రమ ఎండిపోయిన నదిలో ఈదడం వంటిది.

45. పరోక్షే కిలోపకృతం సుప్తసంవాహనమివ.

అ పరోక్షంలో ఉపకారం చెయ్యడం నిద్రలో ఉన్నవానికి ఒళ్ళు పట్టడం వంటిది.

46. అకాలే విజ్ఞప్తం ఊషరే కృష్టమివ.

అ. సమయం కాని సమయంలో విజ్ఞాపన చేయడం చవటనేల దున్నడం వంటిది.

47. ఉపకృత్యోద్ఘాటనం వైరకరణమివ.

అ. ఉపకారం చేసి దాన్ని ప్రచారం చెయ్యడం విరోధం పెట్టుకోవడం వంటిది.

48. అఫలవతః ప్రసాదః కాశకుసుమస్యేవ.

అ. ఫలం లేనివాని (ఏ ఉపకారమూ చేయని వాని) ప్రసాదం (అనుగ్రహం) రెల్లు పువ్వు వికసించడంవంటిది.

49. గుణదోషావనిశ్చిత్య అనుగ్రహనిగ్రహవిధానం గ్రహాభినివేశ ఇవ.

అ. గుణదోషాలను సరిగా నిశ్చయించకుండగా అనుగ్రహం చూపడం కాని, నిగ్రహించడం కాని గ్రహావేశం (దెయ్యం పట్టడం) వంటిది.

50. ఉపకారాపకారాసమర్థస్య తోషరోషకరణమ్ ఆత్మవిడమ్బనమివ.

అ. ఉపకారం చేయడానికి గాని, అపకారం చేయడానికి గాని సామర్థ్యం లేనివాడు సంతోషాన్ని, రోషాన్ని ప్రకటించడం తనను తాను ఉపహాసాస్పదుణ్ణిగా చేసుకోవడమే.

51. గ్రామ్యస్త్రీవిద్రావణకారి గలగర్జితం గ్రామశూరాణాం, న రణశూరాణామ్.

అ. కొంతమంది గ్రామంలోనే శూరత్వం చూపుతూ ఉంటారు; వాళ్ళ కంఠం అరుపు ఆ పల్లెటూళ్ళలో ఉండే స్త్రీలను భయంతో పారిపోయేటట్లు చేస్తుంది. రణశూరులు అలాంటి గర్జనలు చేయరు. చేసినా - అవి మహాశూరులకే భయం కలిగిస్తాయి

52. స విభవో మనుష్యాణాం యః పరోపభోగ్యః.

అ. ఇతరులు కూడా అనుభవించడానికి అందుబాటులో ఉండేదే మానవుల నిజమైన వైభవం.

53. స నను వ్యాధిః, యః స్వస్యైవోపభోగ్యః.

అ. కేవలం తాను మాత్రమే అనుభవించే వైభవం వ్యాధి కదా? తన సంపదను తాను మాత్రమే అనుభవించడం ఎవడి రోగబాధ వాడే అనుభవించడం వంటిది అని భావం.

54. స కిం గురుః, పితా, సుహృద్వా యః అభ్యసూయాగర్భం బహుషు దోషం ప్రకాశయన్ శిక్షయతి.

అ. మనస్సులో ఏదో అసూయాభావం పెట్టుకొని, (శిష్యుడిలో ఉన్న) లోపాలు అందరికీ చాటిచెపుతూ బోధించే గురువు ఏమి గురువు, తండ్రి ఏమి తండ్రి, స్నేహితుడు ఏమి స్నేహితుడు?

55. స కిం ప్రభుః యః చిరసేవకేష్వేకమప్యపరాధం న సహతే.

**ఇతి పురోహితసముద్దేశః.**

అ. ఎంతో కాలంనుంచి సేవ చేస్తున్న వాళ్ళవల్ల జరిగిన ఒక్క అపరాధాన్ని కూడా మన్నించని ప్రభువు ఏమి ప్రభువు?

''బాలానందిని'' అను సోమదేవనీతిసూత్రాంధ్ర వ్యాఖ్యలో
పురోహితసముద్దేశం సమాప్తం

## 12. సేనాపతి సముద్దేశః

1. అభిజనాచార ప్రజ్ఞానురాగ సత్యశౌచ శౌర్యసంపన్నః, ప్రభావవాన్, బహుబాన్ధవపరివారః, నిఖిలనయోపాయప్రయోగనిపుణః, సమభ్యస్తసమస్తవాహనాయుధలిపిభాషాత్మస్వరూపస్థితిః, సకలతన్త్రిసామన్తాభిమతః, సాఙ్గ్రామిగామికాకారశరీరః, భర్తురాదేశాభ్యుదయ హితవృత్తిషు నిర్వికల్పః, స్వామినా ఆత్మవత్ మానార్థప్రతిపత్తిరాజచిహ్నైః సంభావితః, సర్వక్లేశాయాససహః, స్వైః, పరైశ్చాప్రధృష్యప్రకృతిః - ఇతి సేనాపతి గుణాః.

అ. ఉత్తమవంశంలో పుట్టి ఉండడం, ఆచారం (సత్ప్రవర్తన), బుద్ధిబలం, రాజభక్తి, సత్యం, శౌచం (వ్యవహారంలో వంచన లేకపోవడం), శౌర్యం ఇవన్నీ ఉన్నవాడు, ప్రభావవంతుడు (**Having commanding power**), చాలామంది బంధువులూ, పరివారమూ కలవాడు, అన్ని నీతులను, ఉపాయాలనూ ప్రయోగించడంలో నేర్పుగలవాడు, సమస్తవాహనాలూ, ఆయుధాలు, లిపులు, భాషలు, ఆత్మ (మనస్సు) వీటి స్వరూపస్వభావాలు బాగా తెలిసికొన్నవాడు (నేర్చినవాడు), సమస్తమైన తంత్రులకు (తంత్రులనగా వివిధ కార్యాలు నిర్వహించేవాళ్ళు), సామంతులకు అంగీకారయోగ్యుడు, యుద్ధంలో పాల్గొనదగిన,

అందరూ దగ్గరికి రాదగిన (అనగా అందమైన) ఆకారము (Personality), శరీరమూ కలవాడు, ప్రభువు ఆజ్ఞ, అతని అభివృద్ధి, అతనికి హితమైన వ్యవహారము వీటిలో వికల్పాలు లేనివాడు (ముందు వెనకలు ఆడనివాడు), ప్రభువు చేత తనతో సమంగా ఆదరము, ధనసమృద్ధి, రాజచిహ్నాలూ ఇచ్చి ఆదరించబడినవాడూ, అన్ని క్లేశాలు, శ్రమలు ఓర్చుకొనగలిగినవాడు, తనవాళ్ళచేతగాని, పరులచేతగాని ఎదిరింపశక్యం కాని స్వభావం కలవాడు సేనాపతిగా ఉండాలి. ఇవే సేనాపతి లక్షణాలు.

2. స్త్రీజితత్వమ్, ఔద్ధత్యమ్, వ్యసనితా, క్షయవ్యయప్రవాసోపహతత్వమ్, తన్త్రాప్రతీకారః, సర్వైః సహ విరోధః, పరపరీవాదః, పరుషభాషిత్వమ్, అనుచితజ్ఞతా, అసంవిభాగిత్వమ్, స్వాతన్త్ర్యాత్మసంభావనోపహతత్వమ్, స్వామికార్యవ్యసనాపేక్షా, సహకారికృతకార్యవినాశః, రాజహితవృత్తిషు చేర్ష్యా, లుబ్ధత్వమ్ ఇతి సేనాపతిదోషాః.

అ. స్త్రీలకు లొంగిపోవడం (స్త్రీలంపటుడై ఉండడం), పొగరుబోతుతనం, దుర్వ్యసనాలు, ఏమైనా క్షీణించినా (సుఖధనాదికం తగ్గినా), ఖర్చు అయినా, దూరదేశంలో ఉండవలసివచ్చినా దిగాలుపడిపోవడం, పరిపాలనలో అవసరమైనప్పుడు సరియైన ప్రతిక్రియలు చేయకపోవడం, అందరితోను విరోధం పెట్టుకోవడం, ఇతరులను గూర్చి చెడ్డగా మాటలాడడం, పరుషంగా మాటలాడడం, ఔచిత్యజ్ఞానం లేకపోవడం, చేయి రాల్చకపోవడం, స్వాతంత్ర్యం-నేనే గొప్పవాడను అనే అహంభావం - ఈ రెండింటి దుష్ప్రభావంలో పడి ఉండడం, ప్రభువు కార్యాలు చెడిపోవా అని కోరుకోవడం, కూడా పనిచేసేవాళ్ళ పనులు చెడగొట్టడం, రాజుకు హితంగా ప్రవర్తించేవాళ్ళ విషయంలో కోపం లేదా అసూయ, దురాశ-ఇవి సేనాపతిలో ఉండకూడని దోషాలు.

3. స చిరంజీవీ రాజపురుషః యో నగరనాపిత ఇవ అనువృత్తిపరః సర్వాసు ప్రకృతిషు.

ఇతి సేనాపతిసముద్దేశః

అ. నగరనాపితుడు (పట్టణం మంగలి) వలె అందరు ప్రకృతుల విషయంలోను వాళ్ళ మనోభావాలను అనుసరించి ప్రవర్తించే రాజపురుషుడు (రాజసేవకుడు = Government servent) చిరంజీవిగా ఉంటాడు. (చాలా

కాలం పదవిలో ఉంటాడు; ఆవేశాలు (tensions) లేకపోవడంచేత చాలాకాలం బ్రతుకుతాడు.)

'బాలనందిని' అను సోమదేవ నీతిసూత్రాంధ్ర వ్యాఖ్యలో

సేనాపతి సముద్దేశం సమాప్తం.

## 13. దూతసముద్దేశః

1. అనాసన్నేష్వర్థేషు దూతో మన్త్రీ.

అ. దూరంగా ఉన్న కార్యాల విషయంలో దూతయే మంత్రి (ఆలోచనలు చేయగలవాడు).

2. స్వామిభక్తిః, అవ్యసనితా, దాక్ష్యం, శుచిత్వమ్, అమూర్ఖతా, ప్రాగల్భ్యమ్, ప్రతిభానవత్త్వమ్, క్షాన్తిః, పరమర్మవేదిత్వమ్, జాతిశ్చేతి ప్రథమాః దూతగుణాః.

అ. ప్రభుభక్తి, దుర్వ్యసనాలు లేకపోవడం, నేర్పు, పరిశుభ్రమైన వ్యవహారం, మూర్ఖత్వం లేకపోవడం, ప్రగల్భత్వం (మాటలు మొదలైనవాట్లో నిర్భయత్వం) వెంట వెంటనే విషయాలు స్ఫురించే శక్తి, ఓర్పు, ఇతరుల రహస్యాలను తెలుసుకోవడం, ఉత్తమజాతి అనేవి దూతకు ఉండవలసిన మొదటి గుణాలు, అనగా ప్రధాన లక్షణాలు.

3. స చ త్రివిధః నిసృష్టార్థః, పరిమితార్థః, శాసనహరశ్చేతి.

అ. నిసృష్టార్థుడు (సర్వాధికారాలు ఇవ్వబడినవాడు - Fully authorised) పరిమితార్థుడు (పరిమితమైన అధికారం గలవాడు), శాసనహరుడు (చెప్పినది చెప్పినట్లుగా ప్రభుశాసనాన్ని తీసికొని వెళ్ళి తెలిపేవాడు) అని దూత మూడు విధాలు.

4. యత్కృతౌ స్వామిసంధివిగ్రహౌ ప్రమాణం సః నిసృష్టార్థః; యథా కృష్ణః పాణ్డవానామ్.

అ. ఎవడు చేసిన, ప్రభువుకు సంబంధించిన సంధి విగ్రహాలు ప్రమాణమో (Binding on both the parties) అతడు నిసృష్టార్థుడు. ఇందుకు ఉదాహరణం పాండవుల దూత అయిన శ్రీకృష్ణుడు.

5. అవిజ్ఞాతో దూతః పరస్థానం న ప్రవిశేన్న నిర్గచ్ఛేద్వా.

అ. దూత పరుల రాజ్యంలోకి తెలియకుండా వెళ్ళకూడదు; అక్కడినుండి తిరిగి రాకూడదు

6. మత్స్వామినమతిసంధాతుకామః పరో మాం విలమ్బయితుమిచ్ఛతీతి అవిజ్ఞాతోఽపి దూతః అపసరేత్; గూఢపురుషానపసర్పయేద్వా.

అ. "ఈ శత్రువు మన ప్రభువును మోసగించడం కోసం ఆలస్యం చేస్తున్నాడు" అని గ్రహించినప్పుడు దూత ఎవరికీ తెలియకుండానే వెళ్ళిపోవచ్చును. లేదా గూఢచారుల్ని పంపి రహస్యంగా సమాచారం సేకరించాలి.

7. పరేణాశు సంప్రేషణే దూతః కారణం విమృశేత్.

అ. శత్రువు తనను తొందరగా పంపివేస్తే దూత అందుకు కారణం ఏమో ఆలోచించుకోవాలి.

8. కృత్యోపగ్రహః, అకృత్యోత్థాపనమ్, సుతదాయాదావరుద్ధోపజాపః, స్వమణ్డలప్రవిష్టగూఢపురుషపరిజ్ఞానమ్, అన్తపాలాటవికసంబన్ధః, కోశదేశతన్త్రమిత్రావబోధః, కన్యారత్నవాహనవినిఃస్రావణమ్, స్వాభీష్టపురుషప్రయోగాత్ పరప్రకృతిక్షోభకరణం చ దూతకర్మ.

అ. కృత్యులను (చూ. మంత్రి సముద్దేశం. 161 వ సూత్రం) అదుపులో ఉంచడం, అకృత్యులను పైకి లేవదీయడం (అభివృద్ధిలోనికి తీసుకొనిరావడం), (శత్రుపక్షంలో) పుత్రుల్ని, దాయాదుల్ని, నిగ్రహించబడినవాళ్ళని తిరుగుబాటు చేయడానికి పురిగొల్పడం, తన మండలంలో ప్రవేశించిన గూఢపురుషుల్ని గుర్తించడం, రాజ్యం సరిహద్దులలో ఉండే రాజులతోను, ఆటవికులతోను సంబంధం పెట్టుకోవడం, కోశం (ధనాగారం), దేశం, పరిపాలన, మిత్రులు - వీటిని గూర్చి పూర్తిగా తెలిసికొని ఉండడం, శత్రువుల రాజ్యంనుంచి కన్యలను, రత్నాలను, వాహనాలను బైటకు లాగివేయడం, తనకు ఇష్టులైన (సంనిహితులైన) పురుషుల్ని ప్రయోగించి శత్రువుల ప్రకృతులలో సంక్షోభం కలిగించడం. ఇవి దూత చేయవలసిన పనులు.

9. మన్త్రి పురోహిత సేనాపతి ప్రతిబద్ధాప్తజనోపచారవిస్రమ్భాభ్యాం శత్రోరితికర్తవ్యతామ్ అన్తఃసారతాం చ విద్యాత్.

అ. (శత్రువుల) మంత్రులు, పురోహితులు, సేనాపతులు సంబంధించిన వాళ్ళు, ఆప్తజనులు - వీళ్ళకు ఉపచారాలు చేసి (మంచి చేసికొని), విశ్వాసం కలిగించి శత్రువులు ఏమి చేయదలచుచున్నదీ వాళ్ళకి ఎంత సారం (బలం) ఉన్నదీ తెలుసుకోవాలి.

10. స్వయమశక్తః పరేణోక్తమనిష్టం సహేత.

అ. తాను ఏమీ చేయలేనివాడు, ఇతరులు అనిష్టంగా మాటలాడినా సహించాలి.

11. గురుషు స్వామిషు వా పరివాదే నాస్తి క్షాన్తిః.

అ. తన గురువుల విషయంలో కాని, ప్రభువు విషయంలో కాని ఎవరైనా నిందావాక్యాలు పలికితే సహించే ప్రసక్తి లేదు.

12. స్థిత్వాపి యాస్యతోఽవస్థానం కేవలమపక్షయహేతుః.

అ. కొంతకాలం ఆగిన తరవాతనైనా యుద్ధానికి వెళ్ళవలసినవాడు అలా ఆగడం నష్టానికి దారితీస్తుంది.

13. వీరపురుషపరివృతః శూరపురుషాన్తరితాన్ పరదూతాన్ పశ్యేత్.

అ. తన చుట్టూ వీరులను నిలబెట్టుకొని, తనకూ దూతలకూ మధ్య శూరులను నిలబెట్టి శత్రుదూతలను చూడాలి (వాళ్ళకి దర్శనం ఇవ్వాలి).

14. శ్రూయతే కిల చాణక్యః తీక్ష్ణదూతప్రయోగేణైకం నన్దం జఘానేతి.

అ. చాణక్యుడు ఒక తీక్ష్ణుణ్ణి దూతగా పంపి, వాని ద్వారా ఒక నంద వంశీయుణ్ణి చంపి నట్లు వింటున్నాము కదా?

15. శత్రుప్రహితం శాసనముపాయనం చ స్వైః అపరీక్షితం నోపాదదీత.

అ. శత్రువులు పంపిన శాసనాన్ని (లేఖను) గాని, కానుకను గాని తన వాళ్ళచేత పరీక్ష చేయించకుండగా తీసికొనగూడదు.

16. శ్రూయతే హి స్పర్శవిషవాసితాద్భుతవస్త్రోపాయనేన కరహాటపతిః కైటభః వసునామానం రాజానమ్, ఆశీవిషవిషధరోపేతరత్నకరణ్డకప్రాభృతేన చ కరవాలః కరాలం చ జఘానేతి.

అ. కరహాటరాజైన కైటభుడు స్పర్శవిషం (ముట్టుకొంటేనే చంపే విషం) పూసిన అద్భుతమైన వస్త్రాలను కానుకగా ఇచ్చి వసువు అనే రాజును చంపించినట్లు, ముందు కోరలలో విషం ఉన్న సర్పాలతో కూడిన రత్నాల పెట్టెను బహూకరించి కరవాలుడు కరాలుణ్ణి చంపినట్లు వింటున్నాము కదా?

''ఆశీవిషవిషధరోపేత'' అనే పదానికి ''సర్పవిషంతో కూడిన'' అనగా ''విషం పూసిన, రత్నాలతో కూడిన'' అని కూడా అర్థం చెప్పుకొనవచ్చు.

17. మహత్యపకారేపి న దూతముపహన్యాత్.

అ గొప్ప అపకారం జరిగినా కూడ దూతను చంపకూడదు.

18. ఉద్ధృతేష్వపి శస్త్రేషు దూతముఖా వై రాజానః. తేషామన్త్యావసాయినోఽప్యవధ్యాః, కిమఙ్గ పునర్బ్రాహ్మణాః.

అ యుద్ధం జరుగుతున్నప్పుడు కూడా రాజులకు దూతలే ముఖాలు (నోళ్ళు). అలాంటి దూతలలో అంత్యజుల్ని కూడా చంపకూడదు; ఇంక బ్రాహ్మణుల మాట చెప్పాలా?

19. అవధ్యభావాత్ దూతః సర్వమేవ జల్పతి.

అ. అవధ్యుడు (చంపకూడనివాడు) అవడం వల్ల దూత అంతా (ఇష్టం వచ్చినట్లు) పేలుతాడు.

20. కః సుధీః దూతవచనాత్ పరోత్కర్షం స్వాపకర్షం చ మన్యేత.

అ. దూత ఏవేవో అన్నంతమాత్రంచేత శత్రువు గొప్పవాడనీ, తాను తక్కువవాడనీ ఏ బుద్ధిమంతుడైనా అనుకొంటాడా?

21. తదాశయరహస్యపరిజ్ఞానార్థం పరదూతః స్త్రీభిః ఉభయవేతనైః తద్గుణాచారశీలానువర్తిభిర్వా ప్రణిధాతవ్యః.

అ. శత్రువుల దూతల అభిప్రాయాన్నీ, రహస్యాలనూ తెలుసుకోవడం కోసం స్త్రీలను గాని, రెండు వైపులనుండీ జీతాలు తీసికొనేవాళ్ళను గాని, ఆ

దూతల గుణాలను, అలవాట్లను శీలాన్నీ అనుసరించగలిగినవాళ్ళను గాని గూఢంగా ప్రయోగించాలి.

22. చత్వారి వేష్టనాని ఖడ్గముద్రా చ ప్రతిపక్షలేఖానామ్.

ఇతి దూతసముద్దేశః.

అ. శత్రువులకు పంపే లేఖలు నాలుగు మడతలు పెట్టి, దానిపైన ఖడ్గ ముద్ర వెయ్యాలి.

'బాలానందిని' అను సోమదేవ నీతిసూత్రాంధ్ర వ్యాఖ్యలో
దూతసముద్దేశం సమాప్తం.

## 14. చారసముద్దేశః

1. స్వపరమణ్డలకార్యాకార్యవిలోకనే చారాశ్చక్షూంషి క్షితిపతీనామ్.

అ. తన మండలంలోను, శత్రువుల మండలంలోను చేయవలసిన పనులు, చేయకూడని పనులు చూడడానికి రాజులకు గూఢచారులే నేత్రాలు.

2. అలౌల్యమ్, అమాన్ద్యమ్, అమృషాభాషిత్వమ్, అభ్యూహకత్వం చేతి చారగుణాః.

అ. భోగాదులందు అత్యాసక్తి లేకపోవడం, చురుకుగా ఉండడం, అబద్ధాలు ఆడకపోవడం. ఊహించి గ్రహించే శక్తి - ఇవి గూఢచారుల గుణాలు.

3. తుష్టిదానమేవ చారాణాం వేతనమ్.

అ. (అధికమైన పారితోషికాదులిచ్చి) సంతృప్తిని కలిగించడమే గూఢచారులకు జీతం

4. తే హి తల్లోభాత్ స్వామికార్యేష్వతీవ త్వరన్తే.

అ. ఎందుచేత ననగా, వాటిమీద ఆసక్తివలన వాళ్ళు ప్రభువు కార్యాలలో తొందరగా పని చేస్తారు.

5. సన్దిగ్ధవిషయే త్రయాణామైకవాక్యే సంప్రత్యయః.

అ. విషయం సందిగ్ధంగా ఉన్నప్పుడు ముగ్గురు గూఢచారులలో ఏకవాక్యత్వం ఉంటే, (ముగ్గురు వేరు వేరుగా చెప్పినవి కలుస్తే) నమ్మాలి.

6. అనపసర్పో హి రాజా స్వైః పరైశ్చాతిసన్ధీయేత.

అ. గూఢచారులు లేని రాజును తనవాళ్ళు ఇతరులూ కూడా మోసగించవచ్చును.

7. కిమస్త్యయామికస్య నిశి కుశలమ్.

అ. యామికుడు లేనివాడు రాత్రి క్షేమంగా ఉండగలడా?

రాత్రులందు ప్రతిజామూ లేపుతూ కాపలా కాసే రక్షకభటుడు "యామికుడు."

8. కాపటికోదాస్థిత - గృహపతిక - వైదేహక - తాపస - కితవ-కిరాతాక్షశాలిక - యమపట్టికాహితుణ్డిక - శౌణ్డిక - శౌభిక - పాటచ్చర - విట - విదూషక - పీఠమర్దక - నట - నర్తక-గాయక - వాదక - వాగ్జీవక - గణక - శాకునిక - భిషగైన్ద్రజాలిక - నైమిత్తిక - సూదారాలిక - సంవాహక - తీక్ష్ణ-క్రూర - రసద - జడ - మూక - బధిరాన్ధచ్ఛద్మానః స్థాయి యాయిభేదేనాపసర్పవర్గః.

అ. గూఢచారులు స్థాయులు (స్థిరంగా ఒకచోట నివసించే వాళ్ళు) యాయులు (దేశసంచారం చేసేవాళ్ళు) అని రెండు విధాలు. ఈ గూఢచారులు కాపటిక - ఉదాస్థిత - గృహపతిక - వైదేహక - తాపస - కితవ - కిరాత - అక్షశాలిక - యమపట్టిక - అహితుండిక - శౌండిక - శౌభిక - పాటచ్చర - విట - విదూషక - పీఠమర్దక - నట - నర్తక - గాయక - వాదక - వాగ్జీవక - గణక - శాకునిక - భిషక్ - ఇంద్రజాలిక - నైమిత్తిక - సూద - ఆరాలిక - సంవాహక - తీక్ష్ణ - క్రూర - రసద - జడ - మూక - బధిర - అంధుల కపటవేషాలలో ఉంటారు.

9. పరమర్మజ్ఞః ప్రగల్భః ఛాత్రః కాపటికః.

**అ. ఇతరుల రహస్యాలు తెలిసిన, ప్రగల్భుడైన విద్యార్థి "కాపటికుడు."**

10. యం కంచన సమయమాస్థాయ ప్రతిపన్నాచార్యాభిషేకః ప్రభూతాన్తేవాసీ, ప్రజ్ఞాతిశయయుక్తః, రాజపరికల్పితవృత్తిః ఉదాస్థితః.

అ. ఏదో ఒక మతసంప్రదాయం అవలంబించి, ఆచార్యుడుగా అభిషేకం పొంది, అత్యధికసంఖ్యలో ఉన్న శిష్యులతో, మంచి బుద్ధిబలం ఉన్నవాడు "ఉదాస్థితుడు." అతనికి రాజే వృత్తి కల్పిస్తాడు.

11. గృహపతికవైదేహకౌ గ్రామకూటశ్రేష్ఠినౌ.

అ. గ్రామంలోని అత్యుత్తముడైన వ్యక్తి ''గృహపతి'' అనగా ఊరు పెద్ద. "వైదేహకుడు" అనగా పెద్ద షావుకారు.

12. బాహ్యవ్రతవిద్యాభ్యాం లోకవిడమ్బనహేతుః తాపసః.

అ. అందరికీ కనబడేటట్లు చేసే వ్రతాలచేతా విద్యచేతా లోకాన్ని మోసగించగలిగినవాడు ''తాపసుడు.''

13. కితవః ద్యూతకారః.

అ. 'కితవుడు' అనగా జూదరి.

14. అల్పాఖిలశరీరావయవః కిరాతః.

అ. శరీరంలోని అన్ని అవయవాలూ చిన్న చిన్నవిగా ఉన్నవాడు 'కిరాతుడు.'

15. అక్షశాలికః ప్రతిగృహం చిత్రపటదర్శీ.

అ. ఇంటింటికీ వెళ్ళి చిత్రపటం (ఆయా కథలకు సంబంధించిన బొమ్మలు వేసిన విశాలమైన వస్త్రం - canvas) చూపించేవాడు ''అక్షశాలికుడు.''

16. యమపట్టికః గలత్రోటికః.

అ. ''యమపట్టికుడు'' అనగా గలత్రోటికుడు. గలత్రోటికుడు అనగా అర్థం ఏమో పరిశీలించాలి. యముణ్ణి, యమదూతలను, పాపాత్ములకు కలిగే ఆ యా నరకబాధలను చిత్రించిన పటానికి (వస్త్రానికి) యమపటం అని పేరు. అట్టి పటాన్ని ప్రదర్శించేవాడు యమపట్టికుడు అయి ఉంటాడు.

17. అహితుణ్డికః సర్పక్రీడాప్రసరః.

అ. పాములు ఆడిస్తూ తిరిగేవాడు ''అహితుండికుడు.''

18. శౌణ్డికః కల్పపాలః.

అ. మద్యం అమ్మేవాడు శౌండికుడు.

19 శౌభికః జపాయాం కాణ్డపటావరణేన నానారూపదర్శీ.

అ. జపాపుష్పం మీద తెర కప్పి అనేక రూపాలు చూపేవాడు "శౌభికుడు."

'కాండపటం' అనగా వస్త్రంతో కట్టిన గుడారానికి చుట్టూ కట్టిన బట్టతెర. అలాంటి తెరలో ఉండి లేదా పల్చనిగుడ్డకప్పి జపాపుష్పం (ఎఱ్ఱగా ఉండే గులాబిపువ్వులాంటి పువ్వు) మీద అనేకమైన ఆకారాలు చూపించేవాడని అర్థం అయి ఉంటుంది. కాని, భావం అస్పష్టంగానే ఉన్నది. ఇవన్నీ వెయ్యిసంవత్సరాల క్రితం ప్రచారంలో ఉన్న వినోదాలు.

20. పాటచ్చరః చోరో బన్దికారో వా.

అ. 'పాటచ్చరుడు' అనగా దొంగ లేదా ఖైదులో పెట్టేవాడు.

21. వ్యసనినాం ప్రేషణాజీవః విటః.

అ. దుర్వ్యసనాలు ఉన్నవాళ్ళు ఈ పనిమీద ఆ పనిమీదా పంపుతూండడమే జీవిక కలవాడు విటుడు. క్లబ్బులలోను, జూదం ఆడే ఇతర స్థలాలలోను ఉండే అటెండెంటు వంటివాడు.

22. సర్వేషాం ప్రహసనపాత్రం విదూషకః.

అ. అందరూ వేళాకోళం చేసేవాడు "విదూషకుడు."

23. కామశాస్త్రాచార్యః పీఠమర్దకః.

అ. కామశాస్త్రంలో ఆచార్యత్వం చేసేవాడు "పీఠమర్దకుడు."

24. గీతాఙ్గప్రావరణేన నృత్యవృత్త్యాజీవీ నటః.

అ. గీతానికి అంగాలైన తాళమృదంగాదులు చుట్టూ చేర్చుకొని నృత్యం వృత్తిగా చేసికొని జీవించేవాడు "నటుడు."

25. నాటకాభినయరఙ్గనర్తకః నర్తకః.

అ. నాటకాలు అభినయించే రంగస్థలంమీద నర్తనం చేసేవాడు నర్తకుడు.

26. రూపాజీవావృత్త్యుపదేష్టా గాయకః.

అ. వేశ్యలకు తమ వృత్తి ఎలా నడిపించుకోవాలో ఉపదేశించేవాడు గాయకుడు.

27. గీతప్రబన్ధగతివిశేషవాదకః చతుర్విధాతోద్యప్రచారకుశలః వాదకః.

అ. నాలుగు విధాలైన ఆతోద్యాల ప్రయోగంలో నేర్పు కలిగి ఉండి, గీతప్రబంధానికి సంబంధించిన గతివిశేషానికి అనుగుణంగా వాయించేవాడు "వాదకుడు."

గీతం గానం చేసేటప్పుడు వాయించే పక్క వాద్యాలు ఆతోద్యాలు. వాద్యాలు, అనద్ధాలు, సుషిరాలు, ఘనాలు అని ఆతోద్యాలు నాలుగు విధాలు. వీణ మొదలైనవి వాద్యాలు. మృదంగాదులు ఆనద్ధాలు. రంధ్రాలున్న మురళి, సన్నాయి మొదలైనవి సుషిరాలు. ఇత్తడి తాళాలు మొదలైనవి ఘనాలు.

28. వాగ్జీవకః వైతాళికః సూతో వా.

అ. వైతాళికుడు అనగా స్తోత్రపాఠకుడు, లేదా సూతుడు అనగా పురాణ ప్రవచనాదికం చేసేవాడు "వాగ్జీవకుడు" (వాక్కే జీవనాధారంగా గలవాడు).

29. గణకః సంఖ్యావిత్ దైవజ్ఞో వా.

అ. లెక్కలు తెలిసినవాడు లేదా జ్యోతిఃశాస్త్రపండితుడు "గణకుడు."

30. శాకునికః శకునవక్తా.

అ. శకునాలు చెప్పేవాడు "శాకునికుడు."

31. భిషక్ ఆయుర్వేదవిత్ వైద్యః శస్త్రకర్మవిచ్చ.

అ. ఆయుర్వేదమూ, శస్త్రచికిత్సా తెలిసిన వైద్యుడు ''భిషక్''.

32. ఐన్ద్రజాలికః తన్త్రయుక్త్యా మనోవిస్మయకరః మాయావీ చ.

అ. తంత్రయుక్తిచేత అనగా తంత్రప్రయోగంచేత (హస్తలాఘవాదుల చేత) మనస్సుకు ఆశ్చర్యం కలిగించేవాడు, మాయలో ప్రవేశం ఉన్నవాడు ''ఇంద్రజాలికుడు.''

33. నైమిత్తికః లక్ష్యవేధీ దైవజ్ఞో వా.

అ. గురి చూచి కొట్టేవాడు, లేదా జోస్యం చెప్పేవాడు ''నైమిత్తికుడు."

34. మాహానసికః సూదః.

అ. వంట ఇంట్లో పనిచేసేవాడు (వంటవాడు) ''సూదుడు.''

35. విచిత్రభక్ష్యప్రణేతా ఆరాలికః.

అ. విచిత్రములైన భక్ష్యాలు తయారుచేసేవాడు "ఆరాలికుడు."

36. అఙ్గమర్దనకలాకుశలః భారవాహకో వా సంవాహకః.

అ. ఒళ్ళుపట్టడం కళలో నేర్పు గలవాడు, లేదా బరువులు మోసేవాడు "సంవాహకుడు."

37. ద్రవ్యహేతోః కృచ్ఛ్రేణ కర్మణా యః జీవితవిక్రయీ సః తీక్ష్ణః; అసహనో వా.

అ. డబ్బుకోసం అతికష్టమైన పనులు చేయడానికి జీవితాన్ని అమ్ముకున్నవాడు లేదా సహనం లేనివాడు "తీక్ష్ణుడు."

38. సదా బన్ధుషు నిఃస్నేహః క్రూరః.

అ. ఎల్లప్పుడు బంధువులంటే పడనివాడు "క్రూరుడు."

39. రసదః విషప్రయోక్తా.

అ. విషప్రయోగం చేసేవాడు "రసదుడు."

40. లోకవ్యవహారానభిజ్ఞః జడః.

లోకవ్యవహారాలు తెలియనివాడు "జడుడు."

41. జిహ్వాశ్రవణనయనహీనాః మూకబధిరాన్ధాః.

ఇతి చారసముద్దేశః

అ. నాలుక లేనివాడు (మూగవాడు) "మూకుడు," చెవులు లేనివాడు (చెవిటివాడు) "బధిరుడు". కళ్ళు లేనివాడు (గ్రుడ్డివాడు) అంధుడు.

'బాలానందిని' అను సోమదేవ నీతిసూత్రాంధ్రవ్యాఖ్యలో

చార సముద్దేశం సమాప్తం.

## 15. విచారసముద్దేశః

1. నావిచార్య కిమపి కార్యం కుర్యాత్.

అ. ఆలోచించకుండగా ఏ పనీ చేయకూడదు.

2. ప్రత్యక్షానుమానాగమైః యథావస్థితవస్తువ్యవస్థాపనహేతుః విచారః.

అ. ఒక వస్తువు ఎలా వుందో అల్లాగ, అనగా ఒక వస్తువు యథార్థ స్వరూపాన్ని, ప్రత్యక్షంచేత, అనుమానంచేత, ఆగమంచేత నిర్ధారణ చేయడానికి ఉపయోగించేది విచారం.

3. స్వయం దృష్టం ప్రత్యక్షమ్.

అ. స్వయంగా చూడబడినది ప్రత్యక్షం; లేదా స్వయంగా చూడడం ప్రత్యక్షం.

4. న జ్ఞానమాత్రాత్ ప్రేక్షావతాం ప్రవృత్తిర్నివృత్తిర్వా.

అ. పండితులు ఏదో ఒక విషయం (స్థూలంగా) తెలిసినంత మాత్రాన ప్రవర్తించడం గాని, నివర్తించడం గాని చెయ్యరు.

5. స్వయందృష్టేఽపి మతిర్ముహ్యతి, సంశేతే, విపర్యస్యతి వా, కిం పునర్న పరోద్దిష్టే.

అ. స్వయంగా చూచిన దాని విషయంలో కూడా బుద్ధి మోహం చెందుతుంది. సంశయం చెందుతుంది. విపరీతంగా గ్రహిస్తుంది; అలాంటప్పుడు పరులు చెప్పిన విషయంలో మోహాదులు చెందకుండా ఉంటుందా?

6. స ఖలు విచారజ్ఞః, యః ప్రత్యక్షేణోపలబ్ధమపి సాధు పరీక్ష్యానుతిష్ఠతి.

అ. ప్రత్యక్షప్రమాణంచేత (స్వయంగా చూచి) తెలుసుకొన్నదానిని కూడా బాగా పరీక్షించి ఆచరించేవాడే ఆలోచన తెలిసినవాడు.

7. అతిరభసాత్ కృతాని కార్యాణి కిం నామానర్థం న జనయన్తి?

అ. చాల తొందరపడి చేసిన పనులు కలిగించని అనర్థం ఏమి ఉంటుంది?

8. అవిచార్యాచరితే కర్మణి పశ్చాత్ ప్రతివిధానం గతోదకే సేతుబన్ధనమివ.

అ. ఆలోచించకుండా చేసిన పనికి తరవాత ప్రతిక్రియ చేయడం నీళ్లు వెళ్ళిపోయిన తరవాత ఆనకట్ట కట్టడం వంటిది.

9. కర్మసు కృతేనాకృతావేక్షణమ్ అనుమానమ్.

అ. పనులలో చేసినదానిని పట్టి చేయనిదానిని గూర్చి ఊహించుకొనడం అనుమానం.

10. సంభావితైకదేశః అవశిష్టం విద్యాత్.

అ. కార్యానికి సంబంధించిన ఒక భాగాన్ని (అంశాన్ని) ఊహించుకొని దాని సాహాయ్యంతో మిగిలిన భాగాన్ని తెలుసుకోవాలి.

11. ఆకారః, శౌర్యం, ప్రజ్ఞాసంపత్తిః, ఆయతిః, వినయశ్చ రాజపుత్రాణాం భావినో రాజ్యస్య లిఙ్గాని.

అ. ఆకారము (Personality), శౌర్యము, బుద్ధిసంపద, హుందాతనం, వినయం - ఇవి రాజపుత్రులకు రాబోయే రాజ్యాధికారానికి చిహ్నాలు.

12. ప్రకృతేర్వికృతిదర్శనం హి ప్రాణినాం భవిష్యతః శుభస్యాశుభస్య చ లిఙ్గమ్.

అ. ప్రకృతికి వికారంగా కనబడడం, అనగా మామూలుగా ఉండవలసిన దానికి కొంచెం మార్పుతో ఉండడం, ప్రాణులకు (మానవులకు) కలగబోయే శుభాన్ని గాని, అశుభాన్ని గాని సూచిస్తుంది.

13 ఏకస్మిన్ కర్మణి దృష్టబుద్ధిః పురుషకారః కథం నామ న కర్మాన్తరే సమర్థః?

అ. ఒక పనిలో చూడబడిన (సఫలమైన) బుద్ధి గల పురుషప్రయత్నం మరొక పనిలో మాత్రం సమర్థం ఎందుకు కాదు?

14. ఆప్తపురుషోపదేశః ఆగమః.

అ. ఆప్తపురుషుల ఉపదేశం 'ఆగమం.'

15. యథానుభూతానుమితశ్రుతార్థావిసంవాదివచనః పుమాన్ ఆప్తః.

అ. ఏది ఏ విధంగా గ్రహించాడో దాన్ని ఆ విధంగా, ఊహించినదానిని ఊహించినట్లుగా, విన్నదానిని విన్నట్లుగా, మార్పులు లేకుండా చెప్పేవాడు ఆప్తుడు.

16. సా వాగుక్తాప్యనుక్తసమా యత్ర నాస్తి తద్యుక్తిః.

అ. పొసగని మాట చెప్పినా చెప్పనట్లే; లేదా యుక్తివిహీనమైన మాట పలికినా పలకనట్లే.

17. వక్తుర్గుణగౌరవాద్వచనగౌరవమ్; న స్వతః.

అ. మాటలాడేవాని గుణాల మీద ఉండే గౌరవాన్ని పట్టి మాటకి గౌరవం గాని స్వతఃసిద్ధంగా మాటకి గౌరవం అంటూ ఏమీ ఉండదు.

18. కిం మితంపచేషు ధనేన? చణ్డాలసరసి వా జలేన, యత్ర సతాం నోపభోగః.

అ. సత్పురుషులు అనుభవించడానికి అవకాశం లేనప్పుడు కొంచెం వండుకొని తినే లోభికి ఎంత ధనం ఉంటే మాత్రం ఏమి ప్రయోజనం? చండాల సరస్సులో ఎంత నీరుంటే మాత్రం ఏం ప్రయోజనం?

19. లోకస్తు గతానుగతికః, యతోఽసౌ సదుపదేశినీమపి కుట్టినీం ధర్మేషు న తథా ప్రమాణయతి, యథా గోఘ్నమపి బ్రాహ్మణమ్.

ఇతి విచారసముద్దేశః

అ. లోకం గతానుగతికం; (లోకంలో ఒకడు ఎలా చేస్తే రెండోవాడు అలాగే చేస్తూంటాడు). ఎందుచేతననగా, గోహత్య చేసినవాడైనా బ్రాహ్మణుడు చెప్పిన మాట ప్రమాణంగా గ్రహిస్తారు. కాని, మంచిని ఉపదేశిస్తున్నా తార్పుడుకత్తె మాట ప్రమాణంగా గ్రహించరు.

'బాలానందిని' అను సోమదేవనీతి సూత్రాంధ్ర వ్యాఖ్యలో
విచారసముద్దేశం సమాప్తం.

## 16. వ్యసన సముద్దేశః

1. వ్యస్యతి ప్రత్యావర్తయత్యేనం శ్రేయసః ఇతి వ్యసనమ్.

అ. పీడిని శ్రేయోమార్గం నుంచి వెనుకకు మరలిస్తుంది కాబట్టి "వ్యసనం." "వ్యస్యతి ఇతి వ్యసనమ్" అని విగ్రహవాక్యం.

2. వ్యసనం ద్వివిధం సహజమాహార్యం చ.

అ. సహజమూ, ఆహార్యమూ (తెచ్చిపెట్టుకొన్నది) అని వ్యసనం రెండు విధాలు.

3. సహజం వ్యసనం ధర్మసంభూతాద్భుతాభ్యుదయహేతుభిః అధర్మజనితమహాప్రత్యవాయప్రతిపాదనై రుపాఖ్యానైః యోగపురుషైశ్చ ప్రశమయేత్.

అ. ధర్మంవల్ల కలిగిన ఆశ్చర్యకరమైన అభ్యుదయానికి (ఐహిక సుఖాభివృద్ధికి) కారణాలు, అధర్మంవల్ల గొప్ప ప్రత్యవాయం కలుగుతుంది అని బోధించేవి అయిన మంచి ఉపాఖ్యానాల శ్రవణపఠనాదుల ద్వారా, యోగపురుషులద్వారా కూడా సహజవ్యసనాలు శాంతింప చేసుకోవాలి.

4. పరచిత్తానుకూల్యేన తదభిలషితేషు వ్యసనేషు ఉపాయేన విరక్తి జననహేతవః యోగపురుషాః.

అ. ఇతరుల మనస్సులు నొచ్చకుండా మాటలాడుతూ వాళ్ళకి ఇష్టమైన వ్యసనాల విషయంలో విరక్తికలిగేటట్లు ఉపాయాలు చేసేవాళ్ళు యోగపురుషులు.

5. శిష్టసంసర్గదుర్జనాసంసర్గాభ్యాం పురాతనమహాపురుషచరితోత్థితాభిశ్చ కథాభిః ఆహార్యం వ్యసనం ప్రతిబధ్నీయాత్.

అ. మంచివాళ్ళతో సంబంధం పెట్టుకోవడంచేత, దుర్జనులకి దూరంగా ఉండడంచేత, ప్రాచీనులైన (నలరామయుధిష్ఠిరాది) మహాపురుషుల చరిత్రలకి సంబంధించిన కథలు వింటూండడంచేత ఆహార్యవ్యసనాలు ప్రతిబంధించాలి. (కొత్త వ్యసనాలు అలవడకుండా చూచుకోవాలి.)

6. స్త్రియః అతిభజమానః భవత్యవశ్యం తృతీయాప్రకృతిః.

అ. అతిగా స్త్రీ సంసర్గం చేసేవాడు తప్పక నపుంసకుడు అవుతాడు.

7. సౌమ్యధాతుక్షయః సర్వధాతుక్షయం కరోతి.

అ. సౌమ్యధాతు (శుక్ల) క్షయంవల్ల అన్ని ధాతువులూ క్షీణిస్తాయి. శరీరంలో ఉండే రస (నీరు) - రక్త - మాంస-మేదస్ (కొవ్వు) - అస్థి - మజ్జా-శుక్రాలకి ధాతువు లని పేరు.

8. పానశౌణ్డః చిత్తభ్రమాత్ మాతరమప్యభిలషతి.

అ. అతిమద్యపానాసక్తుడు చిత్తభ్రమవల్ల (ఒళ్ళు తెలియని స్థితిలో) తల్లిని కూడ అభిలషిస్తాడు.

9. మృగయాసక్తిః స్తేనవ్యాలద్విషద్దాయాదానామ్ ఆమిషం పురుషం కరోతి.

అ. వేటమీద ఆసక్తి పురుషుణ్ణి దొంగలకి, మదగజాలకి, శత్రువులకి, దాయాదులకీ ఆమిషంగా (తినే ఆహారంగా) చేస్తుంది. (వాళ్ళవల్ల మరణిస్తాడు.)

10. నాస్త్యకృత్యం ద్యూతాసక్తస్య, మాతర్యపి హి మృతాయాం దీవ్యత్యేవ హి కితవః.

అ జూదగాడికి చేయకూడని పని అంటూ ఉండదు. తల్లి చచ్చి పడి ఉన్నా కూడా జూదగాడు జూదం ఆడుతూనే ఉంటాడు.

11. పిశునః సర్వేషామవిశ్వాసం జనయతి.

అ. చాడీలు చెప్పేవానిమీద ఎవరికీ విశ్వాసం ఉండదు.

12. దివాస్వాపః సుప్తవ్యాధివ్యాలానామ్ ఉత్థాపనదణ్డః, సకల కార్యాన్తరాయశ్చ.

అ. పగటి నిద్ర, నిద్రిస్తూన్న రోగా లనే క్రూరసర్పాలను మేల్కొల్పే కఱ్ఱ. అన్ని పనులకూ విఘ్నం.

13. న పరపరివాదాత్ పరం సర్వవిద్వేషణభేషజమస్తి.

అ. అందరినీ శత్రువులుగా చేసికోవాలంటే ఇతరులను చాటుగా దూషించడం వంటి మందు మరొకటిలేదు. (పరపరివాదము=scandalising others.)

14. తౌర్యత్రికాసక్తిః కం నామ ప్రాణార్థమానైర్న వియోజయతి.

అ. నృత్య-గీత-వాద్యాలమీద అత్యాసక్తి ఎవణ్ణి ప్రాణాలనుండీ, ధనం నుండీ, గౌరవం నుండీ దూరం చెయ్యదు?

15. మృషోద్యా నావిధాయ కమప్యనర్థం న విరమతి.

అ. అబద్ధాలాడడం ఏదో ఒక అనర్థం కలిగిస్తేనే కాని ఊరుకోదు.

16. అతీవేర్ష్యాలుం పురుషం స్త్రియః పరిత్యజన్తి, ఘ్నన్తి వా.

అ. ఎక్కువ ఈర్ష్య కలవాణ్ణి స్త్రీలు విడచివేస్తారు లేదా చంపివేస్తారు.

17. పరపరిగ్రహాభిగమః కన్యాదూషణం వా సాహసం దశముఖ దాణ్డక్యాదివినాశహేతుః ప్రసిద్ధమేవ.

అ. పరభార్యాసంబంధము అవివాహితకన్యాదూషణం అనే సాహసమూ రావణుడు, దాండకి మొదలైనవాళ్ళ వినాశానికి దారి తీసినవి అనే విషయం ప్రసిద్ధమే.

18. యత్ర నాహమిత్యధ్యవసాయః తత్సాహసమ్.

అ. ఏ పని చేస్తున్నప్పుడు నేను అనే నిశ్చయం ఉండదో అది సాహసం. అనగా ఒళ్ళు తెలియని ఆవేశంలో చేసే పని సాహసం అని భావం అయి ఉంటుంది.

19. అర్థదూషకః కుబేరోఽపి భవతి భిక్షాభాజనమ్.

అ. అర్థదూషకుడు సాక్షాత్తు కుబేరుడే అయినా బిచ్చం ఎత్తుకొనవలసి వస్తుంది.

20. అతివ్యయః అపాత్రవ్యయశ్చ అర్థస్య దూషణమ్.

అ. అతిగా వ్యయం చేయడం, అయోగ్యులైన వ్యక్తులకు ఇచ్చి వ్యయం చేయడం "అర్థదూషణము."

21. హర్షామర్షాభ్యామ్ అకారణం తృణాఙ్కురమపి నోపహన్యాత్; కిం పునర్మనుష్యమ్.

అ. హర్షంచేతనో, కోపంచేతనో నిష్కారణంగా గడ్డి మొలకను కూడా చంపకూడదు; మనుష్యుని మాట చెప్పాలా?

22. శ్రూయతే హి-నిష్కారణం భూతావమానినౌ వాతాపిరిల్వలశ్చాసురౌ అగస్త్యాత్యాసాదనాద్వినేశతురితి.

అ. నిష్కారణంగా ప్రాణుల్ని బాధించిన వాతాపి, ఇల్వలుడు అనే అసురులు అగస్త్యుని విషయంలో కూడా హద్దు మీరి ప్రవర్తించడంచేత నశించి రని వింటున్నాము కదా?

23. యథాదోషం కోటిరపి గృహీతా న దుఃఖాయతే; అన్యాయేన తృణశలాకాపి గృహీతా ప్రజాః ఖేదయతి.

అ. దోషాలు లేకుండగా (కష్టపెట్టకుండగా) కోటి తీసికొన్నా ఏ విధంగా దుఃఖం కలిగించదో అదేవిధంగా అన్యాయంగా ఒక గడ్డి పరక తీసికొన్నా

ప్రజలకు దుఃఖం కలిగిస్తుంది. లేదా 'యథాదోషమ్' అనగా చేసిన అపరాధాన్ని అనుసరించి అని అర్థం.

24. తరుచ్ఛేదేన ఫలోపభోగః సకృదేవ.

అ. చెట్టు తెగగొట్టి పళ్ళు తినడం ఒక్కమాటే జరుగుతుంది.

25. ప్రజావిభవో హి స్వామినః ద్వితీయం భాణ్డాగారమ్; అతః యుక్తితః తముపయుఞ్జీత.

అ. ప్రజల ఐశ్వర్యం అనేది రాజుకి రెండవ ధనాగారం. అందుచేత దానిని యుక్తితో ఉపయోగించుకోవాలి.

26. రాజపరిగృహీతం తృణమపి పరేణ గృహీతం చేత్ కాఞ్చనీ భవతి; జాయతే చ పూర్వసంచితస్య అర్థస్యాపహారః.

అ. రాజు సొత్తు గడ్డిపరకే ఐనా దాన్ని ఇతరులు గ్రహిస్తే బంగారం అవుతుంది. (రాజు సొత్తు తృణము అపహరించినా బంగారం అపహరించినంత అపరాధంగా పరిగణింపబడుతుంది). దానితో అంతవరకూ ప్రోగు చేసికొన్న ధనం కూడా పోతుంది

27. వాక్పారుష్యం శస్త్రపాతాదపి విశిష్యతే.

మాటలలో పరుషత్వం శస్త్రప్రహారంకంటె కూడా తీక్ష్ణమైనది.

28. జాతివయోవృత్తవిద్యావిభవానుచితం హి వచనం వాక్పారుష్యమ్.

అ. (తన లేదా ఎదుటివాని) జాతికి, వయస్సుకు, నడవడికకి (లేదా ఉద్యోగానికి), ఐశ్వర్యానికి తగని వచనం "వాక్పారుష్యం."

29. స్త్రియమ్, అపత్యం, భృత్యం వా తథోక్త్యా వినయం గ్రాహయేత్ - యథా హృదయప్రవిష్టాత్ శల్యాదివ వచనతో న తే దుర్మనాయన్తే.

అ. స్త్రీకిగాని, సంతానానికి (పుత్రీపుత్రాదులకు) గాని, భృత్యుడికిగాని వినయం ఎలా నేర్పాలంటే-తను చెప్పిన మాటలు హృదయంలో ములుకులవలె ప్రవేశించి వాళ్ళకు కష్టం కలిగించకుండా ఉండేటట్లు నేర్పాలి.

30. వధః క్లేశః అర్థహరణం వా వ్యుత్క్రమేణ దణ్డపారుష్యమ్.

అ. న్యాయవిరుద్ధంగా చంపడంగాని, బాధపెట్టడంగాని, ధనం అపహరించడంగాని "దండపారుష్యం."

31. ఏకేనాపి వ్యసనేనోపహతః చతురఙ్గవానపి రాజా వినశ్యతి కిం పునర్నాష్టాదశభిః.

ఇతి వ్యసనసముద్దేశః

అ చతురంగబలం ఉన్న రాజు కూడా ఏ ఒక్క వ్యసనం అధికంగా ఉన్నా నశిస్తాడు; పద్దెనిమిదీ ఉంటే నశించకుండా ఉంటాడా?

'బాలానందిని' అను సోమదేవ నీతిసూత్రాంధ్ర వ్యాఖ్యలో
వ్యసనసముద్దేశం సమాప్తం

## 17. స్వామి సముద్దేశః

1. ధార్మికః కులాచారాభిజనవిశుద్ధః ప్రతాపవాన్ నయానుగతవృత్తిశ్చ స్వామీ.

అ. ధార్మికుడు, కులంచేత, ఆచారంచేత, బంధువర్గంచేత పరిశుద్ధుడు (అనగా పరిశుద్ధమైన కులము, ఆచారమూ, బంధుజనమూ కలవాడు), ప్రతాపవంతుడు, నీతిని అనుసరించి ప్రవర్తించేవాడు ప్రభువు. అనగా ఇలాంటివాడే ప్రభువుగా ఉండడానికి తగినవాడు.

2. కోపప్రసాదయోః స్వతన్త్రతా, ఆత్మాతిశయవర్ధనం వా యస్యాస్తి న స్వామీ.

అ. కోపం వచ్చినప్పుడు, అనుగ్రహం కలిగినప్పుడూ స్వతంత్రంగా నిగ్రహానుగ్రహాలు చేయగల సామర్థ్యము, తనకు అభివృద్ధి చేకూర్చుకొనే శక్తి ఉన్నవాడే ప్రభువు, (రాజు).

3. స్వామిమూలాః సర్వాః ప్రకృతయో భవన్తి అభిప్రేతప్రయోజనాః, నాస్వామికాః.

అ. ప్రకృతు లందరికీ మూలం స్వామి; అతనివల్లనే వాళ్ళ ప్రయోజనాలు సిద్ధిస్తాయి. స్వామి లేకపోతే సిద్ధించవు.

4. అస్వామికాః ప్రకృతయః సమృద్ధా అపి నిస్తరితుం న శక్నువన్తి.

అ. స్వామి లేని ప్రకృతులు ఎంత సమృద్ధి కలవారైనా గట్టు చేరలేరు. కర్తవ్యాలు సాధించలేరు.

5. అమూలేషు తరుతలేషు కిం కుర్యాత్పురుషప్రయత్నః?

అ. చెట్ల మొదళ్ళే లేనప్పుడు వాటి విషయంలో ఎంత పురుషప్రయత్నం చేస్తే మాత్రం ఏమి ఉపయోగిస్తుంది?

6. అసత్యవాదినో వినశ్యన్తి సర్వే గుణాః.

అ. అబద్ధాలాడేవాడి గుణా లన్నీ నశిస్తాయి.

7. వఞ్చకేషు న పరిజనో, న ధనం, నాపి చిరమాయుః.

అ. మోసగాళ్ళదగ్గర ఎవరూ పరిజనం ఉండరు; ధనం ఉండదు; వాళ్ళు చిరకాలం జీవించరు కూడా.

8. స ప్రియో లోకానాం యో దదాత్యర్థమ్.

అ. ధనం ఇచ్చేవాడు లోకులకు ఇష్టుడౌతాడు.

9. స దాతా మహాన్ యస్య నాస్తి ప్రత్యాశోపహతం చేతః.

అ. ఎవని మనస్సు ప్రత్యాశచేత (తిరిగి ఉపకారం పొందాలనే ఆశచేత) ఉపహతం కాదో (చెడ్డగా ఉండదో) అతడే గొప్ప దాత.

10. ఇయముచ్చధియామలౌకికీ
మహతీ కాపి కఠోరచిత్తతా,
ఉపకృత్య భవన్తి నిఃస్పృహాః
పరతః ప్రత్యుపకారభీరవశ్చ.

అ. ఉన్నతాశయం కలవారిలో అలౌకికమైన (అసాధారణమైన) ఈ కఠోర చిత్తత్వం (కఠినమైన చిత్తం) ఉంటుంది. ఎలాంటి దనగా వాళ్ళు ఇతరులకు ఉపకారం చేసి ఏమీ ఆశించకుండా ఉంటారు. అంతేకాదు, వాళ్ళెక్కడ తమకి ప్రత్యుపకారం చేస్తారో అని భయపడుతూ ఉంటారు.

11. ప్రత్యుపకర్తురుపకారః సవృద్ధికోఽర్థన్యాస ఇవ.

అ. ప్రత్యుపకారం చేసేవాడికి (ప్రత్యుపకారం పొందాలనే కోరికతో) చేసే ఉపకారం వడ్డీతో తిరిగి తీసుకోవడం కోసం ధనం న్యాసం (డిపోజిట్) చేయడం వంటిది.

12. తజ్జన్మాన్తరేషు న కేషామృణం, యేషామప్రత్యుపకారి పరార్థానుభవనమ్.

అ. ప్రత్యుపకారం చెయ్యకుండా ఇతరుల ధనాన్ని అనుభవించడం ఎవరికి జన్మాంతరంలో తీర్చవలసిన ఋణం కాదు?

13. కిం తయా గవా యా న క్షరతి క్షీరమ్, న గర్భిణీ వా?

అ. పాలు ఇవ్వని లేదా చూడుకట్టని ఆవు ఉండి ఏం ప్రయోజనం?

14. కిం తేన స్వామిప్రసాదేన? యో న పూరయత్యాశామ్?

అ. ఆశ తీర్చని ప్రభువు అనుగ్రహిస్తే మాత్రం ఏమి ప్రయోజనం?

15. క్షుద్రపరిషత్కః సర్పవానాశ్రయ ఇవ న కస్యాపి సేవ్యః.

అ. నీచమైన పరిషత్తు ఉన్నవాణ్ణి సర్పాలు ఉన్న ప్రదేశాన్ని వలె ఎవరూ సేవించరు. (అట్టివాడి దగ్గరికి ఎవరూ చేరరు).

16. అకృతజ్ఞస్య వ్యసనేషు న సన్తి సహాయాః.

అ. కృతజ్ఞత లేనివానికి కష్టాలు వచ్చినప్పుడు సహాయం చేసేవాళ్లు ఉండరు.

17. అవిశేషజ్ఞః శిష్టైర్నాశ్రీయతే.

అ. విశేషం గుర్తించలేనివాడి దగ్గరకు శిష్టులు చేరరు.

18. ఆత్మంభరిః కలత్రేణాపి త్యజ్యతే.

అ. తన బాగు మాత్రమే చూచుకొనేవాణ్ణి భార్య కూడా విడిచిపెట్టి వేస్తుంది.

19. అనుత్సాహః సర్వవ్యసనానామ్ ఆగమనద్వారమ్.

అ. ఉత్సాహం లేకపోవడం అన్ని విధాల కష్టాలూ వచ్చే ద్వారం.

20. శౌర్యమ్, అమర్షః, శీఘ్రకారిత్వం, తత్కర్మప్రవీణత్వమి త్యుత్సాహగుణాః.

అ. శౌర్యము, పట్టుదల, శీఘ్రంగా పనులు చెయ్యడం, ఆ పనిలో నేర్పు, అనేవి ఉత్సాహానికి లక్షణాలు.

21. అన్యాయప్రవృత్తేర్న చిరం సంపదః.

అ. అన్యాయంగా ప్రవర్తించేవాడి దగ్గర సంపదలు చాలా కాలం ఉండవు.

22. యత్కించనకారీ స్వైః పరైర్వా హన్యతే.

అ. ఏదో ఒకటి చేసివేసేవాణ్ణి (అనాలోచితంగా పనులు చేసేవాణ్ణి తనవాళ్ళో, ఇతరులో చంపివేస్తారు.

23. ఆజ్ఞాఫలమైశ్వర్యమ్.

అ. ఐశ్వర్యానికి ఫలం ఆజ్ఞ (ఇతరులను ఆజ్ఞాపించకలగడం.)

24. రాజాజ్ఞా హి సర్వేషామలఙ్ఘ్యః ప్రాకారః.

అ. రాజాజ్ఞ అందరికీ కూడా దాట శక్యంకాని ప్రాకారం.

25. ఆజ్ఞాభఙ్గకారిణం సుతమపి న సహేత.

అ. ఆజ్ఞాభంగం చేసినవాణ్ణి, కుమారుడే అయినా సహించకూడదు.

26. కస్తస్య చిత్రగతస్య చ రాజ్ఞో విశేషః యస్యాజ్ఞా నాస్తి?

అ. ఆజ్ఞ చెల్లని రాజుకి చిత్తరువులో రాజుకి తేడా ఏమిటి?

27. రాజాజ్ఞావరుద్ధస్య పునస్తదాజ్ఞాఽప్రతిపాదనే ఉత్తమః సాహస దణ్డః, సమ్బన్ధాభావే తద్దణ్డదాతుశ్చ.

అ. ఒక్క మారు రాజాజ్ఞ ఉల్లంఘించినందుకు శిక్ష విధింపబడిన వాడు మళ్ళీ ఆజ్ఞాభంగం చేస్తే వానికి ఉత్తమసాహసదండం విధించాలి. అయితే అలాంటి ఆజ్ఞోల్లంఘనం చేయకుండా ఒకనిని దండించిన అధికారికి కూడా ఉత్తమసాహసదండం విధించాలి. "సాహసదండం" "ఉత్తమ సాహసదండం" మొదలైనవి ప్రాచీనకాలంలో ఆ యా అపరాధాలకు శిక్ష విధించి వసూలు చేసే జరిమానా సొమ్మును పట్టి ఇచ్చిన పేర్లు. "సంబన్ధాభావే తద్దణ్డదాతుశ్చ" అను దాని అర్థం పైన చెప్పినదేనా అనేది ఆలోచించాలి.

28. పరమర్మస్పర్శకరమ్, అశ్రద్ధేయమ్, అసత్యమ్, అతిమాత్రం చ న భాషేత.

అ. ఇతరుల మర్మాలను స్పృశించే మాట (మనస్సు నొప్పించే మాట), నమ్మడానికి శక్యం కాని మాట, అసత్యమైన మాట పలకకూడదు. అతిగా కూడ మాటలాడకూడదు.

29. వేషమాచారం వానభిజానన్ న కమపి భజేత.

అ. వేషాన్ని. ఆచారాన్ని గుర్తించకుండగా క్రొత్తవాణ్ణి ఎవణ్ణీ సేవించ కూడదు.

30. ప్రభౌ వికారిణి కో నామ న వికురుతే.

అ. ప్రభువు వికృతంగా ప్రవర్తించినప్పుడు వికృతంగా ప్రవర్తించనివాడు ఎవడుంటాడు?

31. అధర్మపరే రాజ్ఞి కో నామ నాధర్మపరః.

అ. రాజు అధర్మపరుడైనప్పుడు ఎవడు అధర్మపరుడు కాకుండా ఉంటాడు?

32. రాజ్ఞావజ్ఞాతః సర్వైరవజ్ఞాయతే.

అ. రాజు అవమానించిన వాణ్ణి అందరూ అవమానిస్తారు.

33. పూజితం హి పూజయన్తి లోకాః.

అ. రాజు గౌరవించినవాణ్ణి అందరూ గౌరవిస్తారు.

34. ప్రజాకార్యం స్వయమేవ పశ్యేత్.

అ. ప్రజల వ్యవహారాలు (రాజు) స్వయంగానే చూడాలి.

35. యథావసరమప్రతీహారసంగం ద్వారం కారయేత్.

అ. సమయానుసారంగా ద్వారాన్ని ప్రతీహారులు (లోపలికి వచ్చేవాళ్ళని అడ్డుకొనేవాళ్ళు) లేకుండా ఉంచాలి.

36. దుర్దర్శో హి రాజా కార్యాకార్యవిపర్యాసమాసన్నైః కార్యతే అతిసన్ధీయతే చ ద్విషద్భిః.

అ. సామాన్య ప్రజలు చూడడానికి పిలుకాని (అవకాశం ఇవ్వని) రాజును దగ్గరవాళ్ళు కార్యాకార్యాల విషయంలో వివరీతంగా నడిపిస్తారు. శత్రువులు మోసం చేస్తారు.

37. వైద్యేషు శ్రీమతాం వ్యాధివర్ధనాదివ న నియోగిషు భర్తృ వ్యసనాదపరోఽస్తి జీవనోపాయః.

అ. ఐశ్వర్యవంతుల రోగాలను పెంచడం తప్ప మరొక జీవనోపాయం వైద్యులకు ఎలా లేదో నియోగులకు (పరిపాలనాధికారులకు) ప్రభువుకి కష్టాలు కలిగించడం తప్ప మరొక జీవనోపాయం లేదు.

38. కార్యార్థినః పురుషాన్(న) లంచలుంచనిశాచరాణాం భూతబలిం కుర్యాత్.

అ. కార్యం కోరి (పనిమీద) వచ్చిన పురుషుల్ని ఒలిచి లంచాలు తీసి కొనే రాక్షసులకి భూతబలి కానివ్వకూడదు

39. లఞ్చో హి సర్వపాతకానామాగమనద్వారమ్.

అ. లంచం అన్ని పాపాలు వచ్చి చేరే ద్వారం.

40. మాతుః స్తనమపి లునన్తి లఞ్చోపజీవినః.

అ. లంచంతో బ్రతికేవాళ్ళు తల్లి స్తనాన్ని కూడా కొరికేస్తారు.

41. లఞ్చేన కార్యకారిభిః ఉరభ్రవత్ స్వామీ విక్రీయతే.

అ. లంచం తీసికొని పనులు చేసేవాళ్ళు గొఱ్ఱెను (కటికవానికి) అమ్మి వేసినట్లు ప్రభువును అమ్మేస్తారు.

42. లఞ్చేన రాజ్ఞోఽర్థలాభః ప్రాసాదవిధ్వంసనేన లోహకీలకలాభ ఇవ.

అ. రాజు లంచం ద్వారా ధనం సంపాదించడం మేడ పడగొట్టి ఇనప మేకు సంపాదించడం వంటిది.

43. రాజ్ఞో లఞ్చేన కార్యకరణం కస్య నామ కల్యాణమ్?

అ. రాజు లంచంతీసికొని పనిచేయడంవల్ల ఎవరికి క్షేమం కలుగుతుంది?

44. దేవతాపి యది చోరేషు మిలతి, కుతః ప్రజానాం కుశలమ్.

అ. దేవత కూడా దొంగలతో కలిస్తే ప్రజలకి ఇంక క్షేమం ఎక్కడిది?

45.. లఞ్చేనార్థోపార్జనం దర్శయన్ దేశం, కోశం, మిత్రం, తన్త్రం చ భక్షయతి.

అ. లంచం ద్వారా ధనసంపాదనానికి దారి చూపేవాడు దేశాన్ని, కోశాన్ని (ధనాగారం), మిత్రుల్నీ, పరిపాలనాతంత్రాన్నీ కూడా మింగేస్తాడు.

46. రాజ్ఞోఽన్యాయకరణం, సముద్రస్య మర్యాదాలఙ్ఘనమ్, ఆదిత్యస్య తిమిరపోషణం, మాతుః స్వాపత్యభక్షణమితి కలికాల విజృమ్భితాని.

అ. రాజు అన్యాయం చెయ్యడం, సముద్రం ఒడ్డు దాటడం, సూర్యుడు చీకటిని పోషించడం, తల్లి తన పిల్లలనే తినివేయడం-ఇవి కలికాలప్రభావాలు.

47. రాజా విశిష్టస్య కాలస్య కారణమ్.

అ. రాజు కాలాన్ని ఉత్తమంగా చేయగలడు.

48. న్యాయతః పాలకే రాజ్ఞి ప్రజానాం కామదుఘా భవన్తి సర్వా దిశః; కాలే చ వర్షతి మఘవాన్; సర్వాశ్చేతయః ప్రశామ్యన్తి; రాజానమనువర్తన్తే సర్వేఽపి లోకపాలాః; తేనేమం మధ్యమమప్యుత్తమం లోకపాలం రాజానమాహుః.

అ. రాజు ప్రజల్ని న్యాయంగా పరిపాలిస్తే అన్ని దిక్కులూ కోరికలు వర్షిస్తాయి. ఇంద్రుడు సకాలంలో వర్షాలు కురిపిస్తాడు. ఈతిబాధ లన్నీ శమిస్తాయి. లోకపాలకు లందరూ రాజును అనుసరించి ఉంటారు. అందుచేత రాజు మధ్యమలోకపాలుడే అయినా (మధ్యనున్న లోకాన్ని, భూలోకాన్ని పరిపాలించేవాడయినా, మధ్యముడే అయినా అని రెండర్థాలు) అతనిని ఉత్తమలోకపాలు డని అంటారు. అతివృష్టి, అనావృష్టి, మిడతలు, పక్షులు, వదంతులు, వ్యవసాయానికి విఘాతం-ఈ ఏడూ ఈతిబాధలు.

"అతివృష్టి రనావృష్టిః శలభా మూషకాః శుకాః,
ప్రవాదాః కృషిహింసా చేత్యేతాః సప్తేతయః స్మృతాః"

"అతివృష్టిరనావృష్టిర్మూషకాః శలభాః శుకాః,
ప్రత్యాసన్నాశ్చ రాజానః షడేతా ఈతయః స్మృతాః"

అనే మరొక పాఠం ప్రకారం పక్షులకు బదులు చిలకలు, చాలా దగ్గరగా ఉన్న రాజులు, లేదా ప్రభువులకు దగ్గరగా ఉండడం, అతివృష్ట్యాదులు నాలుగు. ఈ ఆరూ ఈతిబాధలు.

49. అవ్యసనేన క్షీణధనాన్ కుటుంబినః మూలధనప్రదానేన సంభావయేత్.

అ. ఏ దుర్వ్యసనాలు లేకపోయినా ధనం క్షీణించిన కుటుంబికులకు రాజు మూలధనం ఇచ్చి ఆదుకోవాలి.

50. రాజ్ఞో హి సముద్రావధిర్మహీ స్వకుటుంబమ్; కలత్రాణి తు వంశవర్ధనక్షేత్రాణి.

అ సముద్రంవరకు వ్యాపించి ఉన్న భూమి అంతా రాజుకి స్వకుటుంబమే కదా? ఇంక భార్యలా - వాళ్ళు వంశాన్ని వృద్ధి పొందించుకొనే క్షేత్రాలు.

51. అర్థినామ్ ఉపాయనమ్ అప్రతికుర్వాణో న గృహ్ణీయాత్.

అ ప్రతిక్రియ (ప్రత్యుపకారం) చేయ లేనివాడు (అనగా వాళ్ళ పనులు చేసిపెట్టలేనివాడు) కార్యార్థులనుండి బహుమతులు తీసికొనగూడదు.

52. ఆగన్తుకైః అసహనైశ్చ సహ నర్మ న కుర్యాత్.

అ. క్రొత్తవాళ్ళతోనూ, ఉడుకుబోతులతోను వేళాకోళా లాడకూడదు.

53. పూజ్యైః సహ నాధిరుహ్య వదేత్.

అ. పూజింపదగినవాళ్ళతో ఉన్నతాసనాదు లెక్కి మాటలాడకూడదు. లేదా పూజ్యులతో మాటలాడేటప్పుడు వాళ్ళను మించి - అనగా వాళ్ళ మాట కాదన్నట్లు, మాటలాడకూడదు.

54. భర్తుమశక్యమ్ అప్రయోజనం చ జనం నాఽఽశయా క్లేశయేత్.

అ. పోషించడానికి శక్యం కానివాళ్ళనీ, ఏ ప్రయోజనము లేనివాళ్ళనీ (ఎందుకూ ఉపయోగించనివాళ్ళనీ) ఏ వేవో ఆశలు చూపి, చేరదీసి, బాధపెట్ట కూడదు.

55. పురుషో హి న పురుషస్య దాసః, కిం తు విత్తస్య.

అ. మనిషి మనిషికి దాసుడు కాడు; ధనానికి దాసుడు.

56. కో నామ ధనహీనో న లఘుః.

అ. ధనం లేనివాడు ఎవడు తేలిక అయిపోడు?

57. సర్వధనేషు విద్యైవ ధనం ప్రధానం, అనపహార్యత్వాత్, సహానుయాయిత్వాచ్చ.

అ. అన్ని ధనాలలోకీ విద్యయే ప్రధానమైన ధనం; ఎందుచేతననగా, దానిని ఎవరూ హరించలేరు; ఎక్కడికి వెళ్ళినా, (పరలోకానికి వెళ్ళినా) కూడా వస్తుంది.

58. సరిత్ సముద్రమివ నీచముపగతాపి విద్యా దుర్దర్శమపి రాజానం సంగమయతి; ఫలం తు భాగ్యానాం వ్యాపారః.

అ. నీచుణ్ణి పొందిన (నీచుని) విద్య కూడా, నది సముద్రానికి వెళ్ళినట్లు, చూడడానికి శక్యం కాని రాజుదగ్గరికి తీసికొనివెడుతుంది. అయితే, ఫలం అదృష్టంమీద ఆధారపడి ఉంటుంది.

59. సా ఖలు విద్యా విదుషాం కామధేనుః యతో భవతి సమస్త జగతః స్థితిజ్ఞానమ్.

అ. సమస్తజగత్తు స్థితిని తెలిపే విద్య విద్వాంసులకు కామధేనువు.

60. లోకవ్యవహారజ్ఞో హి సర్వజ్ఞః, అన్యస్తు ప్రాజ్ఞోఽప్యవజ్ఞాయత ఏవ.

అ. లోకవ్యవహారం తెలిసినవాడే సర్వజ్ఞుడు అలా కానివాడు ఎంత బుద్ధిమంతుడైనా అవమానించబడతాడు.

61. తే ఖలు ప్రజ్ఞాపారమితాః పురుషాః, యే కుర్వన్తి పరేషాం ప్రతిబోధనమ్.

అ. ఇతరులకు చక్కగా బోధించేవాళ్ళే ప్రజ్ఞాపారమితులైన (బుద్ధి చివరి అంచులు చూచిన) పురుషులు. ('ప్రజ్ఞాపారమిత' అనే పదం బౌద్ధవాఙ్మయంలో ఎక్కువగా ప్రయోగించబడుతుంది.)

62. అనుపయోగినా మహతాపి కిం జలధిజలేన.

ఇతి స్వామి సముద్దేశః

అ. ఉపయోగించని సముద్రజలం ఎంత ఉంటే మాత్రం ఏం ప్రయోజనం?

'బాలానందిని' అనే సోమదేవనీతి సూత్రాంధ్ర వ్యాఖ్యలో
స్వామి సముద్దేశం సమాప్తం.

## 18. అమాత్య సముద్దేశః

1. చతురఙ్గయుతోఽపి నానమాత్యో రాజాస్తి, కిం పునరన్యః?

అ. చతురంగబలం ఉన్నవాడైనా అమాత్యులు లేని రాజు రాజు కాడు. చతురంగబలం కూడా లేకపోతే చెప్పాలా?

2. నైకస్య కార్యసిద్ధిరస్తి, నైకం చక్రం పరిభ్రమతి.

అ. ఒంటరిగా ఏ పనీ చెయ్యలేడు. ఒక్క చక్రం తిరగదు కదా?

3. కిమవాతః సేన్ధనోఽపి వహ్నిర్జ్వలతి?

అ. కట్టెలు ఉన్నా గాలి లేకపోతే అగ్ని మండదు కదా?

4. స్వకర్మోత్కర్షాపకర్షాభ్యాం దానమానాభ్యాం రాజ్ఞా సహ సంపత్తివిపత్తీ యేషాం తేఽమాత్యాః.

అ. తమ పనుల ఉత్కర్షచేత, అపకర్ష (లోపం)చేతా, దానంచేతా, మానంచేతా, సంపదనైనా ఆపదనైనా రాజుతో సమంగా పంచుకునేవాళ్ళే అమాత్యులు.

5. ఆయో, వ్యయః, స్వామిరక్షా, తన్త్రపోషణం చామాత్యానామధికారః.

అ. ఆయము, వ్యయము, ప్రభువును రక్షించడము, రాజ్యతంత్రాన్ని పోషించడమూ - ఇవి అమాత్యుల అధికారాలు.

6. ఆయవ్యయముఖయోర్మునికమణ్డలురేవోదాహరణమ్.

అ. ఆయవ్యయాల ముఖాలు ఎలా ఉండాలో తెలుసుకోవాలంటే మునుల కమండలమే ఉదాహరణం. కమండలంలో నీళ్ళు పోసే ముఖం విశాలంగా ఉంటుంది. నీళ్ళు బైటకు వచ్చే నాళం ముఖం సన్నంగా ఉంటుంది. అదే విధంగా ఆయముఖం పెద్దదిగాను, వ్యయముఖం చిన్నదిగాను ఉండాలి.

7. ఆయః ద్రవ్యస్య ఉత్పత్తిముఖమ్.

అ. ఏ ద్రవ్యమైనా పుట్టాలంటే దానికి ముఖం ఆయం.

8. యథాస్వామిశాసనమ్ అర్థస్య వినియోగః వ్యయః.

అ. ప్రభువు శాసనం ప్రకారం ధనం వినియోగించడం వ్యయం.

9. ఆయమనాలోచ్య వ్యయమానః వైశ్రవణోఽపి అవశ్యం శ్రమణాయతే.

అ. రాబడిని గూర్చి ఆలోచించకుండగా వ్యయం చేస్తే వైశ్రవణుడు (కుబేరుడు) కూడా శ్రమణుడు (దరిద్రుడైన భిక్షువు) అవుతాడు.

10. రాజ్ఞః శరీరం, వాక్యం, ధర్మః, కలత్రమ్, అపత్యాని చ స్వామిశబ్దార్థాః.

అ. రాజుగారి శరీరం, మాటా, ధర్మమూ, భార్యా, సంతానమూ - వీటి కన్నింటికీ "స్వామి" అని పేరు.

11. తన్త్రం చతురఙ్గబలమ్.

అ. 'తంత్రం' అనగా చతురంగసైన్యం.

12. తీక్ష్ణమ్, అశుచిం, వ్యసనినమ్, అశుద్ధాభిజనం, బలవత్పక్షమ్, అశక్యప్రత్యావర్తనమ్, అతివ్యయశీలమ్, అల్పాయమ్, అన్యదేశాయాతమ్, అతిచిక్కణం చామాత్యం న కుర్వీత.

అ. తీక్ష్ణంగా (క్రూరంగా) ప్రవర్తించేవాణ్ణి, వ్యవహారాదులలో పరిశుద్ధి లేనివాణ్ణి, దుర్వ్యసనాలకి లోనైనవాణ్ణి, పరిశుద్ధులు కాని బంధుజనం కలవాణ్ణి, మంచి బలం గల పక్షం ఉన్నవాణ్ణి, క్రిందికి దింపివేయడానికి (to dismiss or revert) శక్యం కానివాణ్ణి, ఎక్కువ వ్యయం చేసే స్వభావం కలవాణ్ణి, అల్పమైన ఆయం కలవాణ్ణి, ఇతరదేశంనుంచి వచ్చినవాణ్ణి, చాలా జిడ్డు స్వభావం కలవాణ్ణి (జిడ్డుమనిషిని) అమాత్యునిగా చేయకూడదు.

13. తీక్ష్ణోఽభియుక్తః స్వయం మ్రియతే, మారయతి వా స్వామినమ్.

అ. తీక్ష్ణమైనవాడు ఎవరైనా ఎదిరించినప్పుడు లేదా ఆతనిమీద ఏదైనా చర్య తీసికొన్నప్పుడు, తానైనా మరణిస్తాడు, స్వామినైనా చంపుతాడు.

14. బలవత్పక్షః నియోగ్యభియుక్తః జలకల్లోల ఇవ మత్తగజ ఇవ చ సమూలం నృపాఙ్ఘ్రిమున్మూలయతి.

అ. బలమైన పక్షం ఉన్న అధికారి, తనమీద (రాజు) చర్య తీసికొన్నప్పుడు నీటి తరంగం వలె, లేదా మదించిన ఏనుగు వలె రాజు పాదాలు సమూలంగా పెకిలించి వేస్తాడు.

15. అల్పాయో మహావ్యయః రాజార్థం భక్షయతి.

అ. ఆదాయం తక్కువా, వ్యయం ఎక్కువా ఉన్నవాడు రాజు ధనాన్ని భక్షించివేస్తాడు.

16. అల్పాయముఖః మహాజనం పరిగ్రహం చ పీడయతి.

అ. ఆదాయానికి ముఖం (ద్వారం) అల్పంగా ఉన్నవాడు జనసామాన్యాన్ని, పరివారాన్ని పీడిస్తాడు ('మహాజనం' అనగా జనసామాన్యం. **General Public.**)

17. నాగన్తుకేష్వర్థాధికారః ప్రాణాధికారో వాస్తి, యతస్తే స్థిత్వాపి గన్తారోఽపకర్తారో వా.

అ. బైటనుండి వచ్చినవాళ్ళకి ధనాధికారంగాని, ప్రాణాధికారం (అంగరక్షకాదిరూపంలో ఉండే అధికారం గాని) ఇవ్వకూడదు; ఎందుచేత ననగా, వాళ్లు కొంతకాలం ఉన్నా తమ దేశాలకి వెళ్ళిపోయేవాళ్ళే; లేదా అపకారం చేస్తారు.

18. స్వదేశజేష్వర్థః కూపే పతిత ఇవ కాలాన్తరేఽపి లబ్ధుం శక్యతే.

అ. స్వదేశీయులకు సంబంధించిన అర్థం (కార్యం, వస్తువు అని రెండర్థాలు) నూతిలో పడిన అర్థం వలె కాలాంతరంలోనైనా (కొంతకాలం తరవాతనైనా) పొందడానికి వీలు అవుతుంది.

19. అతిచిక్కణాదర్థలాభః పాషాణాద్వల్కలోత్పాటనమివ.

అ. జిడ్డుమనిషి ద్వారా పని చేయించుకోవడం బండరాయినుంచి నారఒలవడం వంటిది.

20. సోఽధికారీ, యః సతి దోషే స్వామినా సుఖేన నిగ్రహీతుమ్ అనుగ్రహీతుం వా శక్యతే.

అ. ఏదైనా తప్పు చేసినప్పుడు ప్రభువు ఎవర్నైతే సులభంగా నిగ్రహించడానికి గాని, అనుగ్రహించడానికి గాని శక్యం అవుతుందో అటువంటి వానినే అధికారిగా చెయ్యాలి. (ఏకుగా వచ్చి మేకై కూర్చొనేవాణ్ణి చేయకూడదు.)

21. బ్రాహ్మణః క్షత్రియః సమ్బన్ధీ వా నాధికారీ కర్తవ్యః.

అ. బ్రాహ్మణుణ్ణి గాని, క్షత్రియుణ్ణి గాని, సంబంధిని గాని అధికారిగా చేయగూడదు.

22. బ్రాహ్మణః జాతిబలాత్ సిద్ధమప్యర్థం కృచ్ఛ్రేణ ప్రయచ్ఛతి, న ప్రయచ్ఛతి వా.

అ. బ్రాహ్మణుడు సిద్ధంగా ఉన్న ధనాన్ని కూడా, జాతిబలాన్ని (తనను శిక్షించరు కదా అనే ధీమాతో) అతికష్టం మీద ఇస్తాడు; అసలు ఇవ్వకపోవచ్చును కూడా.

23. క్షత్రియః అభియుక్తః ఖడ్గం దర్శయతి.

అ అభియోగం చేస్తే క్షత్రియుడు కత్తి చూపిస్తాడు. (అభియోగం అనగా కేసు. ఎవని మీద కేసు పెడతారో అతడు "అభియుక్తుడు.")

24. జ్ఞాతిభావేనాతిక్రమ్య సామవాయికాన్ సర్వమప్యర్థం గ్రసతే బన్ధుః సమ్బన్ధీ.

అ. సంబంధం ఉన్న బంధువు జ్ఞాతి అవడంచేత మిగిలిన అధికారుల నందరినీ కాదని తానే ధనం అంతా మింగివేస్తాడు.

25. సమ్బన్ధః త్రివిధః శ్రౌతో మౌఖో యౌనశ్చేతి.

అ. శ్రౌతము, మౌఖము, యౌనము అని సంబంధం మూడు విధాలు.

26. సహదీక్షితః, సహాధ్యాయీ, పితృపైతామహాధ్యాగతో వా శ్రౌతః.

అ. తనతో కలిసి విద్యాదీక్షాదులు పొందినవాడు, సహాధ్యాయి, పితృపితామహులనుంచీ తెలిసినవాడు శ్రౌతుడు. అలాంటి సంబంధం శ్రౌతసంబంధం.

27. ముఖేన పరిజ్ఞాతో మౌఖః.

అ. ముఖంచేత తెలియబడ్డవాడు (ముఖపరిచయం ఉన్నవాడు) మౌఖుడు.

28. సయోనేర్జాతః యౌనః.

అ సమానగర్భంనుండి పుట్టినవాడు యౌనుడు.

29. వాచికే సమ్బన్ధే న సమ్బన్ధాన్తరానువృత్తిః.

అ. వాచికమైన సంబంధం ఉన్నప్పుడు ఇతరసంబంధాలు అనువర్తించవు. శ్రౌతాదిసంబంధాలలో ఏదైనా ఒక సంబంధం ఉన్నా కర్తవ్యాకర్తవ్యాలను గూర్చి స్పష్టంగా మాటలాడుకొన్న తరవాత ఆ సంబంధాలు తెగిపోయినట్లే.

30. న తం కమప్యధికారిణం కుర్యాత్ సత్యపరాధే యముపహత్యాను శయీత.

అ. ఏదైనా తప్పు చేస్తే ఎవనిని శిక్షించి పశ్చాత్తాపపడవలసివస్తుందో అలాంటివాణ్ణి అధికారంలో నియోగించకూడదు.

31. మాన్యధికారీ రాజాజ్ఞామవజ్ఞాయ నిరవగ్రహశ్చరతి.

అ. దురభిమానం ఉన్న అధికారి రాజాజ్ఞను లెక్కచేయకుండా, అడ్డు లేకుండా ప్రవర్తిస్తాడు.

32. చిరసేవకో నియోగీ నాపరాధేఽప్యాశఙ్కతే.

అ. చాల కాలంనుంచి సేవలో ఉన్న అధికారి తప్పుచేసి కూడా జంకడు.

33. ఉపకర్తాధికారీ ఉపకారమేవ ధ్వజీకృత్య సర్వమేవార్థమవలుమ్పతి.

అ. ఉపకారం చేసిన అధికారి ఆ ఉపకారాన్నే ధ్వజంగా చేసికొని (ప్రభువుకు ఇలా ఉపకారం చేశాను, అలా ఉపకారం చేశాను అని చాటుకుంటూ) మొత్తం ధనం కాజేస్తాడు.

34. సహపాంసుక్రీడితోఽమాత్యః అతిపరిచయాత్ స్వయమేవ రాజాయతే.

అ. కూడా బూడిదలో ఆడుకొన్న (బాల్యస్నేహితుడైన) అమాత్యుడు అతిపరిచయంవల్ల తానే రాజు అన్నట్లు ప్రవర్తిస్తాడు

35. అన్తర్దుష్టో నియుక్తః సర్వమనర్థముత్పాదయతి, శకునిశకటాలౌ అత్ర దృష్టాన్తౌ.

అ. లోలోపల దుష్టమైన ఆలోచన లున్న అధికారి అన్ని విధాలైన అనర్థాలు కలిగిస్తాడు. ఈ విషయంలో శకుని, శకటాలుడు దృష్టాంతం.

కౌరవపాండవుల మధ్య జరిగిన జూదానికి శకుని కారణం. నందుని మంత్రి శకటాలుడు. వానిని రాజు కొన్నాళ్ళు గుహలో నిర్బంధించి తరువాత మళ్ళీ వాని పదవి వానికి ఇచ్చాడు. అతడు చివరికి చాణక్యునిచేత నందుణ్ణి చంపించాడు.

36. సోఽధికారీ చిరం నన్దతి, యః స్వామిప్రసాదేన నోత్సేకం ప్రాప్నోతి.

అ. ప్రభువు అనుగ్రహం లభించినందుకు గర్వించని అధికారి చిరకాలం జీవిస్తాడు (సుఖంగా ఉంటాడు).

37 సుహృది నియోగిని భవత్యవశ్యం ధనమిత్రత్వయోర్నాశః.

అ. స్నేహితుణ్ణి అధికారిగా చేస్తే ధనమూ, స్నేహమూ కూడా తప్పక నశిస్తాయి.

38. మూర్ఖస్య నియోగే భర్తుర్ధర్మార్థయశసాం సందేహః; నిశ్చితౌ చ అనర్థనరకపాతౌ.

అ. మూర్ఖుణ్ణి అధికారిగా నియమిస్తే ప్రభువు ధర్మార్థకీర్తులు ఎలా పరిణమిస్తాయో సందేహమే. అనర్థమూ, నరకపాతమూ మాత్రం కలిగి తీరుతాయి.

39. కిం తేన పరిచ్ఛదేన యత్ర ఆత్మక్లేశేనైవ సుఖం స్వామినః.

అ. ప్రభువు తాను శ్రమపడితే తప్ప సుఖం లేనప్పుడు పరివారం ఉండి ఏమి ప్రయోజనం?

40. కా నామ నిర్వృతిః స్వయమూఢతృణభోజినో గజస్య?

అ. తానే మోసికొని తెచ్చిన తృణాన్ని తినే ఏనుగుకు సుఖం ఏమి ఉంటుంది?

41. ఆశ్వసధర్మాణః పురుషాః కర్మసు నియుక్తాః వికుర్వతే; తస్మా
దహన్యహని తాన్ పరీక్షేత.

అ. గుఱ్ఱాలవంటి స్వభావం గల మనుష్యులు పనులలో నియుక్తు లైనప్పుడు వికృతంగా ప్రవర్తిస్తారు. అందుచేత వాళ్ళని ప్రతిరోజూ పరీక్షిస్తూ ఉండాలి

42. మార్జారేషు దుగ్ధరక్షణమివ నియోగిషు విశ్వాసకరణమ్.

అ. నియోగుల్ని (అధికారుల్ని) నమ్మడం అనేది పిల్లులకు పాలు రక్షించే పని అప్పగించడం వంటిది. 

43. "బుద్ధిశ్చిత్తవికారిణీ నియోగినామ్" ఇతి సిద్ధానామాదేశః.

అ. "ఐశ్వర్యం నియోగుల (అధికారుల) మనస్సుకు వికారం కలగ చేస్తుంది" అని సిద్ధుల ఆదేశం (ఉపదేశం). 

44. సర్వోఽప్యతిసమృద్ధో భవత్యాయత్యామసాధ్యః, కృచ్ఛ్ర
సాధ్యః, స్వామిపదాభిలాషీ వా. 

అ. చాలా ఐశ్వరం కూడబెట్టిన ప్రతి అధికారీ భవిష్యత్తులో అదుపులో ఉంచడానికి శక్యం కానివాడు అవుతాడు; లేదా అతికష్టంమీద శక్యం అవుతాడు; లేదా ప్రభువు స్థానాన్నే పొందాలని కోరుతాడు. 

45. భక్షణమ్, ఉపేక్షణమ్, ప్రజ్ఞాహీనత్వమ్, ఉపరోధః, ప్రాప్తార్థా
ప్రవేశః, ద్రవ్యవినిమయశ్చేత్యమాత్యదోషాః.

అ. అందినది తినెయ్యడం, కర్తవ్యాన్ని ఉపేక్షించడం, బుద్ధిశూన్యత్వం, అడ్డుకోవడం, వసూలు చేసిన ధనం కోశానికి జమ కట్టకపోవడం, వస్తువులు మార్చేయడం - ఇవి అమాత్యులు చేసే దోషాలు.

46. బహుముఖ్యమ్ అనిత్యం చ కరణం స్థాపయేత్.

అ. కరణాన్ని చాలా ముఖ్యంగా (ప్రాధాన్యం ఎక్కువగా ఇచ్చి) స్థాపించాలి; అనిత్యంగా స్థాపించాలి. (పెర్మనెంట్ చేయకూడదు )

47. స్త్రీష్వర్థేషు చ మనాగప్యధికారే నాన్యజాతిసంబన్ధః కార్యః.

అ. స్త్రీల విషయంలోను, ధనం విషయంలోను అధికారంలో ఇతరజాతి వానికి ఏమాత్రం సంబంధం ఉండకూడదు.

48. స్వపరదేశజత్వావనపేక్ష్య అనిత్యశ్చాధికారః.

అ. స్వదేశీయుడైనా, పరదేశీయుడైనా ప్రతివాడి అధికారం అనిత్యంగానే ఉండాలి. ఎవరికీ నిత్యమైన అధికారం ఇవ్వకూడదు.

49. ఆదాయక నిబన్ధక ప్రతికణ్టక నీవీగ్రాహక రాజాధ్యక్షాః కరణాని.

అ. ("నీవీగ్రాహక కరాధ్యక్షాః" అని పాఠం అయి ఉంటుంది.) ఆదాయకులు (ఆ యా ధనాలు వసూలు చేసేవాళ్ళు), వ్రాతలు నిర్ధరించేవాళ్ళు (Registrars), ప్రతికంటకులు(?), నీవిని గ్రహించేవాళ్ళు, పన్నుల శాఖల అధ్యక్షులు "కరణాలు."

50. ఆయవ్యయవిశుద్ధం ద్రవ్యం నీవీ.

అ. ఆయవ్యయాలు పోగా మిగిలిన ద్రవ్యం నీవి.

51. నీవీనిబన్ధపుస్తకగ్రహణపూర్వకం ఆయవ్యయౌ విశోధయేత్.

అ. నీవి వ్రాసిన పుస్తకాలను రప్పించుకొని ఆయవ్యయాల శోధనం చేయించాలి (సరిగా పరిశీలించాలి).

52. ఆయవ్యయవిప్రతిపత్తౌ కుశలకరణకార్యపురుషేభ్యః తద్వినిశ్చయః.

అ. ఆయవ్యయాల విషయంలో తేడాలు వచ్చినపుడు ఆ పనిలో నేర్పు ఉన్న కరణాలను, కార్యపురుషులను సంప్రదించి నిశ్చయం చేసుకోవాలి.

53. నిత్యపరీక్షణం, కర్మవిపర్యయః, ప్రతిపత్తిదానం చ నియోగిష్వర్థగ్రహణోపాయాః.

అ. నిత్యమూ పరీక్షిస్తూ ఉండడము, పనులు మారుస్తూ ఉండడము (డిపార్ట్‌మెంట్ మార్చడము), పూర్తిగా బరువు మోపడం (Giving full responsibility) - ఇవి నియోగులనుండి పనులు తీసికొనే ఉపాయాలు.

54. నాపీడితా నియోగినః దుష్టవ్రణా ఇవ అన్తఃసారముద్వమన్తి

అ. చెడ్డ వ్రణాల వలె నియోగులు గట్టిగా పట్టి పిండితేనే కాని, లోపల ఉన్న సారాన్ని పైకి కక్కరు.

55. పునః పునరభియోగః నియోగిషు మహీపతీనాం వసుధారా.

అ. నియోగుల విషయంలో మాటిమాటికి అభియోగం (కేసు పెట్టడం), రాజులకు ధనప్రవాహం.

56. సకృన్నిష్పీడితం స్నానవస్త్రం కిం జహాతి స్నిగ్ధతామ్.

అ. స్నానంచేసిన బట్ట ఒక్కమాటు పీడించినంతమాత్రాన (పిండినంత మాత్రాన) పూర్తిగా తడి పోదుకదా?

57. దేశమపీడయన్ బుద్ధిపురుషకారాభ్యాం పూర్వనిబన్ధమధికం కుర్వన్ అర్థమానౌ లభేత.

అ. దేశాన్ని పీడించకుండగా, బుద్ధిబలమూ, పురుషకారమూ వినియోగిస్తూ పూర్వపు నియమాలను అధికం చేస్తూ ధనగౌరవాలను సంపాదించాలి.

58. యో యత్ర కర్మణి కుశలస్తం తత్ర నియోజయేత్.

అ. ఎవనికి ఏ పనిలో నేర్పు ఉంటుందో వానిని ఆ పనిలో నియమించాలి.

59. న ఖలు స్వామిప్రసాదః సేవకేషు కార్యనిబన్ధనే హేతుః, కిన్తు బుద్ధిపురుషకారావేవ.

అ. ప్రభువు అనుగ్రహం ఉన్నంత మాత్రంచేత సేవకుడు కార్యం సాధించలేడు; బుద్ధి, పురుషకారం - ఈ రెండూ ఉంటేనే సాధించగలుగుతాడు. లేదా "కార్యనిబన్ధనే" అనగా పని అప్పగించడానికి అని అర్థం. అనుగ్రహం కలిగినంతమాత్రాన వాని శక్తి పరీక్షించకుండా పని అప్పచెప్పకూడదు అని అర్థం.

60. శాస్త్రవిదప్యదృష్టకర్మా కర్మసు విషాదం గచ్ఛేత్.

అ. ఎంత శాస్త్రవేత్త అయినా పనిలో అనుభవం లేనివాడు పనులలో విషాదం పొందుతాడు (విఫలుడౌతాడు).

61. అనివేద్య భర్తుర్న కంచిదారమ్భం కుర్యాత్, అన్యత్రాపత్ప్రతీకారేభ్యః.

అ. ప్రభువుకు తెలియపరచకుండా ఏ పనీ చెయ్యకూడదు. ఆపదలకు ప్రతిక్రియ చేయడం విషయంలో మాత్రం తెలుపకపోయినా దోషం లేదు.

62. సహసోపచితార్థః మూలధనమాత్రేణావశేషితవ్యః.

అ. హఠాత్తుగా ధనం ఎక్కువ పెరిగిపోయిన అధికారినుండి మూలధనం మాత్రం ఉంచి మిగిలినది అంతా లాగికొనాలి.

63. నియోగిషు పరస్పరకలహః భూభుజాం నిధిః.

అ. అధికారులు పరస్పరం కలహించుకొంటే అది రాజులకు నిధి.

64. నియోగిషు లక్ష్మీః క్షితీశ్వరాణాం ద్వితీయః కోశః.

అ. నియోగులవద్ద ఉన్న ఐశ్వర్యం రాజులకు రెండవ ధనాగారమే (అవసరం వచ్చినపుడు లాగుకొనవచ్చు).

65. సర్వసంగ్రహేషు ధాన్యసంగ్రహో మహాన్, యన్నిబన్ధనం జీవితం సకలః ప్రయాసశ్చ.

అ. అన్ని సంగ్రహాలలోకి (నిలువలు) ధాన్యసంగ్రహం గొప్పది. జీవితం దానిమీద ఆధారపడి ఉంది; పడుతూన్న పాట్లన్నీ దానికోసమే.

66. న ఖలు ముఖే నిక్షిప్తం మహదపి ద్రవ్యం ప్రాణత్రాణాయ, యథా ధాన్యమ్.

అ. ఎంత డబ్బు తీసికొనివచ్చి నోట్లో పెట్టినా అది ధాన్యంవలె ప్రాణాలు రక్షించదు.

67. ధాన్యేషు చిరజీవినః కోద్రవాః.

అ. ధాన్యాలలో కొఱ్ఱలు చిరంజీవులు (చాలాకాలం నిలవఉంటాయి).

68. అనవం నవేన వర్ధయితవ్యం వ్యయితవ్యం చ.

అ. పాతదాన్ని కొత్తది చేర్చి వృద్ధిపొందిస్తూ దాన్ని ఖర్చు పెట్టాలి.

69. లవణసంగ్రహః సర్వరసానాముత్తమః.

అన్ని రసాలలోకి లవణసంగ్రహం ఉత్తమం.

70. సర్వరసమయ్యన్నమలవణం గోమయాయతే.

ఇత్యమాత్య సముద్దేశః

అ. అన్ని రసాలూ ఉన్నా లవణం లేని అన్నం ఆవు పేడ వంటిది

'బాలానందిని' అను సోమదేవ నీతి సూత్రాంధ్ర వ్యాఖ్యలో

అమాత్యసముద్దేశం సమాప్తం.

## 19. జనపదసముద్దేశః

1. పశుధాన్యహిరణ్యసంపదా రాజతే, శోభతే ఇతి రాష్ట్రమ్.

అ. (రాబోయే ఎనిమిది సూత్రాలలో కొన్ని పదాలకి వ్యుత్పత్తి చూప బడుచున్నది)

"రాజతే ఇతి రాష్ట్రమ్'' అని రాష్ట్రపదానికి విగ్రహవాక్యం. పశు సంపదతోను, ధాన్యసంపదతోను, సువర్ణసంపదతోను ప్రకాశించేది "రాష్ట్రం'' అని ఈ పదానికి అర్థం. ఇట్లే మిగిలిన పదాలకి.

2. భర్తుర్దణ్డకోశవృద్ధిం దిశతి, దదాతీతి దేశః.

అ. ''దిశతీతి దేశః'' అని విగ్రహవాక్యం. ప్రభువుకు కావలసిన దండ వృద్ధిని (పాలనాసామర్థ్యాన్ని), కోశ (ధన) వృద్ధినీ ఇచ్చేది ''దేశం.''

3. వివిధవస్తుప్రదానేన స్వామినః సద్మని గజాన్ వాజినశ్చ విషిణోతి బధ్నాతీతి విషయః.

అ. ''విషిణోతీతి విషయః''అని విగ్రహవాక్యం. అనేక విధాలైన వస్తువులను ఇచ్చి ప్రభువు గృహంలో ఏనుగుల్ని, గుఱ్ఱాల్ని బంధిస్తుంది కాబట్టి ''విషయం''.

4. సర్వకామదుఘత్వేన నరపతిహృదయం మణ్డయతి భూషయతీతి మణ్డలమ్.

అ. ''మణ్డయతీతి మణ్డలమ్'' అని విగ్రహవాక్యం. అన్ని కోరికలను తీర్చడంచేత రాజు హృదయాన్ని అలంకరిస్తుంది (సంతోషపెడుతుంది) కాబట్టి ''మండలం ''

5. జనస్య వర్ణాశ్రమలక్షణస్య ద్రవ్యోత్పత్తేర్వా పదం స్థానమితి జనపదః.

అ. వర్ణాశ్రమరూపమైన జనానికి లేదా ద్రవ్యముల ఉత్పత్తికి స్థానం కాబట్టి "జనపదం''. జనానాం పదం ''జనపదం'' అని విగ్రహవాక్యం.

6. నిజపతేరుత్కర్షజనకత్వేన శత్రుహృదయం దారయతి భినత్తి ఇతి దరత్.

అ. "దారయతీతి దరత్" అని విగ్రహవాక్యం. తన ప్రభువునకు ఉత్కర్షను కలిగించడం ద్వారా శత్రువుల హృదయాన్ని చీల్చివేసేది "దరత్."

7. ఆత్మసమృద్ధ్యా స్వామినం సర్వవ్యసనేభ్యః నిగమయతి నిర్గమయతీతి నిగమః.

అ. "నిగమయతీతి నిగమః" అని విగ్రహవాక్యం. తన సమృద్ధిచేత ప్రభువును సకలవ్యసనాలనుండీ (ఆపదలనుండీ) బైటకు తెస్తుంది కాబట్టి "నిగమం". వర్తకం జరిగే చోటు (Market).

8. అన్యోన్యరక్షకః, ఖన్యాకరద్రవ్యనాగవనవాన్, అనతివృద్ధానతిహీనగ్రామః, బహుసారవిచిత్రధాన్యపణ్యోత్పత్తిః, అదేవమాతృకః, పశుమనుష్యహితః, శ్రేణిశూద్రకర్షకప్రాయః - ఇతి జనపదగుణాః.

అ. జనపదంలో ఉన్న గ్రామాలు ఒకదానిని ఒకటి రక్షించుకోవాలి. ఆ జనపదంలో గనులు, గనులలో లభించే ద్రవ్యాలు, గజవనాలు ఉండాలి. దానిలోని గ్రామాలు చాలా పెద్దవిగా కాని, చాలా చిన్నవిగా కాని ఉండకూడదు. మంచి సారం గల విచిత్రాలైన ధాన్యాలు పండేది అయి ఉండాలి. పణ్యాల (అమ్మదగిన వస్తువుల) ఉత్పత్తి సమృద్ధిగా ఉండాలి. దేవమాతృకం (వర్షాలమీద ఆధారపడేది)గా ఉండకూడదు. పశువులకు, మనుష్యులకూ హితమైనదిగా ఉండాలి. జనపదంలో వర్తకుల సంఘాలు, శూద్రులు, వ్యవసాయదారులు అధికసంఖ్యలో ఉండాలి. ఇవి జనపదానికి ఉండవలసిన గుణాలు

9. విషతృణోదకోషర-పాషాణ - కణ్టక-గిరిగర్త - గహ్వరప్రాయభూమిః, భూరివర్షాజీవనః, వ్యాలలుబ్ధకమ్లేచ్ఛబహులః, స్వల్పసస్యోత్పత్తిః తరుఫలాభావః ఇతి దేశదోషాః.

అ. కొన్ని దేశాలలో భూమి విషపుగడ్డి, విషమయమైన నీళ్ళు, చవిటి నేల, రాళ్ళు, ముళ్ళు, కొండలోయలు, గుహలు - వీటితో నిండి ఉంటుంది. అధికంగా వర్షాలు కురిస్తేనే జీవనాధారం లభిస్తుంది. క్రూరమృగాలు (పాములు, దుష్టగజాలు మొదలైనవి), బోయవాళ్ళు, మ్లేచ్ఛులు అధికంగా ఉంటారు. సస్యాల ఉత్పత్తి (పంట) చాలా స్వల్పంగా ఉంటుంది. చెట్లు, పళ్ళు ఉండవు. ఇవి దేశానికి దోషాలు (ఇట్టి దేశం చెడ్డ దేశం).

10. తత్ర సదా దుర్భిక్షమేవ, యత్ర జలదజలేనైవ సస్యనిష్పత్తిః, అసుకృష్టభూమికశ్చారమ్భః.

అ. ఎక్కడైతే సస్యాలు మొలవడం మేఘజలంచేతనే (వర్షాల మీదనే ఆధారపడి) అవుతుందో, వ్యవసాయం బాగా దున్నని నేలమీదనే చేయవలసి ఉంటుందో అక్కడ ఎల్లప్పుడూ దుర్భిక్షమే.

11. క్షత్రియప్రాయా హి గ్రామాః స్వల్పాస్వపి బాధాసు ప్రతియుధ్యన్తే.

అ. క్షత్రియులు అధికంగా ఉన్న గ్రామాలు ఏ మాత్రం చిన్న బాధ కలిగినా తిరగబడతాయి.

12. మ్రియమాణోఽపి ద్విజలోకః న ఖలు సాన్త్వేన ప్రయచ్ఛతి సిద్ధమప్యర్థమ్.

ఆ. చావడానికి సిద్ధంగా ఉన్నా కూడా బ్రాహ్మణులు సిద్ధంగా ఉన్న (చేతికి వచ్చిన) ధనం కూడా మంచి మాటలకు ఇవ్వరు.

13. స్వభూమికం భూతపూర్వమభూతపూర్వం వా జనపదం స్వదేశాభిష్యన్దవమనాభ్యాం పరదేశోపవాహనేన వా వాసయేత్.

అ. పూర్వంనుంచీ ఉన్నదైనా, క్రొత్తదైనా తన భూమి గల జనపదాన్ని, తన దేశంలో అధికంగా ఉన్న జనాభాని తరలించడం ద్వారాగాని, ఇతరదేశం నుంచి జనాన్ని తీసికొనిరావడం ద్వారాగాని నెలకొల్పాలి. 'అభిష్యన్దవమనం' అనగా ఎక్కువగా ఉన్న జనాభా మరొక చోటికి తరలించడం. ఉపవాహనం అనగా రప్పించడం. ఇలా నెలకొల్పే జనపదం తన రాజ్యంలో ఉండేటట్లు చూచుకోవాలి అని 'స్వభూమికమ్' అన్న పదానికి అభిప్రాయం. ఇది ఈనాడు మనం అనుకొంటున్న 'సాటలైట్ టౌన్స్' నిర్మాణం వంటిది.

14. స్వల్పోఽపి వాపేషు ప్రజోపద్రవః మహాన్తమర్థం నాశయతి.

అ. విత్తనాలు నాటే కాలంలో ఏ కొంచెం ప్రజోపద్రవం సంభవించినా అది గొప్ప లాభాన్ని నశింపచేస్తుంది.

15. కణిశేషు క్షీరిషు సిద్ధాదాయః జనపదముద్వాసయతి.

అ. వెన్నులు పాలుపోసుకొంటూన్న సమయంలో (అంతకు పూర్వం రైతుల దగ్గర) సిద్ధంగా ఉన్న ధాన్యాదులను లాగికొనడం జనపదాలను లేవగొట్టేస్తుంది. రాజు అలా లాగికొంటే జనపదాలలోనివాళ్ళు మరొక చోటికి వెళ్ళిపోతారు.

16. లవనకాలే సేనాప్రచారః దుర్భిక్షమావహతి.

అ. పంటలు కోతకి వచ్చిన కాలంలో సేనాసంచారం (యుద్ధయాత్ర) దుర్భిక్షానికి దారితీస్తుంది.

17. సర్వా అపి బాధాః ప్రజానాం కోశం కర్ష(ర్శ)యన్తి.

అ. అన్ని బాధలూ ప్రజల ధనాగారాన్ని లాగేస్తాయి. (కృశింప చేస్తాయి.)

18. దత్తపరిహారాన్ పితేవానుగృహ్ణీయాత్.

అ. పరిహారం చెల్లించినవాళ్ళని తండ్రివలె అనుగ్రహించాలి.

19. మర్యాదాతిక్రమేణ ఫలవత్యపి భూమిర్భవత్యరణ్యానీ.

అ. కొన్ని కట్టుబాట్లు ఉల్లంఘించి వ్యవసాయం చేస్తే ఫలవంతమైన భూమి కూడా మహారణ్యం అయిపోతుంది. (మితికి మించిన ఎరువులు వాడితే భూమి ఊషరక్షేత్రం అవుతుంది అని మనం ఈనాడు అనుకుంటూన్నట్లు.)

20. క్షీణజనసంభావనం, తృణశలాకాయా అపి స్వయమగ్రహః, కాదాచిత్కం చోపజీవనమ్ ఇతి పరమాః ప్రజానాం సంవర్ధనోపాయాః.

అ. కష్టాలలో ఉన్న జనాన్ని ఆదుకోవడం, గడ్డిపరక కూడా తాను ఇతరులనుండి తీసికొనకపోవడం, ఎప్పుడోకాని వాళ్ళమీద ఆధారపడకపోవడం. ఇవి ప్రజలకు అభివృద్ధి కలిగించే అత్యుత్తమమైన ఉపాయాలు.

21. న్యాయేన రక్షితా పణ్యపుటభేదినీ పిణ్ఠా రాజ్ఞాం కామధేనుః.

అ. అమ్మకానికి తీసికొనివచ్చే వస్తువులను న్యాయసమ్మతమైన పద్ధతిలో రక్షించే స్థానం రాజులకు కామధేనువు (పణ్యపుటభేదినీ పిణ్ఠా = వస్తువులను రక్షించే స్థానం పెద్ద మార్కెట్టు).

22. రాజ్ఞశ్చతురఙ్గబలాభివృద్ధిహేతవో భవేయుః భూయాంసో భక్త గ్రామాః.

అ. సస్యాలు పండించే గ్రామాలు అధికంగా ఉంటే అవి రాజు చతురంగ బలాన్ని బాగా అభివృద్ధి చేయడానికి హేతువులు అవుతాయి.

23. సుమహచ్చ గోమణ్డలం హిరణ్యాయయుక్తం శుల్కం చ కోశ వృద్ధిహేతుః.

అ. అత్యధికమైన గోవుల సముదాయము, బంగారం రాబడితో కూడిన పన్ను ఇవి ధనాగారం వృద్ధిపొందడానికి హేతువు.

24. దేవద్విజప్రదేయా గోరుతప్రమాణా భూమిః దాతురాదాతుశ్చ సుఖనిర్వాహా.

అ. ఎద్దు రంకె ప్రమాణం గల భూమి (ఎద్దు రంకె వేస్తే ఎంత దూరం వినబడుతుందో అంత దూరం లోపుగా ఉన్న భూమి) దేవతలకీ ద్విజులకీ ఇచ్చి నట్లయితే దాన్ని దాత, ప్రతిగ్రహీతా (దానం పట్టినవాడు) కూడ సుఖంగా నిర్వహించవచ్చు.

25. క్షేత్రవప్రఖణ్డగృహధర్మాయతనానామ్ ఉత్తరః పూర్వం బాధేత న పునరుత్తరం పూర్వః.

అ. పొలము, ప్రాకారము, ఖండము (?) గృహము, ధర్మశాల-వీటిలో తరవాతది వెనుకటి దానిని బాధించాలి కాని, వెనుకటిది తరవాతదాన్ని బాధించ కూడదు.

ఒక ప్రదేశంలో పొలం మొదలైనవి నిర్మించవలసి వచ్చినప్పుడు పొలమా ప్రాకారమా అన్నప్పుడు ప్రాకారమే కట్టాలి. ఇదే విధంగా ప్రాకారమా ధర్మశాలా అన్నప్పుడు ధర్మశాలకు ప్రాధాన్యం (Preference) ఇవ్వాలి. ఇట్లే మిగిలిన వాటి విషయంలో కూడ. ఖండ శబ్దానికి ఇక్కడ సరిపడే అర్థం తెలియలేదు. లేదా ఖండగృహం అని గ్రహించి చిన్న ఇల్లు (Out house) అని అర్థం చెప్పుకొనవచ్చును.

26. నాముద్రహస్తోఽశోధితో వా కశ్చిత్ స్వమణ్డలే నిర్విశేన్నిర్గచ్ఛేద్వా.

అ. ముద్ర దగ్గరలేనివాడు కాని, శోధించబడనివాడు గాని ఎవ్వడూ తన మండలంలో నివసించకూడదు, బైటకి వెళ్ళకూడదు.

ముద్ర అనగా అధికారి ద్వారా తీసికొన్న అభిజ్ఞానచీటిక (Pass). శోధితః అనగా పరీక్షించబడినవాడు (Cleared after checking).

27. శ్రూయతే హి కిల - హూణాధిపతిః పణ్యపుటవాహిభిః సుభటైశ్చిత్రకూటం జగ్రాహ. ఖేటఖడ్గసహాయశ్చ భద్రః కాఞ్చీపతిమితి.

అ. హూణుల ప్రభువు సరుకుల గంపలు మోసే భటుల ద్వారా చిత్రకూటం ఆక్రమించాడని, భద్రుడు ఆయుధాలు, ఖడ్గం సహాయంగా గ్రహించి కాంచీరాజును పట్టుకొన్నాడని వింటున్నాం కదా?

28. న హి భర్తురభియోగాత్పరః సర్వజనవిశుద్ధిహేతురస్తి.

ఇతి జనపదసముద్దేశః

అ. ప్రభువు అభియోగం చేయడాన్ని మించిన సకలజనవిశుద్ధికి కారణమైనది ఏదీ లేదు.

ఎవరైనా అపరాధం చేసినా, చేసినట్లు సందేహం కలిగినా రాజు వాళ్ళ మీద అభియోగం చేసి (కేసు పెట్టి) మంచిచెడ్డలను నిర్ణయించాలి; అంతకు మించి మరొక ఉపాయం లేదు అని భావం అయి ఉంటుంది.

''బాలానందిని'' అను సోమదేవనీతిసూత్రాంధ్రవ్యాఖ్యానంలో జనపద సముద్దేశం సమాప్తం.

## 20. దుర్గ సముద్దేశః

1. యస్యాభియోగాత్ పరే దుఃఖం గచ్ఛన్తి తద్దుర్గమ్.

అ. ఎదిరించడానికి వచ్చిన శత్రువులకి దుఃఖం కలిగించేది దుర్గం.

2. దుర్జనోద్యోగవిషయాద్వా స్వస్య విజిగీషోరాపదో గమయతీతి.

అ. లేదా దుర్జనుల ప్రయత్నవిషయం నుండి (కాపాడి) తనను జయించ తలచి వచ్చేవానికి ఆపదలు కలగచేసేది కాబట్టి దుర్గం.

3. తద్ద్వివిధం స్వాభావికం ఆహార్యం చేతి.

అ. స్వాభావికము, ఆహార్యము అని దుర్గం రెండు విధాలు.

4. వైషమ్యం, పర్యాప్తావకాశః, యవసేన్ధనోదకభూయస్త్వం చ స్వస్య, పరేషాం తదభావః, బహుధాన్యరససంగ్రహః, ప్రవేశాపసారౌ, వీరపురుషాశ్చేతి దుర్గసంపత్; అన్యద్దుర్గం బన్దిశాలేవ.

అ. పర్వతాలు, గోతులు మొదలైన వాటితో విషమంగా ఉండడం, చాలినంత వైశాల్యం, తనకు పశుగ్రాసము, కట్టెలు, ఉదకమూ సమృద్ధిగా లభించడం, శత్రువులకు అవి లభించకపోవడం, అధికంగా ధాన్యాల తైలాదిరసాల నిలవలు, దిగుమతులు, ఎగుమతులు, వీరులైన పురుషులు- ఇవి దుర్గానికి ఉండవలసిన మంచి సంపద. ఇది లేని దుర్గం బందీఖానాయే.

5. అదుర్గో దేశః కస్య నామ న పరిభవాస్పదమ్?

అ. దుర్గం లేని దేశం ఎవరికి తిరస్కార హేతువు కాదు?

6. అదుర్గస్య రాజ్ఞః పయోధిమధ్యే పోతచ్యుతపక్షివత్ ఆపది నాస్త్యాశ్రయః.

అ. దుర్గం లేని రాజుకు, సముద్రమధ్యంలో ఓడనుండి జారిపడిన పక్షికి వలె, ఆపత్సమయంలో ఆశ్రయం ఉండదు.

7. ఉపాయతో గమనమ్, ఉపజాపః, చిరమనుబన్ధః, అవస్కన్దః, తీక్ష్ణపురుషప్రయోగశ్చేతి దుర్గలమ్భనోపాయాః.

**ఇతి దుర్గ సముద్దేశః.**

అ. ఉపాయపూర్వకంగా యుద్ధానికి వెళ్ళడం, భేదోపాయం (అంతః కలహాలు) సృష్టించడం, చిరకాలం ఏవో కష్టాలు కలిగించడం, హటాత్తుగా ఆక్రమించడం, క్రూరస్వభావం గల పురుషుల్ని ప్రయోగించడం - ఇవి దుర్గాన్ని ఆక్రమించుకొనడానికి ఉపాయాలు.

"బాలానందిని" అనే సోమదేవనీతిసూత్రాంధ్రవ్యాఖ్యానంలో

**దుర్గ సముద్దేశం సమాప్తం.**

## 21. కోశ సముద్దేశః

1. యః విపది సంపది చ స్వామినస్తన్త్రాభ్యుదయం కోషయతి-సంశ్లేషయతి స కోషః.

అ. ఆపదలలోను, సంపదలలోనూ కూడా ప్రభువు తంత్రానికి అభ్యుదయం (అభివృద్ధి) కలిగించేది "కోషం."

2. అతిశయితరత్నహిరణ్యరజతప్రాయః, వ్యావహారికనాణక బహులః మహాపది వ్యయసహశ్చేతి కోశగుణాః.

అ. రత్నాలు, బంగారమూ, వెండీ అత్యధికంగా ఉండడం, వాడుకలో ఉన్న నాణాలు ఎక్కువగా ఉండడం, గొప్ప ఆపత్సమయాలలో ఎంత ఖర్చు వచ్చినా తట్టుకోగలిగి ఉండడం అనేవి కోశగుణాలు.

3. కోశం సంవర్ధయన్నుత్పన్నమర్ధముపయుఞ్జీత.

అ. కోశాన్ని వృద్ధిపొందించుకొంటూ పుట్టిన (చేతికి అందుతూన్న) ధనాన్ని ఉపయోగించుకొంటూండాలి.

4. కుతస్తస్యాయత్యాం శ్రేయాంసి యః ప్రత్యహం కాకిణ్యాపి కోశం న వర్ధయతి.

అ. ప్రతి రోజూ ఒక్క కాకిణి (పైసావంటి చిన్న నాణెం) అయినా చేర్చి కోశాన్ని వృద్ధిపొందించనివానికి భవిష్యత్తులో శ్రేయస్సు ఎలా కలుగుతుంది?

5. కోశో హి మహీపతీనాం జీవితం, న ప్రాణాః.

అ. రాజుకు జీవితం కోశమే; ప్రాణాలు జీవితం కాదు.

6. క్షీణకోశో హి రాజా పౌరజానపదానన్యాయేన గ్రసతే, తతో రాష్ట్రమేవ భవేచ్ఛూన్యమ్.

అ. కోశం క్షీణించిన రాజు పౌరుల్ని, జానపదుల్ని అన్యాయంగా మ్రింగివేస్తాడు; అప్పుడు రాష్ట్రమే శూన్యం అయిపోతుంది.

7. కోశో హి రాజేత్యుచ్యతే, న భూపతీనాం శరీరమ్.

అ. రాజు అనగా కోశమే; అంతే కాని శరీరం రాజు కాదు.

8. యస్య హస్తే ద్రవ్యం స జయతి.

అ. చేతిలో ద్రవ్యం ఉన్నవాడే జయిస్తాడు.

9. ధనహీనః కలత్రేణాపి త్యజ్యతే, కిం పునర్నాన్యైః?

అ. ధనం లేనివాణ్ణి భార్య కూడా విడిచిపెట్టి వేస్తుంది, ఇతరులు విడిచి పెట్టకుండా ఉంటారా?

10. న ఖలు కులాచారాభ్యాం పురుషః సేవ్యతామేతి కింతు విత్తేనైవ.

అ. ఎవ్వరూ ఒక వ్యక్తిని అతని కులాన్ని పట్టీ, సదాచారాన్ని (మంచి నడవడికను)బట్టీ సేవించరు; ధనాన్ని పట్టి సేవిస్తారు.

11. కిం తయా మహత్తయా కులీనతయా వా యా న సంతర్పయతి పరాన్.

అ. పరులకు సంతృప్తి కలిగించని గొప్పతనంవల్ల కాని, సత్కులంచేత కాని ఏం ప్రయోజనం?

12. స ఖలు మహాన్ కులీనశ్చ యస్యాస్తి ధనమన్యూనమ్.

అ. అధికంగా ధనం ఉన్నవాడే గొప్పవాడు, సత్కులంలో పుట్టినవాడూను.

13. కిం తస్య సరసో మహత్త్వేన యత్ర న జలాని?

అ. నీళ్ళు లేని సరస్సు ఎంత పెద్దదైతే మాత్రం ఏమి ప్రయోజనం?

14. దేవద్విజవణిజాం ధర్మాధ్వరపరిజనానుపయోగిద్రవ్యభాగైః, ఆఢ్యవిధవానియోగి గ్రామకూట గణికాసంఘ పాషణ్డి విభవాంశప్రత్యాదానైః, సమృద్ధపౌరజానపదద్రవిణ సంవిభాగ ప్రార్థనైః, అనుపక్షయ శ్రీకమన్త్రి పురోహిత శ్రోత్రియ మిత్ర సామన్తాన్తపాలానునయగృహగమనాభ్యాం చ క్షీణకోశః కోశమభివర్ధయేత్.

**ఇతి కోశ సముద్దేశః**

అ. కోశం క్షీణించిన రాజు ఈ క్రింది ఉపాయాలచేత కోశాన్ని వృద్ధి పొందించుకోవాలి - ధర్మకార్యాలకోసం ఉపయోగించని దేవతాద్రవ్యంనుంచి, యజ్ఞాలకి వినియోగించని బ్రాహ్మణద్రవ్యంలోను, పరిజనంకోసం వినియోగించని వర్తకుల ద్రవ్యంలోను కొంత భాగం తీసికోవాలి. బాగా ఐశ్వర్యం ఉన్న విధవలు, అధికారులు, గ్రామాధ్యక్షులు, వేశ్యాసంఘాలు, పాషండులు (నాస్తికులు) - వీళ్ళ ఐశ్వర్యంలో కొంత భాగాన్ని తిరిగి తీసికోవాలి. 'మీ ద్రవ్యం

నుంచి కొంత భాగం ఇవ్వండి' అని ఐశ్వర్యసమృద్ధులైన పౌరుల్నీ, జాన పదుల్నీ ప్రార్థించాలి. తరగని ఐశ్వర్యం ఉన్న మంత్రులు, పురోహితులు, శ్రోత్రియులు, మిత్రులు, సామంతరాజులు, సరిహద్దు ప్రాంతాల పాలకులు - వాళ్ళతో మంచి మాటలు చెప్పి వాళ్ళ ఇళ్లకి వెళ్ళి ధనం గ్రహించాలి.

"బాలానందిని'' అనే సోమదేవనీతిసూత్రాంధ్ర వ్యాఖ్యలో కోశసముద్దేశం సమాప్తం.

## 22. బలసముద్దేశః

1. ద్రవిణదానప్రియభాషణాభ్యామ్ అరాతినివారణేన చ స్వామినం సర్వాస్వవస్థాసు బలతే సంవృణోతీతి బలమ్.

అ. "బలతే ఇతి బలమ్" అని విగ్రహవాక్యం. "కప్పునది" అని అర్థం. ధనం ఇవ్వడంచేత, ప్రియంగా మాటలాడడంచేత, శత్రువును నివారించడంచేత అన్ని అవస్థలలోను ప్రభువును కప్పుతుంది, అనగా సంరక్షిస్తుంది కాబట్టి బలం; అనగా సైన్యం.

2. బలేషు హస్తినః ప్రధానమఙ్గమ్; తే యథా స్వైరవయవైరష్టా ప్యాయుధాని భవన్తి న తథాన్యద్బలమ్.

అ. సేనలలో ఏనుగులు ప్రధానమైన అంగం. ఏనుగులు తమ అవయ వాల ద్వారా ఎనిమిది ఆయుధాలుగా ఎలా ఉపయోగిస్తాయో. ఆ విధంగా ఇతర బలం ఉపయోగించదు.

ఎనిమిది అవయవా లనగా - నాలుగు కాళ్ళు, రెండు దంతాలు, తొండం, పైన కూర్చున్న యోధుడు అయి ఉంటాయి. ఈ అవయవాలలో ప్రతి ఒక్కటీ శత్రుసంహారం చేస్తుంది అని భావం.

3. హస్తిప్రధానో విజయో రాజ్ఞామ్, యదేకోఽపి హస్తీ సహస్రం యోధయతి, న సీదతి ప్రహారసహస్రేణాపి.

అ. రాజులకు విజయం సంపాదించిపెట్టడానికి ఏనుగే ప్రధానమైనది. ఎందుచేత ననగా, ఒక్కటే అయినా ఏనుగు వెయ్యిమందితో యుద్ధం చేస్తుంది. వేలకొలంది దెబ్బలు తగిలినా నశించదు.

4. జాతిః, కులం, వనం, తత్ప్రచారశ్చ న హస్తినాం ప్రధానమ్; కిం తు శరీరం, బలమ్, శౌర్యమ్, శిక్షా చ.

అ. ఏనుగుల విషయంలో వాటి జాతీ, కులమూ, అవి లభించిన వనమూ, ఆ అరణ్యాలలో సంచరించడమూ అనేవి ప్రధానం కాదు; మరేమనగా వాటి శరీరమూ, బలమూ, శౌర్యమూ, శిక్షా (ట్రెయినింగ్) - ఇవి ప్రధాన మైనవి.

5. అశిక్షితా హి హస్తినః కేవలం నృపాణామర్థప్రాణహరాః.

అ. శిక్షణ (ట్రెయినింగ్) ఇవ్వని ఏనుగులు కేవలమూ రాజుల ధనాన్నీ, ప్రాణాలనూ హరిస్తాయి.

6. సుఖేన యానమ్, ఆత్మరక్షా, పరపురావమర్దనమ్, అరివ్యూహ వ్యాఘాతః, జలేషు సేతుబన్ధనః, వచనాదన్యత్ర సర్వవినోద హేతవశ్చేతి హస్తిగుణాః.

అ సుఖంగా ప్రయాణం చెయ్యడం, ఆత్మరక్ష, శత్రుపురాలను నశింప చెయ్యడం, శత్రువుల వ్యూహాలను ఛేదించడం, నీటిలో సేతుబంధానికి ఉపయోగించడం (నీటిలో అడ్డంగా నిలచి సేతువుగా ఏర్పడడం), ఇతరసమయాలలో చెప్పిన పనులు చేస్తూ సమస్తమైన వినోదాలకీ హేతువులై ఉండడం - ఇవి ఏనుగుల గుణాలు (ఏనుగులవల్ల లాభాలు).

7. అశ్వబలం సైన్యస్య జఙ్గమః ప్రాకారః.

అ. అశ్వబలం సైన్యానికి, కూడా నడచి వచ్చే ప్రాకారం.

8. అశ్వబలప్రధానస్య హి రాజ్ఞః కదనకన్దుకక్రీడాః ప్రసీదన్తి శ్రియః; దూరస్థా అపి శత్రవః కరస్థా భవన్తి, ఆపత్సు చ సర్వేఽపి మనోరథాః సిద్ధ్యన్తి.

అ. అశ్వబలం ప్రధానంగా ఉన్న రాజు విషయంలో విజయలక్ష్మలు యుద్ధం అనే బంతితో ఆడుకొంటూ ప్రసన్నలు అవుతారు. దూరంగా ఉన్న శత్రువులు కూడా చేతిలో ఉంటారు. ఆపదలలో అన్ని మనోరథాలూ సిద్ధిస్తాయి.

9. సరణమ్, అపసరణమ్, అవస్కన్దః, పరానీకభేదనం చేత్యేతత్ తురంగమైకసాధ్యమ్.

అ. ముందుకు సాగడం, ప్రక్కకి తప్పుకోవడం, ఆక్రమించడం, శత్రు సైన్యాన్ని ఛేదించడం - ఈ పనులు అశ్వసైన్యానికే సాధ్యం అవుతాయి.

10 శమా భూమిః, ధనుర్వేదవిదో రథారూఢాః ప్రహర్తారశ్చ యది తదా కిం నామ భవేదసాధ్యం నృపాణామ్.

అ. రణభూమి సమంగా (ఎగుడు దిగుళ్లు) లేనిదిగా ఉండి రథాలు ఎక్కిన యోధులు ధనుర్వేదంలో నిష్ణాతులైతే రాజులకు సాధ్యం కానిది ఏముంటుంది?

11. రథైరవమర్దితం పరబలం సుఖేన జీయతే.

అ. రథాలచేత మర్దించబడిన శత్రుసైన్యాన్ని అనాయాసంగా జయించ వచ్చును.

12. మౌల-భృతక-శ్రేణీ-మిత్రామిత్రాటవికేషు బలేషు పూర్వ పూర్వం బలం భర్తుం సంనాహయితుం చ యతేత.

అ. మౌల - భృతక - శ్రేణీ - మిత్ర - శత్రు - ఆటవిక సైన్యాలలో ముందు ముందు పేర్కొన్నవాటిని బాగా పోషించడానికీ, యుద్ధసన్నద్ధం చేయ డానికీ ప్రయత్నించాలి.

తండ్రి తాతలనుంచీ వంశక్రమానుసారంగా వస్తున్న స్థిరంగా ఉండే (Permanent) సైన్యం మౌలం. తాత్కాలికంగా వేతనం ఇచ్చి తెప్పించిన సైన్యం భృతకం. వర్తకసంఘాలు మొదలైనవాళ్ళు పంపినది శ్రేణీబలం. మిత్రులు పంపినది మిత్రబలం. శత్రువును ఓడించి ఆతనివద్దనుండి తీసికొన్నది అమిత్ర బలం. ఆటవికులను పోగు చేసి ఏర్పరచినది ఆటవికబలం. వీటిలో పోషణసంనా హాదులలో ముందు మౌలసైన్యానికి, తరవాత భృతకసైన్యానికి, ఈ క్రమంలో ఇతరసైన్యాలకి ప్రాధాన్యం ఇవ్వాలని భావం.

13. అథాన్యత్సప్తమమౌత్సాహికం బలం యత్ విజిగీషోః విజయ యాత్రాకాలే పరరాష్ట్రవిలోడనార్థమేవ మిలతి.

అ. ఈ ఆరు సైన్యాలూ కాక ఏడవది ఔత్సాహికబలం, (మనుష్యుల్ని ప్రోత్సహించి సమకూర్చుకొన్న బలం). జయం సంపాదించ దలచినవాడు విజయ యాత్రాకాలంలో పరరాష్ట్రాలలో కలత పుట్టించడానికి సమకూర్చుకొనేది.

14. సుహృత్త్వం, క్షత్రిసారత్వమ్, అస్త్రజ్ఞత్వం, స్వభావ శూరత్వమ్, అనురక్తత్వం చేతి బలస్య గుణాః.

అ. మంచి హృదయం ఉండడం, క్షత్రియులు అధికంగా ఉండడం, ఆయుధప్రయోగం బాగా తెలిసి ఉండడం, సహజంగా శౌర్యం ఉండడం, రాజు మీద ప్రేమ ఉండడం- ఇవి సైన్యానికి ఉండవలసిన మంచి గుణాలు.

15. మౌలబలావిరోధేన అన్యద్బలమర్థమానాభ్యామనుగృహ్ణీయాత్.

అ మౌలబలానికి విరోధం లేకుండా చూచుకొంటూ - అనగా మౌలబలం మనస్సులో అసూయాదులు కలగకుండా చూచుకొంటూ, ఇతరబలాలను ధన సత్కారాలచేత అనుగ్రహిస్తూ ఉండాలి.

16. మౌలం హ్యాపద్యనుగచ్ఛతి, దణ్డితమపి న ద్రుహ్యతి, భవతి చాపరేషామభేద్యమ్.

అ. మౌలబలం ఆపత్సమయాలలో వెంట ఉంటుంది ఎప్పుడైనా శిక్షించినా ద్రోహం చెయ్యదు. శత్రువు లెవ్వరూ దాన్ని భేదించజాలరు (చీలికలు తీసికొని రాజాలరు).

17. న తథార్థః పురుషాన్యోధయతి యథా ప్రభుసమ్మానః.

అ. ప్రభువువల్ల లభించే సన్మానం సైనికుల చేత యుద్ధం చేయించినట్లు ఎంత ధనం ఇచ్చినా అది చేయించజాలదు.

18. స్వయమనవేక్షణం, దేయాంశహరణం, కాలయాపనం, వ్యసనాప్రతీకారః, విశేషవిధావసంభావనం చ తన్త్రస్య విరక్తికారణాని.

అ. పరిపాలనాతంత్రాన్ని స్వయంగా చూసుకొనకపోవడం, ఇవ్వవలసిన దానిలో కొంత భాగాన్ని హరించడం, కాలాన్ని గడిపివేయడం (Postponement), వచ్చిన కష్టాలకి ప్రతిక్రియ చేసుకొనకపోవడం, ఎవరైనా ఒక విశిష్టమైన కార్యం సాధించినప్పుడు అతనిని గౌరవించకపోవడం - ఇవి తంత్రంలో విరక్తికి (రాజభక్తి లేకపోవడానికి) కారణాలు.

19. స్వావేక్షణీయం పరైరవేక్షయన్ అర్థతన్త్రాభ్యాం హీయతే.

అ. స్వయంగా చూసుకొనవలసిన విషయాలను ఇతరులచేత పర్యవేక్షింప చేసేవాడు అర్థాన్నీ (ధనాన్ని లేదా సాధించవలసిన ప్రయోజనాన్ని) తంత్రాన్నీ (పాలనావిధానాన్నీ) కూడా పోగొట్టుకుంటాడు.

20. ఆశ్రితభరణే, స్వామిసేవాయాం, ధర్మానుష్ఠానే, పుత్రోత్పాదనే చ న ఖలు సన్తి ప్రతిహస్తాః.

అ. ఆశ్రితుల్ని పోషించడం, ప్రభువును సేవించడం, ధర్మం అనుష్ఠించడం, పుత్రుల్ని పుట్టించడం - ఈ పనులలో ప్రతినిధులు (deputies) ఉండరు కదా?

21. తావద్దేయం, యావతా ఆశ్రితాః (న) సంపూర్ణతామాప్నువన్తి.

అ. ఎంత ఇస్తే ఆశ్రితులు ధనసమృద్ధితో నిండినవాళ్ళు అవుతారో అంతా వాళ్ళకి ఇవ్వాలి.

22. న హి స్వద్రవ్యమవ్యయమానో రాజ్ఞో దణ్డనీయః.

అ. తన ధనం తాను ఖర్చు పెట్టుకొననివాడు రాజుచేత దండింపదగిన వాడు కాడు కదా?

23. కో నామ సుచేతాః స్వగుడం చౌర్యాత్ ఖాదేత్?

అ. తెలివి ఉన్నవా డెవడైనా తన బెల్లం తానే అపహరించి తింటాడా?

24. కిం తేన జలదేన యః కాలే న వర్షతి?

అ. తగిన కాలంలో వర్షించని మేఘంవల్ల ఏమి ప్రయోజనం?

25. స కిం స్వామీ యః ఆశ్రితేషు వ్యసనే న ప్రతివిధత్తే?

అ. ఆశ్రితులకు కష్టాలు వచ్చినప్పుడు వాటిని నివారించని ప్రభువు ఏమి ప్రభువు?

26. అవిశేషజ్ఞే రాజ్ఞి కోనామార్థప్రాణవ్యయేనోత్సహేత?

**ఇతి బలసముద్దేశః**

అ. బుద్ధిమంతు లెవరో, మూర్ఖు లెవరో భేదం తెలియని రాజుకోసం ఎవడు ధనాన్ని, ప్రాణాల్ని ఖర్చు పెట్టడానికి (ఇవ్వడానికి) ఉత్సాహం చూపుతాడు?

'బాలానందిని' అను సోమదేవ నీతిసూత్రాంధ్ర వ్యాఖ్యానం

బలసముద్దేశం సమాప్తం.

## 23. మిత్ర సముద్దేశః

1 సంపదీవ విపద్యపి మేద్యతి స్నిహ్యతీతి మిత్రమ్.

అ. సంపత్సమయంలో వలె ఆపత్సమయంలో కూడా స్నేహం చూపే వాడు మిత్రుడు.

2. యః కారణమన్తరేణ రక్ష్యో రక్షకో వా భవతి తన్నిత్యం మిత్రమ్.

అ. కారణం ఏమీ లేకుండగా, అనగా ప్రత్యుపకారాపేక్ష లేకుండా, ఎవడు రక్షింపతగినవాడు గాని, రక్షకుడు గాని అవుతాడో అతడే నిత్యమిత్రుడు.

3. తత్సహజం మిత్రం, యత్ర పూర్వపురుషపరమ్పరయా సమాయాతః శ్లాఘ్యః సంబన్ధః.

అ. ఎవనితో ఉన్న శ్లాఘనీయమైన సంబంధం పూర్వపురుషుల పరంపరతో, అనగా కొన్ని తరాలనుంచీ, ఏర్పడినదో అతడు సహజమిత్రుడు.

4. యత్ వృత్తిజీవితహేతోః ఆశ్రితం తత్ కృత్రిమం మిత్రమ్.

అ. వృత్తికోసం, జీవితంకోసం ఆశ్రయించినవాడు కృత్రిమమిత్రుడు.

5. వ్యసనేషూపస్థానం, అర్థేష్వవికల్పః, స్త్రీషు పరమం శౌచం, కోపప్రసాదవిషయేష్వప్రతిపక్షత్వమ్ - ఇతి మిత్రగుణాః.

అ. కష్టాలలో ఆదుకోవడం, ధనం విషయంలో లేదా కార్యాల విషయంలో ఏలాంటి సందేహాలకీ ఆస్పదం కాకుండా ఉండడం, స్త్రీల విషయంలో పరిశుద్ధత్వం, కోపవిషయములలో కాని, అనుగ్రహవిషయములలో కాని, అనగా తన మిత్రునికి ఎవరి విషయంలో కోపం కాని, అనుగ్రహం కాని కలుగుతుందో వాళ్ళ విషయంలో, తాను మరొక విధంగా ఎదురు తిరగకుండా కోపప్రసాదాలు చూపడం - ఇవి మిత్రగుణాలు.

6. దానేన ప్రణయః, స్వార్థపరత్వం, విపద్యుపేక్షణం, అహితసంప్రయోగః, విప్రలమ్భనగర్భః ప్రశ్రయశ్చ మిత్రదోషాః.

అ. ఏమైనా ఇస్తేనే స్నేహంగా ఉండడం, స్వార్థపరత్వం, ఆపత్సమయంలో ఉపేక్షించడం, (అతని) శత్రువులతో సంబంధం పెట్టుకొనడం, మోసంతో కూడిన వినయం - ఇవి మిత్రదోషాలు.

7. స్త్రీసంగతిః, వివాదః, అభీక్ష్ణయాచనమ్, అప్రదానమ్, అర్థ సంబన్ధః, పరోక్షే దోషగ్రహణమ్, పురోభాగితా, పైశున్యాకర్ణనం చ - ఇతి మైత్రీభేదకారణాని.

అ. (మిత్రుని) స్త్రీతో సంబంధం, తగవు పెట్టుకొనడం, ఎక్కువగా ఆ సహాయంకోసం ఈ సహాయం కోసం యాచించడం, తాను మాత్రం ఏమీ ఇవ్వక పోవడం, ధనసంబంధం, పరోక్షంలో తప్పులు ఎన్నడం, దోషాలు మాత్రమే గ్రహించడం, చెప్పుడు మాటలు వినడం - ఇవి మైత్రి చెడిపోవడానికి కారణాలు.

8. న హి క్షీరాత్పరం మహదస్తి యత్సఙ్గతిమాత్రేణ కరోతి నీరమాత్మసమమ్.

అ. పాలను మించిన గొప్ప వస్తువు లేదు. ఎందుచేత ననగా తనతో కలిసినంతమాత్రంచేతనే నీటిని తనతో సమమైన దానినిగా చేస్తుంది. ఇది మంచి మైత్రికి దృష్టాంతం.

9. న నీరాత్పరం మహదస్తి యన్మిలితమాత్రేణ సంవర్ధయతి, రక్షతి చ స్వక్షయేణాపి క్షీరమ్.

అ. జలంకంటె ఉత్తమమైనది మరొకటి లేదు. ఎందుచేత ననగా అది పాలు తనతో కలిసినంత మాత్రం చేతనే వాటిని వృద్ధిపొందేటట్లు చేస్తుంది; (మరగపెట్టే సమయంలో) తాను క్షీణించి అయినా పాలను రక్షిస్తుంది.

10. యేన కేవాప్యుపకారేణ తిర్యఞ్చోఽపి ప్రత్యుపకారిణః, అవ్యభిచారిణః భవన్తి; న పునః ప్రాయేణ మనుష్యాః.

అ. ఏ మాత్రం చిన్న ఉపకారం చేసినా (ఆవులు, ఎద్దులు, కుక్కలు, పిల్లులు మొదలైన) తిర్యగ్జంతువులు కూడా ప్రత్యుపకారం చేస్తాయి; ప్రతికూలంగా ఉండవు. సాదారణంగా మనుష్యులు మాత్రం ఇలా ఉండరు.

11. తథా చోపాఖ్యానకమ్ - అటవ్యాం కిల అన్ధకూపే పతితేషు కపిసర్పసింహాక్షశాలికసౌవర్ణికేషు కృతోపకారః కఙ్కాయన నామా కశ్చిత్ పాన్థః విశాలాయాం పురి తస్మాదక్షశాలికా ద్వ్యాపాదనమాప, నాడీజఙ్ఘశ్చ గౌతమాత్ ఇతి.

**ఇతి మిత్రసముద్దేశః.**

అ. అందుచేతనే ఒక చిన్న కథ ఉంది - ఒక అడవిలో కోతి, పాము, సింహం, జూదం ఆడే గృహాన్ని నడిపేవాడు (అక్షశాలికుడు), కంసాలి ఒక పాడునూతిలో పడిపోగా కంకాయను దనే ఒక బాటసారి ఉపకారం చేశాడట. అతనిని విశాలానగరంలో ఆ అక్షశాలికుడే చంపివేశాడట. నాడీజంఘం అనే కొంగను గౌతముడు చంపివేశాడట.

నాడీజంఘుని కథః- చోలదేశంలో గౌతముడనే చదువులేని బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి స్వగ్రామంలో వృత్తి లభించకపోవడంచేత ఆటవికులతో కలిసిపోయి ఒక విధవ అయిన శబరస్త్రీని వివాహం చేసుకొని పశుపక్ష్యాదులను వేటాడుతూ కొంతకాలం జీవించాడు. తరవాత ఒక వర్తకుల గుంపులో చేరి విదేశాలలో వర్తకం చెయ్యడానికి అరణ్యమార్గంలో ప్రయాణం చేస్తుండగా అతనిని తప్ప మిగిలిన వర్తకులనందరినీ ఒక అడవి ఏనుగ చంపివేసింది. అప్పుడు అతడు అడవిలో అలమటిస్తూ ఒక అందమైన వనంలో ప్రవేశిస్తాడు. అక్కడ నాడీజంఘుడనే కొంగలరాజు కనబడి ధనంకోసం అతడు అవిధంగా బాధపడుతున్నట్లు విని తన మిత్రుడైన విరూపాక్షుడనే రాక్షసుని దగ్గరికి పంపుతాడు. ఆ రాక్షసుడు గౌతమునికి చాలా ధనం ఇస్తాడు. అతడా ధనం తీసికొని నాడీజంఘుణ్ణి కలిసి ఇంటికి తిరిగివెడుతూ దారిలో అహారంకోసం ఆ నాడీజంఘుణ్ణే చంపి కొంత మాంసం తిని మిగిలిన మాంసం మూటకట్టుకొని బయలుదేరుతాడు. విరూపాక్షుడు ఆ విషయం గ్రహించి ఆ బ్రాహ్మణుణ్ణి చంపివేస్తాడు. నాడీజంఘుని వృత్తాంతం విన్న ఇంద్రుడు అక్కడికి వచ్చి అమృతం కురిపించి నాడీజంఘుణ్ణి బ్రతికిస్తాడు. ఆ బ్రాహ్మణుణ్ణి కూడా బ్రతికించమని నాడీజంఘుడు ఇంద్రుణ్ణి ప్రార్థిస్తాడు. ఇంద్రుడు బ్రతికిస్తాడు. అప్పుడు నాడీజంఘుడు ఆ బ్రాహ్మణుణ్ణి ఆ ధనం అంతా ఇచ్చి సాదరంగా ఇంటికి పంపుతాడు. అయితే దేవతలు మాత్రం నీవు మరణానంతరం చిరకాలం నరకబాధ అనుభవిస్తావు అని శపించారు.

**'బాలానందిని' అనే సోమదేవనీతిసూత్రాంధ్రవ్యాఖ్యలో**

**మిత్రసముద్దేశం సమాప్తం.**

## 24. రాజరక్షాసముద్దేశః

1. రాజ్ఞి రక్షితే సర్వం రక్షితం భవతీతి స్వేభ్యః పరేభ్యశ్చ రాజా నిత్యం రక్షితవ్యః.

అ. రాజును రక్షించుకుంటే సర్వాన్నీ రక్షించినట్లే. అందుచేత తనవాళ్ళ నుండీ, శత్రువులనుండీ, రాజును ఎల్లప్పుడూ రక్షించాలి.

2. ఉక్తం హి నయవిద్భిః- "పితృపైతామహమహాసంబన్ధానుబన్ధం, సుశిక్షితమ్, అనురక్తం, కృతకర్మాణం చ జనమ్ ఆసన్నం కుర్వీత; న త్వన్యదేశీయమ్, అకృతార్థమానమ్; స్వదేశీయం చాపకృత్యోపగృహీతమ్" ఇతి.

అ. అందుచేతనే నీతి తెలిసినవాళ్ళు ఇలా అంటారు - "తండ్రి తాతల నుంచీ ఉన్న సంబంధాన్ని పట్టి బాగా తెలిసినవాడు, శిక్షితుడు ఆ యా కార్యా లలో శిక్షణపొందినవాడు (Trained), అనురాగం రాజభక్తి (loyalty) ఉన్నవాడు, కొన్ని గొప్ప పనులు సాధించి ఉన్నవాడు అయిన జనుణ్ణి (వ్యక్తిని) రాజు తన దగ్గరగా ఉంచుకోవాలి (అంతరంగికుణ్ణిగా చేసుకోవాలి). తనవల్ల ఏ విధమైన ప్రయోజనాలు గాని, సన్మానాలు కాని పొందని విదేశీయుణ్ణి దగ్గర ఉంచుకొన గూడదు. ఏదో ఒక అపకారం చేసి ఉండడం చేత (ఒకప్పుడు) నిగ్రహించబడిన స్వదేశీయుణ్ణైనా దగ్గర ఉంచుకొనకూడదు.

3. చిత్తవికృతేర్నాస్త్యవిషయః.

అ. చిత్తవికారానికి గురికానివాడు ఉండడు. ఏ వ్యక్తికైనా, ఏ మనిషి విషయంలో నైనా వైమనస్యం కలగవచ్చును.

4. కిం న భవతి మాతాపి రాక్షసీ?

అ. తల్లి కూడా రాక్షసి కావచ్చును కదా?

5. అస్వామికాః ప్రకృతయః సమృద్ధా అపి నిస్తరితుం న శక్నువన్తి.

అ. ప్రభువు లేని అమాత్యాదిప్రకృతులు, ప్రజలు, ఎంత ఐశ్వర్యం ఉన్నా కడదేరలేరు; ఏవైనా చిక్కులు వచ్చినప్పుడు వాటిని దాటజాలరు.

6. గతాయుషి సకలాఙ్గేఽపి దేహిని కిం కరోతి ధన్వన్తరిరపి వైద్యః?

అ. వైద్యుడు సాక్షాత్తు ధన్వంతరే అయినా అన్ని అవయవాలూ బాగానే ఉన్నవానికి కూడా ఆయుర్దాయం చెల్లినప్పుడు ఏమి చెయ్యగలడు?

7. రాజ్ఞస్తావత్ ఆసన్నాః స్త్రియః, ఆసన్నతరాః దాయాదాః, ఆసన్నతమాశ్చ పుత్రాః; అతో రాజ్ఞః ప్రథమం స్త్రీభ్యో రక్షణం, తతో దాయాదేభ్యః, తతః పుత్రేభ్యః.

అ. రాజుకు స్త్రీలు (భార్యాదులు) దగ్గరగా ఉంటారు. దాయాదులు ఇంకా దగ్గరగా ఉంటారు. వాళ్ళకంటే కూడా దగ్గరగా ఉండేవాళ్ళు పుత్రులు. అందుచేత రాజును ముందుగా స్త్రీలనుండి రక్షించాలి. తరవాత దాయాదులనుండీ తరవాత పుత్రులనుండీ రక్షించాలి.

8. ఆపణ్డాదా చ చక్రవర్తినః సర్వోఽపి స్త్రీసుఖాయ క్లిశ్యతి.

అ. అతినీచప్రాణి మొదలు చక్రవర్తి వరకూ ప్రతివాడూ స్త్రీసుఖం కోసం తంటాలు పడుతూ ఉంటాడు.

9. నివృత్తస్త్రీసంగస్య ధనపరిగ్రహః మృతమణ్డనమివ.

అ. స్త్రీసంగంనుంచి దూరంగా ఉన్నవాడు ధనం సంపాదించడం చచ్చినవానికి అలంకరించడం వంటిది.

10. సర్వాః స్త్రియః క్షీరోదవేలా ఇవ ప్రాయేణ విషామృతస్థానమ్.

అ సాధారణంగా అందరు స్త్రీలూ కూడా క్షీరసముద్రం వలె విషానికీ అమృతానికీ కూడా స్థానం అయినవాళ్ళు.

11. మకరదంష్ట్రా ఇవ స్త్రియః స్వభావాదేవ వక్రశీలాః.

అ. మొసళ్ళ కోరల వలె స్త్రీలు సహజంగానే వక్రస్వభావం గలవాళ్ళు.

12. స్త్రీణాం వశోపాయః దేవానామపి దుర్లభః.

అ. స్త్రీలను వశంచేసుకొనే ఉపాయం దేవతలకు కూడా లభించదు.

13. కలత్రం రూపవత్, సుభగమ్, అనవద్యాచారమ్, అపత్యవత్ ఇతి మహతః పుణ్యస్య ఫలమ్.

అ. మంచి రూపం, సౌందర్యం, దోషాలు లేని నడవడి ఉన్నదీ, పుత్రులను కన్నదీ అయిన భార్య లభించాలంటే ఎంతో పుణ్యం ఉండాలి.

14. కామదేవోత్సఙ్గస్థాపి స్త్రీ పురుషాన్తరమభిలషత్యేవ.

అ. మన్మథుని ఒడిలో కూర్చున్నా స్త్రీకి మరొక పురుషుడిమీద అభిలాష ఉంటుంది.

15. న హి మోహో, భయం, లజ్జా చ స్త్రీణాం రక్షణమ్, కిన్తు పరపురుషాదర్శనం, యథేష్టం సంభోగః, సాధారణతా చ.

అ. కుటుంబమోహం కాని, లజ్జ కాని, భయం కాని స్త్రీకి రక్షణలు కావు. ఇంక నేమనగా- పరపురుషుణ్ణి చూడకపోవడం, సంతృప్తికలిగేటట్లు సంభోగం, సవతులందరితోనూ సమానమైన గౌరవం - ఇవి మాత్రమే రక్షణాలు.

పూర్వం రాజులూ, ధనికులూ చాలామంది స్త్రీలను వివాహం చేసుకొనేవారు. వివాహం చేసికోకుండా ఎంతో మందిని చేరదీసేవారు. ఈ ఘట్టంలో చెప్పిన విషయాలన్నీ అలాంటి స్త్రీలను గూర్చి చెప్పినట్లుగా కనబడతాయి.

16. దానదర్శనాలాపైః సమవృత్తే హి పుంసి స్త్రియో నాపరాధ్యన్తి; భవన్తి చ కామధేనవ ఇవ మనీషితరతయః.

అ. వస్త్రాలంకారాదులు ఇవ్వడం, కనబడడం, మాటలాడడం ఈ విషయాలలో పురుషుడు అందరినీ సమంగా చూస్తే స్త్రీలు చెడుదారి పట్టరు; కామధేనువులు వలె ఇష్టమైన విధంగా రతిని ఇస్తారు.

17. పరిగృహీతాసు స్త్రీషు ప్రియత్వమ్ అప్రియత్వం వా న మన్యేత.

అ. చేరదీసిన స్త్రీల విషయంలో వీళ్ళు ప్రియలా కాదా అనే ఆలోచన చేయకూడదు.

18. కారణవశాన్నిమ్బోఽప్యనుభూయత ఏవ.

అ. అవసరాన్ని పట్టి వేపచెట్టును కూడా అనుభవించవలసి వస్తుంది. వేపాకు తినడం, రసం తాగడం, దాని పళ్ళు తినడం వంటివి చేయవలసి వస్తుంది.

19. చతుర్థదివసస్నాతా స్త్రీ తీర్థమ్.

అ. నాల్గవ రోజున (ఋతు) స్నానం చేసిన స్త్రీ 'తీర్థం'.

20. తీర్థోపరోధః మహాధర్మానుబన్ధః.

అ. తీర్థాన్ని ఉపేక్షించడం చాలా అధర్మానికి హేతువు.

21. ఋతావపి స్త్రియముపేక్షమాణః పితౄణామృణభాజనం, స్త్రీ దూషకశ్చ భవతి.

అ. ఋతుకాలంలో కూడా స్త్రీని ఉపేక్షించినవాడు (పుత్రుల్ని కనక పోవడం చేత) పితృదేవతలకు ఋణపడతాడు; స్త్రీదూషకుడు (స్త్రీచేత పాపం చేయించినవాడు) అవుతాడు.

22. అవరుద్ధాః స్త్రియః స్వయం నశ్యన్తి, నాశయన్తి వా పతిమ్.

అ. ఋతుకాలంలో ఉపేక్షించబడిన స్త్రీలు తామైనా నశిస్తారు, భర్తనైనా నశింపచేస్తారు.

23. న స్త్రీణామకర్తవ్యే మర్యాదాస్తి.

అ. స్త్రీలు చెయ్యకూడని పని చేయడం ప్రారంభిస్తే హద్దు ఉండదు.

24. వరమవివాహః, నోఢోపేక్షణమ్.

అ. వివాహం చేసికొనకపోవడమైనా మంచిది కాని వివాహితను ఉపేక్షించడం మంచిది కాదు.

25. అకృతరక్షస్య కిం కలత్రేణ? అకృషతశ్చ కిం క్షేత్రేణ?

అ. రక్షించుకొనలేనివానికి భార్య ఎందుకు? దున్ననివానికి పొలం ఎందుకు?

26. సపత్నీవిధానం, పత్యురసమఞ్జసత్వం, విమాననమ్, అపత్యాభావః, చిరవిరహశ్చ స్త్రీణాం విరక్తికారణాని.

అ. సవతిని తీసికొనిరావడం, భర్త ప్రవర్తన సరిగా లేకపోవడం, అవమానం, సంతానం లేకపోవడం, చాలా కాలం విరహం - ఇవి స్త్రీకి వైరాగ్యం (వైమనస్యం) కలగడానికి కారణాలు.

27. న స్త్రీణాం సహజో గుణో దోషో వాస్తి; కింతు నద్యః సముద్రమివ యాదృశం పతిమాప్నువన్తి తాదృశ్యో భవన్తి స్త్రియః.

అ. స్త్రీలలో సహజంగా గుణం కాని దోషం కాని లేదు. మరేమనగా నదులు సముద్రాన్ని పొందినట్లు స్త్రీలు ఎలాంటి భర్తను పొందుతారో అలాంటి వాళ్ళే అవుతారు.

28. స్త్రీణాం దౌత్యం స్త్రియ ఏవ కుర్యుః.

అ. స్త్రీలకు దౌత్యం స్త్రీలే చెయ్యాలి.

29. తైరశ్చోఽపి పుంయోగః స్త్రియం దూషయతి, కిం పునర్మానుష్యః.

అ. ఏదైనా ఒక పురుషతిర్యగ్జంతువుతో సంబంధం కూడా స్త్రీని చెడగొడుతుంది, మనుష్యునితో సంబంధం మాట చెప్పాలా?

30. వంశవిశుద్ధ్యర్థమ్ అనర్థపరిహారార్థం చ స్త్రియో రక్ష్యన్తే, న భోగార్థమ్.

అ. స్త్రీలను రక్షించడం వంశాన్ని పరిశుద్ధంగా ఉంచుకొనడం కోసం, అనర్థాలని పరిహరించడం కోసమూను; అంతే కాని భోగంకోసం కాదు.

31. యథాకామం కామినీనాం వేశ్యానాం వా సంగ్రహః, పరమ్ అనీర్ష్యావాన్ ప్రక్రమః కల్యాణావహః.

అ. కామవతులైన స్త్రీలను, వేశ్యలను యథేచ్ఛగా స్వీకరించవచ్చును కాని ఈ విషయంలో ఈర్ష్య లేకుండా ప్రవర్తిస్తే అది కల్యాణకరం.

32. అదౌవారికే ద్వారి కో వా ప్రవిశతి?

అ. ద్వారపాలకుడు లేని గుమ్మంలోనికి ఎవడు ప్రవేశిస్తాడు?

దీని భావం అస్పష్టంగా ఉంది. 'న ప్రవిశతి' అని పాఠం అయి ఉంటుంది ద్వారపాలకుడు లేని ద్వారంలో ఎవడు ప్రవేశించడు? అని అర్థం.

33. భోజనభాజనవత్ సర్వసమానాః పణ్యస్త్రియః;కస్తాసు హర్షామర్షయోరవసరః?

అ. వేశ్యలు, భోజనపాత్రల వలె అందరికీ సమానమైనవారే. వాళ్ళ విషయంలో సంతోషించడానికి కాని, అసూయపడడానికి గాని అవకాశం ఎక్కడ ఉంది?

34. మాత్రభిజనవిశుద్ధాః ఉదవసితోపస్థాయిన్యః స్త్రియః రాజ్ఞా ఉపభోక్తవ్యాః.

అ. ఎవరి తల్లులు, కుటుంబాలు పరిశుద్ధమైనవో, ఎవరు తన ఇంటికి వస్తారో అలాంటి స్త్రీలతోనే రాజు రమించాలి (తాను ఏ స్త్రీ ఇంటికి వెళ్ళకూడదు.)

35. దర్దురస్య సర్పబిల ప్రవేశ ఇవ స్త్రీగృహప్రవేశో మహీపతీనామ్.

అ. రాజు స్త్రీగృహంలో ప్రవేశించడం కప్ప పాము కన్నంలో ప్రవేశించడం వంటిది.

36. న స్త్రీగృహాదాయాతమాపద్యపి కించిత్ స్వయమనుభవనీయమ్.

అ. స్త్రీగృహం నుంచి వచ్చిన ఏ వస్తువును కూడా, ఆపత్సమయంలో కూడా తాను (రాజు) అనుభవించకూడదు.

37. నాపి స్వయమనుభవనీయేషు స్త్రియో నియోక్తవ్యాః.

అ. తాము (రాజులు) అనుభవించవలసిన వస్తువులు మొదలైనవి సిద్ధం చేయడానికి స్త్రీలను నియమించకూడదు.

38. సంవననం స్వాతన్త్ర్యం చానుభవన్త్యః స్త్రియః కిం నామ న కుర్యుః?

అ. అభిచారికకర్మలు (ఇతరులను హింసించే కర్మలు) చేసేవాళ్ళు, స్వాతంత్ర్యం అనుభవిస్తూన్నవాళ్ళు అయిన స్త్రీలు ఏ పని చెయ్యరు?

39. శ్రూయతే హి కిల - ఆత్మనః స్వచ్ఛన్దవృత్తిమిచ్ఛన్తీ విషదూషితమద్యగణ్డూషేణ మణికుణ్డలా మహాదేవీ యవనేషు నిజతనుజరాజ్యార్థం జఘాన రాజానమజరాజమ్; విషాలక్తకదిగ్ధేనాధరేణ వసన్తమతిః శూరసేనేషు సురతవిలాసమ్, విషోపలిప్తేన మేఖలామణినా వృకోదరీ దశార్ణేషు మదనార్ణవమ్, నిశితనేమినా ముకురేణ మదిరాక్షీ మగధేషు మన్మథవినోదమ్, కబరీనిగూఢేన అసిపత్రేణ చణ్డరసా పాణ్డ్యేషు పుణ్డరీకం చేతి.

అ. యవనదేశంలో మణికుండల అనే రాణి తాను స్వేచ్ఛగా ప్రవర్తించాలనే కోరికతో, తన కుమారునికి రాజ్యం సంపాదించాలనే ఉద్దేశ్యంతో అజరాజును విషం కలిపిన మద్యం గండూషంచేత (పుక్కిలించిన మద్యంచేత) చంపినదనీ, శూరసేనదేశంలో వసంతమతి విషం కలిపిన లత్తుక (పెదవులకు పూసుకొనే రంగు) రాసుకొన్న అధరోష్ఠంచేత సురతవిలాసుణ్ణి చంపినదనీ దశార్ణ

దేశంలో వృకోదరి విషం పూసిన వడ్డాణపు మాణిక్యంచేత మదనార్ణవుణ్ణి చంపిన దనీ, మగధదేశంలో మదిరాక్షి వాడియైన అంచు గల అద్దంతో మన్మథవినోదుణ్ణి చంపివేసిన దనీ, పాండ్యదేశంలో చండరస కొప్పులో దాచుకొన్న కైజారుతో పుండరీకుణ్ణి చంపివేసిందనీ వింటున్నాం కదా?

40. అమృతసురావాప్య ఇవ క్రీడాసుఖోపకరణం స్త్రియః; కస్తాసాం కార్యాకార్యావలోకనే అధికారః?

అ. అమృతపు దిగుడు బావుల వలె, మద్యపు దిగుడుబావులు వలె స్త్రీలు క్రీడలకు, సుఖానికీ సాధనమైనవారు; కార్యాకార్యాలను పరీక్షించడానికి వాళ్ళకు అధికారం ఏమి ఉంటుంది?

41. అపత్యపోషణే, గృహకర్మణి, శరీరసంస్కరణే భర్తుః శయనావసరే చ స్త్రీణాం స్వాతన్త్ర్యమ్;నాన్యత్ర.

అ. సంతానాన్ని పోషించడంలోను, ఇంటి పనులలోను, శరీరాన్ని అలంకరించుకొనడంలోను, భర్త శయనించే సమయంలోనూ మాత్రమే స్త్రీలకు స్వాతంత్ర్యం; ఇతర విషయాలలో లేదు.

42. అతిప్రసక్తం హి స్త్రీషు స్వాతన్త్ర్యం కరపత్రమివ పత్యుర్నా విదార్య హృదయం విశ్రామ్యతి.

అ. స్త్రీలకి అధికంగా స్వాతంత్ర్యం ఇచ్చినట్లయితే అది రంపం వలె భర్త హృదయాన్ని చీల్చకుండ ఆగదు.

43. స్త్రీవశః పురుషః నదీప్రవాహపతితః పాదప ఇవ న చిరం నన్దతి.

అ. స్త్రీకి లొంగిపోయిన పురుషుడు నదీప్రవాహంలో పడిన చెట్టు వలె చాల కాలం సుఖంగా ఉండజాలడు.

44. పురుషముష్టిస్థా హి స్త్రీ ఖడ్గయష్టిరివ కముత్సవం న జనయతి?

అ. పురుషుని పిడికిట్లో ఉన్న స్త్రీ, ఖడ్గం వలె, ఏ ఉత్సవం కలిగించదు?

45. నాతీవ స్త్రియో వ్యుత్పాదనీయాః, యతః స్వభావసుభగోఽపి శాస్త్రోపదేశః స్త్రీషు, శస్త్రీషు పయోలవ ఇవ, విషమతాం ప్రతిపద్యతే.

అ. స్త్రీలకు ఎక్కువగా చదువు చెప్పకూడదు. ఎందుచేత ననగా శాస్త్రోపదేశం సహజంగా మంచిదే అయినా, వాడియైన చాకులమీద పడిన నీటిబిందువు వలె, స్త్రీలలో విషమత్వాన్ని పొందుతుంది. (వాళ్ళల్లో వికారం కలిగిస్తుంది.)

46. వేశ్యాసక్తిః కస్య న ప్రాణార్థమానహానిం కరోతి?

అ. వేశ్యలయందు ఆసక్తివల్ల ప్రాణహానీ, ధనహానీ, మానహానీ కలగనివా డెవడైనా ఉంటాడా?

47. ధనమనుభవన్తి వేశ్యాః, న పురుషమ్.

అ. వేశ్యలు అనుభవించేది ధనాన్నే కాని పురుషుణ్ణి కాదు.

48. ధనహీనే కామదేవేఽపి న ప్రీతిం బధ్నన్తి వేశ్యాః.

అ. ధనంలేని వాడు సాక్షాత్తు మన్మథుడే అయినా, అతనిమీద వేశ్యలకు ప్రీతి ఉండదు.

49. స పుమాన్న భవత్యాయతిసుఖీ యస్యాననుశయం వేశ్యాసు దానమ్.

అ. ముందువెనుకలు చూచుకొనకుండా వేశ్యలకు ధనం ఇచ్చేవాడు భవిష్యత్తులో సుఖవంతుడు కాజాలడు.

50. స పశోరపి పశుః, యః, స్వధనేన పరేషామర్థవతీం కరోతి వేశ్యామ్.

అ. పరుల వేశ్యను స్వధనం ఇచ్చి ధనవంతురాలుగా చేసేవాడు పశువు కంటె కూడ పశువు (నికృష్టుడు).

51. అధ్రువేణాధికేనాప్యర్థేన వేశ్యామనుభవన్ పురుషః న చిరమనుభవతి సుఖమ్.

అ. అస్థిరమైన అధికధనంతో వేశ్యను అనుభవించేవాడెవడైనా చిరకాలం సుఖం అనుభవించజాలడు.

52. ఆచిత్తవిశ్రాన్తేర్వేశ్యాపరిగ్రహః శ్రేయాన్.

అ. చిత్తానికి విశ్రాంతి కలిగేవరకూ (మోజు తీరేవరకూ) వేశ్యను స్వీకరించడం మంచిది.

53. విసర్జనాకారణాభ్యాం తదనుభవే మహాననర్థః.

అ. వేశ్యను విడిచివేస్తూ మళ్ళీ పిలుస్తూ ఆమెను అనుభవిస్తే గొప్ప అనర్థం కలుగుతుంది.

54. యథా సురక్షితాపి వేశ్యా స్వాం ప్రకృతిం న ముఞ్చతి, తథా లోభోపహతాఽసతీ చ పరపురుషాన్ భజతే.

అ. ఎంత రక్షించినా వేశ్య తన స్వభావాన్ని విడిచిపెట్టనట్లే అధికలోభం గల కులట పరపురుషుల్ని పొందుతూనే ఉంటుంది.

55. యా యస్య ప్రకృతిః సా తస్య దేవైరప్యపనేతుం న శక్యతే.

అ. ఎవనికి ఏది స్వభావమో దానిని దేవతలు కూడా మార్చజాలరు.

56. సుభోజితోఽపి శ్వా కిమశుచీన్యస్థీని పరిహరతి!

అ. కుక్కకి ఎంత మంచి ఆహారం పెట్టినా అది అపవిత్రాలైన ఎముకలను విడిచిపెడుతుందా?

57. క్షీరాజ్యశర్కరయా భోజితోఽప్యహిః న కదాచిద్విషం పరిత్యజతి.

అ. సర్పానికి పాలు, నెయ్యి, పంచదారా పెట్టినా కూడ అది ఎన్నటికీ విషం విడిచిపెట్టదు.

58. న ఖలు శిక్షాశతేనాపి కపిః చాపల్యం పరిహరతి.

అ. వంద విధాల నేర్పించినా కూడ కోతి చపలత్వాన్ని విడిచిపెట్టదు కదా?

59. ఇక్షురసేనాపి సిక్తో నిమ్బః కటురేవ.

అ. చెరకురసంతో తడిపినా వేప చేదుగానే ఉంటుంది.

60. తారుణ్యమవైకృత్యం చ సంస్కారాహారోపయోగాదిజన్యం శరీరస్య రమణీయత్వమ్, న పునః స్వభావః.

అ. యౌవనమూ, స్నానాదిసంస్కారాలవల్లా ఆహారోపయోగాదులవల్లా లేదా ఆహారంవల్లా జాగ్రత్తగా వాడుకోవడం మొదలైనదానివల్లా కలిగే అవైకృత్యమూ (వికారా లేవీ లేకపోవడమూ), ఈ రెండే శరీరానికి సౌందర్యం ఇచ్చేవి. అంతేనే కాని శరీరసౌందర్యం సహజం కాదు.

61. సంమానాదవసాదః కుల్యానామపరిగ్రహహేతుః.

అ. అందరి సన్మానం నుండి దూరం అవడం (అనగా అందరికీ మాన్యుడు కాకపోవడం) సమానకులంవాళ్ళని దగ్గరికి తీసికొనకపోవడానికి కారణం. అనగా సమానకులానికి (తన వంశానికి) చెందిన వాళ్ళనైనా, వాళ్లు అందరికీ సన్మానపాత్రులు కాని పక్షంలో, దగ్గరికి రానీయ కూడదు అని అర్థం.

62. తన్త్రకోశవర్ధనీ వృత్తిః దాయాదాన్ వికారయతి.

అ. రాజ్యతంత్రాన్నీ, ధనకోశాన్నీ వృద్ధి పొందించే వృత్తి (ప్రవర్తన) దాయాదులలో వికారం పుట్టిస్తుంది. అనగా రాజ్యంలో అంతా బాగుంటే దాయాదుల దృష్టి దానిమీద పడుతుంది. ఒక ఆస్తిలో తమకు కూడా భాగం ఉందనుకొనేవాళ్ళు దాయాదులు.

63. భక్తివిశ్రమ్భాదేశావ్యభిచారిణం కుల్యం, పుత్రం వా సంవర్ధయేత్, వినియుఞ్జీత చోచితేషు కర్మసు.

అ. (రాజ) భక్తి, విశ్వాసం, ఆజ్ఞ వీటి విషయంలో ఎప్పుడూ మార్పు చెందని తన వంశానికి చెందిన వానిని గాని, పుత్రుణ్ణి గాని వృద్ధిలోనికి తీసికొని రావాలి. అతనిని తగిన పనులలో నియోగించాలి.

64. భర్తురాదేశం న వికల్పయేత్, అన్యత్ర ప్రాణబాధాబహుజన విరోధపాతకేభ్యః.

అ. (తన లేదా ప్రభువు) ప్రాణాలకి బాధ, చాలామందితో విరోధం, మహాపాపం కలుగుతాయి అన్నప్పుడు తప్ప ఎన్నడూ ప్రభువు ఆజ్ఞకు విరుద్ధంగా చేయకూడదు.

65. బలవత్పక్షపరిగ్రహేషు దాయిషు ఆప్తపురుషపురఃసరో విశ్వాసః, వశీకరణం, గూఢపురుషనిక్షేపః, ప్రణిధిర్వా.

అ. దాయాదుల్ని బలవంతులైనవాళ్ళ పక్షం తమవైపు తిప్పుకొన్నప్పుడు (దాయాదుల పక్షం బలంగా ఉన్నప్పుడు) పెద్దమనుష్యుల్ని ఎదట ఉంచుకొని వాళ్ళకు తనమీద విశ్వాసం కలిగే టట్లు చేసుకోవడం కాని, వాళ్ళని వశం చేసుకోవడం గాని, గూఢపురుషనిక్షేపం గాని (వాళ్ళని హతమార్చడానికై రహస్యంగా కొందరు పురుషుల్ని [గూండాలను] ఏర్పాటు చేయడం), గూఢచారుల ప్రయోగం (వాళ్ళ ద్వారా వార్తలు సేకరించడం) గాని చెయ్యాలి.

66. దుర్బుద్ధౌ సుతే దాయిని వా సమ్యగ్యుక్తిభిర్బుద్ధిమవతారయేత్.

అ. కుమారుడు గాని, దాయాది గాని దుర్బుద్ధితో ఉన్నప్పుడు మంచి యుక్తులతో (Brain washing methods) ఆతని దుర్బుద్ధిని తొలగించాలి.

67. సాధుష్వాపచర్యమాణేషు వికృతిభజనం స్వహస్తాదఙ్గారాపకర్షణ మివ.

అ. ఉపచర్యమాణులైన సాధువుల విషయంలో, అనగా మంచి విషయాలు నేర్చుకొనడం కోసం తాను ఏ సత్పురుషుల దగ్గరకు చేరాడో వారి విషయంలో, వికారం పొందడం (చెడ్డగా ప్రవర్తించడం) తన చేతితో కణకణలాడుతూన్న నిప్పు లాగడం వంటిది.

68. క్షేత్రబీజయోర్వైకృత్యమపత్యాని వికారయతి.

అ. క్షేత్రం (స్త్రీ)లో కాని, బీజం (పురుషుడు)లో గాని ఉన్న లోపం సంతానంలో వికారాన్ని కలిగిస్తుంది.

69. కులవిశుద్ధిః, ఉభయతః ప్రీతిః, మనఃప్రసాదః, అనుపహత సమయః, శ్రీసరస్వత్యావాహనమన్త్రపూతపరమాన్నోపయోగశ్చ గర్భాధానే పురుషోత్తమమవతారయతి.

అ. స్త్రీపురుషుల వంశాలు శుద్ధములై ఉండడం, ఇద్దరికీ సమానమైన పరస్పర ప్రేమ, వాళ్ళ మనస్సు నిర్మలంగా ఉండడం, ఏ విఘ్నాలూ లేని సమయం, లక్ష్మీసరస్వతుల ఆవాహనం చేసే మంత్రాలచేత పవిత్రమైన పరమాన్నం భుజించడం- ఇవి గర్భాధానం జరిగినప్పుడు, ఉత్తమపురుషుణ్ణి అవతరింపచేస్తాయి. ఇట్టి పరిస్థితులలో ఉన్న దంపతులకు సత్సంతానం పుడుతుంది అని భావం.

70. గర్భశర్మజన్మకర్మ అపత్యేషు పరిశుద్ధదేహలాభాత్మలాభయోః పరమం కారణమ్.

అ. గర్భానికి సుఖం (క్షేమం) కలిగించే జన్మకర్మ (సీమంతోన్నయన పుంసవనాది సంస్కారం) సంతానానికి పరిశుద్ధమైన దేహమూ, ఆత్మలాభమూ (తన స్వరూపాన్ని తాను తెలిసికొని ఉత్తమ స్థితిని పొందగలిగిన బుద్ధిబలమూ) కలగడానికి కారణం.

71. స్వజాతియోగ్యసంస్కారహీనానాం రాజ్యే వా ప్రవ్రజ్యాయాం వా నాస్త్యధికారః.

అ. తమ జాతికి తగిన సంస్కారం (వైదిక సంస్కారం) లేనివాళ్ళకు రాజ్యానికి గాని సంన్యాసానికి గాని అధికారం లేదు.

72. అసతియోగ్యేఽన్యస్మిన్ అఙ్గవిహీనోఽపి పితృపదమర్హత్యా పుత్రోత్పత్తేః.

అ. యోగ్యుడైన మరొకడు లేనప్పుడు ఏదైనా అవయవలోపం ఉన్నవాడు కూడా, తనకు పుత్రుడు కలిగేవరకు, తండ్రిస్థానాన్ని (రాజ్యాన్ని) అధిష్ఠించవచ్చును.

73. సాధుసంపాదితో హి రాజపుత్రాణాం వినయః అన్వయం, నయమ్, అభ్యుదయం చ న దూషయతి.

అ. రాజపుత్రులకు సత్పురుషులు నేర్పిన వినయం వంశాన్ని, నీతిని, అభివృద్ధిని చెడిపోకుండా కాపాడుతుంది.

74. ఘుణజగ్ధం కాష్ఠమివ అవినీతరాజపుత్రం రాజకులం అభియుక్తమాత్రం భజ్యేత.

అ. రాజపుత్రులలో వినయం లేకపోతే ఆ రాజవంశం పురుగులు దొలిచిన కట్టె వలె, (ఎవరైనా వచ్చి) ఎదిరించగానే నశిస్తుంది.

75. ఆప్తవిద్యావృద్ధోపరుద్ధాః సుఖోపరుద్ధాశ్చ రాజపుత్రాః పితరం నాభిద్రుహ్యన్తి.

అ అప్తులచేత విద్యావృద్ధులచేత కట్టుబాటులో పెట్టబడిన, సుఖాలకు మరిగిన రాజపుత్రులు తండ్రికి ఎదురుతిరగరు.

76. మాతాపితరౌ రాజపుత్రాణాం పరమం దైవమ్, యత్ప్రసాదాదాత్మలాభో రాజ్యలాభశ్చ.

అ. ఏ తలిదండ్రులవల్ల తమకు శరీరం లభించిందో, రాజ్యం లభించిందో అలాంటి తలిదండ్రులే రాజపుత్రులకు గొప్ప దేవతలు.

77. మాతాపితృభ్యాం మనసాప్యవమన్యమానేష్వభిముఖాః అపి శ్రియః విముఖీభవన్తి.

అ. మనస్సుచేత కూడ తలిదండ్రులు అవమానం చేస్తే (చెడ్డగా తలుస్తే) అలాంటి పుత్రులకు ఎదురుగా వచ్చే ఐశ్వర్యాలు కూడా వెనుకకు తిరిగి వెళ్ళి పోతాయి.

78. కిం తేన రాజ్యేన యత్ర దురపవాదోపహతం జన్మ.

అ. చెడ్డ అపవాదులచేత జన్మ పాడైపోయిన తరవాత రాజ్యం ఉండి ఏమి ప్రయోజనం?

79. క్వచిదపి కర్మణి పితురాజ్ఞాం న లఙ్ఘయేయుః.

అ. ఏ పనిలోనూ కూడా తండ్రి ఆజ్ఞను మీరకూడదు.

80. కిం ఖలు రామః క్రమేణ విక్రమేణ వా హీనః, యః పితు రాజ్ఞయా వనమావివేశ.

అ. రాముడు తండ్రి ఆజ్ఞచేత అరణ్యానికి వెళ్ళాడనగా, ఆతనికి క్రమం కాని (పుత్రులలో జ్యేష్ఠ డవడం అనేది కాని) పరాక్రమం కాని లేక వెళ్ళాడా?

81. యః ఖలు పుత్రః అభీప్సితకర్మణి పరంపరాభిర్లభ్యతే స కథ ముపహన్తవ్యః?

అ. ఇష్టమైన పనియందు పరంపరలచేత లభించే పుత్రుణ్ణి చంపడం ఎట్లు? (దీని భావం స్పష్టంగా లేదు.)

82. కర్తవ్యమేవాశుభం కర్మ యది హన్యమానస్య విపద్విధాన మాత్మనో న భవేత్.

అ. చంపబడేవాడు కల్పించే ఆపద తనకు రాకుండా ఉండాలంటే అశుభకర్మ కూడా చెయ్యవలసినదే.

83. తే ఖలు రాజపుత్రాః సుఖినః యేషాం పితరి రాజ్యభారః.

అ. రాజ్యభారం అంతా తండ్రిమీదనే ఉన్న రాజపుత్రులు సుఖవంతులు.

84. అలం తయా శ్రియా, యా న కిమపి సుఖం జనయన్తీ వ్యాసఙ్గ పరంపరాభిః శతశో దుఃఖమేవానుభావయతి

అ. ఏ ఐశ్వర్యం ఏ మాత్రమూ సుఖం ఇవ్వకుండా వరసగా వచ్చే వందలకొలది చిత్తవిక్షోభాలచేత దుఃఖాన్నే కలిగిస్తుందో అలాంటి ఐశ్వర్యం వద్దు.

85. నిష్ఫలో హ్యారమ్భః కస్య నామోదర్కే సుఖావహః.

అ. నిష్ఫలమైన ప్రయత్నం భవిష్యత్తులో ఎవనికి సుఖం కలిగిస్తుంది?

86. పరక్షేత్రే కృషతః కర్షయతో వా వృథా శ్రమః; ఫలం హి తస్యైవ యస్య తత్ క్షేత్రమ్.

అ. ఎవడు ఇతరుల పొలంలో దున్నుతాడో, లేదా దున్నిస్తాడో వాని శ్రమ వ్యర్థం; ఎందుచేత ననగా పంట పొలం కలవానికే చెందుతుంది.

87. సుతసోదరసాపత్నపితృవ్యకుల్యదౌహిత్రాగన్తుకేషు పూర్వపూర్వాభావే భవత్యుత్తరోత్తరస్య రాజ్యపదావాప్తిః.

అ. పుత్రుడు, సోదరుడు, సవతి తమ్ముడు, పినతండ్రి, తన వంశానికి చెందినవాడు, దౌహిత్రుడు బైటనుండి వచ్చినవాడు- వీళ్ళలో వెనక వెనకవాడు లేకపోతే తరవాత తరవాత వానికి రాజ్యం లభిస్తుంది. పుత్రుడు లేకపోతే సోదరుడికి ఇత్యాదివిధంగా అని అర్థం.

88. శుష్కశ్యామవక్త్రతా,వాక్స్తమ్భః,వాగ్భేదః, స్వేదః,విజృమ్భణమ్, అతిమాత్రవేపథుః, ప్రస్ఖలనమ్, బాహ్యవిప్రేక్షణమ్, ఆస్యప్రేక్షణమ్, ఆవేగః, స్వకర్మణి స్వభూమౌ చానవస్థానమ్- ఇతి దుష్కృతం కృతవతః కరిష్యతో వా లిఙ్గాని.

**ఇతి రాజరక్షాసముద్దేశః.**

అ. ముఖం ఎండిపోయి నల్లబడడం, మాట రాకపోవడం, మాటలు తడబడడం, చెమట, ఆవులింతలు, మిక్కిలి వణుకు, తొట్రుపాటు, బైటకు చూస్తూ ఉండడం, ముఖంకేసి చూడడం, కంగారు, తన పనిలో, తాను నిలచినచోట స్థిరంగా నిలబడకపోవడం-ఇవి చెడ్డపని చేసినవానికీ, చేయనున్నవానికీ చిహ్నాలు.

"బాలానందిని" అనే సోమదేవనీతిసూత్రాంధ్రవ్యాఖ్యానంలో

రాజరక్షాసముద్దేశం సమాప్తం.

## 25. దివసానుష్ఠాన సముద్దేశః

1. బ్రాహ్మే ముహూర్తే ఉత్థాయ ఇతికర్తవ్యతాయాం సమాధి ముపేయాత్.

అ. బ్రాహ్మముహూర్తంలో (సూర్యోదయానికి ముందు రెండు ఘడియల కాలం - 48 నిమిషాల కాలం - బ్రాహ్మ ముహూర్తం) నిద్రనుండి లేచి, చేయవలసిన పనులను గూర్చి ఏకాగ్రచిత్తంతో ఆలోచించాలి.

2. సుఖనిద్రాపన్నే హి మనసి ప్రతిఫలన్తి సర్వా బుద్ధయో యథార్థాః.

అ. సుఖనిద్ర పొందిన (పొంది లేచిన) మనస్సులో అన్ని బుద్ధులూ (ఆలోచనలూ) యథార్థాలుగా ప్రతిఫలిస్తాయి. అనగా ఆలోచనాశక్తి బాగుంటుంది.

3. ఉదయాస్తమనసంధిషు ధర్మకార్యాతిక్రమః దోషాయ.

అ. సూర్యోదయసూర్యాస్తమనసంధ్యాకాలాలలో ధర్మకార్యాలను దాటబెట్టడం దోషహేతువు.

"ఉదయాస్తమనశాయిషు భవతి ధర్మకాలాతిక్రమః" అని మరొక పాఠం. సూర్యోదయ - సూర్యాస్తమనసమయాలలో నిద్రించేవాళ్ళకి ధర్మకార్యాల కాలం దాటిపోతుంది.

4 ఆత్మవక్త్రమ్ ఆజ్యే దర్పణే వా నిరీక్షేత.

అ. (నిద్రనుండి లేవగానే) తన ముఖం నేతిలో కాని, అద్దంలో కాని చూచుకోవాలి.

5. న వర్షధరం వికలాఙ్గం వా ప్రాతః పశ్యేత్.

అ. కొజ్జావానిని కాని, అంగవైకల్యం ఉన్నవానిని కాని ప్రొద్దుటనే చూడకూడదు.

6. సంధ్యాస్వధౌతముఖపాదం జ్యేష్ఠా దేవతా నానుగృహ్ణాతి.

అ. సంధ్యాకాలాలలో ముఖప్రక్షాలన, పాదప్రక్షాలన చేయనివానిని జ్యేష్ఠాదేవత (వందనీయురాలైన ఒక ఉత్తమదేవత) అనుగ్రహించదు.

7. నిత్యమదన్తధావనస్య నాస్తి ముఖశుద్ధిః.

అ. నిత్యమూ దంతధావనం చేసుకొనని వాని ముఖం (నోరు) పరిశుద్ధంగా ఉండదు.

8. న కార్యవ్యాసఙ్గేన శారీరం కర్మోపహన్యాత్.

అ. పనుల తొందరలో శరీరానికి సంబంధించిన పనులు (కాలకృత్యాదులు) మానకూడదు.

9. న ఖలు యుగైరపి తరఙ్గవిగమాత్ సాగరే స్నానమ్.

అ. యుగాలకొలదీ నిరీక్షించినా తరంగాలు తగ్గిన తరవాత సముద్రంలో స్నానం చేయడం అనేది కుదరదు కదా ?

10. వేగవ్యాయామస్వాపస్నానభోజనస్వచ్ఛన్దవృత్తికాలాన్ నోపరున్ధ్యాత్.

అ. (మలమూత్రాదుల) వేగం, వ్యాయామం, నిద్ర, స్నానం, భోజనం, విశ్రాంతిగా ఉండడం - వీటి కాలాలను అడ్డుపెట్టకూడదు. వీటిని యథాకాలంగా జరపాలి.

11. శుక్లమలమూత్రమరుద్వేగసంరోధః అశ్మరీభగందరగుల్మార్శసాం హేతుః.

అ. శుక్లం, మలం, మూత్రం, గాలి - వీటి వేగాన్ని అడ్డగించడంవల్ల మూత్రకృచ్ఛ్రం, భగందరం, గుల్మం, మూలశంఖ, (అనే రోగాలు) కలుగుతాయి.

12. గన్ధలేపావసానం శౌచమాచరేత్.

అ. దుర్వాసన, లేపమూ తొలగేవరకు శౌచం చేసుకోవాలి.

13. బహిరాగతో నానాచమ్య గృహం ప్రవిశేత్.

అ. బైటకు వచ్చినవాడు ఆచమనం చేయకుండా ఇంటిలోనికి వెళ్ళకూడదు.

14. గోసర్గే వ్యాయామః రసాయనమ్, అన్యత్ర క్షీణాజీర్ణవృద్ధవాతకిరూక్షభోజిభ్యః.

అ. దుర్బలంగా ఉన్నవాళ్ళు, అజీర్ణంతో బాధపడుతున్నవాళ్ళు, ముసలి వాళ్లు, వాతరోగులు, ఎక్కువగా కారం తినేవాళ్ళు తప్ప మిగిలినవాళ్ళకి అపులను బైటకు వదిలే వేళ అనగా ఉషఃకాలంలో, వ్యాయామం చేయడం రసాయనం వంటిది.

15. శరీరాయాసజననీ క్రియా వ్యాయామః.

అ. శరీరానికి అయాసం కలిగించే పని వ్యాయామం.

16. శస్త్రవాహనాభ్యాసేన వ్యాయామం సఫలయేత్.

అ. శస్త్రాభ్యాసంచేత వాహనాభ్యాసంచేత వ్యాయామం సఫలం అయేటట్లు చేసుకోవాలి. వీటివల్ల శరీరానికి ఆయాసమూ కలుగుతుంది, శస్త్రాదిప్రయోగంలో నేర్పూ కలుగుతుంది అని భావం.

17. ఆదేహస్వేదం వ్యాయామకాలముశన్త్యాచార్యాః.

అ. దేహానికి చెమట పట్టేవరకు వ్యాయామం చేయాలని అచార్యుల అభిప్రాయం.

18. బలాతిక్రమేణ వ్యాయామః కాం నామ నాపదం జనయతి.

అ. బలాన్ని మించి చేసిన వ్యాయామం ఎంతటి ఆపదనైనా కలిగిస్తుంది.

19. అవ్యాయామశీలేషు కుతోఽగ్నిదీపనమ్, ఉత్సాహః, దేహదార్ఢ్యం చ?

అ. వ్యాయామం చేయడం అలవాటు లేనివాళ్ళకి జఠరాగ్ని దీపనం కాని, ఉత్సాహం కాని, దేహానికి దార్ఢ్యం కాని ఎలా వస్తాయి?

20. ఇన్ద్రియాత్మమనోమరుతాం సూక్ష్మావస్థా స్వాపః.

అ. ఇంద్రియాలు, ఆత్మ, మనస్సు, వాయువు - వీటి సూక్ష్మావస్థయే అనగా ఇవన్నీ అణిగి ఉండడమే, నిద్ర.

21. యథానియమం స్వాపాద్భుక్తాన్నపాకో భవతి, ప్రసీదన్తి చేన్ద్రియాణి.

అ. నియమానుసారం నిద్రపోతే తిన్న అన్నం అరుగుతుంది, ఇంద్రియాలు ప్రసన్నాలౌతాయి (అలసట పోయి చురుగ్గా పని చేస్తాయి).

22. అఘట్టితమ్ అపిహితం చ భాజనం న ఖలు సాధు సాధయ త్యన్నాని.

అ. బాగా దట్టించని, మూత పెట్టని పాత్ర అన్నాలను బాగా సాధించదు కదా? కుండ గట్టిగా ఉండేటట్లు తయారుచేసి మూత పెట్టి వండుతేనే అన్నం ఉడుకుతుంది. నియమానుసారం నిద్ర కూడా అన్నం జీర్ణం అవడానికి అలాంటిదే అని భావం.

23. నిత్యం స్నానం, ద్వితీయముత్పాదనం, తృతీయమాయుష్యం, చతుర్థకం ప్రత్యాయుష్యకమ్ ఇతి అహీనం సేవేత.

అ. ప్రతిరోజూ మొదటి నిత్యస్నానమూ, రెండవ ఉత్పాదనస్నానం, మూడవ ఆయుష్యస్నానం, నాల్గవ ప్రత్యాయుష్యస్నానం చెయ్యాలి.

ఇది అధికపాఠం కాబోలు- దీనిని బ్రాకెట్లులో ఇచ్చారు. 'ఉత్పాదనం'కు బదులు 'ఉత్సాహనం' అని ఉంటే బాగుంటుంది. ఉత్సాహజనకం అని అర్థం. మొత్తంమీద సూత్రార్థం అస్పష్టంగా ఉంది.

24. ధర్మార్థకామశుద్ధిదుర్జనస్పర్శాః స్నానస్య కారణాని.

అ. ధర్మార్థకామాల ప్రాప్తి, అశుద్ధి, దుర్జనుల స్పర్శ- ఇవి స్నానానికి కారణాలు.

25. శ్రమస్వేదాలస్యవిగమః స్నానస్య ఫలమ్.

అ. అలసట, చెమట, బద్ధకం - ఇవి తొలగిపోవడమే స్నానానికి ఫలం.

26. జలచరస్యేవ తత్ స్నానం, యత్ర న సన్తి దేవగురుధర్మోపాసనాని.

అ దేవతా-గురు-ధర్మాల ఉపాసన పూజ (లేని) స్నానం జలచరాలైన మత్స్యాదుల స్నానం వంటిది.

27. ప్రాదుర్భవత్క్షుత్పిపాసః అభ్యఙ్గనస్నానం న కుర్యాత్.

అ. ఆకలి, దప్పిక, కలుగుతూన్నవాడు అభ్యంగస్నానం చేయకూడదు.

28. ఆతపసంతప్తస్య జలావగాహః దృఙ్మాన్ద్యం శిరోవ్యథాం చ కరోతి.

అ. ఎండలో తిరిగినవాడు నీటిలో మునుగుతే చూపుకు మాంద్యం, తల నొప్పి కలుగుతాయి.

29. బుభుక్షాకాల ఏవ భోజనకాలః.

అ. ఆకలి వేసే కాలమే భోజనానికి కాలం.

30. అక్షుధితేనామృతమపి భుక్తం విషం భవతి.

అ. ఆకలి లేనివాడు అమృతం తిన్నా అది విషం అవుతుంది.

31. జఠరాగ్నిం వజ్రాగ్నిం కుర్వన్ ఆహారస్యాదౌ సదైవ వజ్రకం కబలయేత్.

అ. జఠరాగ్నిని వజ్రాగ్నినిగా (తీవ్రమైనదానినిగా) చేయడానికి ఆహారానికి ముందు, ఎల్లప్పుడూ, వజ్రకాన్ని తినాలి లేదా తాగాలి. వజ్రకం అనగా పుల్లని గంజి అనీ, అభ్రకం అనీ కూడ నిఘంటువులలో అర్థాలున్నాయి. ఇక్కడ ఏ అర్థమో వైద్యులే చెప్పాలి.

32. నిరన్నస్య సర్వం ద్రవద్రవ్యం అగ్నిం నాశయతి.

అ. తినవలసిన అన్నం లేకుండా ఆహారం అంతా ద్రవద్రవ్యమయమే అయితే అది జఠరాగ్నిని నశింప చేస్తుంది.

33. అతిశ్రమపిపాసోపశాన్తౌ న పేయాయాః పరం కారణమస్తి.

అ. మిక్కిలి అలసట, దాహమూ శాంతించాలంటే వరి అన్నం గంజిని మించిన కారణం (సాధనం) మరొకటి లేదు.

34. ఘృతాధరోత్తరం భుఞ్జానః అగ్నిం దృష్టిం చ లభతే.

అ. ముందూ చివరా నేతితో (మంచి ఆవు నేతితో) భోజనం చేసేవాని జఠరాగ్ని, చూపూ కూడా బాగుంటాయి.

35. సకృద్భూరినీరోపయోగః వహ్నిమవసాదయతి.

అ. ఒకేమారు చాలా నీళ్ళు త్రాగడంవల్ల జఠరాగ్ని చల్లారిపోతుంది.

36. క్షుత్కాలాతిక్రమాత్ అన్నద్వేషః దేహసాదశ్చ భవతి.

అ ఆకలివేళ దాటితే అన్నం మీద ద్వేషం పుడుతుంది. (అన్నం సహించదు). శరీరం దుర్బలం అవుతుంది.

37. విధమితే వహ్నౌ కిం నామేన్ధనం కుర్యాత్?

అ. అగ్నిని చల్లార్చేసిన తరవాత కట్టెలు వేసి ఏమి ప్రయోజనం?

38. యో మితం భుఙ్క్తే స బహు భుఙ్క్తే.

అ. ఎవడు మితంగా తింటాడో అతడు చాలా తింటాడు. చాలా తిన్నంత మాత్రాన బలం రాదు; మితంగా తింటేనే ఆహారం వంటబడుతుంది అని అర్థం.

39. అప్రమితమ్, అసుఖం, విరుద్ధమ్, అపరీక్షితమ్, అసాధుపాకమ్, అతీతరసమ్, ఆకాలం చాన్నం నానుభవేత్.

అ. అధికంగా ఉన్నది, సుఖకరం కానిది (రుచిగా లేనిది), తన శరీరానికి పడనిది, బాగా పక్వం కానిది, రసం పోయినది (నిలవ ఉన్నది), సమయం కాని సమయంలో లభించినదీ అయిన ఆహారం తినకూడదు.

40. ఫల్గుభుజమ్, అననుకూలం, క్షుధితమ్, అతిక్రూరం చ న భుక్తిసమయే సంనిధాపయేత్.

అ. భోజనం చేసేటప్పుడు చాలా తక్కువ తినేవాణ్ణి, తనకు అనుకూలుడు కానివాణ్ణి, ఆకలిగొన్నవాణ్ణి, అతిక్రూరుణ్ణి దగ్గర ఉండనీయకూడదు.

41. గృహీతగ్రాసేషు సహభోజిషు ఆత్మనే పరివేషయేత్.

అ. కూడా భోజనం చేసేవాళ్లు తినడం ప్రారంభించిన తరవాత తనకు వడ్డింప చేసుకోవాలి.

42. తథా భుఞ్జీత, యథా సాయమన్యేద్యుశ్చ న విపద్యతే వహ్నిః.

అ. సాయంకాలానికి, మరునాటికీ జఠరాగ్ని చెడిపోకుండా ఉండే టట్లు భోజనం చేయాలి.

43. న భుక్తిపరిమాణే సిద్ధాన్తోఽస్తి.

అ. భోజనం ప్రమాణం విషయంలో సిద్ధాంతం ఏదీ లేదు.

44. వహ్న్యభిలాషాయత్తం హి భోజనమ్.

అ. భోజనం జఠరాగ్నికి ఉన్న అభిలాషను పట్టి ఉంటుంది కదా?

45. అతిమాత్రభోజీ దేహమగ్నిం చ విధురయతి.

అ. అతిగా తినేవాడు దేహాన్ని, జఠరాగ్నినీ కూడా దుర్బలం చేస్తాడు.

46. దీప్తో వహ్నిః లఘుభోజనాత్ బలం క్షపయతి.

అ. ప్రదీప్తమైన (చురుకుగా ఉన్న) జఠరాగ్ని లఘుభోజనం చేస్తే బలాన్ని క్షీణింపచేస్తుంది.

47. అత్యశితుః దుఃఖేనాన్నపరిణామః.

అ. అతిగా తినేవానికి అన్నం అతికష్టంమీద జీర్ణం అవుతుంది.

48. శ్రమార్తస్య పానం భోజనం చ జ్వరాయ ఛర్దయే వా.

అ. బాగా అలసిపోయినవాడు త్రాగినా, భోజనం చేసినా జ్వరమైనా వస్తుంది, వాంతులైనా వెదతాయి.

49. న జిహాత్సుః న ప్రస్రోతుమిచ్ఛుః నాసమఞ్జసమనాః నానపనీయ పిపాసోద్రేకం చాశ్నీయాత్.

అ. మలవిసర్జనం చేయాలనుకొనేవాడు, మూత్రవిసర్జనం చేయాలనుకొనేవాడు, మనస్సు బాగా లేనివాడు ఆ సమయంలో భోజనం చేయకూడదు. అధికంగా ఉన్న దాహాన్ని శాంతింపచేసుకోకుండా కూడ భోజనం చేయకూడదు.

50. భుక్త్వా వ్యాయామవ్యవాయౌ సద్యోవ్యాపత్తికారణమ్.

అ. భోజనం చేసిన వెంటనే వ్యాయామం చేసినా, మైథునం చేసినా అవి వెంటనే అపాయానికి కారణం అవుతాయి.

51. ఆజన్మ సాత్మ్యకృతం విషమపి పథ్యమ్.

అ. పుట్టుకనుంచీ వంటపట్టించుకున్న విషం కూడా పథ్యమే. (ఈ నాడు కాఫీ మొదలైనవి వలె.)

52. అసాత్మ్యమపి పథ్యం సేవేత, న పునః సాత్మ్యమప్యపథ్యమ్.

అ. తాత్కాలికంగా వంటబట్టనిదైనా, లేదా ఇష్టం కాకపోయినా, పథ్యమైన వస్తువునే సేవించాలి; అంతేనే కాని, వంటబట్టేదైనా అపథ్యవస్తువును సేవించకూడదు.

53. సర్వం బలవతః పథ్యమితి మత్వా న కాలకూటం సేవేత.

అ. "బలవంతుడికి ప్రతీదీ పథ్యమే" అనుకొంటూ కాలకూటం తినకూడదు.

54. సుశిక్షితోఽపి విషతన్త్రజ్ఞః మ్రియత ఏవ విషాత్ కదాచిత్.

అ. ఎంత నేర్చిన విషతంత్రవేత్త అయినా ఒకప్పుడు విషం వల్లనే మరణిస్తాడు.

55. సంవిభజ్యాతిథిష్వాశ్రితేషు చ స్వయమాహరేత్.

అ. అతిథులకు, ఆశ్రితులకూ ముందు ఆహారం పంచి ఇచ్చి, తరువాత తాను తీసుకోవాలి.

56. దేవాన్ గురుం ధర్మం చ ఉపచరన్ న వ్యాకులమతిః స్యాత్.

అ. దేవతలను, గురువులను, ధర్మాన్నీ సేవిస్తూన్నప్పుడు వ్యాకులమైన మనస్సుతో (చిత్తవిక్షేపంతో) ఉండగూడదు.

57. వ్యాక్షేపభూర్మనోనిరోధోఽపి మన్దయతి సర్వాణీన్ద్రియాణి.

అ. విక్షేపానికి (మనస్సు చెదిరిపోవడానికి) కారణమైన మనోనిరోధం (మనోనిగ్రహం) కూడా సమస్తేంద్రియాలను దుర్బలములు చేస్తుంది. శ్రమపడి మనస్సును బిగించినా చివరికి విక్షేపం కలిగినట్లయితే దానివల్ల ఇంద్రియాలు దుర్బలము లవుతాయి అని భావం. లేదా చాలా విక్షిప్తంగా ఉన్న మనస్సును ఏదో విధంగా నిరోధించినా ఇంద్రియాలు దుర్బలము లవుతాయి అని అర్థం చెప్పవచ్చు.

58. స్వచ్ఛన్దవృత్తిః పురుషాణాం పరమం రసాయనమ్.

అ. స్వేచ్ఛగా (స్వతంత్రులుగా) ఉండడమే పురుషులకు గొప్ప రసాయనం.

59. యథాకామసమీహాః కిల కాననేషు కరిణః న భవన్త్యాస్పదం వ్యాధీనామ్.

అ. అటవులలో యథేచ్ఛగా సంచరించే ఏనుగులు వ్యాధులకు గురి కావు కదా?

60. సతతం సేవ్యమానే ద్వే ఏవ వస్తునీ సుఖాయ, సరసః సత్సు సంలాపః తామ్బూలభక్షణం చ.

అ. సత్పురుషులతో సరససంలాపాలు, తాంబూలభక్షణం - ఎల్లప్పుడూ సేవిస్తే ఈ రెండు వస్తువులే సుఖం ఇస్తాయి.

61. చిరాయోర్ధ్వజానుః జడ(ర)యతి రసవాహినీః స్నసాః.

అ. చాలా సేపు మోకాళ్ళు పైకి పెట్టి కూర్చుండేవాడు రసం ప్రవహించే నాడులను మొద్దుబారేటట్లు (దుర్బలము లయేటట్లు) చేస్తాడు.

62. సతతముపవిష్టః జఠరమాధ్మాపయతి ప్రతిపద్యతే చ తున్దిలతామ్.

అ. ఎల్లప్పుడూ కూర్చునే ఉండేవాడు జఠరాగ్నిని ఊదరకొడతాడు; బొజ్జ పెరుగుతుంది.

63. వాచి మనసి శరీరే వా అతిమాత్రం ఖేదః పురుషమకాలేఽపి జరయా యోజయతి.

అ. మాటలోను, మనస్సులోను, శరీరంలోను ఎక్కువ అలసట పురుషుణ్ణి అకాలంలోనే ముసలివాణ్ణి చేస్తుంది.

64. నాదైవౌ దేవదేహప్రాసాదౌ కుర్యాత్.

అ. దేవతాదేహాన్ని, అనగా దేవతాప్రతిమను, పెద్ద భవనాన్ని దేవతలు లేని దానినిగా చేయకూడదు. దేవతాప్రతిమ మీద దేవతావాహనపూజాదులు లేకుండా ఉంచకూడదు. పెద్ద భవనాలలో కూడ దేవతామూర్తులు ఉంచి పూజాదులు జరుపుతూ ఉండాలి అని భావం. లేదా దేవప్రాసాదాన్ని (దేవాలయాన్ని) దేహం అనే ప్రాసాదాన్ని దేవతాశూన్యంగా ఉంచకూడదు. దేవాలయంలో దేవతాప్రతిష్ఠ చెయ్యాలి. సర్వదా దేవతాధ్యానం చేస్తూ తన దేహంలో దేవతను నెలకొల్పాలి అని అర్థం.

65. దేవగురుధర్మరహితే పుంసి నాస్తి ప్రత్యయః.

అ. దేవుడు లేడు, గురువు లేడు, ధర్మం లేదు అనే వానిని విశ్వసించకూడదు.

66. క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేషః దేవః.

అ. అవిద్య, అస్మిత, రాగం, ద్వేషం, అభినివేశం అనే క్లేశాలచేత, ధర్మాధర్మరూపకర్మలచేత, కర్మఫలాలైన జన్మ - ఆయుర్దాయ - భోగా లనే విపాకాలచేత, వీటికి అనుగుణాలైన ఆశయాలచేత (సంస్కారాలచేత) స్పృశింపబడని ఒకానొక ఉత్తమపురుషుడు దేవుడు.

పాతంజల యోగసూత్రం సమాధిపాదంలో ఉన్న ఇరవై మూడవ సూత్రం చివర ఉన్న 'ఈశ్వరః' కు బదులు 'దేవః' చేర్చి ఆ సూత్రం యథాతథంగా ఇక్కడ ఇవ్వబడింది. క్లేశాదులంటే ఏమో మా పాతంజలయోగ సూత్రవ్యాఖ్య అయిన బాలానందినినుండి తెలుసుకొనవచ్చును.

67. తస్యైవైతాని ఖలు విశేషనామాని - అర్హన్, అజః, అనన్తః, శమ్భుః, బుద్ధః, తమోన్తకః, బ్రహ్మేతి.

అ. అర్హన్, అజుడు, అనంతుడు, శంభువు, బుద్ధుడు, తమోంతకుడు, బ్రహ్మ అనేవి ఆ దేవుని విశేషనామధేయాలు.

68. ఆత్మసుఖానురోధేన కార్యాయ నక్తమహశ్చ విభజేత్.

అ. ఆ యా పనులు చేయడానికి, తన సౌకర్యాన్ని పట్టి రాత్రి, పగలూ కూడ సమయాన్ని విభజించుకొనాలి.

69. కాలానియమేన కార్యానుష్ఠానం హి మరణసమమ్.

అ. కాలనియమం లేకుండా పనులు చేయడం మరణం వంటిది.

70. ఆత్యయికే కార్యే నాస్త్యనవసరః.

అ. ఆలస్యం చేయడానికి వీలులేని పని వచ్చినప్పుడు (**Time of emergency**) సమయమూ అసమయమూ అనేది ఉండదు.

71. అవశ్యం కర్తవ్యే కాలం న యాపయేత్.

అ. ఒక పని తప్పక చేయవలసి ఉన్నప్పుడు కాలం గడిపివేయకూడదు; ఏమాత్రం ఆలస్యం చేయకూడదు.

72. ఆత్మరక్షాయాం కదాచిదపి న ప్రమాద్యేత్.

అ. తన రక్షణ విషయంలో ఎన్నడూ ఏమరిపాటు చెందకూడదు.

73. సవత్సాం ధేనుం ప్రదక్షిణీకృత్య ధర్మాసనం యాయాత్.

అ. (న్యాయాన్యాయనిర్ణయంకోసం) ధర్మాసనానికి వెళ్ళేటప్పుడు లేగదూడతో ఉన్న ధేనువుకు ప్రదక్షిణం చేసి వెళ్ళాలి.

74. అనధికృతః అనభిమతశ్చ న రాజసభాం ప్రవిశేత్.

అ. అధికారం లేనివాడు, అనుమతి లేనివాడు రాజసభలోనికి వెళ్ళకూడదు.

75. ఆరాధ్యముత్థాయాభివాదయేత్.

అ. గౌరవించవలసినవాళ్ళని కూర్చున్నచోటనుంచి లేచి అభివాదనం చేసి గౌరవించాలి.

76. దేవగురుధర్మకార్యాణి స్వయం పశ్యేత్.

అ. దేవతాకార్యాలు, గురువుల పనులు ధర్మకార్యాలు స్వయంగా చూడాలి.

77. కుహకాభిచారకర్మభిః సహ న సంగచ్ఛేత.

అ. వంచకులతోను, అభిచారకర్మలు (ఇతరులను హింసించే ప్రయోగాలు) చేసేవాళ్ళతోను కలవకూడదు.

78. ప్రాణ్యుపఘాతేన కామక్రీడాం న ప్రవర్తయేత్.

అ. ప్రాణులకు హింస కలిగే ఆటలు (కోడిపందెం, గొఱ్ఱెపొట్టేళ్ళ పందెం, ఎద్దుల పందెం మొదలైనవి) ఆడించకూడదు.

79. జనన్యాపి పరస్త్రియా సహ రహసి న తిష్ఠేత్.

అ. తల్లియే అయినా పరస్త్రీతో రహస్యస్థానంలో ఉండకూడదు.

80. అతిక్రుద్ధోఽపి న మాన్యమతిక్రామేత్ అవమన్యేత వా.

అ. ఎంత కోపం వచ్చినా గౌరవింపదగిన వ్యక్తిని అతిక్రమించకూడదు (ఆతని మాట కాదనకూడదు), అవమానించకూడదు.

81. నాప్తశోధితం పరస్థానముపేయాత్.

అ. ఆప్తులచేత (తన హితం కోరేవాళ్ళచేత) పరీక్ష చేయించకుండా కొత్త చోటికి వెళ్ళకూడదు.

82. నాప్తజనైరనారూఢం వాహనమధ్యాసీత.

అ. ఆప్తజనులు ఒకసారి ఎక్కిచూడని అశ్వాదివాహనాన్ని ఎక్కకూడదు.

83. న స్వైః అపరీక్షితం తీర్థం, సార్థం, తపస్వినం వాభిగచ్ఛేత్.

అ. తనవాళ్ళు ముందుగా పరీక్షించని తీర్థానికి (పుణ్యక్షేత్రం లేదా నది మొదలైనవాటి రేవు) గాని, సార్థానికి (వర్తకుల గుంపు లేదా జనుల గుంపు)గాని, ముని దగ్గరకు గాని వెళ్ళకూడదు

84. న యాష్టికైరవివిక్తం మార్గం భజేత.

అ. యాష్టికులచేత (కఱ్ఱలు చేత పట్టుకొని తిరిగే రక్షకభటులు) పరిశోధించబడని మార్గంలో ప్రయాణం చెయ్యకూడదు.

85. న విషాపహారౌషధిమణీన్ క్షణమప్యుపాసీత.

అ. విషం అపహరించే ఓషధులను, మణులను క్షణకాలం కూడా ధరించకూడదు.

86. న సదైవ జాఙ్గలికీం విద్యాం కణ్ఠే ధారయేత్.

అ. ఎన్నడూ విషవిద్యను కంఠస్థం చేయకూడదు.

87. మన్త్రిభిషఙ్నైమిత్తికాదిరహితః కదాచిదపి న ప్రతిష్ఠేత.

అ. మంత్రులు, వైద్యులు, నైమిత్తికులు (శకునాలకు అర్థం చెప్పగలిగినవాళ్ళు) కూడా లేకుండా ఎన్నడూ ప్రయాణం చేయకూడదు.

88. వహ్నావన్యచక్షుషి చ భోజ్యముపభోగ్యం చ పరీక్షేత.

అ. భుజించే పదార్థాలను, అనుభవించే పదార్థాలను ముందుగా అగ్నియందు, ఇతరుల దృష్టిచేత పరీక్షించాలి.

89. అమృతే మరుతి ప్రవిశతి సర్వదా చేష్టేత.

అ. ఎల్లప్పుడు అమృతం వంటి సుఖకరమైన గాలి ప్రవేశిస్తూన్న చోట పనులు చేసుకోవాలి.

90. భుక్తిసురతసమరార్థీ దక్షిణే మరుతి స్యాత్.

అ. దక్షిణపు గాలి వీచుతున్నప్పుడు భోజనాన్ని, సురతసమరాన్ని కోరేవాడుగా ఉండాలి.

91. పరమాత్మనా సమీకుర్వాన్ న కస్యాపి భవతి ద్వేష్యః.

అ. అందర్నీ పరమాత్మతో సమంగా చేసేవాడు (అందర్నీ పరమాత్మ రూపులనుగా చూచేవాడు) ఎవరికీ ద్వేషపాత్రుడు కాడు. లేదా (పరమ్ + ఆత్మనా) ఎదుటివాణ్ణి తనతో సమంగా చూచేవాడు ఎవనికీ ద్వేషపాత్రుడు కాడు.

92. మనఃపరిజనశకునపవనానులోమ్యం భవిష్యతః కార్యస్య సిద్ధేర్లిఙ్గమ్.

అ. (తన) మనస్సు, పరిజనమూ, శకునాలు, గాలి- ఇవి అనుకూలంగా ఉండడం జరగబోయే కార్యసిద్ధికి చిహ్నాలు (సూచకాలు).

93. నైకో నక్తం దివా వాఽఽహిణ్డేత.

అ. రాత్రైనా పగలైనా ఒంటరిగా తిరగకూడదు.

94. నియమితమనోవాక్కాయః ప్రతిష్ఠేత.

అ. మనస్సును, వాక్కును, శరీరాన్ని అదుపులో ఉంచుకొని ప్రయాణానికి బయలుదేరాలి.

95. అహని సన్ధ్యాముపాసీతానక్షత్రదర్శనాత్.

అ. నక్షత్రదర్శనం అయేవరకూ పగలు సంధ్యను (సాయంకాల సంధ్యను) ఉపాసించాలి.

96. "చతుఃపయోధిపయోధరాం, ధర్మవత్సవతీమ్, ఉత్సాహ వాలధిం, వర్ణాశ్రమఖురామ్, కామార్థశ్రవణాం, నయప్రతాప విషాణాం, సత్యశౌచచక్షుషం, న్యాయముఖీమ్ ఇమాం గామ్ అహం గోపయామి, తమహం మనసాపి న సహే యోఽపరా ధ్యేత్తస్యై" ఇతీమం మన్త్రం సమాధిస్థో జపేత్.

అ. "నేను ఈ భూమి అనే గోవును రక్షిస్తున్నాను. ఈ గోవుకు నాలుగు సముద్రాలు నాలుగు స్తనాలు. ధర్మమే లేగదూడ. ఉత్సాహమే తోక. వర్ణాశ్రమాలే డెక్కలు. కామార్థాలే చెవులు. నీతి-ప్రతాపాలే కొమ్ములు. సత్య-శౌచాలే కళ్లు. న్యాయమే ముఖం. ఈ గోవు విషయంలో అపరాధం చేసినవాణ్ణి మనస్సు చేత కూడ క్షమించను"- ఈ మంత్రాన్ని ఏకాగ్రచిత్తంతో జపించాలి.

97. కోకవద్దివకామః నిశి స్నిగ్ధం భుఞ్జీత, చకోరవన్నక్తంకామః దివా చ.

అ. చక్రవాకపక్షి వలె పగలు కామం కలవాడు రాత్రి సుష్ఠుగా భోజనం చెయ్యాలి. చకోరపక్షి వలె రాత్రి కామం కలవాడు పగలు సుష్ఠుగా భోజనం చెయ్యాలి.

98. పారావతకామః వృష్యాన్నయోగాంశ్చరేత్.

అ. పావురం వంటి (దివారాత్రనియమం లేని)కామం కలవాడు వీర్యవర్ధకాలైన అన్నయోగాలను (విశేషాలను) తినాలి.

99. బష్కయిణీనాం సురభీణాం పయః మాషదలపరమాన్నం పరో యోగః స్మరసంవర్ధనే.

అ. ఒకేమారు ఈనిన (తొలిచూలు) ఆవుల పాలు, మినప్పప్పుతో చేసిన శ్రేష్ఠమైన అన్నం కామవర్ధనంలో శ్రేష్ఠమైన యోగం.

100. నావృషస్య స్త్రీం స్త్రియమభియాయాత్.

అ. పురుషసంగేచ్ఛ లేని స్త్రీని పొందగూడదు.

101. ఉష్ణప్రకర్షవాన్ ప్రదేశః పరమం రహస్యమనురాగే ప్రథమ ప్రకృతీనామ్; సశాద్వలమృదుపవనప్రదేశః ద్వితీయప్రకృతీనామ్; సర్వత్ర తృతీయప్రకృతీనాం సురతోత్సవః, త ఏతే ధర్మార్థస్థానే లిఙ్గోత్సవం లభన్తే.

అ. (వృషప్రకృతి కలవాళ్ళు, శశప్రకృతి కలవాళ్ళు, అశ్వప్రకృతి కలవాళ్ళు అని పురుషులు మూడు విధాలు.) మొదటి ప్రకృతి (స్వభావం) ఉన్న వాళ్ళకి అనురాగం విషయంలో మంచి వేడి ఉన్న ప్రదేశం మంచి రహస్యస్థానం, రెండవ ప్రకృతి ఉన్నవాళ్ళకి పచ్చికబీడు, మందవాయువు ఉన్న ప్రదేశం మంచిది. తృతీయప్రకృతులకు అంతటా సురతోత్సవమే. వాళ్ళు ధర్మస్థానాల లోను, అర్థస్థానాలలోను లింగోత్సవాన్ని (కామోత్సవాన్ని) పొందుతారు.

102. స్త్రీపుంసయోర్న సమసమాగమాత్ పరం వశీకరణమస్తి.

అ. స్త్రీ పురుషులకు సమానమైనవాళ్ళ సమాగమనాన్ని మించిన వశీకరణం అంటూ లేదు.

103. ప్రకృతిః, ఉపదేశః, స్వాభావికం చ ప్రయోగవైదగ్ధ్యమితి సమసమాయోగకారణాని.

అ. ప్రకృతి (ఇద్దరిదీ ఒకే ప్రకృతి అయి ఉండడం), ఉపదేశం, స్వభావసిద్ధంగా వచ్చిన ప్రయోగనైపుణ్యం-ఇవి సమసమాయోగానికి కారణాలు.

104. క్షుత్తర్షపురీషాభిష్యన్దార్తస్య అభిగమః నాపత్యమనవద్యం కరోతి.

అ. ఆకలితోను, దప్పికతోను, మలవేగంతోను, మూత్రవేగంతోను పీడితుడై ఉన్నవాడు సంగమం చేస్తే పుట్టిన సంతానం దోషరహితంగా ఉండదు.

105. న సంధ్యాసు న దివా నాప్సు న దేవాయతనే మైథునం కుర్వీత.

అ. సంధ్యాకాలంలోను, పగలు, నీటిలోను, దేవాలయంలోను మైథునం చెయ్యకూడదు.

106. పర్వణి, పర్వసంధౌ, ఉపహతే వాహ్ని కులస్త్రియం న గచ్ఛేత్.

అ. పర్వదినంలోను, పర్వసంధియందు, చెడ్డ రోజునా కులకాంతను పొందకూడదు.

107. న తద్గృహాభిగమనేన కామపి స్త్రియమధిశయీత.

అ. ఏ స్త్రీని కూడ ఆమె ఇంటికి వెళ్ళి కలవకూడదు.

108. వంశవయోవృత్తవిద్యావిభవానురూపః వేషః సమాచారో వా న కం విడమ్బయతి?

అ. వంశము, వయస్సు, జీవిక, విద్య, వైభవం - వీటికి అనుగుణంగా లేని వేషం కాని, ప్రవర్తన కాని ఎవనిని హాస్యాస్పదుణ్ణి చేయదు?

109. అపరీక్షితమశోధితం చ రాజకులే న కించిత్ప్రవేశయేన్నిష్కాసయేద్వా.

అ. బాగా పరీక్షించకుండా, శోధించకుండా దేనినీ కూడా రాజగృహం లోనికి రానీయకూడదు, రాజగృహంనుంచి బైటకు పంపకూడదు.

110. శ్రూయతే హి స్త్రీవేషధారీ కున్తలనరేన్ద్రప్రయుక్తః గూఢపురుషః కర్ణనిహితేనాసిపత్రేణ పల్లవనరేన్ద్రం, హయపతిశ్చ మేషవిషాణనిహితేన విషేణ కుశస్థలేశ్వరం జఘానేతి.

అ. కుంతలదేశరాజు పంపగా గూఢచారి స్త్రీవేషధారియై వచ్చి చెవి దగ్గర దాచిన చాకుతో పల్లవదేశరాజును చంపినాడనీ, హయపతి (అశ్వపాలకుడు లేదా పేరు కావచ్చును) గొఱ్ఱె కొమ్ములో ఉంచిన విషంతో కుశస్థలేశ్వరుణ్ణి చంపినాడనీ వింటున్నాం కదా?

111 సర్వత్రావిశ్వస్తే నాస్తి కాచిత్ క్రియా.

ఇతి దివసానుష్ఠానసముద్దేశః.

అ. ఎవరినీ నమ్మనివాడు ఏ పనీ చేయజాలడు.

"బాలానందిని" అను సోమదేవనీతిసూత్రాంధ్రవ్యాఖ్యానంలో దివసానుష్ఠాన సముద్దేశం సమాప్తం.

## 26. సదాచారసముద్దేశః

1. లోభప్రమాదవిశ్వాసైః బృహస్పతిరపి పురుషో వధ్యతే వఞ్చ్యతే వా.

అ. సాక్షాత్తు బృహస్పతియే అయినా పురుషుడు దురాశచేత, అతిగా నమ్మడంచేత చంపబడతాడు, లేదా మోసగించబడతాడు.

2. బలవతా అవష్టబ్ధస్య విదేశగమనం, తదనుప్రవేశో వా శ్రేయాన్, యద్యన్యథా నాస్తి క్షేమోపాయః.

అ. బలవంతుడు వచ్చి ఎదిరించినపుడు (ముట్టడించినప్పుడు), క్షేమానికి మరొక ఉపాయం లేని పక్షంలో విదేశాలకు వెళ్ళిపోవడం గాని, ఆ బలవంతునికే లొంగి ఉండడం గాని శ్రేయస్కరం.

3. విదేశవాసోపహతస్య కో నామ పురుషకారః?

అ. విదేశవాసంతో బాధపడేవానికి పురుషకారం ఏమిటి?

4. యో యేనావిజ్ఞాతస్వరూపః పుమాన్ స తస్య మహానపి లఘురేవ.

అ. ఎంతటి గొప్పవాడైనా అతని నిజస్వరూపం తెలియని వానికి తేలిక గానే కనబడుతాడు.

5. అలబ్ధప్రతిష్ఠస్య నిజాన్వయాయేనాహఙ్కారః కస్య న లాఘవం కరోతి?

అ. ఏ విధమైన పరువూ, ప్రతిష్ఠా లేకపోయినా తన వంశం పేరు చెప్పు కొని అహంకారం ప్రదర్శిస్తే ఎవడు చులకన కాడు?

6. ఆర్తః సర్వోఽపి భవతి ధర్మబుద్ధిః.

అ. అనారోగ్యంతో బాధపడుతున్న ప్రతివాడు ధర్మబుద్ధి కలవాడవుతాడు.

7. స నీరోగః యః స్వయం ధర్మాయ సమీహతే.

అ. ఎవడైతే స్వయంగా ధర్మాన్ని కోరుతాడో అతడే ఆరోగ్యవంతుడు.

8. వ్యాధిగ్రస్తస్య ధైర్యాదృతే న పరమౌషధమస్తి.

అ. వ్యాధిగ్రస్తునికి ధైర్యాన్ని మించిన మందు లేదు.

9. స మహానుభావః, యస్య న దురపవాదోపహతం జన్మ.

అ. ఎవని జన్మ చెడ్డ అపవాదులచేత మలినం కాలేదో అతడే మహానుభావుడు.

10. పరాధీనేష్వర్థేషు స్వోత్కర్షసంభావనం మన్దమతీనామ్.

అ. అన్ని విషయాలూ పరాధీనాలుగానే ఉన్నా మందబుద్ధులు తామేమో గొప్పవాళ్ళం అనుకుంటూ ఉంటారు

11. న భయేషు విషాదః ప్రతీకారః, కిం తు ధైర్యావలమ్బనమ్.

అ. భయాలు వచ్చినప్పుడు దిగులు చెందడం ప్రతిక్రియ కాదు; ధైర్యం అవలంబించడమే ప్రతిక్రియ.

12. స కిం ధన్వీ తపస్వీ వా యో రణే మరణే శరసన్ధానే మనః సమాధానే చ ముహ్యతి?

అ. రణంలోను, బాణాన్ని సంధించడంలోను మోహంచెందే (పొరపాటు పడే) విలుకాడు ఏమి విలుకాడు? మరణం విషయంలోను, మనస్సును స్థిరంగా నిలపడంలోను మోహం చెందే ముని ఏమి ముని?

13. కృతేః ప్రతికృతిమకుర్వతః నైహికఫలమస్తి నాముత్రికం చ.

అ. చేసినదానికి (ఉపకారమైనా, అపకారమైనా) ప్రతిక్రియ చేయనివానికి ఇహలోకఫలమూ లేదు, పరలోకఫలమూ లేదు.

14. శత్రుణాపి సూక్తముక్తం న దూషణీయమ్.

అ. శత్రువు పలికినదైనా మంచి మాటను దూషించకూడదు.

15. కలహజననమ్ అప్రీత్యుత్పాదనం చ దుర్జనానాం ధర్మో న సజ్జనానామ్.

అ. కలహానికి కాలుదువ్వడం, ద్వేషం పుట్టించడం అనేవి దుర్జనుల ధర్మమే కాని సజ్జనుల ధర్మం కాదు.

16. న తస్య శ్రీరభిముఖీ యో లబ్ధార్థమాత్రేణ సంతుష్టః.

అ. లభించిన ధనంతో మాత్రమే సంతృప్తి చెందేవానికి లక్ష్మి అభిముఖురాలుగా ఉండదు.

17. భీతేష్వభయప్రదానాత్ పరం న దానమస్తి.

అ. భయపడినవాళ్ళకు అభయం ఇవ్వడాన్ని మించిన దానం లేదు.

18. తస్య కుతో వంశవృద్ధిః యో న ప్రశమయతి వైరానుబన్ధమ్.

అ. వైరం కొనసాగడాన్ని శాంతింపచేయనివానికి వంశవృద్ధి ఎలా ఉంటుంది?

19. స్వస్యాసంపత్తౌ న చిన్తా కామితమర్థం దుగ్ధే, కిం తూత్సాహః.

అ. తనకు ఐశ్వర్యం లేదనే చింత కోరిన ఫలాన్ని ఇవ్వదు. ఉత్సాహం మాత్రమే కోరిన ఫలాన్ని ఇస్తుంది.

20. స ఖలు స్వస్యైవాపుణ్యోదయః అపరాధో వా యత్ సర్వేషు కల్పవృక్షవత్ ఫలన్నపి స్వామీ భవత్యాత్మని వన్ధ్యః.

అ. కల్పవృక్షం వలె అందరికీ అన్నీ ఇస్తూన్న ప్రభువు తనకేమీ ఇవ్వడం లేదంటే అది తన పాపమైనా అయి ఉండాలి, లేదా తన అపరాధమైనా అయి ఉండాలి.

21. స సర్వదైవ దుఃఖితః యో మూలధనమసంవర్ధయన్ అనుభవతి.

అ. మూలధనాన్ని పెంచకుండా అనుభవిస్తూ ఉండేవాడు ఎల్లప్పుడూ దుఃఖవంతుడే అవుతాడు.

22. మూర్ఖదుర్జనపతితైః సహ సంగః కస్య నామ శ్రేయస్కరః.

అ. మూర్ఖులతోను, దుర్జనులతోనూ. పతితులతోను సంబంధం ఎవరికి శ్రేయస్కరం అవుతుంది?

23. కిం తేన ప్రీతేన, యస్య హరిద్రారాగ ఇవ చిత్తానురాగః?

అ. ఎవని మనస్సులోని అనురాగం హరిద్రారాగం వంటిదో (పసుపు రంగు వలె అల్పకాలం మాత్రమే ఉంటుందో) అలాంటివానికి ప్రేమ కలుగుతే మాత్రం ఏమి ప్రయోజనం?

24. ఆత్మానమవిజ్ఞాయ విక్రమః కస్య నామ పరాభవం న కరోతి.

అ. తనను (తన బలం) తెలుసుకొనకుండా చూపించిన పరాక్రమం ఎవనికి పరాభవం కలిగించదు?

25. న క్షాన్తిః పరాభియోగస్యోత్తరం, కిం తు యుక్త్యుపన్యాసః.

అ. శత్రువు ఎదిరించినప్పుడు తగిన సమాధానం (ప్రతిక్రియ) ఓర్పు కాదు, యుక్తిని చూపడమే (తగిన సమాధానం).

26. అస్థానే కుప్యతాం కుతః పరిజనః.

అ. అనవసరంగా కోపించేవాళ్ళకి పరిజనం ఎక్కడనుంచి వస్తారు?

27. న మృతేషు రోదితవ్యమ్; అశ్రుపాతసమా హి కిల పతన్తి తేషాం హృదయేష్వఙ్గారాః.

అ. మరణించినవాళ్ళకోసం ఏడ్వకూడదు. ఎన్ని కన్నీటి చుక్కలు రాలతాయో అన్ని నిప్పులు వాళ్ళ హృదయాలమీద పడతాయి.

28. అతీతే వస్తుని శోకః శ్రేయానేవ, యది పునః తత్సమాగమః స్యాత్.

అ. పోయినదానిగూర్చి శోకించడం, అది తిరిగి వస్తుంది అన్నట్లయితే, మంచిదే.

29. శోకమాత్మని అనువాసయన్ త్రివర్గమనుశోషయతి.

అ. చాల కాలంపాటు తనలో శోకాన్ని నివసింప చేసేవాడు (దుఃఖంతో కుమిలేవాడు) ధర్మార్థకామా లనే త్రివర్గాన్ని శుష్కింపచేస్తాడు.

30. స కింపురుషః యోఽకించనః సన్ కరోతి విషయాభిలాషమ్.

అ. దరిద్రుడై ఉండి ఆ భోగాలూ ఈ భోగాలూ కావాలనుకొనేవాడు కూడా మనిషేనా?

31. అపూర్వేషు ప్రియపూర్వం సంభాషణం స్వర్గచ్యుతానాం లిఙ్గమ్.

అ. కొత్తవారితో కూడా ప్రియంగా మాటలాడడం స్వర్గంనుంచి ఈ లోకం వచ్చినవాళ్ళ చిహ్నం. పుణ్యాత్ములు మాత్రమే అలా చేస్తారు అని అర్థం.

32. న తే మృతాః యేషామిహాస్తి శాశ్వతీ కీర్తిః.

అ. ఎవరి శాశ్వతమైన కీర్తి ఈ లోకంలో ఉంటుందో వాళ్ళు మరణించిన వాళ్ళు కాదు (మరణించనట్లే).

33. న కేవలం భూభారాయ జాతః యస్య యశోభిర్న ధవళితాని భువనాని.

అ. ఎవని కీర్తులచేత ఈ లోకాలు తెల్లగా చేయబడలేదో అతడు కేవలం భూభారంకొరకే పుట్టాడు.

34. పరోపకారోద్యతానాం కా నామ శరణాగతేషు పరీక్షా?

అ. పరోపకారంకోసం ఉద్యమించేవాళ్ళు శరణుజొచ్చినవాళ్ళ విషయంలో పరీక్ష చేస్తారా?

35 అభిచారేణ పరోపఘాతః మహాపాతకినాం, న మహాసత్త్వానామ్.

అ. మహాపాపాత్ములు మాత్రమే అభిచారప్రయోగంచేత ఇతరులను చంపుతారు, ఉత్తమస్వభావం కలవాళ్ళెవరూ అలా చెయ్యరు.

36. తస్య భూపతేః కుతః అభ్యుదయః విజయో వా యస్య ద్విషత్స భాసు విద్వత్సభాసు చ నాస్తి గుణగ్రహణే ప్రాగల్భ్యమ్.

అ. శత్రువుల సభలలోను (మధ్యయందు), పండితసభలలోను గుణాలను గ్రహించగలిగిన ప్రాగల్భ్యం లేని రాజుకు అభివృద్ధి గాని, విజయం కాని ఎలా లభిస్తుంది?

37. తస్య గృహే కుటుమ్బం స్థాపనీయం, యత్ర న భవతి పరేషా మామిషం, విప్లుతం వా.

అ. ఎక్కడ ఉంచుతే తన కుటుంబం ఇతరులకు ఆమిషం (తినివేసే మాంసం) కాదో, నశించదో, అక్కడనే (ఆపత్సమయాలలో) తన కుటుంబాన్ని సంరక్షణకోసం ఉంచాలి.

38. పరస్త్రీద్రవ్యయోః రక్షణేన నాత్మనః కిమపి ఫలం, విప్లవే తు భవేన్మహాననర్థసంబన్ధః.

అ. పరస్త్రీలను, పరద్రవ్యాన్ని రక్షించడంవల్ల తనకేమీ ఫలం ఉండదు. కాని అపాయం కలిగితే మాత్రం గొప్ప అనర్థం కలుగుతుంది.

39. ఆత్మానురక్తం కథమపి న త్యజేత్, యద్యస్తి దత్తే తస్య సంతోషః.

అ. తాను ఇచ్చినది తీసికొని సంతోషిస్తాడూ అంటే తనయందు ప్రేమ ఉన్నవానిని ఎన్నడూ విడిచి పెట్టకూడదు.

40. ఆత్మసంభావనః పరేషామసహనశ్చ భృత్యః బహుపరిజనమపి స్వామినమేకాకినం కరోతి.

అ. తనను గూర్చి చాలా గొప్పగా తలచేవాడు, ఇతరులను సహించలేని వాడూ అయిన ఒక భృత్యుడు తన స్వామికి (ప్రభువును) ఎంతమంది పరిజనం ఉన్నా ఒంటరివానిని చేసేస్తాడు. వానివల్ల మిగిలినవాళ్ళందరూ ప్రభుభక్తి శూన్యులు అయిపోతారు.

41. అపరాధానురూపో దణ్డః పుత్రేఽపి ప్రణేతవ్యః.

అ. పుత్రుడైనా అపరాధానికి తగినట్లు దండించాలి.

42. దేశానురూపః కరో గ్రాహ్యః.

అ. దేశానికి తగిన (దేశాన్నిపట్టి) పన్ను వసూలు చెయ్యాలి.

43. ప్రతిపాద్యానురూపం వచనముదాహార్యమ్.

అ. చెప్పదలచిన విషయానికి తగిన మాటలు మాట్లాడాలి.

44. ఆయానురూపః వ్యయః కార్యః.

అ. ఆదాయానికి తగిన వ్యయం చెయ్యాలి.

45. ఐశ్వర్యానురూపః ప్రాసాదో విధాతవ్యః.

అ. ఐశ్వర్యానికి తగినట్లుగా భవనం నిర్మించాలి.

46. సహాయానురూపం కర్మ ఆరబ్ధవ్యమ్.

అ. ఉన్న సహాయానికి తగిన విధంగా (అంగబలం అర్థబలం చూసుకొని) పని ప్రారంభించాలి.

47. ధనశ్రద్ధానురూపః త్యాగోఽనుసర్తవ్యః.
అ. ధనానికి, శ్రద్ధకీ అనుగుణంగా త్యాగం అనుసరించాలి.

48. న సుఖీ పుమాన్ యస్యాస్తి సంతోషః.
అ. సంతోషం ఉన్న పురుషుడే సుఖవంతుడు.

49. రజస్వలాభిగామీ చణ్డాలాదప్యధమః.
అ. రజస్వలాసంగం చేసేవాడు చండాలుడికంటె అధముడు.

50. సలజ్జం నిర్లజ్జం న కుర్యాత్.
అ. లజ్జ ఉన్నవాణ్ణి లజ్జ లేనివాణ్ణిగా చేయకూడదు. చెడ్డపనులు చేయడానికి సంకోచం లజ్జ. అలాంటి సంకోచం ఉండడం మంచి గుణం అని భావం.

51. స పుమాన్ సవస్త్రోఽపి నగ్న ఏవ యస్య నాస్తి సచ్చరిత్రమావరణమ్.
అ. మంచి నడవడిక అనే ఆవరణం లేనివాడు వస్త్రాలు ధరించినా నగ్నుడే (వస్త్రవిహీనుడే).

52. స నగ్నోఽప్యనగ్న ఏవ యో భూషితః సచ్చరిత్రేణ.
అ. మంచి నడవడికచేత అలంకరించబడ్డవాడు నగ్నుడైనా నగ్నుడు కానివాడే.

53. సర్వత్ర సంశయానేషు నాస్తి కార్యసిద్ధిః.
అ. ప్రతీదానికీ సంశయించేవాళ్ళకు కార్యసిద్ధి ఉండదు (పనులు జరగవు).

54. న క్షీరఘృతాభ్యామన్యత్ పరం రసాయనమస్తి.
అ. పాలనూ, నేతినీ మించిన రసాయనం లేదు.

55. పరోపఘాతేన వృత్తిః నిర్భాగ్యానామ్.
అ. నిర్భాగ్యులకు (భాగ్యం లేనివాళ్ళు) పరుల్ని హింసించడమే వృత్తి.

56. వరముపవాసః న పరాధీనం భోజనమ్.
అ. పరాధీనమైన భోజనంకంటె పస్తు పండుకోనడం మంచిది.

57. స దేశోఽనుసర్తవ్యః యత్ర నాస్తి వర్ణసంకరః.
అ. వర్ణసంకరం లేని దేశంలో నివసించాలి.

58. న జాత్యంధో యః పరలోకం న పశ్యతి.

అ. పరలోకం చూడనివాడే పుట్టంధుడు.

59. వ్రతం, విద్యా, సత్యమ్, ఆనృశంస్యమ్, అలోలతా, శక్తి విశేషశ్చ బ్రహ్మణ్యమ్; న పునర్జాతిమాత్రమ్.

అ. మంచి నియమం, విద్య, సత్యం, క్రూరత్వం లేకపోవడం, చపలత్వం లేకపోవడం, ఒకానొక విధమైన శక్తి - ఇదే బ్రాహ్మణత్వం అనగా; జాతిమాత్రం (పుట్టుకచేత మాత్రం) బ్రాహ్మణత్వం కాదు.

60. నిఃస్పృహాణాం కా నామ పరాపేక్షా.

అ. ఆశ లేనివాళ్ళకి పరాపేక్ష ఏముంటుంది?

61. కం నామ పురుషమ్ ఆశా న క్లేశయతి.

అ. ఆశ క్లేశం కలిగించని పురుషుడు ఎవడు?

62. న సంయమీ గృహాశ్రమీ వా తత్పదమర్హతి, యస్యావిద్యాతృష్ణాభ్యామనుపహతం చేతః.

అ. ఎవని మనస్సు అవిద్యచేత, దురాశచేత దూషితం కాదో అతడే, సంన్యాసి అయినా, గృహస్థుడైనా ఆ ఉత్తమస్థానాన్ని చేరదగిన అర్హత కలవాడు.

63. శీలమలఙ్కారః పురుషాణామ్, న దేహఖేదావహో బహిరాకల్పః.

అ. పురుషులకు శీలమే అలంకారం కాని దేహానికి అలసట కలిగించే బాహ్యాలంకారం అలంకారం కాదు.

64. కస్య నామ నృపతిర్మిత్రమ్?

అ. రాజు ఎవరికి మిత్రుడు? రాజుకు మిత్రుడంటూ ఎవడు?

65. అప్రియకర్తుః న ప్రియకరణాత్పరం మారణకారణమస్తి.

అ. అప్రియం చేసినవానికి ప్రియం చేయడాన్ని మించిన చంపడం మరొకటి లేదు.

66. అప్రయచ్ఛన్నర్థినే న పరుషం బ్రూయాత్.

అ. యాచకునికి ఏమీ ఇవ్వనప్పుడు పరుషంగా కూడ మాట్లాడకూడదు.

67. సా శ్రీః (స స్వామీ) మరుభూమిః యత్రార్థినో న భవన్తి ఆప్తకామాః.

అ. యాచకులకు కోరికలు లభించని ఐశ్వర్యం (ప్రభువు) ఎడారి ప్రదేశమే.

68. ప్రజాపాలనం హి రాజ్ఞో యజ్ఞః, న పునః భూతానామ్ ఆలమ్భః.

అ. రాజు చేయవలసిన యజ్ఞం ప్రజాపాలనమే; అంతేకాని పశువులను చంపడం కాదు.

69. నానపరాధిసత్త్వవ్యావృత్తయే నృపాణాం బలం ధనుర్వా, కిం తు శరణాగతరక్షణాయ.

ఇతి సదాచారసముద్దేశః.

అ. రాజుల బలం కాని, ధనం కాని అపరాధం చెయ్యని ప్రాణులను హింసించడంకోసం కాదు; ఇంక ఏమనగా, శరణుజొచ్చిన వాళ్ళను రక్షించడం కొరకే.

"బాలానందిని" అను సోమదేవ నీతిసూత్రానువాదంలో

సదాచారసముద్దేశం సమాప్తం.

## వ్యవహార సముద్దేశః

1. కలత్రం నామ నరాణాం అనిగడమపి దృఢం బన్ధనమాహుః.

అ. పురుషులకు భార్య అనేది సంకెల కాని దృఢమైన బంధనం అని అంటారు.

2. త్రీణ్యవశ్యం భర్తవ్యాని - మాతాపితరౌ, కలత్రమ్, అప్రాప్త వ్యవహారాణి చాపత్యాని.

అ. తలిదండ్రులు, భార్య, వ్యవహరించే వయస్సు రాని (మైనర్లు అయిన) సంతానం. వీళ్ళని తప్పకుండా పోషించాలి.

3. దానం, తపః, ప్రాయోపవేశనం, నియమవ్యవస్థాపనం వా తీర్థోపాసనస్య ఫలమ్.

అ. దానమూ, తపస్సు, ప్రాయోపవేశనం (ఆహారం తినకుండా మరణించడానికి దీక్ష బూనడం) నియమాలను నిలపడం ఇవి తీర్థం (పుణ్యక్షేత్రం) సేవించినందుకు ఫలం. ఈ పనులకోసం తీర్థసేవ చెయ్యాలి.

4. తీర్థోపవాసిషు దేవస్వపరిహరణం క్రవ్యాదేషు కారుణ్యమివ; స్వాచారచ్యుతేషు పాపభీరుత్వమివ.

అ. పుణ్యక్షేత్రాలలో ఉండేవాళ్ళ (పండాలు మొదలైనవాళ్ళు) దేవతా ధనాన్ని పరిహరించడం (తినకుండా ఉండడం) క్రూరజంతువులకు జాలి ఉండడం వంటిది; ఆచారభ్రష్టులకు పాపభీతి ఉండడం వంటిది.

5. అధార్మికత్వమ్, అతినిష్ఠురత్వం, వఞ్చకత్వం చ ప్రాయేణ తీర్థవాసినాం ప్రకృతిః.

అ. అధర్మం ఆచరించడం, చాలా నిష్ఠురంగా ఉండడం, మోసం చెయ్యడం- ఇవి సాధారణంగా తీర్థవాసుల (పుణ్యతీర్థాలలో నివసించే పురోహితాదుల) స్వభావం.

6. మూషికగృహే మోదకన్యాస ఇవ హి ధర్మరహితేషు దేవపూజాద్యుపయోగాయ ధనార్పణమ్.

అ. దేవపూజాదులకై వినియోగించడంకోసం (ఈ డబ్బు దేవతాపూజ, అన్నదానం మొదలైనవాటికి వినియోగించండి అని చెప్పి) ధర్మశూన్యుల చేతిలో డబ్బు పెట్టడం ఎలక ఇంట్లో మధురపదార్థం దాచడంవంటిది.

7. స కిం ప్రభుః; యః కార్యకాల ఏవ న సంభావయతి భృత్యాన్.

అ. (ఇక్కడ 'న' అనవసరం అని తోస్తుంది.) పనిపడ్డప్పుడు మాత్రమే భృత్యులను ఆదరించే ప్రభువు ఏంప్రభువు?

8. స కిం భృత్యః సఖా వా యః కార్యముద్దిశ్య అర్థం యాచతే, కరోతి చ అఙ్గాకృష్టిమ్.

అ. పనిచేయడానికి ధనం అడిగేవాడూ, (పనిచేయడంలో) శరీరాన్ని వెనక్కి లాగేవాడూ (ఒళ్ళు దాచుకొనేవాడూ) అయిన భృత్యుడు లేదా స్నేహితుడు ఏం భృత్యుడు? ఏం స్నేహితుడు?

9. సా కిం భార్యా యా అర్థేన ప్రణయినీ?

అ. డబ్బు చూచి ప్రేమించే భార్య ఏం భార్య?

10. స కిందేశః యత్ర నాస్త్యాత్మనో నిర్వృతిః?

అ. ప్రాణాలకి సుఖం లేని దేశం ఏం దేశం?

11. స కిం బన్ధుః యః వ్యసనేషు నోపతిష్ఠతే.

అ. కష్టసమయాలలో ఆదుకోని బంధువు ఏం బంధువు?

12. తత్ కిం మిత్రం యత్ర నాస్తి విస్రమ్భః.

అ. విశ్వాసపాత్రుడు కాని మిత్రుడు ఏం మిత్రుడు?

13. స కింగృహస్థః యస్య నాస్తి సత్కలత్రసంపత్తిః.

అ. సద్భార్యాసుఖం లేని గృహస్థుడు ఏం గృహస్థుడు?

14. తత్ కిం దానం యత్ర నాస్తి సత్కారః.

అ. సత్కారం లేని (గౌరవభావంతో శ్రద్ధాపూర్వకంగా చేయని) దానం ఏం దానం?

15. తత్ కిం భుక్తం యత్ర నాస్త్యతిథిసంవిభాగః.

అ. అతిథులకు పంచిపెట్టడం లేని (అతిథులకు పెట్టకుండా తిన్న) తిండి ఏం తిండి?

16. తత్ కిం ప్రేమ యత్రాస్తి కార్యవశాత్ ప్రవృత్తిః?

అ. ఏదో కార్యాన్ని ఆపేక్షించి ఏర్పడిన ప్రేమ ఏం ప్రేమ?

17. తత్ కిమాచరణం యత్రాస్తి వాచ్యతా మాయావ్యవహారో వా.

అ. వేలుపెట్టి చూపించే అవకాశంగాని మోసంగాని ఉన్న ప్రవర్తన ఏం ప్రవర్తన?

18. తత్కిమపత్యం యత్ర నాధ్యయనం వినయో వా?

అ. చదువూ చదవని, వినయమూ లేని సంతానం ఏం సంతానం?

19. తత్ కిం జ్ఞానం యత్ర మదేనాన్ధతా చిత్తస్య?

అ. మనస్సును మదాంధం చేసే జ్ఞానం ఏం జ్ఞానం?

20. తత్ కిం సౌజన్యం యత్ర పరోక్షే పిశునభావః?

అ. వెనకాల చాడీలు చెప్పే సౌజన్యం (మంచితనం) ఏం సౌజన్యం?

21. సా కిం శ్రీః యయా న సన్తోషః సత్పురుషాణామ్?

అ. సత్పురుషులకు సంతోషం కలిగించని ఐశ్వరం ఏమి ఐశ్వర్యం?

22. తత్ కిం కృతం యత్రోక్తిరుపకృతస్య?

అ. నేను చేశానని చెప్పుకొనే ఉపకారం ఏమి ఉపకారం?

23. తయోః కో నామ నిర్వాహః యౌ ద్వావపి ప్రభూతమానినౌ, పణ్డితౌ, స్పర్ధినౌ, వాచాలౌ, హైతుకౌ, లుబ్ధౌ, మూర్ఖౌ, అసహనౌ, సాహఙ్కారౌ, ఉచ్ఛృఙ్ఖలౌ, ప్రబలౌ, అతత్త్వదర్శినౌ.

అ. ఇద్దరూ చాలా గర్వం ఉన్నవాళ్ళే - పండితులే, పోటీపడేవాళ్ళే, వదరుబోతులే, ఏవో యుక్తులు చెప్పి వాదించేవాళ్ళే, లుబ్ధులే, మూర్ఖులే, సహనం లేనివాళ్ళే, అహంకారవంతులే కట్టుబాట్లు దాటినవాళ్ళే, ప్రబలులే, తత్త్వజ్ఞానం (దృష్టి) లేనివాళ్ళే! అలాంటివాళ్ళు ఎలా కలిసిమెలిసి ఉండగలుగుతారు?

24. స్వవాన్త ఇవ స్వదత్తే నాభిలాషం కుర్యాత్.

అ. తాను ఇచ్చివేసినదానిమీద తాను కక్కినదానిమీద వలె అభిలాష చూపకూడదు.

25. ఉపకృత్య మూకభావః అభిజాతానామ్.

అ. ఉత్తమవంశసంజాతులు (The noble) ఉపకారం చేసి మూగవాళ్ళ వలె ఉంటారు.

26. పరదోషశ్రవణే బధిరభావః సత్పురుషాణామ్.

అ. సత్పురుషులు పరుల దోషాలను వినడంలో చెవిటివారుగా ఉంటారు.

27. పరకలత్రదర్శనే అన్ధభావః మహాభాగ్యానామ్.

అ. మహాభాగ్యవంతులు (పుణ్యాత్ములు) పరుల భార్యలను చూడడంలో గ్రుడ్డివాళ్లవుతారు.

28. శత్రావపి గృహాయాతే సంభ్రమః కర్తవ్యః, కిం పునః న మహతి?

అ. ఇంటికి శత్రువు వచ్చినా హడావుడి చెయ్యాలి. (ఆదరంతో సత్కరించాలి). గొప్పవాడు వస్తే చెప్పాలా? చెయ్యకుండా ఉండడం అనేది జరుగుతుందా?

29. అన్తర్ధనసార ఇవ స్వయం స్వస్య ధర్మః న ప్రకాశయితవ్యః.

అ. ఇంట్లో ఉన్న ధనసారం (సంపదను) వలెనే తన ధర్మాన్ని (జపతప ఆదుల్ని) తాను ప్రకటించుకొనగూడదు.

30. మదప్రమాదజే దోషే గురుషు నివేదనమ్, అనుశయః ప్రాయశ్చిత్తం చ ప్రతీకారః.

అ. గర్వంచేతగాని, ఏమరిపాటుచేతగాని ఏదైనా చెడ్డపని చేసినప్పుడు పెద్దవాళ్ళకు చెప్పడం; పశ్చాత్తాపం, ప్రాయశ్చిత్తం చేసుకోవడం దానికి ప్రతిక్రియ.

31. శ్రీమతః కాయక్లేశః న దేవగురుద్విజాతిథీన్ ప్రీణయతి, కింతు విభవసంవిభాగ ఏవ.

అ. శ్రీమంతుడు తనకున్న ఐశ్వర్యం పంచిపెడితే దేవతలకూ, గురువులకూ, ద్విజులకూ, అతిథులకూ సంతోషం కలిగిస్తుంది. కాని, అతడు కాయక్లేశం చేస్తే కలిగించదు.

32. చణకా ఇవ నీచాః ఉదరస్థాపితా అపి నావికుర్వాణాః తిష్ఠన్తి.

అ. శనగలవలె నీచులు పొట్టలో పెట్టుకున్నా కూడ వికారం చేయకుండా ఉండరు.

33. స పుమాన్ వన్ద్యచరితః యః ప్రత్యుపకారమనవేక్ష్య పరోపకారం తనోతి.

అ. ప్రత్యుపకారాపేక్ష లేకుండా పరోపకారం చేసేవాడే నమస్కరించదగిన చరిత్ర కలవాడు.

34. అజ్ఞానినో వైరాగ్యం, భిక్షోర్విటత్వమ్, అధనస్య విలాసః, వేశ్యారతస్య శౌచమ్, అవిదితవేదితవ్యస్య తత్త్వపరిగ్రహః (సాగ్రహః తత్త్వవిచారః) ఇతి పఞ్చ న కస్య శిరఃశూలాని?

అ. జ్ఞానం లేనివాని వైరాగ్యం, సన్యాసి విటుడు అవడం, దరిద్రుడు విలాసమయజీవితం గడపడం, వేశ్యాలంపటుని శౌచం (మడిగా ఉండడం), తెలియదగిన విషయాలు తెలుసుకొననివాడు తత్త్వశాస్త్రం అభ్యసించడం - ఈ ఐదూ ఎవరికి తలనొప్పి కలిగించవు?

35. స హి పఞ్చమహాపాతకీ యః అశస్త్రమ్, అశాస్త్రం వా పురుషమభియుఞ్జీత.

అ. శస్త్రం (ఆయుధం) లేనివానిని గాని, శాస్త్రం (శాస్త్రజ్ఞానం) లేనివానిని గాని ఎదుర్కొనేవాడే పంచమహాపాతకి.

36. ఉపశ్రుతిం శ్రోతుమివ కార్యవశాన్నీచమపి లోకం స్వయముప సర్పేత్.

అ. పనిపడ్డప్పుడు ఎంత నీచునిదగ్గరకైనా ఉపశ్రుతి వినడంకోసం వెళ్ళినట్లు, స్వయంగా వెళ్ళాలి. ముందు ముందు జరగబోయే శుభాశుభాలను చెప్పే ఒక అశరీర దేవవాక్కు 'ఉపశ్రుతి'. అది వినటంకోసం రాత్రులందు బైటకు వెళ్ళి వినేవారట.

37. అర్థీ కమపి దోషం న పశ్యతి.

అ. యాచకునికి ఏ దోషమూ కనబడదు.

38. గృహదాస్యభిగమః గృహం, గృహపతిమ్, గృహిణీం చ ప్రత్యవసాదయతి.

అ గృహదాసితో సంబంధం పెట్టుకొనడం గృహాన్నీ. గృహపతినీ, గృహిణిని (ఇంటి యజమానురాలు) నశింపచేస్తుంది.

39. వేశ్యాపరిగ్రహః దేవద్విజగురుగృహిణీబన్ధూనామ్ ఉచ్చాటన మన్త్రః

అ. వేశ్యను స్వీకరించడం దేవతలకు, ద్విజులకు, గురువులకు, భార్యకు, బంధువులకు ఉచ్చాటన మంత్రం. పిశాచాదులను దూరంగా తరిమివేసే మంత్రం ఉచ్చాటన మంత్రం. వేశ్యాపరిగ్రహం చేసినవాని దరిదాపులకు దేవతాదులు రారు అని అర్థం

40. అహో! లోకస్య పాపం, యత్ నిజస్త్రీ రతిరతా రతిరపి నిమ్బ సమా, పరపరిగృహీతా శునక్యపి రమ్భాసమా.

అ. రత్యాసక్తురాలైన తన స్త్రీ సాక్షాత్తు రతిదేవియే అయినా ఆమె వేపచెట్టువంటిది. పరభార్య ఆడకుక్క అయినా ఆమె రంభ వంటిది. అహో! లోకం ఎంత పాపిష్టిది. 'రమ్భా' శబ్దానికి అరటి చెట్టు అని కూడా అర్థం ఉండడం చేత 'నిమ్బసమా' అని ఉంటాడు.

41. న సుఖీ యస్యైక ఏవ దారపరిగ్రహః.

అ. ఒకే భార్యను వివాహం చేసుకొన్నవాడే సుఖవంతుడు.

42. వ్యసనినో యథాభిసారికాసు సుఖం న తథార్థవతీషు.

అ. స్త్రీ వ్యసనం ఉన్నవానికి అభిసారికలవల్ల ఉన్నంత సుఖం ధనవతులైనవాళ్ళవల్ల ఉండదు.

43. మహాన్ ధనవ్యయః తదిచ్ఛానువర్తనం, దైన్యం చ అర్థవతీషు.

అ. ధనవంతురాళ్ళైన స్త్రీల విషయంలో ఎక్కువ ధనం వ్యయం చెయ్యవలసి ఉంటుంది; వాళ్ళ ఇష్ట ప్రకారం నడచుకోవాలి, దైన్యం ప్రదర్శించాలి.

44. ఆస్తరణం, కమ్బలః, జీవధనమ్, గర్దభః, పరిగ్రహః, ఘోటీ, సర్వకర్మీణాః సుభృత్యాః ఇతి కస్య నామ న సుఖావహాని స్కన్ధావారోపకరణాని?

అ. ఆస్తరణలూ, కంబళ్ళు, జీవధనం (పశురూపమైన ధనం (live stock), గాడిదలు, భార్యాదులు, ఆడగుఱ్ఱం, అన్నిపనులూ చేసే మంచి నౌకర్లు- ఈవిధమైన స్కంధావారంలో (సైన్యాదులు ప్రయాణం చేసేటప్పుడు మధ్యలో వేసే మజిలీలకు స్కంధావారాలు అని పేరు) ఉండే ఉపకరణాలు ఎవరికి సుఖం కలిగించవు?

45. యతిఠక్కురవేశ్యావరణ్డభణ్డానాం పరిసపన్దో మహాన్, అర్థతస్తు న కించన.

అ. సన్యాసులు, ఠక్కురులు, వేశ్యలు, వరండులు, భండులు- వీళ్ళ హడావుడి ఎక్కువగా ఉంటుంది; అసలు విషయం ఏమీ ఉండదు.

కొన్ని ప్రాంతాలలో పండితులు గౌరవసూచకంగా 'ఠక్కుర'అని పేరు చివర తగల్చుకుంటారు. వాళ్ళు ఠక్కురులు. వరండు దనగా పిసినికొట్టువాడు. భండు దనగా వేషాలు వేసేవాడు. పగటి వేషగాళ్ళవంటివాడు- హాస్యగాడు.

46. లోభవతి భవన్తి విఫలాః సర్వేఽపి గుణాః.

అ. లోభవంతునిలో ఎన్ని గుణా లున్నా అన్నీ వ్యర్థం.

47. అర్థయాచనా కం నామ న లఘయతి?

అ. ధనాన్ని యాచించడం ఎవణ్ణి తేలికపరచదు?

48. న దారిద్ర్యాత్ పరం లాఘవకారణమస్తి, యతో మహానపి భవత్యన్యదోషేణ శఙ్కనీయః యత్సంగేన చ సర్వే గుణాః నిష్ఫలతాం యాన్తి.

అ. మనిషి తేలిక అయిపోవడానికి దారిద్ర్యాన్ని మించిన కారణం లేదు. దీనివల్ల మరొకడు చేసిన అపరాధానికి ఉత్తమవ్యక్తిని కూడా శంకిస్తారు. ఇది ఉంటే సద్గుణా లన్నీ వ్యర్థం అయిపోతాయి.

49. అలబ్ధార్థోఽపి హి లోకో ధనవతి భణ్డో భవతి.

అ. ఏ లాభమూ పొందకపోయినా జనం ధనవంతుని ముందు విదూషకు లవుతారు.

50. ధనినో యతయోఽపి చాటుకారాః.

అ. సంన్యాసులు కూడా ధనికునిముందు స్తోత్రపాఠాలు వల్లిస్తూంటారు.

51. న రత్నహిరణ్యపూతాజ్జలాత్ పరం పావనమస్తి.

అ. రత్నాలచేత, బంగారంచేత పవిత్రం చేయబడిన జలాన్ని మించిన పావనవస్తువు లేదు.

52. స్వయం మేధ్యా ఆపో, వహ్నితప్తా విశేషతః.

అ. నీళ్ళు స్వతః సిద్ధంగానే పవిత్రమైనవి. నిప్పుతో కాచితే విశేషించి పవిత్ర మైనవి.

53. స ఏవోత్సవః, యత్ర బన్దిమోక్షః దీనోద్ధరణం చ.

అ. ఏ ఉత్సవసమయంలో ఖైదీలను విడిచివేస్తారో, దీనోద్ధరణం చేస్తారో అదే నిజమైన ఉత్సవం.

54. తాన్యేవ పర్వాణి యేష్వతిథిపరిజనయోః ప్రకామం సంతర్పణమ్.

అ. అతిథులకు, పరిజనానికీ పూర్తిగా సంతృప్తి కలిగే పర్వాలే నిజమైన పర్వాలు.

55. తాస్తిథయః యాసు ధర్మాచరణమ్.

అ. ధర్మం ఆచరించిన తిథులే తిథులు.

56. సా తీర్థయాత్రా యస్యామకృత్యనివృత్తిః.

అ. చెడ్డ పను లేవీ చేయని తీర్థయాత్రయే తీర్థయాత్ర.

57. తత్ పాణ్డిత్యం యత్ర జాతివయోవిద్యోచితమనుష్ఠానమ్.

అ. జాతికీ, వయస్సుకీ, విద్యకీ తగిన ఆచరణ ఉన్నదే పాండిత్యం.

58. తచ్చాతుర్యం యత్పరప్రీత్యా స్వకార్యసాధనమ్.

అ. పరులను సంతోషపెడుతూ తన కార్యం సాధించుకొనడమే చాతుర్యం (నేర్పు).

59. తల్లోకవిత్త్వం యత్సర్వజనాదేయత్వమ్.

అ. అందరి మన్ననలూ పొందగలిగి ఉండడమే లోకజ్ఞానం.

60. తత్సౌజన్యం వాగ్మితా చ యత్ర నాస్తి పరోద్వేగః.

అ. ఇతరుల మనస్సు నొప్పించకుండా ఉండడంలోనే సౌజన్యం, వాక్చాతుర్యం (మాటలలో నేర్పరితనం) ఉంటాయి.

61. తద్ధీరత్వం యదనపవారం యౌవనమ్.

అ. యౌవనంలో చెడ్డ పేరు లేకపోవడమే ధీరత్వం.

62. తత్సౌభాగ్యం యదదానేవ వశీకరణమ్.

అ. ఏమీ ఇవ్వకుండానే ఇతరులను వశం చేసుకోవడం "సౌభాగ్యం."

63. సా సభా అరణ్యానీ యస్యాం న సన్తి విద్వాంసః.

అ. విద్వాంసులు లేని సభ మహారణ్యం.

64. కిం తేనాత్మనః యస్య స్వయం న భవతి ప్రియః.

అ. తాను ఎవనికి ఇష్టుడు కాడో అలాంటివాడు తనకు ఇష్టుడయి ఏమి ప్రయోజనం?

65. స కిం ప్రభుః యో న సహతే పరిజనసంబాధామ్.

అ. పరిజనులవల్ల కలిగే ఒత్తిడిని సహించని ప్రభువు ఏమి ప్రభువు?

66. న లేఖాద్వచనం ప్రమాణమ్.

అ. లేఖకంటె మాట ఎక్కువ ప్రమాణం కాదు.

67. అనభిజ్ఞాతే లేఖే నాస్తి సంప్రత్యయః.

అ. గుర్తింపబడని (ఎవరు వ్రాశారో తెలియని అనగా సంతకం లేని) లేఖ (ఆకాశరామన్న ఉత్తరం) నమ్మదగినది కాదు.

68. త్రీణి పాతకాని సద్యః ఫలన్తి స్వామిద్రోహః, స్త్రీవధః, బాలవధశ్చేతి.

అ. ప్రభువుకు చేసిన ద్రోహం, స్త్రీవధ, బాలవధ - ఈ మూడు పాపాలు వెంటనే ఫలం ఇస్తాయి.

69. అప్లవస్య సముద్రావగాహనమివ అబలస్య బలవతా సహ విగ్రహాయ టిరిటిల్లితమ్.

అ బలవంతునితో విరోధంకోసం దుర్బలుని గులగుల తెప్పలేనివాడు సముద్రంలో ప్రవేశించడం వంటిది.

70. బలవన్తమాశ్రిత్య వికృతిభజనం సద్యోమరణకారణమ్.

అ. బలవంతుణ్ణి ఆశ్రయించి వికారం చెందడం అనగా అతనికి విరుద్ధంగా ప్రవర్తించడం, వెంటనే మరణానికి కారణం.

71. ప్రవాసః చక్రవర్తినమపి సంతాపయతి, కిం పునర్నాన్యమ్?

అ. ప్రవాసం చక్రవర్తికి కూడా మనస్సుకు బాధ కలిగిస్తుంది ఇతరుని మాట చెప్పాలా?

72. బహు పాథేయం, మనోనుకూలః పరిజనః, సువిహితశ్చోపస్కరః ఇతి ప్రవాసేషు దుఃఖోత్తరణతరణ్డకో వర్గః.

**ఇతి వ్యవహార సముద్దేశః.**

అ. అధికమైన దారిబత్తెం, మనస్సుకు అనుకూలమైన పరిజనం, బాగా ఏర్పరచుకొన్న ఆసనశయనాదులు- ఇవి ప్రవాసాలలో దుఃఖాన్ని దాటడానికి ఉపయోగించే తెప్ప అయిన సామగ్రి.

'బాలానందిని' అనే సోమదేవనీతిసూత్రాంధ్రవ్యాఖ్యానం
వ్యవహార సముద్దేశం సమాప్తం.

## వివాద సముద్దేశః

1. గుణదోషయోస్తులాదణ్డసదృశో రాజా.

అ. రాజు గుణదోషాలకు త్రాసువంటివాడు.

2. స్వగుణదోషాభ్యాం జన్తుషు గౌరవలాఘవే, రాజా తు పరం సమవర్తీ తత్ఫలమనుభావయతి.

అ. మానవులకు వాళ్ళ వాళ్ళ గుణదోషాలను పట్టి గౌరవం, లాఘవం కలుగుతూ ఉంటాయి. కాని, రాజు మాత్రం నిష్పక్షపాతబుద్ధితో ప్రవర్తిస్తూ ఆ గుణదోషాల ఫలాన్ని అనుభవింపచేస్తాడు.

3. ఆదిత్యవద్యథావస్థితార్థప్రకాశనపరాః సభ్యాః.

అ. సభ్యులు (ధర్మాసనం దగ్గర రాజు ప్రక్కనే ఉండి వ్యవహారాలు అన్నీ విని తమ అభిప్రాయం చెప్పేవాళ్ళు, Jury) సూర్యుడువలె ఉన్నది ఉన్నట్లు ప్రకటిస్తారు.

4. అదృష్టశ్రుతవ్యవహారాః, ప్రత్యర్థినః, సామిషాశ్చ న సభ్యాః.

అ. ఏనాడూ వ్యవహారాలు చూడనివాళ్ళు, విననివాళ్ళు, కేసులో ముద్దాయీలుగా ఉన్నవాళ్ళు, డబ్బు మింగే వాళ్ళు సభ్యులుగా ఉండడానికి పనికిరారు.

5. లోభపక్షపాతాభ్యామయథార్థవాదినః సభ్యాః సభాపతేః సద్యో మానార్థహానిం లభేరన్.

అ. లోభంచేత, పక్షపాతంచేత అయథార్థం చెప్పే సభ్యుల మానాన్ని (గౌరవాన్ని), ధనాన్ని వెంటనే సభాపతి (న్యాయనిర్ణేతగా కూర్చున్న రాజు లేదా ఆతని ప్రతినిధి) తొలగించాలి.

6. తత్రాలం వివాదేన యత్ర స్వయమేవ సభాపతిః ప్రత్యర్థీ.

అ సభాపతియే స్వయంగా ప్రత్యర్థిగా (ప్రతివాదిగా) ఉన్నచోట వివాదంతో పని లేదు. వివాదంచేసి ప్రయోజనం లేదు.

7. సభ్యసభాపత్యోరసామఞ్జస్యే న్యాయస్య కుతో జయః?

అ. సభ్యులకు, సభాపతికీ మధ్య సామరస్యం లేనప్పుడు న్యాయం ఎలా జయిస్తుంది? లేదా వాళ్ళిద్దరూ సరిగా లేనప్పుడు న్యాయం ఎలా జయిస్తుంది?

8. కిం బహుభిః ఛగలః శ్వా న క్రియతే?

అ. పదిమంది కలిస్తే మేకను కుక్కగా చేయవచ్చును కదా. ఒక బ్రాహ్మణుడు యజ్ఞంకోసం మేకను చంకన బెట్టుకొని వెడుతున్నప్పుడు అది కుక్క అని ఒప్పించి నలుగురు మోసగాళ్ళు దానిని అపహరించినట్లు పంచతంత్రకథ ప్రసిద్ధం.

9. వివాదమాస్థాయ సభాయాం నోపతిష్ఠతే, సమాహూతోఽపసరతి, పూర్వోక్తముత్తరోక్తేన బాధతే, నిరుత్తరః పరోక్తేషు, యుక్తముక్తం న ప్రతిపద్యతే; స్వదోషమనుద్ధృత్య పరదోషము పాలభతే; యథార్థవాదేఽపి ద్వేష్టి సభామ్ ఇతి పరాజితలిఙ్గాని.

అ. వివాదం అవలంబించి సభకు రాడు (కేసు పెడతాడు కాని, కోర్టుకు రాడు). పిలుస్తూంటే వెళ్ళిపోతాడు. ముందు చెప్పినదానిని తరువాత చెప్పిన దానిచేత ఖండిస్తాడు (తాను చెప్పినదానికే వ్యతిరేకంగా చెపుతాడు). ఇతరులు చెప్పినదానికి సమాధానం చెప్పడు. ఎదుటివాడు చెప్పినది యుక్తమే అయినా దానిని అంగీకరించడు. తన దోషాన్ని ఉద్ధరించకుండా (తన తప్పులేదని నిరూపించకుండా) పరుల దోషాలను వివరిస్తాడు. యథార్థం చెప్పినా కూడ సభను ద్వేషిస్తాడు (కోర్టును). ఇవన్నీ (కోర్టు వ్యవహారంలో) ఓడిపోయినవాని చిహ్నాలు.

10. ఛలేన, అప్రతిభానేన వచనాకౌశలేన చ అర్థహానిః.

అ. మోసంచేత, సమయానికి విషయం స్ఫురించకపోవడంచేత, మాట నేర్పు లేకపోవడం చేత (కోర్టులో) పని చెడిపోతుంది.

11. భుక్తిసాక్షిశాసనేషు పూర్వం పూర్వం ప్రమాణమ్.

అ. భుక్తి, సాక్షి, రాజశాసనం- వీటిలో ముందుముందుది ప్రమాణం.

ఒక ఆస్తిని పన్నెండేళ్ళపాటు అనుభవించడం భుక్తి. రాజశాసనం కంటె సాక్షి ఎక్కువ ప్రమాణం, దానికంటె భుక్తి ఎక్కువ ప్రమాణం అని అర్థం.

12. భుక్తిః సాపవాదా, సాక్రోశాః విప్రతిపన్నాశ్చ సాక్షిణః, శాసనం చ కూటలిఖితమితి న వివాదం సమాపయన్తి.

అ. అపవాదతో కూడిన అనగా అందరూ సత్యమే అని అంగీకరించని (Disputed) భుక్తి, నిందిస్తూ ఐక్యమత్యం లేని సాక్షులు, కపటంతో వ్రాసిన శాసనము (Forged document) వీటివల్ల వివాదం ఏ నాటికీ తేలదు.

13. బలాత్ కృతమ్, అన్యాయకృతం, రాజోపధికృతం చ న ప్రమాణమ్.

అ. బలాత్కారంచేత చేయబడినదీ, అన్యాయంగా చేయబడినదీ, రాజ వంచనచేత చేయబడినదీ ప్రమాణం కాదు. ఉపధి అనగా నిజాన్ని కప్పిపుచ్చడం. రాజే నిజాన్ని కప్పిపుచ్చితే అది రాజోపధి లేదా రాజు దగ్గర ఉన్న అధికారులు చేసినది కూడ రాజోపధి కావచ్చు (Suppression of truth done by the administration)

14. వేశ్యాకితవయోరుక్తం గ్రహణకానుసారితయా ప్రమాణయితవ్యమ్.

అ. వేశ్యలు, జూదరులు చెప్పినదానిని గ్రహించేవానిని పట్టి ప్రమాణంగా గ్రహించాలి.

గ్రహణక శబ్దానికి అర్థం స్పష్టంగా తెలియదు. గ్రాహకుడు(అదే హిందీలో గిరాకి) అని అర్థం కావచ్చును. సాధారణంగా తమకు రావలసినది విటుడు ఇవ్వ లేదని వేశ్య, జూదరి ఇవ్వలేదని మరొక జూదరి వ్యవహారానికి రావచ్చును. అప్పుడు ఇవ్వవలసినవాడు గ్రహణకుడు అని చెప్పవచ్చును. వాడు చెప్పేది కూడా దృష్టిలో ఉంచుకొని నిర్ణయించాలని అర్థం కావచ్చును. ఇదంతా ఊహ మాత్రమే. అసలు అర్థం మరొకటి కావచ్చును.

15. అసత్యంకారే వ్యవహారే నాస్తి వివాదః.

అ. సత్యంకారం లేని వ్యవహారంలో వివాదం లేదు. సత్యంకారం అనగా బేరాన్ని ధ్రువపరచటం, బజానా అని అర్థం. అది జరుగుతేనే సభకి (కోర్టుకు) వెళ్ళవచ్చును అని అర్థం.

16. నీవీన్యాసేషు వివాదః పురుషప్రామాణ్యాత్ సత్యాపయితవ్యః, దివ్యక్రియయా వా.

అ. మూలధనం విషయంలోను, న్యాసం విషయంలోను వివాదాన్ని ఒక మనిషి ప్రామాణ్యాన్ని (మోతుబరీని) పట్టి ధ్రువీకరించాలి; లేదా దివ్యక్రియ చేత ధ్రువీకరించాలి. ఒకరి దగ్గర కొంత కాలం పాటు దాచడానికి ఉంచిన వస్తువు 'న్యాసం.' ఒక వ్యక్తి నిజం చెపుతున్నాడా, అబద్ధం చెపుతున్నాడా అని నిర్ణయించడానికి ఆతని చేతిలో కాల్చిన ఇనుపగుండు పెట్టడం వంటివి చేసి అతనికేమీ జరగకపోతే సత్యం చెప్పినాడనీ, చెయ్యి కాలడం మొదలైనవి జరిగితే అసత్యం చెప్పినా డనీ నిర్ణయించేవారు. వీటికి 'దివ్యక్రియలు' అని పేరు. ఇవి అన్ని దేశాలలోనూ ఉండేవి.

17. యాదృశే తాదృశే వా సాక్షిణి నాస్తి దైవీ క్రియా, కిం పునరుభయసంమతే.

అ. ఈ దివ్యక్రియ ప్రతి సాక్షి విషయంలోనూ చేయగూడదు; రెండు పక్షాలవాళ్ళకీ ఇష్టుడైనవాని విషయంలోనే చెయ్యాలి.

18. శ్రూయతే హి వనస్పతివనమార్జారాభ్యాం సాక్షిభ్యామర్థసిద్ధిః.

అ. పెద్ద వృక్షము, అడవి పిల్లి వీటి సాక్ష్యం చేత విషయం నిర్ణయించ బడింది అని వింటున్నాం కదా! ఈ కథ పురాణాదులలో ఉండవచ్చును. అన్వేషించాలి.

19. యః పరద్రవ్యమభియుఞ్జీత అభిలుమ్పేత వా తస్య శపథః క్రోశో దివ్యం వా.

అ. ఎవడు పరధనాన్ని బలాత్కారంగా అపహరిస్తాడో, లేదా పరద్రవ్యానికి నష్టం కలగచేస్తాడో వానిని తిట్టడంగాని, దివ్యపరీక్ష గాని శపథం.

20. అభిచారయోగై ర్విశుద్ధస్య అభియుక్తార్థసంభావనాయాం ప్రాణావశేషోఽర్థాపహారః.

అ. అభిచారయోగాలచేత పరీక్షించబడినవాని దగ్గర ధనం ఉన్నట్లు కనబడితే వాని ప్రాణాలు మాత్రం మిగిల్చి సమస్త ధనాన్ని లాగుకోవాలి. (ఈ సూత్రానికి అర్థం స్పష్టంగా తెలియలేదు.)

21. లిఙ్గివిటనాస్తికస్వాచారచ్యుతానఙ్గపతితానాం న దైవీ క్రియాస్తి, తేషాం యుక్తితోఽర్థస్య సిద్ధిరసిద్ధిర్వా.

అ. సంన్యాసులు, విటులు, నాస్తికులు, అచారభ్రష్టులు, అవయవలోపం ఉన్నవాళ్ళు, పతితులు - వీళ్ళ విషయంలో దివ్యక్రియ లేదు. వాళ్ళ కార్యం సిద్ధించడమైనా సిద్ధించకపోవడమైనా యుక్తిచేతనే జరగాలి.

22. పత్రస్థం భాషోత్తరే విచార్య పరిచ్ఛిన్ద్యాత్.

అ. పత్రంలో ఉన్న అంశాన్ని భాషనూ, ఉత్తరాన్ని (జవాబునూ) పరిశీలించి నిర్ణయించాలి. (దీని భావం అస్పష్టంగా ఉంది)

23. పరస్పరవిప్రలాపే న యుగైరపి వివాదసమాప్తిః, ఆనన్త్యాద్విప్రకృతోక్తీనామ్.

అ. ఒకరి మీద ఒకరు అరుచుకొంటూ ఉంటే యుగాలు గడచినా వివాదం పూర్తి కాదు. ఎందుచేత ననగా - మాటమీద మాటలకు అంతం ఉండదు.

24. సభాయాం పరభూమిం నాభినివిశేత, న వా మిథః సంజల్పం కుర్వీత.

అ. న్యాయస్థానంలో మరొకరు కూర్చుండవలసిన చోట కూర్చొనకూడదు. ఒకరితో ఒకరు మాట్లాడకూడదు.

25. గ్రామే పురే వా వృత్తైః వ్యవహారైః సతి వివాదే రాజానముపే యాత్.

అ. గ్రామంలో కాని, పట్టణంలోకాని వ్యవహారం (కేసు) జరిగినతరవాత ఇంకా వివాదం ఉన్నట్లయితే (పరిష్కారం పూర్తికాకపోతే) రాజుదగ్గరికి వెళ్లాలి.

26. రాజ్ఞా దృష్టే వ్యవహారే నాస్త్యనుబన్ధః.

అ. వ్యవహారం రాజు చూచిన తరవాత ఇంక దానికి పొడిగింపు ఉండదు. (పై అప్పీలు లేదు.)

27. రాజాజ్ఞాం మర్యాదాం వా అతిక్రామన్ సద్యఃఫలేన దణ్డేనోప హన్తవ్యః.

అ. రాజాజ్ఞను కాని, కట్టుబాటును గాని అతిక్రమించినవాణ్ణి వెంటనే ఫలం గల దండనంచేత శిక్షించాలి.

28. న దుర్వృత్తానాం దణ్డాదన్యోఽస్తి వినయోపాయః, యతః అగ్నిసంయోగ ఏవ వక్రం కాష్ఠం సరలయతి.

అ. చెడునడవడిక కలవాళ్ళను అదుపులో ఉంచడానికి దండం తప్ప మరొక ఉపాయం లేదు. వంకర కఱ్ఱను నిప్పుతో సంబంధమే సరళంగా ఉండే టట్లు చేస్తుంది. (కఱ్ఱ వంకర కాలిస్తేనే కాని పోదు.)

29. ఋజుం సర్వే పరిభవన్తి.

అ. ఋజువైనవాణ్ణి (వక్రస్వభావం లేనివాణ్ణి) అందరూ తిరస్కరిస్తారు.

30. న హి తథా వక్రతరుః ఛిద్యతే యథా సరలః.

అ. సరలమైన (వంకరలేని) చెట్టును (దూలాలు తలుపులు మొదలైన వాటికోసం) ఛేదించినట్లు వంకర చెట్టును ఛేదించరు కదా?

31. యా శక్తస్యాపరాధిషు క్షమా సా తస్యాత్మనస్తిరస్కారః.

అ. సమర్థుడైనవాడు అపరాధుల విషయంలో ఓరిమి చూపడం తనను తాను తిరస్కరించుకోవడమే.

32. అతిక్రమ్య వర్తిషు నిగ్రహకర్తుః రాజ్ఞః సర్పాదివ దృష్ట ప్రత్యవాయాః సర్వేఽపి జనాః బిభ్యతి.

అ. కట్టుబాట్లు అతిక్రమించేవానిని శిక్షించే రాజుకు, ఆ శిక్షను చూచిన అందరూ కూడా, సర్పాన్ని చూచి భయపడ్డట్లు భయపడతారు.

33. అనాయకాం బహునాయకాం వా సభాం న ప్రవిశేత్.

అ. నాయకుడు లేని సభకు (న్యాయస్థానానికి) గాని, చాలామంది నాయకు లున్న సభకు కాని వెళ్ళకూడదు.

34. గణపురశ్చారిణః సిద్ధే కార్యే స్వస్య న కించిదపి, అసిద్ధే ధ్రువ మాత్మనః ప్రత్యవాయః.

అ. ఒక గుంపును వెనక వేసికొని ముందు వెళ్ళే నాయకుడికి (యూని యన్ లీడర్ వంటివాడు) పని జరిగితే, తన కేమీ లాభం ఉండదు. జరగకపోతే వానికి ప్రత్యవాయం తప్పదు.

35. న సా గోష్ఠి ప్రస్తోతవ్యా యత్ర పరేషాం ప్రతాపః.

అ. ఏ గోష్ఠిలో శత్రువులకు ప్రతాపం ఉంటుందో దానిని ప్రస్తావించ గూడదు.

36. స్వోపాలమ్భపరిహారేణ పరముపాలభేత.

అ. ఇతరులవల్ల తనకు కలిగిన నిందను పరిహరించుకొనడం చేత (కోసం) ఇతరులను నిందించాలి.

37. స్వామినముత్కర్షయన్ గోష్ఠిమవతారయేత్.

అ. తన ప్రభువు ఉత్కర్షను చాటుతూ గోష్ఠి ప్రారంభించాలి.

38. న భర్తురభియోగాత్పరం సత్యమసత్యం వా వదన్తమవగృహ్ణీ యాత్.

అ. ప్రభువు నిర్బంధించడంచేత సత్యం పలికినా అసత్యం పలికినా ఒక వ్యక్తిని శిక్షించకూడదు.

39. నానభియుక్తః కమప్యభియుఞ్జీత.

అ. అభియుక్తుడు కాకుండా ఎవరినీ అభియోగం చేయకూడదు.

ఎవనిమీద మరొకడు కేసు పెడతాడో వాడు అభియుక్తుడు. అభియోగం అనగా న్యాయస్థానానికి లాగడం.

40. అర్థసంబన్ధః సహవాసశ్చ నాకలహః సంభవతి.

అ. కలహం లేని (కలహానికి దారితీయని) ధనసంబంధం (డబ్బుతో లావాదేవీలు) గాని, కలిసి ఉండడం గాని సంభావ్యాలు కావు.

41. నిధిః ఆకస్మికో వార్థలాభః సహప్రాణైః సంచితమప్యర్థ మపహారయతి.

అ. నిధి (దొరకడం) గాని, ఆకస్మికంగా కలిగిన ధనలాభం గాని అంతకుముందు సంపాదించుకొన్న ధనాన్ని అంతనీ ప్రాణాలతో సహా అపహరింపచేస్తుంది.

42. బ్రాహ్మణానాం హిరణ్యయజ్ఞోపవీతయోః స్పర్శనం శపథః; శస్త్రాస్త్రరత్నభూమివాహనపల్యాయనానాం తు క్షత్రియాణామ్; వైశ్రవణపోతయోః కాకిణీహిరణ్యయోర్వా వైశ్యానామ్; క్షీరబీజయోః వల్మీకస్య వా శూద్రాణామ్; యేన కర్మణా జీవతి తత్కర్మోపకరణానాం తు కారూణామ్.

అ. బ్రాహ్మణులు బంగారం గాని, యజ్ఞోపవీతం గాని స్పృశించి ఒట్టు పెట్టాలి. (న్యాయస్థానంలో ఆ విధంగా ఒట్టు పెట్టించాలి.) క్షత్రియులు శస్త్రాలు, అస్త్రాలు, రత్నాలు, భూమి, కళ్ళెం స్పృశించి శపథం చెయ్యాలి. వైశ్యులు కుబేరునిమీదా, బాలుడిమీదా, నాణాలమీదా, బంగారంమీదా శపథం చెయ్యాలి. శూద్రులు పాలమీదా, విత్తనాలమీదా, లేదా పుట్టమీదా ఒట్టు పెట్టాలి. శిల్పులు తాము పని చేసే ఉపకరణాలమీద ఒట్టు పెట్టాలి.

43. వ్రతినామన్యేషాం చ ఇష్టదేవతాపాదస్పర్శనప్రదక్షిణీకరణ దివ్యకోశదణ్డతులారోహణై ర్విశుద్ధిః.

అ. సంన్యాసులకు అలాంటివారే అయిన ఇతరులకు, ఇష్టదేవతాపాద స్పర్శచేత, దివ్యపరీక్షచేత, కోశదండతులారోహణాలచేత విశుద్ధి (అపరాధ విహీను లనే నిర్ణయం) కలుగుతుంది.

44. వ్యాధానాం ధనుర్లఙ్ఘనం శపథః, అన్త్యావసాయినామార్ద్ర చర్మాధిరోహణమ్.

అ. బోయవాళ్ళకు ధనస్సును దాటడం శపథం. అంత్యజాతివాళ్ళు తడి చర్మను ఎక్కి శపథం చెయ్యాలి.

45. వేశ్యా మహిలా, భృత్యో భణ్డః, శ్రేణిః నియోగః, నియోగీ చ మిత్రమ్ ఇతి చత్వార్యశాశ్వతాని.

అ. వేశ్య ఇంటిలో స్త్రీగా ఉండడం, నీచుడు భృత్యుడుగా ఉండడం, శ్రేణి (వర్తకులు, శిల్పులు మొదలైనవాళ్ళ సంఘం) నియోగం (ఇవ్వడం), నియోగి (ఆఫీసర్) మిత్రుడుగా ఉండడం. ఈ నాలుగూ శాశ్వతం కానివి. 'శ్రేణేః' అని పాఠం అయిఉండవచ్చు. అనగా శ్రేణియొక్క (శ్రేణి ఇచ్చిన) ఉద్యోగం. ప్రైవేటు కంపెనీ ఉద్యోగం వంటిది అయివుంటుంది.

46. క్రీతేష్వాహారేష్వివ పణ్యస్త్రీషు క ఆస్వాదః.

అ. కొన్న ఆహారపదార్థాలలోవలె వెలయాలులలో రుచి ఏమి ఉంటుంది?

47. యస్య యావాన్ పరిగ్రహః తం తావానేవ సంతాపయతి.

అ. ఎవడు ఎంత (సొత్తు) సమకూర్చుకుంటాడో అది అతనికి అంత బాధే కలిగిస్తుంది.

48. గజే గర్దభే చ రాజరజకయోః సమ ఏవ చిన్తాభారః.

అ. రాజుకు తన ఏనుగును గూర్చి ఎంత చింతాభారం ఉంటుందో చాకలికి తన గాడిదను గూర్చి అంతే చింతాభారం ఉంటుంది.

49. మూర్ఖస్యాగ్రహః నాపాయమనవాప్య నివర్తతే.

అ. మూర్ఖుడి మొండిపట్టు అపాయం ఏదో జరిగితేనే కాని వదలదు.

50. కార్పాసాగ్నేరివ మూర్ఖస్యోపశాన్తౌ ఉపేక్షణమేవ ఔషధమ్.

అ. దూదికి అంటుకొన్న నిప్పుకు వలె మూర్ఖునికి ఉపశాంతి కలగాలంటే దాన్ని ఉపేక్షించడమే ఔషధం.

51. మూర్ఖస్యాభ్యుపపత్తికరణమ్ ఉద్దీపనపిణ్డః.

అ. మూర్ఖుని అభిప్రాయం ప్రకారం నడవడం మూర్ఖత్వం పెంచే పిండం వంటిది.

52. క్రోధాగ్నిజ్వలితేషు తత్క్షణప్రశమాగ్రహః ఘృతాగ్నిష్వాహుతి నిక్షేప ఇవ.

అ. క్రోధాగ్నితో మండిపడుతున్న వాళ్ళని వెంటనే శాంతింపచేయడంకోసం పట్టుదలతో ప్రయత్నించడం నేతితో మండుతూన్న అగ్నులలో ఆహుతి వేయడమే.

53. జలసంసిచ్యమాన శణగుణగ్రన్థిరివ అనునయేన కర్కశో మూర్ఖః.

అ. బతిమాలినకొలదీ మూర్ఖుడు జనపనారపగ్గం ముడి తడిపిన కొలదీ బిగిసిపోయినట్లు బిగిసిపోతాడు.

54. అనభిజ్ఞోఽన్ధోఽన్ధానివ ధ్రియమాణః మూర్ఖకరమాకర్షతి.

అ. పట్టుకొనబడిన ఒక గ్రుడ్డివాడు గ్రుడ్డివాళ్ళ చేయి లాగినట్లు, తెలివి తక్కువవాడు మూర్ఖుని చెయ్యి లాగుతాడు.

55. స్వయమగుణం వస్తు న ఖలు పక్షపాతాద్గుణవద్భవతి.

అ. స్వతఃసిద్ధంగా గుణం లేని వస్తువు పక్షపాతం ఉన్నంత మాత్రాన గుణం కలది కాదు కదా?

56. న ఖలు గోపాలకస్నేహాదుక్షా క్షీరం క్షరతి?

ఇతి వివాదసముద్దేశః

అ. గొల్లవాని స్నేహంచేత ఎద్దు పాలు ఇవ్వదు కదా?

''బాలానందిని'' అనే సోమదేవనీతి సూత్రాంధ్రవ్యాఖ్యానంలో వివాద సముద్దేశం సమాప్తం.

## షాడ్గుణ్య సముద్దేశః

1. శమవ్యాయామౌ వ్యతిక్రమేణ యోగక్షేమయోర్యోనిః

అ. శమవ్యాయామాలు వ్యతిక్రమంచేత యోగక్షేమాలకి కారణం అవుతాయి. అనగా శమం క్షేమానికి, వ్యాయామం యోగానికి కారణం.

2. కర్మారమ్భాణాం యోగసాధనో వ్యాయామః.

అ పనులు ప్రారంభించే యోగానికి సాధనమైనది వ్యాయామం. చేయవలసిన పను లన్నీ ఒక నియతమైన పద్ధతిలో చేయడం వ్యాయామం అని అర్థం. దానివల్ల యోగం (అంతకు పూర్వం లేనివి లభించడం) జరుగుతుంది,

3. కర్మఫలోపభోగానాం క్షేమసాధనః శమః.

అ. సాధించిన పనుల ఫలాలను అనుభవించడానికి కావలసిన క్షేమానికి సాధనమైనది శమం.

4. దైవం మానుషం చ కర్మ లోకం యాపయతి.

అ. ఈ లోకాన్ని దైవకర్మ, మానుషకర్మ నడిపిస్తున్నాయి.

5. దైవం ధర్మాధర్మౌ, మానుషం నయానయౌ; తచ్చిన్త్యమ్; అచిన్త్యం దైవమ్.

అ. ధర్మాధర్మాలు దైవకర్మ. నీతిదుర్నీతులు మానుషకర్మ. మానుష కర్మ ఆలోచించి చేయదగినది. దైవకర్మ ఆలోచించ (ఊహించ) శక్యం కానిది.

6. అతర్కితోపస్థితార్థానర్థసంబన్ధః దైవాయత్తః.

అ. ఊహించని విధంగా వచ్చిన అర్థానర్థాల సంబంధం (తలవని విధంగా సుఖదుఃఖాలు రావడం) దైవాయత్తమైనది.

7. బుద్ధిపూర్వం హితాహితప్రాప్తిపరిహారసంబన్ధః మనుష్యాయత్తః.

అ. బుద్ధిపూర్వకంగా కలిగిన హితప్రాప్తి సంబంధమూ, అహితపరిహార సంబంధమూ, అనగా హితం కలిగేటట్లు, అహితం తొలగేటట్లు బుద్ధిబలం ఉపయోగించి చేసికోవడం అనేది మనుష్యాధీనం.

8. సత్యపి దైవేఽనుకూలే న నిష్కర్మణో భద్రమస్తి.

అ. దైవం అనుకూలంగా ఉన్నా కర్మ (పురుషప్రయత్నం) చేయని వానికి క్షేమం ఉండదు.

9. న ఖలు దైవమేవేహమానస్య కృతమప్యన్నం ముఖే ప్రవిశతి.

అ. దైవాన్నే నమ్ముకొని కూర్చున్న వానికి, సిద్ధంగా ఉన్న అన్నమైనా నోటిలోనికి వెళ్ళదు కదా?

10. న ఖలు దైవమేవావలమ్బమానస్య ధనుః స్వయమేవ శరాన్ సంధత్తే.

అ. దైవంమీదనే ఆధారపడి ఉన్న వాని ధనస్సు తనంతట తానే బాణాలు సంధించదు కదా?

11. పౌరుషావలమ్బినోఽర్థానర్థయోః సన్దేహః, నిశ్చిత ఏవానర్థో దైవమాత్రపరస్య.

అ. పౌరుషం (పురుషకారం) అవలంబించినవానికి లాభనష్టాల విషయంలో సందేహం ఉంటుంది. దైవంమీదనే ఆధారపడ్డవానికి అనర్థం నిశ్చితం.

12. ఆయురౌషధయోరివ దైవపౌరుషయోః పరస్పరానుబన్ధో హి సమీహితమర్థం సాధయతి.

అ. ఒకదానితో ఒకటి కలిసిన ఆయుర్దాయం, ఔషధం వలెనే దైవ పౌరుషాలు రెండూ పరస్పరం కలిస్తే అనుకున్న పని సాధించవచ్చును.

13. తత్తత్ఫలమనుభావయన్ అనుష్ఠీయమానో న కశ్చిద్ధర్మోఽధర్మమనుబధ్నాతి.

అ. అనుష్ఠించబడే ధర్మం ఆ యా ఫలాలను అనుభవింపచేస్తూ అధర్మంతో సంబంధించినది కాదు. ధర్మబుద్ధితో ధర్మకార్యాలు చేస్తున్నప్పుడు దాని సత్ఫలితం లభిస్తూనే ఉంటుంది. అప్పుడు అధర్మంతో సంబంధం ఉండదు

14. యోగక్షేమయోర్నిష్పత్త్యుపాయో నయః విపత్తిహేతురనయః.

అ. యోగక్షేమాల సిద్ధికి హేతువైనది నీతి. అది చెడిపోవడానికి హేతువైనది అనయం (దుర్నీతి).

15. త్రిపురుషమూర్తిత్వాన్న భూభుజః పరం ప్రత్యక్షం దైవతమస్తి.

అ. రాజు త్రిమూర్తిస్వరూపుడవడంచేత అతనిని మించిన ప్రత్యక్ష దేవత మరొకరు లేరు.

16. ప్రతిపన్నప్రథమాశ్రమో హృదయగుహాజ్యోతిషి భగవతి పరే బ్రహ్మణి నిష్ణాతమతిః, ఉపాసితగురుకులః, సమ్యగ్విద్యాయామధీతీ, కౌమారం వయోఽలఙ్కుర్వన్ క్షత్రపుత్రో భవతి బ్రహ్మా.

అ. బ్రహ్మచర్యాశ్రమాన్ని అవలంబించి, హృదయగుహలోని జ్యోతిస్సు అయిన పూజ్యమైన పరబ్రహ్మయందు స్థిరమైన బుద్ధి కలవాడై, గురుకులాన్ని సేవిస్తూ, బాగా విద్యాభ్యాసం చేస్తూ, కౌమారవయస్సును అలంకరించి ఉన్న క్షత్రియపుత్రుడు బ్రహ్మదేవుడే.

17. సంజాత రాజ్యదీక్షాభిషేకం, స్వైర్గుణైః ప్రజాస్వనురాగం జనయన్తం రాజానం నారాయణమాహుః; న హ్యవిష్ణుః పృథివీపతిరితి.

అ. రాజ్యలక్ష్మీ దీక్షాభిషేకం పొంది తన గుణాలచేత ప్రజలలో అనురాగాన్ని పుట్టించే రాజును నారాయణు డని అంటారు. విష్ణువు కానివాడు రాజు కాడు కదా?

18. ప్రవృద్ధతాపతృతీయలోచనానలః పరమైశ్వర్యమాతిష్ఠమానః రాష్ట్రకణ్టకానసురాన్ ద్విషద్దానవాంశ్చోచ్ఛేత్తుం యతమానః విజిగీషుర్నృపతిః భవతి పినాకపాణిః.

అ. వృద్ధి పొందిన ప్రతాపం అనే మూడవ కంటి అగ్ని కలవాడై, గొప్ప ఐశ్వర్యాన్ని అధిష్ఠించి, రాష్ట్రానికి కంటకాలైన అసురులను (దుష్టులను) ద్వేషిస్తూ, దానవులను నశింపచేయడంకోసం ప్రయత్నించేవాడు, జయేచ్ఛ కలవాడూ అయిన రాజే శివుడు అవుతాడు.

19. ఉదాసీన - మధ్యస్థ - విజిగీషు - అరి - పార్ష్ణిగ్రాహ - ఆక్రన్ద ఆసార - అన్తర్ధయః యథాసంభవం గుణగణవిభవతారతమ్యాత్ మణ్డలానామధిష్ఠాతారః.

అ. ఉదాసీనుడు, మధ్యస్థుడు, విజిగీషువు, అరి, మిత్రుడు, పార్ష్ణిగ్రాహుడు, ఆక్రందుడు, ఆసారుడు, అంతర్ధి - వీళ్ళు వాళ్ళ గుణగణాల తారతమ్యాన్ని పట్టి, సామర్థ్యంలో ఉన్న తారతమ్యాన్ని పట్టి యథాసంభవంగా మండలాధిష్ఠాతలు (మండలప్రభువులు) అవుతారు.

20. అగ్రతః, పృష్ఠతః, పార్శ్వతః, కోణతో వా సంనికృష్టే విప్రకృష్టే మణ్డలే స్థితః, మధ్యమాదీనాం విగృహీతానాం విగ్రహే, సంహతానామనుగ్రహే చ సమర్థోఽపి కేన చిత్కారణేన అన్యస్మిన్ భూపతౌ విజిగీషమాణే యః ఉదాస్తే స ఉదాసీనః.

అ. ముందు గాని, వెనుక గాని, ప్రక్కల గాని, మూలలో గాని, దగ్గరగా గాని, దూరంగా గాని ఉన్న మండలంలో ఉంటూ, విరోధంతో ఉన్న మధ్యమాదులను నిగ్రహించడానికి, కలిసి ఉన్నవాళ్ళని అనుగ్రహించడానికి సమర్థుడై ఉండి కూడ, మరొక రాజు జయేచ్ఛతో ఉన్నప్పుడు ఏ కారణం చేతనైనా ఉదాసీనంగా (ఏమీ కలగచేసుకొనకుండా) ఉన్నవాడు "ఉదాసీనుడు."

21. ఉదాసీనవదనియతమణ్డలః, పరభూపాపేక్షయా స్వయం సమధికబలోఽపి కుతశ్చిత్ కారణాత్ అన్యస్మిన్ నృపతౌ విజిగీషమాణే యో మధ్యస్థభావమవలమ్బతే స మధ్యమః.

అ. ఉదాసీనుడు వలెనే అనిశ్చితమైన మండలం కలవాడై, శత్రురాజు కంటె అధికబలం కలవాడై ఉండి కూడ ఇతరరాజు జయేచ్ఛతో ఉన్నప్పుడు, ఏ కారణంవల్లనో మధ్యస్థత్వం అవలంబించినవాడు ''మధ్యస్థుడు.''

22. రాజాత్మదైవద్రవ్యప్రకృతిసంపన్నం నయవిక్రయయోరధిష్ఠానం విజిగీషుః.

అ. బుద్ధిబలం, దైవబలం, ద్రవ్యం, ప్రకృతిసంపదా ఉండి నీతి పరాక్రమాలకు నెలవైన రాజు "విజిగీషువు."

23. య ఏవ స్వస్యాహితానుష్ఠానేన ప్రాతికూల్యం బిభర్తి స ఏవారిః.

తనకు అహితం చేస్తూ ప్రతికూలంగా ఉండేవాడు అరి.

24. మిత్రలక్షణ ముక్తం పురస్తాత్.

అ. మిత్రుని లక్షణం వెనుక చెప్పబడింది.

25. యో విజిగీషౌ ప్రస్థితే, ప్రతిష్ఠమానే వా పశ్చాత్ కోపం జనయతి స పార్ష్ణిగ్రాహః.

అ. విజిగీషువు యుద్ధయాత్రకు బయలుదేరినపిమ్మట గాని, బయలు దేరుతున్నప్పుడు గాని వెనక ప్రకోపాన్ని (జనులలో అశాంతిని) పుట్టించేవాడు పార్ష్ణిగ్రాహుడు.

26. పశ్చాద్విజిగీషోర్మిత్రమాక్రన్దః.

అ. విజిగీషువుకు వెనక ఉన్న (తన) మిత్రుడు 'ఆక్రందుడు.

27. పార్ష్ణిగ్రాహమిత్రమ్ ఆసారః ఆక్రన్దమిత్రం వా.

అ. పార్ష్ణిగ్రాహుని మిత్రుడు గాని, ఆక్రందుని మిత్రుడు గాని ఆసారుడు.

28 అరివిజిగీష్వోర్మణ్డలాన్తర్విహితవృత్తిః, ఉభయవేతనః పర్వతాటవీకృతాశ్రయశ్చాన్తర్ధిః.

అ. అరివిజిగీషువుల మండలాల మధ్య ఉండి, ఇద్దరి దగ్గరినుండీ వేతనం తీసికొంటూ, పర్వతాలమీదా అడవులలోనూ నివసించేవాడు "అంతర్ధి"

29. అరాజబీజీ, లుబ్ధః, క్షుద్రః, విరక్తప్రకృతిః, అన్యాయపరః, వ్యసనీ, విప్రతిపన్నమిత్రామాత్యమన్త్రిసామన్తసేనాపతిః శత్రుః అభియోక్తవ్యః.

అ. క్షత్రియ బీజానికి పుట్టనివాడు, లోభి, నీచుడు, ప్రకృతుల అనురాగం లేనివాడు, అన్యాయపరుడు, దుర్వ్యసనా లున్నవాడు, ఐకమత్యం లేని మిత్రులు, అమాత్యులు, మంత్రులు, సామంతులు, సేనాపతులు కలవాడు అయిన శత్రువు మీదికి యుద్ధానికి వెళ్ళాలి.

30. అనపాశ్రయః, దుర్బలాశ్రయో వా శత్రురుచ్ఛేదనీయః; విపర్యయః పీడనీయః, కర్షణీయో వా.

అ. ఆశ్రయం లేనివాడు గాని, దుర్బలుణ్ణి ఆశ్రయించినవాడు గాని అయిన శత్రువును పెకలించివేయాలి. అలా కానివాణ్ణి పీడించాలి, లేదా లాగాలి

31. సమాభిజనః సహజశత్రువిరుద్ధః విరోధయితా వా కృత్రిమః శత్రుః.

అ. తనతో సమానమైన అభిజనం (ఉత్తమవంశాదికం) ఉన్నవాడు, సహజశత్రువుకు విరుద్ధుడు, అనగా సహజశత్రువుకు ఉండే లక్షణాలు లేని శత్రువు, లేదా తనతో విరోధం పెట్టుకొన్నవాడు - కృత్రిమశత్రువు.

32. "అనన్తరః శత్రుః, ఏకాన్తరం మిత్రమ్" ఇతి నైష ఏకాన్తతః, కార్యం హి మిత్రత్వామిత్రత్వయోః కారణమ్, న పునర్విప్రకర్షసంనికర్షౌ.

అ. సరిహద్దులో ఉన్నవాడు శత్రువు, ఒక రాజ్యానికి అవతల ఉన్నవాడు మిత్రుడు అని నిశ్చింతగా చెప్పడానికి వీలులేదు; ఎందుచేత ననగా-మిత్రత్వ, అమిత్రత్వాలకి కారణం కార్యమే కాని దూరం, దగ్గర అనేవి కారణం కాదు.

33. బుద్ధిశక్తిరాత్మశక్తేరపి గరీయసీ; శశకేన సింహవ్యాపాదనమత్ర దృష్టాన్తః.

అ. శరీరబలంకంటె బుద్ధిశక్తి గొప్పది చెవులపిల్లి సింహాన్ని చంపి వేయడం ఇందుకు దృష్టాంతం.

34. కోశదణ్డబలం ప్రభుశక్తిః; శూద్రకశక్తికుమారౌ దృష్టాన్తౌ.

అ. కోశం (ధనం), సేనాబలం- ఈ రెండూ ప్రభుశక్తి. శూద్రకుడు, శక్తికుమారుడూ దృష్టాంతాలు.

35. విక్రమః బలం చోత్సాహశక్తిః, అత్ర రామో దృష్టాన్తః.

అ. పరాక్రమం, బలం- ఈ రెండూ ఉత్సాహశక్తి. ఈ విషయంలో రాముడు దృష్టాంతం.

36. శక్తిత్రయోపచితః జ్యాయాన్; శక్తిత్రయాపచితః హీనః; సమానశక్తిత్రయః సమః.

అ. ఈ మూడు శక్తులచేత తనను మించినవాడు గొప్పవాడు, శక్తిత్రయంచేత తనకంటె తక్కువగా ఉన్నవాడు హీనుడు; మూడు శక్తులూ సమంగా ఉన్నవాడు సముడు.

37. సంధి విగ్రహయానాసన సంశ్రయద్వైధీభావాః షాడ్గుణ్యమ్.

అ. సంధి, విగ్రహం, యానం, ఆసనం, సంశ్రయం, ద్వైధీభావం-ఇవి ఆరు గుణాలు. వీటికి షాడ్గుణ్యం అని పేరు.

38. పణబన్ధః సంధిః.

అ. పణబంధం సంధి. నువ్వు ఇలా చేస్తే - నేను ఇలా చేస్తాను అనే ఒప్పందం పణబంధం

39. అపకారో విగ్రహః.

అ. అపకారం చేయడం విగ్రహం.

40. అభ్యుచ్చయో యానమ్.

అ. అభ్యుచ్చయం యానం. అభ్యుచ్చయం అనగా శత్రువుకంటె అధిక బలంతో ఉండడం. కాని 'అభియోగః' అని పాఠం అయి ఉంటుంది. శత్రువు మీదికి యుద్ధానికి వెళ్ళడం యానం.

41. ఉపేక్షణమ్ ఆసనమ్.

అ. సమయం కోసం నిరీక్షించి ఉండడం ఆసనం.

42. పరస్యాత్మార్పణం సంశ్రయః.

అ. తనను తాను మరొకనికి సమర్పించడం సంశ్రయం.

43. ఏకేన సహ సంధాయ అన్యేన సహ విగ్రహకరణం, ఏకత్ర వా శత్రౌ సంధానపూర్వో విగ్రహః ద్వైధీభావః.

అ. ఒక శత్రువుతో సంధి చేసుకొని మరొకనితో విరోధం పెట్టుకొనడం, లేదా ఒకే శత్రువుతో కొంతవరకు సంధి చేసికొని విరోధం కొనసాగించడం ద్వైధీభావం.

44. ప్రథమపక్షే సన్ధీయమానః, విగృహ్యమాణః, విజిగీషుః ఇతి త్ర్యాశ్రయః ద్వైధీభావః; ద్వితీయే తు ద్వ్యాశ్రయః.

అ. మొదటి పక్షంలో ద్వైధీభావం సంధిచేసికొనబడేవాడు, విరోధం చేయబడేవాడు, జయేచ్ఛ గలవాడు అని ముగ్గురిని ఆశ్రయించి ఉంటుంది. రెండవ పక్షంలో ఇద్దరిని మాత్రమే ఆశ్రయించి ఉంటుంది.

45. హీయమానః పణబన్ధేన సంధిముపేయాత్ యది నాస్తి పరేషాం పరిపణితేఽర్థే మర్యాదోల్లఙ్ఘనమ్.

అ. పెట్టిన షరతును ఇతరులు ఉల్లంఘించరు అనే నమ్మకం ఉంటే దుర్బలుడై పోతున్నవాడు పణబంధంచేత (షరతులు పెట్టుకొని)సంధి చేసుకోవాలి.

46. అభ్యుచ్చీయమానః పరం విగృహ్ణీయాత్, యది నాస్త్యాత్మబలేషు క్షోభః.

అ. తన సేనలలో క్షోభం ఏమీ ఉండదనే నమ్మకం ఉంటే అభివృద్ధి పొందుతూన్న విజిగీషువు శత్రువులతో విరోధం పెట్టుకోవాలి.

47. గుణాతిశయయుక్తో యాయాత్ యది న సన్తి రాష్ట్రకణ్టకాః, న భవతి వా పశ్చాత్ కోపః.

అ. రాష్ట్రకంటకులు (రాష్ట్రంలో బాధ కలిగించే దుష్టులు) వెనకనుంచి ప్రకోపం (సైనికులు, మంత్రులు మొదలైనవాళ్ళు విద్రోహానికి పాలుపడడం)గాని లేకపోతే శత్రువుకంటె గుణాలచేత ఆధిక్యంతో ఉన్నవాడు దండెత్తి వెళ్ళాలి.

48. స్వమణ్డల మపరిపాలయతః పరమణ్డలాభియోగః వివసనస్య శిరోవేష్టనమివ (అన్ధస్య రజ్జువలనమివ).

అ. తన రాజ్యాన్నే చక్కబెట్టుకొనలేనివాడు పరరాజ్యంమీదికి దండెత్తి వెళ్ళడం దిగంబరుడు తలపాగా ధరించడం వంటిది. గ్రుడ్డివాడు త్రాడు అల్లడం వంటిది.

49. న మాం పరో హన్తుం నాహం పరం హన్తుం చ శక్తః ఇత్యాసీత, యద్యాయత్యామస్తి కుశలమ్.

అ. "నన్ను శత్రువు చంపజాలడు. నేను శత్రువును చంపజాలను" అనే పరిస్థితిలో, భవిష్యత్తులో అది క్షేమకరం అవుతుంది అనే నమ్మకం ఉన్న పక్షంలో, ఏమీ చేయకుండా ఉండాలి.

50. శక్తిహీనః సంశ్రయం కుర్యాత్; యది న భవతి పరేషామామిషమ్.

అ. శక్తి లేనివాడు ఇతరులను ఆశ్రయించాలి; అయితే వాళ్ళు తనను మింగేయకుండా ఉంటారంటేనే అలా చెయ్యాలి.

51. బలవద్భయాదబలవదాశ్రయణం హస్తిభయాదేరణ్డాశ్రయణమివ.

అ. బలవంతునికి భయపడి ఎవరో బలం లేనివాణ్ణి ఆశ్రయించడం ఏనుగుకు భయపడి ఆముదం చెట్టు ఎక్కడం వంటిది.

52. స్వయమస్థిరేణ అస్థిరాశ్రయణం నద్యాం వహమానేన వహమానస్యాశ్రయణమివ.

అ. తనకే స్థైర్యం లేనివాడు స్థైర్యం లేని మరొకణ్ణి ఆశ్రయించడం నదిలో కొట్టుకొని పోతున్నవాడు మరొక కొట్టుకొనిపోతూన్నవాణ్ణి ఆశ్రయించడం వంటిది.

53. వరం మానినో మరణమ్, న పరేచ్ఛానువర్తనాదాత్మవిక్రయః.

అ. ఆత్మాభిమానం కలవానికి మరణమేనా మంచిది కాని, ఇతరుల ఇష్టం ప్రకారం చేస్తూ తనను అమ్ముకొనడం మంచిది కాదు.

54. ఆయతికల్యాణే సతి కస్మింశ్చిత్సంబన్ధే పరసంశ్రయః శ్రేయాన్.

అ. భవిష్యత్తులో మంచి జరిగే పక్షంలో ఏదో ఒక సంబంధం కల్పించుకొని ఇతరుల్ని ఆశ్రయించడం మంచిది.

55. న రాజకార్యేషు కాలనియమోఽస్తి; మేఘవదుత్థానం హి రాజకార్యాణామ్.

అ. రాజకార్యాలలో కాలనియమం ఉండదు. అనగా, రాజ్యంలో ఎప్పుడు ఏ సమస్యలు వస్తాయో చెప్పడం కష్టం. రాజకార్యాలు మేఘాల వలె హటాత్తుగా పైకి వస్తాయి.

56. అన్యత్ర శత్రౌ చ సంధివిగ్రహాభ్యాం ద్వైధీభావం గచ్ఛేత్; యద్యన్యోఽవశ్యమాత్మనా సహోత్సహతే.

అ. అవతలివాడు తప్పకుండా తనతో కలిసి విజయం సాధించడానికి ఉత్సాహం చూపించేటట్లయితే అతనితో సంధీ, శత్రువుతో విగ్రహమూ చేసి ద్వైధీభావాన్ని ఆశ్రయించాలి.

57. బలవదుభయమధ్యస్థః శత్రుః ఉభయసింహమధ్యగతః కరీవ భవతి సుఖసాధ్యః.

అ. బలవంతులైన ఇద్దరి మధ్య ఉన్న శత్రువు రెండు సింహాల మధ్య ఏనుగు వలె సుఖంగా సాధించడానికి శక్యం అవుతాడు.

58. భూమ్యర్థినాం భూమిఫలప్రదానేన సందధ్యాత్, యతో న భువాం ఫలదానమస్తి నిత్యమితి; న తు భువా; పరేషు గతా భూమిర్గతైవ.

అ. భూమి కోరేవాళ్ళకి భూమినుంచి వచ్చే ఫలం ఇచ్చి సంధి చేసుకోవాలి. ఎందుచేత ననగా, భూమినుండి తప్పకుండా ఎల్లప్పుడూ ఫలం వస్తుంది అనేది లేదు. అంతేకాని, భూమిని ఇచ్చి సంధి చేసుకొనకూడదు. భూమి ఇతరుల చేతికి వెళ్ళిపోయిందంటే వెళ్ళిపోవడమే (తిరిగి రాదు).

59. అవజ్ఞయాపి భూమావారోపితస్తరుః భవతి బద్ధమూలః, కిం పునర్న భూపతిః?

అ. ఏదైనా ఒక చెట్టు అనాదరంగా భూమిమీద పాతినా అది ప్రాను పెంచి పెద్దదైపోతుంది. అలాంటపుడు రాజు కాడా?

60. ఉపాయోపపన్నవిక్రమః అనురక్తప్రకృతిః అల్పదేశోఽపి భూపతిః సార్వభౌమో భవతి.

అ. ఉపాయాలతో కూడిన పరాక్రమం గలవాడు, అనురాగంతో కూడిన ప్రకృతులు కలవాడు అయిన రాజు చిన్న దేశం ఉన్నవాడే అయినా సార్వభౌముడు అవుతాడు.

61. న హి కులాగతా కస్యచిద్భూమిః, కిం తు వీరభోజ్యా వసుంధరా.

అ. ఎవనికీ భూమి కులక్రమంచేత రాదు. మరేమనగా భూమి వీరులచేత అనుభవించదగినది.

62. సామోపప్రదానభేదదణ్డాః ఉపాయాః.

అ. సామం, ఉపప్రదానం, భేదం, దండం - ఇవి ఉపాయాలు.

63. తత్ర పఞ్చవిధం సామ - గుణసంకీర్తనమ్, సంబన్ధోపాఖ్యానమ్, పరస్పరోపకారసందర్శనమ్, ఆయతిప్రదర్శనమ్, ఆత్మోపనిధానమితి.

అ. గుణాలు వర్ణించడం, తమ కున్న పూర్వసంబంధాన్ని గూర్చి చెప్పడం, పరస్పరము ఉపకారం చూపడం, భవిష్యత్తులో కలగబోయే మంచి ఫలాలు చూపడం, నేను నీవాడనే అని చెప్పడం - ఈ విధంగా సామం ఐదు విధాలు.

64. యన్మమ ద్రవ్యం తత్ భవతా స్వకృత్యేషు ప్రయుజ్యతామ్ ఇత్యాత్మోపనిధానమ్.

అ. "నా ద్రవ్యాన్ని నువ్వు నీ పనులకోసం వినియోగించుకొనవచ్చును" అని చెప్పడం ఆత్మోపనిధానం.

65. బహ్వర్థసంరక్షణాయ అల్పార్థప్రదానేన పరప్రసాదనమ్ ఉపప్రదానమ్.

అ. అధికధనాన్ని సంరక్షించుకొనడంకోసం అల్పమైన ధనం ఇచ్చి ఎదట వానిని సంతోష పెట్టడం ఉపప్రదానం.

66. యోగతీక్ష్ణగూఢపురుషోభయవేతనైః పరబలస్య పరస్పరాశఙ్కాజననం, నిర్భర్త్సనం వా భేదః.

అ. ఉపాయాలచేత, తీక్ష్ణమైన స్వభావం గల గూఢపురుషుల సహాయం చేత, రెండు పక్షాలవాళ్ళకి లంచాలు ఇవ్వడంచేత శత్రుబలంలో పరస్పరం శంక కలిగించడం, లేదా భయం పుట్టించడం భేదం.

67. వధః, పరిక్లేశః, అర్థహరణం వా దణ్డః.

అ. చంపడం గాని, బాధ పెట్టడం గాని, ధనం హరించడం గాని దండం.

68. శత్రోరాగతం సాధు పరీక్ష్య కల్యాణబుద్ధిమనుగృహ్ణీయాత్.

అ. శత్రువునుంచి వచ్చినవానిని బాగా పరీక్షించి, ఆతడు సద్బుద్ధి కల వాడైతే అనుగ్రహించాలి.

69. కిమరణ్యజమౌషధం న భవతి క్షేమాయ?

అ. అరణ్యంలో పుట్టిన ఔషధం క్షేమకరం కాదా?

70. గృహప్రవిష్టః కపోత ఇవ అల్పోఽపి శత్రుసంబన్ధీ లోక తన్త్రముద్వాసయతి.

అ. శత్రువుకు సంబంధించినవాడు అల్పుడైనా ఇంట్లో ప్రవేశించిన పావురం వలె పాలనాతంత్రాన్ని అస్తవ్యస్తం చేస్తాడు.

71. మిత్రహిరణ్యభూమిలాభానామ్ ఉత్తరోత్తరో లాభః శ్రేయాన్, హిరణ్యం భూమిలాభాద్భవతి, మిత్రం చ హిరణ్యలాభాదితి.

అ. మిత్రలాభ - హిరణ్యలాభ - భూమిలాభాలలో తరవాత తరవాత దాని లాభం మంచిది. భూమి లభిస్తే దానివల్ల బంగారం లభిస్తుంది; బంగారం ఉంటే మిత్రుడు లభిస్తాడు.

72. స్వయమసహాయశ్చేత్ భూమిః హిరణ్యలాభాయ న ప్రభవతి; తదా మిత్రం గరీయః.

అ. తాను అసహాయుడైన పక్షంలో భూమివల్ల హిరణ్యలాభం కలగదు. అలాంటప్పుడు మిత్రుణ్ణి పొందడమే మంచిది.

73. సహాయానుయాయి మిత్రం స్వయం చాస్థాస్నుర్భూమిరితి తాభ్యాం హిరణ్యం గరీయః.

అ. మిత్రుడు సహాయుడుగా కూడా ఉంటాడు. భూమైతే స్థిరం కాదు. ఆ రెండింటికంటె హిరణ్యమే మంచిది. అనగా, పెద్ద ఉపకారం చేయకుండా కూడా మాత్రమే ఉండే మిత్రుని కంటె, స్థిరంగా లభించని భూమికంటె, హిరణ్యమే మంచి దని అభిప్రాయం.

74. శత్రోర్మిత్రభావే కారణం విమృశ్య తథా చరేత్ యథా న వఞ్చ్యతే.

అ. శత్రువును మిత్రుణ్ణిగా చేసికొనేటప్పుడు బాగా విమర్శించి తాను మోసపోకుండా ఉండేటట్లు చూచుకొని చేసికొనాలి.

75. గూఢోపాయేన సిద్ధకార్యస్య అసంవృతికరణం సర్వాశఙ్కాం దురపవాదం చ కరోతి.

అ. గూఢమైన ఉపాయంచేత సిద్ధించిన కార్యాన్ని రహస్యంగా ఉంచక పోతే అందరికీ శంకను, చెడ్డ అపవాదును కలిగిస్తుంది. రహస్యోపాయంచేత సాధించిన కార్యాన్ని తరవాత కూడా రహస్యంగానే ఉంచాలి అని భావం.

76. అభయప్రదానమాన్యోపదేశాభ్యాం దుర్జనం శమయేత్.

అ. దుర్జనుడికి అభయప్రదానం చేసి, మాన్యులచేత ఉపదేశం చేయించి శాంతింపచెయ్యాలి.

77. గృహీతపుత్రదారాన్ ఉభయవేతనాన్ కుర్యాత్.

అ. భార్యాపుత్రులను గ్రహించిన వాళ్ళకి, అనగా వివాహమై పుత్రులు కూడ పుట్టిన భృత్యులకు, రెండు వేతనాలు ఇవ్వాలి. వాళ్ళు ఒంటరిగా ఉన్నప్పుడు ఇచ్చిన వేతనం కంటె రెట్టింపు వేతనం ఇవ్వా లని అర్థం.

78. శత్రుమపకృత్య తద్దాయాదాన్ భూమిదానేన ఆత్మనః సఫల యేత్, క్లేశయేద్వా.

అ. శత్రువుకు అపకారం చేసి వాని దాయాదులకు భూమి ఇచ్చి తనకు అనుకూలులనుగా చేసుకోవాలి, లేదా వాళ్ళకు కూడా క్లేశం కలిగించాలి.

79. అన్యస్య భూః అన్యస్య మహతా ప్రయత్నేన పరిణమతి, న పరిణమతి వా.

అ. ఒకని భూమి ఎంతో ప్రయత్నం చేస్తే మరొకని భూమిగా అవ వచ్చును, కాకపోవచ్చును కూడా.

80. పరవిశ్వాసజననే సత్యం, శపథః, ప్రతిభూః, ప్రధానపురుష పరిగ్రహో వా హేతుః.

అ. పరులకు విశ్వాసం కలిగించడానికి సత్యం కాని, ఒట్టు పెట్టడంగాని, జామీనుగాని, ప్రధానపురుషుణ్ణి చెప్పడంగాని (giving reference of an important person) కారణం.

81. సహస్రైకీయః పురస్తాల్లాభః, శతైకీయః పశ్చాత్కోపః ఇతి న యాయాత్.

అ. శత్రువుమీదకు యుద్ధానికై ముందుకు వెడితే లాభం వెయ్యిపాళ్ళల్లో ఒక పాలు, వెనక వచ్చే ప్రకోపం (కొందరి తిరుగుబాటు) నూరుపాళ్ళల్లో ఒక పాలు అని అనిపించినట్లయితే యుద్ధానికి వెళ్ళకూడదు.

82. సూచీముఖాహ్యనర్థా భవన్తి; అల్పేనాపి సూచీముఖేన మహత్ సూత్రజాలం ప్రవిశతి.

అ. అనర్థాలు సూచీముఖాలుగా ఉంటాయి. అనగా ప్రారంభంలో చాలా చిన్నవిగానే కనబడతాయి; అవే చాల పెద్దవిగా పరిణమిస్తాయి అని భావం. చాలా చిన్నదైన సూది ముఖం (కొన) ద్వారా పెద్ద సూత్రసముదాయం ప్రవేశిస్తుంది.

83. యోగ్యపురుషాపచయః క్షయః.

అ. యోగ్యులైన పురుషులు తగ్గిపోవడం క్షయం.

84. హిరణ్యధాన్యాపచయః వ్యయః.

అ. బంగారమూ, ధాన్యమూ తరిగిపోవడం వ్యయం.

85. తమాత్మనో లాభమిచ్ఛేత, యేన సామిషః క్రవ్యాద ఇవ న పరైరవరుద్ధ్యేత.

అ. తనకు ఎలాంటి లాభం వస్తే, మాంసంతో ఉన్న క్రూరమృగాన్ని ఇతర మృగాలు చుట్టుముట్టినట్లు ఇతరులు చుట్టుముట్టి పీడించరో అలాంటి లాభాన్ని పొందడంకోసం అభిలషించాలి.

86. గృహాగతమర్థం కేనాపి కారణేన నావధీరయేత్.

అ. ఇంటికి వచ్చిన ధనాన్ని (సొత్తును) ఏదో కారణం చెప్పి తిరస్కరించకూడదు. ఎట్టి పరిస్థితిలోనూ విడవకూడదు.

87. యదార్థాగమః తదైవ సర్వతిథినక్షత్రగ్రహబలమ్.

అ. ధనం ఎప్పుడు వచ్చిందో అప్పుడే సమస్తమైన తిథి-నక్షత్ర-గ్రహాదుల బలం.

88. గజేన గజబన్ధనమివ అర్థేనార్థోపార్జనమ్; న కేవలాభ్యాం బుద్ధిపౌరుషాభ్యామ్.

అ. ఏనుగును ఏనుగు సహాయంచేతనే బంధించినట్లు ధనాన్ని ధనం సహాయం చేతనే సంపాదించాలి. కేవలం బుద్ధీ, పురుషప్రయత్నమూ ఉంటే చాలదు.

89. మహతో జనస్య సంభూయోత్థానే సంఘాతవిఘాతేన దణ్డం ప్రణయేత్. శతమవధ్యం, సహస్రమదణ్డ్యమితి న ప్రణయేత్.

అ. చాలా మంది జనులు కలిసి ఎదురు తిరిగితే (విప్లవం లేవదీస్తే) ఆ సముదాయాన్ని విడగొట్టి దండించాలి. నూరుగురికి ఒక్క మారు మరణదండం విధించకూడదు, వెయ్యి మందిని ఒక్క మారు దండించకూడదు; అందుచేత ఆ సంఘాన్ని సంఘంగా దండించకూడదు; విడగొట్టి దండించాలి. (అర్థం అస్పష్టంగా ఉంది.)

90. సా రాజన్వతీ భూమిః, యస్యాం నాసురవృత్తిః పరప్రణేయశ్చ రాజా.

అ. ఏ రాజ్యంలో రాజు అసురవృత్తి కలవాడు కాడో, ఇతరుల చేత నడిపించబడడో ఆ రాజ్యమే మంచి రాజు గల రాజ్యం.

91. అపరీక్షితార్థమానప్రాణో హి రాజా అసురవృత్తిః.

అ. ప్రయోజనాన్ని, మానాన్ని, ప్రాణాలనూ పరీక్షించని రాజుది అసుర వృత్తి.

92. పరకోపప్రసాదానువృత్తిః పరప్రణేయః.

అ. ఇతరుల కోపాన్ని, అనుగ్రహాన్ని పట్టి ప్రవర్తించే రాజు పరప్రణేయుడు.

93. తత్ స్వామినః ఛన్దానువర్తనం శ్రేయః, యన్న భవత్యాయత్యా మహితాయ.

అ. ఏది భవిష్యత్తులో అహితకరం కాదో అలాంటి స్వామిఛందాను వర్తనం (ప్రభువు ఇష్టాన్ని అనుసరించడం) శ్రేయస్కరం.

94. నిరనుబన్ధమ్, అనర్థానుబన్ధం చ అర్థం న గృహ్ణీయాత్.

అ. ప్రయోజనం లేని పని, అనర్థాన్ని ఇచ్చే పనీ చేబట్ట కూడదు.

95. నాసావర్థః యత్రాయత్యాం మహాననర్థానుబన్ధః.

అ. భవిష్యత్తులో గొప్ప అనర్థాన్ని కలిగించే అర్థం (కార్యం లేదా ఉద్దేశించిన ప్రయోజనం) అర్థం కాదు.

96. లాభస్త్రివిధః - నవః, భూతపూర్వః, పిత్ర్యశ్చ.

**ఇతి షాడ్గుణ్య సముద్దేశః**

అ. క్రొత్తది, పూర్వమే వచ్చినది, తండ్రిద్వారా వచ్చినది అని లాభము మూడు విధాలు.

**"బాలానందిని" అను సోమదేవనీతి సూత్రాంధ్రానువాదంలో షాడ్గుణ్య సముద్దేశం సమాప్తం.**

## 30. యుద్ధ సముద్దేశః

1. స కిం మన్త్రీ మిత్రం వా యః ప్రథమమేవ యుద్ధోద్యోగం, భూమిత్యాగం చ ఉపదిశతి.

అ. ముందుగానే యుద్ధప్రయత్నం చెయ్యాలని ఉపదేశించే మంత్రి ఏమి మంత్రి? భూమి (దేశం) విడచి వెళ్ళిపోవడం మంచి దని ముందుగానే చెప్పే మిత్రుడు ఏమి మిత్రుడు

2. స కిం సహాయః యోఽసౌ వ్యాహరతి మహాన్తమనర్థం సంశయం వా స్వామినః సంగ్రామే.

అ. యుద్ధంలో తన ప్రభువుకు గొప్ప అనర్థం కలగవచ్చు, అంతా సంశయాస్పదంగా ఉండవచ్చు అని చెప్పే సహాయుడు ఏమి సహాయుడు?

3. కో నామాత్మవాన్ అదావేవ స్వామినం ప్రాణసందేహతులామారోహయతి.

అ. బుద్ధిమంతు డెవడైనా తన ప్రభువును ముందుగానే ప్రాణ సందేహం అనే తక్కెడను ఎక్కిస్తాడా? యుద్ధం ప్రాణ సందేహానికి కారణం అని భయ పెడతాడా?

4. భూమ్యర్థం నృపాణాం నయః విక్రమశ్చ, న తు భూమి త్యాగాయ.

అ. రాజులు నీతిని అవలంబించినా, పరాక్రమం చూపినా భూమి (రాజ్యం) కోసమే కాని భూమిని త్యజించడం కోసం కాదు.

5. బుద్ధియుద్ధేన పరాన్ జేతుమశక్తః శస్త్రయుద్ధమారభేత.

అ. శత్రువులను బుద్ధియుద్ధంచేత జయించజాలకపోతే శస్త్రయుద్ధం ప్రారంభించాలి.

6. న తథేషవః ప్రభవన్తి యథా ప్రజ్ఞావతాం ప్రజ్ఞాః.

అ. బుద్ధిగలవాళ్ళ బుద్ధి కార్యాన్ని సాధించడానికి సమర్థం అయినట్లు బాణాలు కావు.

7. దృష్టేఽప్యర్థే భవన్త్యపరాద్ధేషవో ధనుష్మన్తః, అదృష్టమప్యర్థం సాధు సాధయతి ప్రజ్ఞావాన్.

అ. విలుగాళ్ళు ఎదురుగా కనబడుతూన్న వస్తువుమీద కూడా గురి తప్పుతూంటారు; బుద్ధిశాలి చూడని విషయాన్ని కూడా బాగుగా సాధిస్తాడు.

8. శ్రూయతే కిల - దూరస్థోఽపి మాధవపితా కామన్దకీయప్రయోగేణ మాధవాయ మాలతీం సాధయామాసేతి.

అ. మాధవుని తండ్రి దూరంగానే ఉండి కూడా కామందికిని ప్రయోగించి మాధవునికి మాలతిని సాధించాడు అని వింటున్నాం కదా. ఇది భవభూతి వ్రాసిన 'మాలతీమాధవం' అనే రూపకానికి సంబంధించిన కథ.

9. ప్రజ్ఞా హ్యామోఘం శస్త్రం కుశలబుద్ధీనామ్.

అ. నేర్పుగల బుద్ధి ఉన్నవాళ్ళకి ప్రజ్ఞయే (బుద్ధియే) అమోఘమైన ఆయుధం కదా?

10. ప్రజ్ఞాహతాః కులిశహతా ఇవ న పునః ప్రాదుర్భవన్తి భూభృతః

అ. బుద్ధిబలంచేత అణచివేయబడిన రాజులు, పిడుగుపడి చచ్చిన చెట్లవలె మళ్ళీ పైకి లేవరు.

11. పరైః స్వస్యాభియోగమపశ్యతోఽభయం, నదీమపశ్యతః ఉపానత్పరిత్యజనమివ.

అ. శత్రువులు తనను ఆక్రమించడం అనేది ఏదీ లేకుండానే భయపడడం, నది కనబడకుండానే కాలి చెప్పులు విడవడం వంటిది.

12. అతితీక్ష్ణో బలవానపి శరభ ఇవ న చిరం నన్దతి.

అ. ఎంత బలంవంతుడైనా చాలా తీక్ష్ణంగా ప్రవర్తించేవాడు శరభమృగం వలె చాలాకాలం సుఖంగా ఉండజాలడు. సింహాన్ని కూడా చంపగలిగిన ఎనిమిది కాళ్ళ జంతువు శరభం.

13. ప్రహరతోఽపసరతో వా సమే వినాశే వరం ప్రహారః యత్ర నైకాన్తికో వినాశః.

అ. (శత్రువుమీద) దెబ్బ తీసినా వెనుకకు తగ్గినా వినాశం సమమే అయినప్పుడు దెబ్బతీయడమే మంచిది. దానిలో తప్పకుండా వినాశమే కలుగుతుంది అనే నియమం లేదు.

14. కుటిలా హి గతిర్దైవస్య - యత్ ముమూర్షమపి జీవయతి, జిజీవిషుమపి మారయతి.

అ. దైవగతి చాలా వక్రంగా ఉంటుంది; ఎందుచేత ననగా దైవం చావాలనుకున్న వాణ్ణి బ్రతికిస్తుంది, బ్రతకాలనుకున్న వాణ్ణి చంపివేస్తుంది. చావడానికి సిద్ధంగా ఉన్నవాడు జీవిస్తాడు, ఇంకా పదికాలాల పాటు జీవిస్తా ననుకొన్నవాడు మరణిస్తాడు.

15. దీపశిఖాయాం పతఙ్గవత్ ఐకాన్తికే వినాశే తు అవిచారమపసరేత్.

అ. (ముందుకు వెడితే) దీపశిఖమీద పడిన మిడతకు వలె వినాశం తప్పదని తెలిసినప్పుడు ఏమీ ఆలోచించకుండా వెనుకకు తొలగిపోవాలి.

16. జీవతో హి సంభవేద్దైవోదయాత్ కాలబలమ్.

అ. బ్రతికి ఉంటే ఏ నాటికైనా దైవం అనుకూలించి బలవర్ధకమైన కాలం రావచ్చును.

17. వరమల్పమపి సారం బలమ్, న తు భూయసీ ముణ్డమణ్డలీ.

అ. అల్పమే అయినా మంచి సారం ఉన్న సైన్యం మంచిది. అంతే కాని అధికసంఖ్యలో ఉన్న బోడిగుళ్ళ సముదాయం మంచిది కాదు. సారంలేని తల కాయలు లెక్కకు ఎన్ని ఉన్నా, ప్రయోజనం లేదు.

18. అసారబలభఙ్గః సారబలభఙ్గం కరోతి.

అ. సారం లేని సైన్యానికి కలిగిన పరాజయం సారబలపరాజయానికి హేతువు అవుతుంది.

19. నాప్రతిగ్రహో యుద్ధముపేయాత్.

అ. ప్రతిగ్రహం లేకుండా యుద్ధానికి వెళ్ళకూడదు.

20. రాజవ్యఞ్జనం పురస్కృత్య పశ్చాత్ స్వామ్యధిష్ఠితస్య సార బలస్య నివేశనం ప్రతిగ్రహః.

అ. రాజచిహ్నా లన్నీ ముందు నడుపుతూ రాజుచే నడిపించబడే సార బలాన్ని వెనుక నిలపడం ప్రతిగ్రహం.

21. సప్రతిగ్రహం బలం సాధు యుద్ధాయోత్సహతే.

అ. ప్రతిగ్రహం ఉన్న సైన్యం యుద్ధంలో బాగా ఉత్సాహంతో ఉంటుంది. (యుద్ధం చేయడానికి సామర్థ్యంతో ఉంటుంది.)

22. పృష్ఠతః సదుర్గజలా భూమిః బలస్య మహానాశ్రయః.

అ. దుర్గమూ జలసమృద్ధీ ఉన్న ప్రదేశం వెనక ఉన్నట్లయితే అది సైన్యా నికి పెద్ద ఆశ్రయం.

23. నద్యా నీయమానస్య తటస్థపురుషదర్శనమపి జీవనహేతుః.

అ. నదిలో కొట్టుకొనిపోతూ ఉన్నవానికి ఒడ్డుమీద మనిషి ఎవరైనా కని పించడం కూడా బ్రతకటానికి కారణం అవుతుంది.

24. నిరన్నమపి సప్రాణమేవ బలం యది జలం లభేత.

అ. అన్నం లేకపోయినా జలం దొరికితే సైన్యం ప్రాణాలతో ఉంటుంది.

25. బలవతా విగృహీతస్య తద్దాయాదపరిగ్రహః శ్వమణ్డలే శిఖి మణ్డకప్రవేశః ఇవ.

అ. బలవంతునితో విరోధం పెట్టుకున్నవాడు ఆతని దాయాదులతో చేరడం శిఖిమండకం కుక్కలగుంపులో చేరడం వంటిది. శిఖిమండక శబ్దానికి అర్థం అస్పష్టం. శిఖీ అనగా నెమలి. మండకం అనగా పిండితో చేసిన పల్చని భక్ష్యవిశేషం. నెమలిమాంసంతో తయారు చేసిన భక్ష్యం అని అర్థం కావచ్చును. శిఖిమణ్డల అని పాఠం అయితే నెమళ్ళ గుంపు అని అర్థం కుదురుతుంది.

26. ఆత్మశక్తిమవిజ్ఞాయోత్సాహః శిరసా పర్వతభేదనమివ.

అ. తన శక్తి ఎంత ఉందో తెలుసుకొనకుండా ఉత్సాహం చూపడం తలతో పర్వతాన్ని ఢీకొనడం వంటిది.

27. సామసాధ్యం యుద్ధసాధ్యం న కుర్యాత్.

అ. సామోపాయంచేత సాధించ శక్యమైనదానిని యుద్ధంచేత సాధించే దానినిగా చేయకూడదు.

28. గుడాదభిప్రేతసిద్ధౌ కో నామ విషం భుఞ్జీత?

అ. బెల్లంవల్ల ఇష్టమైన పని సిద్ధిస్తూన్నప్పుడు విషం ఎవడు తింటాడు? తియ్యనిమందుతో రోగం కుదురుతున్నప్పుడు వెగటుగా ఉన్న ఔషధం ఎవడు తింటాడు?

29. అల్పవ్యయభయాత్ సర్వనాశం కరోతి మూర్ఖః.

అ. మూర్ఖుడు కొంచెం ఖర్చుకు భయపడి సర్వనాశం చేసుకుంటాడు.

30. కో నామ కృతధీః శుల్కభయాత్ భాణ్డం పరిత్యజతి.

అ. తెలివి అయినవా డెవడైనా పన్ను కట్టవలసివస్తుంది అని భయపడి భాండాన్ని విడిచిపెడతాడా? భాండం అనగా విలువైన వస్తువుల సముదాయం; లేదా దుకాణంలో అమ్మే వస్తువుల సముదాయం (Shop keeper's stock).

31. స కిం వ్యయః యో మహాన్తమర్థం రక్షతి.

అ. అత్యధికమైన ప్రయోజనాన్ని (ధనాన్ని) రక్షించే వ్యయం ఏమి వ్యయము? (వ్యయం కాదు.)

32. పూర్ణసరఃసలిలస్య హి న పరివాహాదపరోఽస్తి రక్షణోపాయః.

అ. నిండిపోయిన చెరువులో నీటిని రక్షించాలంటే దానిని కొంత బైటకు వదిలివేయడం తప్ప మరొక ఉపాయం లేదు.

33. అప్రయచ్ఛతో బలవాన్ ప్రాణైః సహార్థం గృహ్ణాతి.

అ. బలవంతుడు ధనం ఇవ్వనివానినుంచి ప్రాణాలతో సహా ధనం లాక్కుంటాడు.

34. బలవతి సీమాధిపేఽర్థం ప్రయచ్ఛన్ వివాహోత్సవగృహాగమనాదిమిషేణ ప్రయచ్ఛేత్.

అ. బలవంతుడైన సరిహద్దును పాలించేవానికి ఏమైనా ముట్టచెప్పాలని అనుకొనేవాడు వివాహం, ఉత్సవం, ఇంటికి రావడం మొదలైన వంకలమీద ఇవ్వాలి.

35. అమిషమర్థం ప్రయచ్ఛతః నిరవధిః స్యాన్నిబన్ధః శాసనేన.

అ. ఏదో ఒక వంక లేకుండా ఇవ్వడం ప్రారంభిస్తే అది శాసనపూర్వకంగా గ్రహించే అంతంలేని నిబంధంగా అయిపోతుంది. 'నిబంధం' అనగా ఒక విధమైన మామూలు.

36. స్వయమల్పకోశదేశదుర్గభూమిః, అప్రతివిధేయశ్చ శత్రుః స్వదేశం న పరిత్యజేచ్చ, తదా కృతసంఘాతవిఘాతోఽరిభిః సాధయేత్.

అ తన బలమూ - కోశమూ (ధనబలమూ), దేశమూ, దుర్గమూ, భూమీ అల్పంగా ఉన్నాయి; ఏమీ చేయడానికి శక్యంకాని (లొంగని) శత్రువు స్వదేశాన్ని విడవడంలేదు; అలాంటప్పుడు ఇతర శత్రువుల ద్వారా ఆ శత్రువు సంఘాతాన్ని (కలిసికట్టుగా ఉండడాన్ని) విడగొట్టి ఆ శత్రువును సాధించాలి. (భావం అస్పష్టంగా ఉంది.)

37. విశీర్ణయూథో వనగజ ఇవ కస్య వా న భవతి సాధ్యః?

అ. గుంపునుండి విడిపోయినవాడు, వనగజం వలె ఎవరికి సాధ్యుడు (ఓడింప శక్యమైనవాడు) కాడు?

38. వినిఃస్రావితజలే సరసి విషమోఽపి గ్రాహః జలవ్యాలో వా చగల ఇవ.

అ. నీళ్ళు పైకి విడిచివేసిన సరస్సులో ఉన్న మొసలి గాని కౄరజలజంతువు గాని ఎంత భయంకరమైనదైనా, మేకపిల్ల వంటిదే.

39. వననిర్గతః సింహః శృగాలాయతే.

అ. అడవిలోనుంచి బైటకు వచ్చిన సింహం నక్క అయిపోతుంది.

40. విచ్ఛిన్నేప్యా న్తప్రతానే వంశే కిమస్త్యాకర్షకస్య క్లేశః.

అ. చుట్టుప్రక్కల ఉన్న డొంక అంతా విచ్ఛిన్నం అయిపోయిన తర వాత వెదురుకఱ్ఱను పైకి లాగేవానికి క్లేశం ఏ ముంటుంది?

41. నాస్తి సంఘాతస్య నిస్సారతా.

అ. సంఘానికి దుర్బలత్వం అనేది లేదు

42. కిం న స్ఖలయతి మత్తమపి వారణం తృణసంఘాతః?

అ. తృణసంఘాతం (దట్టమైన గడ్డి) మదించిన ఏనుగును కూడా తొట్రుపడే టట్లు చేయదా?

43. సంహతైర్బిసతన్తుభిః దిగ్గజోఽపి నియమ్యతే.

అ. దగ్గరగా చేరిన తామరతూడు దారాల చేత దిగ్గజాన్ని కూడా కట్టి వేయవచ్చు.

44. దణ్డసాధ్యే శత్రౌ ఉపాయాన్తరం అగ్నావాహుతిప్రదానమివ.

అ. దండోపాయంమాత్రం చేతనే సాధించవలసిన శత్రువు విషయంలో మరొక ఉపాయం అవలంబించడం అగ్నిలో ఆహుతి పోయడం వంటిది.

45. యన్త్రశస్త్రాగ్నిక్షారప్రతీకారే వ్యాధౌ కిం సామాన్యమౌషధం కుర్యాత్.

అ. యంత్రము, శస్త్రమూ, అగ్ని, క్షారమూ మాత్రమే ప్రతీకారంగా గల వ్యాధి విషయంలో ఇతరౌషధాలు ఏమి చేస్తాయి? ఎముక విరిగినప్పుడు ఇటూ అటూ కఱ్ఱలు పెట్టి కట్టడం మొదలైన చికిత్స యంత్రచికిత్స. శస్త్రచికిత్స ప్రసిద్ధమే. కొన్ని చోట్ల పుండు మానడానికై, లేదా విషం శమించడానికై ఆ ప్రదేశం కాల్చడం అగ్నిచికిత్స, ఉప్పు మొదలైనవాటితో పుండ్లకు చేసే చికిత్స క్షారచికిత్స.

46. అవిజ్ఞాతకరణవృత్తః సర్వోఽపి భవతి శూరః.

అ. వానివద్ద ఉన్న సాధనసామగ్రి, వాని అసలు వ్యవహారం తెలియనంతవరకూ ప్రతివాడూ శూరుడే.

47. అదృష్టాన్యసామర్థ్యః కో నామ న భవతి సదర్పః?

అ. ఎదుటివాని సామర్థ్యం చూడనంతవరకూ గర్వంతో ఉండనివాడు ఎవడు?

48. అతిప్రవృద్ధా శ్రీః కం న దర్పయతి?

అ. బాగా పెరిగిన లక్ష్మి (ఐశ్వర్యం) ఎవనికి గర్వం కలిగించదు?

49. కృతార్థాపహారః విఘటితతన్త్రశ్చ పరః రుష్యన్నపి కిం కుర్యాత్.

అ. (వానివద్ద) ఉన్న ధనం అంతా లాగికొని, రాజ్యతంత్రాన్ని విఘటితం చేసిన తరువాత ఆ శత్రువు కోపం వస్తే మాత్రం ఏమి చేయగలుగుతాడు?

50. ఉత్పాటితదంష్ట్రః సర్పోఽపి రజ్జురేవ.

అ. కోరలు పీకివేసిన సర్పమైనా ఒక త్రాడు మాత్రమే.

51. ప్రతిహతప్రతాపః అఙ్గారః సంపతితోఽపి కిం కుర్యాత్.

అ. పోయిన ప్రతాపం గల (నిప్పు ఆరిపోయిన) బొగ్గు మీద పడితే మాత్రం ఏమవుతుంది?

52. విద్విష్టానాం చాటుకారం న బహుమన్యేత.

అ. పగవాళ్ళు చెప్పే మంచి మాటలు నమ్మకూడదు.

53. జిహ్వయా లిహన్ ఖడ్గో మారయత్యేవ.

అ. ఖడ్గం నాలుకతో (పదునైన ప్రదేశంతో) నాకుతూనే చంపివేస్తుంది. (ఇది ఖడ్గమృగాన్ని గూర్చి చెప్పినది కావచ్చునా?)

54. తన్త్రావాపౌ నీతిశాస్త్రమ్.

అ. తంత్రమూ, ఆవాపమూ రెండూ కలిస్తే నీతిశాస్త్రం అవుతుంది.

55. స్వమణ్డలపాలనాభియోగః తన్త్రమ్.

అ. తన మండలాన్ని పరిపాలించడానికి చేసే నిరంతర ప్రయత్నం "తంత్రం."

56. పరమణ్డలావాప్త్యభియోగః ఆవాపః.

అ. శత్రుమండలాన్ని సంపాదించడంకోసం చేసే నిరంతరప్రయత్నం "ఆవాపం."

57. బహూనేకో న విగృహ్ణీయాత్.

అ. ఒక్కడు చాలామందితో విరోధం పెట్టుకొనకూడదు

58. సదర్పోఽపి సర్పః వ్యాపాద్యత ఏవ పిపీలికాభిః.

అ. ఎంత దర్పంతో ఉన్నా సర్పాన్ని చీమలు చంపివేస్తాయి కదా?

59. నాశోధితాయాం పరభూమౌ ప్రవిశేన్నిష్క్రమేద్వా.

అ. బాగా శోధించని (అపాయాలేవీ లేవని పరీక్షించని) క్రొత్త ప్రదేశం లోనికి ప్రవేశించకూడదు, బైటకు రాకూడదు.

60. విగ్రహకాలే పరస్మాదాగతం కమపి న గృహ్ణీయాత్.

అ. విరోధసమయంలో శత్రువునుండి వచ్చిన ఎవర్నీ దగ్గరకి రానీయ కూడదు.

61. గృహ్ణన్ వా సహ న వసేత్: అన్యత్ర దాయాదేభ్యః.

అ. దగ్గరికి తీసినా, వాళ్లు శత్రువుల దాయాదులైతే తప్ప, వాళ్ళతో కలిసి ఉండగూడదు.

62. శ్రూయతే హి - నిజస్వామినా సహ కూటకలహం విధాయ ఆప్తవిశ్వాసః కృకలాసః నామానీకపతిః ఆత్మవిపక్షం విరూపాక్షం జఘానేతి.

అ. కృకలాసు డనే సేనాపతి తన ప్రభువుతో కపటంగా కలహించి (కలహించినట్లు నాటక మాడి) విశ్వాసం పొంది తన శత్రువైన విరూపాక్షుణ్ణి చంపినట్లు వింటున్నాం కదా?

63. బలమపీడయన్ పరానభిషేణయేత్.

అ. తన సైన్యానికి పీడ కలగకుండా చూచుకొంటూ శత్రువుమీద దాడి చేయాలి.

64. దీర్ఘప్రయాణోపహతం బలమ్ అనాయాసేన భవతి పరేషాం సాధ్యమ్.

అ. దీర్ఘప్రయాణంచేత పీడించబడిన (అలసిపోయిన) సైన్యాన్ని శత్రువులు అనాయాసంగా ఓడించివేస్తారు.

65. న దాయాదాదపరః పరబలస్యాకర్షణమన్త్రోఽస్తి.

అ. శత్రువు సైన్యాన్ని తన వైపుకు త్రిప్పుకోవడానికి వాని దాయాదుణ్ణి మించిన మంత్రం లేదు.

66. యమభిగచ్ఛేత్తస్యావశ్యం దాయాదానుత్థాపయేత్.

అ. ఎవని మీదకు దండెత్తి వెడదామని అనుకుంటాడో వాని దాయాదుల్ని రెచ్చగొట్టాలి.

67. కణ్టకేన కణ్టకమివ పరేణైవ పరముద్ధరేత్.

అ. ముల్లును ముల్లుతో తీసినట్లుగా శత్రువును శత్రువుచేతనే పెకలించాలి.

68. బిల్వేన బిల్వం హన్యమానమ్ ఉభయథా ప్యాత్మనో లాభాయ.

అ. మారేడుపండును మారేడుపండుతో కొట్టితే రెండువిధాలా తనకే లాభం. అనగా రెండు పళ్ళూ పగిలినా, ఒక పండే పగిలినా పగిలిన దానిని తినవచ్చును. అట్లే ఇద్దరు శత్రువుల విషయంలో.

69. యావత్ పరేణాపకృతం తావతోఽధికమపకృత్య సంధిం కుర్యాత్.

అ. శత్రువు ఎంత అపకారం చేశాడో అంతకంటె ఎక్కువ అపకారం చేసి సంధి చేసుకోవాలి.

70. నాతప్తం లోహం లోహేన సంధత్తే.

అ. ఒక లోహఖండం బాగా కాల్చకుండా మరొక లోహఖండంతో అతుకుకొనదు.

71. తేజో హి సందానకారణం, నాపరాధస్య క్షాన్తిరుపేక్షా వా.

అ. సంధికి తేజస్సే కారణం కాని, అపరాధాన్ని క్షమించినా, ఉపేక్షించినా దానివల్ల సంధి కుదరదు. సంధి చేసుకొనకపోతే ఏమి అపాయం కలుగుతుందో అని భయం ఉన్నప్పుడే ఒకరితో ఒకరు సంధి చేసుకుంటారు అని భావం.

72. ఉపచీయమానః ఘటేనేవాశ్మా హీనేన సహాపి విగ్రహం కుర్యాత్.

అ. వృద్ధిలోకి వస్తూన్నవాడు, రాయి కుండతో విరోధం పెట్టుకున్నట్లు హీనుడితో కూడా విగ్రహం పెట్టుకోవాలి.

73. దైవానులోమ్యం, యుగ్యపురుషోపచయః, అప్రతిపక్షతా చ విజిగీషోరుదయః.

అ. దైవం అనుకూలంగా ఉండడం, పనులు చక్కబెట్టగలిగిన పురుషులు అధికంగా ఉండడం, ఎదిరించేవాడు లేకపోవడం - ఇవి విజిగీషువు వృద్ధి పొందడానికి హేతువులు.

74. పరాక్రమకర్కశః ప్రవీరానీకశ్చేత్ హీనః సంధాయ సాధూపచరితవ్యః.

అ. హీనుడు కూడా పరాక్రమంచేత కఠినుడుగా ఉంటే, వాని సైన్యం ఉత్తమ వీరులున్నది అయితే ఆతనితో సంధి చేసుకొని బాగా ఉపచారం చెయ్యాలి (అతనితో మంచిగా ఉండాలి).

75. దుఃఖామర్షజం తేజో విక్రమయతి.

అ. దుఃఖంవల్ల, అధికకోపంవల్ల కలిగిన తేజస్సు పరాక్రమం చూపేటట్లు చేస్తుంది.

76. స్వజీవితే హి నిరాశస్య అవార్యో భవతి వీర్యవేగః.

అ. తన జీవితంమీద ఆశ వదులుకొన్నవాని పరాక్రమవేగం నివారింప శక్యం కాకుండా ఉంటుంది.

77. లఘురపి సింహశాబః హన్త్యేవ దన్తినమ్.

అ. చిన్న సింహం పిల్ల కూడా ఏనుగును చంపివేస్తుంది.

78. న చాతిభగ్నం పీడయేత్.

అ. బాగా దెబ్బతిని ఉన్నవాణ్ణి పీడించకూడదు.

79. శౌర్యైకధనస్య ఉపచారః మనసి తచ్ఛగలస్య పూజేవ.

అ. శౌర్యమే ప్రధానధనంగా కలవానికి చేసే ఉపచారం మనస్సులో ఆ మేకపిల్లకు చేసే పూజవంటిది. అర్థం సరిగా కుదరటంలేదు. పాఠంలో దోషం ఉన్నదేమో తెలియదు. "బలియివ్వడం కోసం కట్టిన మేకపిల్లకు పూజ చేయడం వంటిది" అనే అర్థం వచ్చే పదాలేవైనా ఉండి ఉండాలి. 'సిత' అనగా కట్టబడిన 'మనసిత' అనే పదమైతే 'మన' శబ్దానికి ఏమి అర్థమో చూడాలి.

80. సమస్య సమేన సహ విగ్రహే నిశ్చితం మరణమ్, జయే చ సందేహః.

అ. సమునికి సమునితో విగ్రహం ఏర్పడితే మరణం నిశ్చితమే. జయం సందిగ్ధం.

81. ఆమం హి పాత్రమ్ ఆమేనాభిహతమ్ ఉభయతఃక్షయమ్.

అ. పచ్చి కుండను పచ్చికుండతో ఢీకొడితే రెండింటికీ వినాశనమే కదా?

82. జ్యాయసా సహ విగ్రహః హస్తినా పదాతియుద్ధమివ.

అ. పెద్దవానితో (బలవంతునితో) విరోధం పెట్టుకోవం కాలిబంటు ఏనుగుతో యుద్ధం చేయడం వంటిది.

83. స ధర్మవిజయీ రాజా యో విధేయతామాత్రేణైవ సంతుష్టః ప్రాణార్థమానేషు నాపకరోతి

అ. విధేయత చూపినంతమాత్రంచేతనే సంతోషించి జయించబడినవాళ్ల ప్రాణాలకు, ధనానికి, మానానికీ అపకారం చేయని రాజు ధర్మవిజయి (ధర్మం కోసం విజయం చేసేవాడు).

84. స లోభవిజయీ రాజా యో ద్రవ్యేణ కృతప్రీతిః ప్రాణార్థ మానేషు నాపరాధ్యతి.

అ. ఓడిపోయిన రాజు ఇచ్చిన ధనంచేత సంతోషించి అతని ప్రాణార్థమానాలకు అపకారం చేయని రాజు లోభవిజయి (ధనలోభంచేత విజయయాత్రకి బయలుదేరినవాడు).

85. సోఽసురవిజయీ రాజా యః ప్రాణార్థమానోపఘాతేన మహీమభిలషతి.

అ. ప్రాణాలకు, ధనానికి, మానానికి హానికలిగించి భూమిని ఆక్రమించ కోరే రాజు అసురవిజయి (తురుష్క ఆంగ్లేయాదులవంటివాళ్ళు).

86. అసురవిజయినః సంశ్రయః సూనాగారే మృగప్రవేశ ఇవ.

అ. అసురవిజయిని ఆశ్రయించడం లేడి కసాయి ఇంట్లో ప్రవేశించడం వంటిది.

87. యాదృశస్తాదృశో వా యాయినః స్థాయీ బలవాన్, యది సాధుచారసంచారః సన్నద్ధశ్చ.

అ. గూఢచారుల సంచారం బాగుండి, ఏ సమయంలో నైనా యుద్ధానికి సిద్ధంగా ఉన్న పక్షంలో, మిగిలిన విషయా లన్నీ ఎలా ఉన్నా, స్థాయి అయిన రాజే (కదలకుండా తన రాజ్యంలోనే ఉన్న రాజే) యుద్ధయాత్రకోసం వెళ్ళే వానికంటె బలవంతుడు.

88. రణేషు చరణపతితం, భీతమ్. అశస్త్రం చ హింసన్ బ్రహ్మహా భవతి.

అ. యుద్ధాలలో పాదాలమీద పడినవాణ్ణీ, భయపడినవాణ్ణీ, ఆయుధం లేనివాణ్ణి హింసించినవాడు బ్రహ్మహత్యాపాపం చేసినవా డవుతాడు.

89. సంగ్రామవృత్తేషు యాయిషు విసర్గః, స్థాయిషు సంసర్గశ్చ సేనాపత్యాయత్తః శ్రేయాన్.

అ. యుద్ధం జరిగిపోయిన తరవాత సేనాపతి అభిప్రాయం ప్రకారం యాయి సైనికులను, అనగా తాత్కాలికంగా నియోగించిన సైనికులను సత్కరించి విడచివేయడం, స్థాయి సైనికులతో సంబంధం ఉంచుకొనడం శ్రేయస్కరం.

90. మతినదీయం నామ సర్వేషాం ప్రాణినాముభయతో వహతి పాపాయ, ధర్మాయ చ; తత్రాద్యం స్రోతోఽతీవ సులభం, దుర్లభం తద్ద్వితీయమ్.

అ. సకల ప్రాణుల బుద్ధి అనే ఈ నది పాపం వైపూ, ధర్మం వైపూ, రెండు వైపులా కూడ ప్రవహిస్తుంది. వాటిలో మొదటి ప్రవాహం సులభమైనది; రెండవది దుర్లభమైనది.

91. సత్యేనాపి శప్తవ్యమ్; మహతామభయప్రదాయి వచనమేవ శపథమ్.

అ. అవసరమైతే సత్యంమీదనైనా ఒట్టుపెట్టాలి. అభయం ఇచ్చే వచనమే మహాత్ముల శపథం. అనగా మహాత్ములు మాట అంటే చాలు; అది శపథమే అని అర్థం.

92. సతామసతాం చ వచనాయత్తాః ఖలు సర్వే వ్యవహారాః.

అ. సత్పురుషుల వ్యవహారాలైనా, అసత్పురుషుల వ్యవహారాలైనా, వ్యవహారా లన్నీ మాటమీదనే ఆధారపడి ఉంటాయి కదా?

93. స ఏవ సర్వలోకమహనీయః, యస్య వచనమమనస్కతయా ప్యాయాతం భవతి శాసనమ్.

అ. ఎవని నోటిలోనుంచి పొరబాటున జారినా ఒక మాట శాసనం అవుతుందో అతడే సమస్తలోకంలో పూజించదగినవాడు.

94. నాస్యాప్రేరితా వాక్ దేవతయా వదతి, సత్యా హ్యేషా సరస్వతీ.

అ. దేవత ప్రేరేపించకుండా ఆతని నోటినుంచి మాట రాదు; ఆ మాట సత్యమైన సరస్వతియే.

95. వ్యభిచారివచనేషు నైహికీ పారలౌకికీ వా క్రియా సమస్తి.

ఆ. సత్యదూరములైన మాటలతో ఇహలోకానికి సంబంధించిన పనులకు గాని, పరలోకానికి సంబంధించిన పనులకు గాని పొందు ఉండదు.

96. న విశ్వస్తఘాతాత్పరం పాతకమస్తి.

అ. నమ్మిన వానిని మోసంచేయడం కంటె మించిన పాపం లేదు.

97. విశ్వాసఘాతకః సర్వేషామవిశ్వాసం కరోతి.

అ. విశ్వాసఘాతకుడు అందరికీ అవిశ్వాసం కలిగిస్తాడు.

98. అసత్యసంధేషు విశ్వాసః కృతాన్యకృతాని చ హన్తి.

అ. అసత్యసంధుల్ని నమ్మడం చేసిన పనులనూ, చేయని పనులనూ కూడ చెడగొట్టుతుంది.

99. అసత్యవాదినో మృతస్యాపి దుర్యశో న వినశ్యతి.

అ. అసత్యం పలికేవాని అపకీర్తి చచ్చిన తరవాత కూడా పోదు.

100. సకృదుత్థితా అప్రసిద్ధిః దేవైరపి న నివారయితుం శక్యతే.

అ. ఒక్క మాటు అపకీర్తి వచ్చిందా, దానిని దేవతలు కూడా పోగొట్టలేరు.

101. తథాహి - ధర్మపుత్రః అసత్యమభాషత; అపాచ్ఛ మద్యమిత్య ద్యాప్యస్తి దుష్ప్రసిద్ధిః.

అ. ఉదాహరణకి ధర్మరాజు అసత్యం పలికాడు; మద్యం త్రాగాడు అనే అపకీర్తి నేటికి కూడా ఉంది.

102. యశోవధః ప్రాణవధాద్గరీయాన్.

అ. కీర్తివధ ప్రాణవధకంటె గొప్పది.

103. బలం, బుద్ధిః, భూమిః, గ్రహానులోమ్యమ్, పరోద్యోగస్య ప్రత్యేకం బహువికల్పదణ్డమణ్డలాభోగాశ్చ సంహతవ్యూహ రచనాయాః హేతవః.

అ. బలము, బుద్ధి, భూమి, గ్రహాలు అనుకూలంగా ఉండడం, పరుని విషయంలో ఉద్యోగానికి, అనగా శత్రువు మీదికి దండెత్తివెళ్ళే ప్రయత్నం చెయ్యడానికి హేతువులు. అనేకమైన వికల్పాలు, దండము, మండలాల వైశాల్యమూ ఇవి కలిసి వ్యూహరచనకు హేతువులు. (దీని భావం అస్పష్టంగా ఉన్నది).

104. సాధు రచితోఽపి వ్యూహః తావత్తిష్ఠతి యావన్న పరబల దర్శనమ్.

అ. వ్యూహం ఎంత బాగా పన్నినా అది శత్రువుల సైన్యం కంటబడనంత వరకే నిలుస్తుంది.

105. న హి శస్త్రశిక్షాక్రమేణ యోద్ధవ్యం, కిం తు పరప్రహారాభి ప్రాయేణ.

అ. శస్త్రాభ్యాసం చేసిన క్రమం ప్రకారం యుద్ధం చేయకూడదు; (యథాశాస్త్రంగా యుద్ధం చేస్తామని అనుకొనకూడదు) మరేమనగా, శత్రువుల్ని కొట్టవలెననే అభిప్రాయంతో యుద్ధం చెయ్యాలి శత్రువుల్ని కొట్టడం ప్రధాన లక్ష్యంగా పెట్టుకోవాలి కాని, ట్రైనింగులో చెప్పిన ప్రకారం చేస్తున్నామా లేదా అని చూడకూడదు.

106. వ్యసనేషు ప్రమాదేషు వా పరేష్వభిషేణనమవస్కన్దః.

అ. (శత్రువులు) వ్యసనాలలో (కష్టాలలో) ఉన్నప్పుడు కాని, ఏమరి ఉన్నప్పుడు గాని వాళ్ళమీదికి దండెత్తి వెళ్ళడం 'అవస్కందం.'

107. అన్యాభిముఖం ప్రయాణముపక్రమ్య అన్యోపఘాతకరణం కూట యుద్ధమ్.

అ. ఒకనిమీదికి దండెత్తి వెడుతున్నట్లు ప్రయాణం అయి మరొకనిమీద దెబ్బ కొట్టడం కూటయుద్ధం (కపటయుద్ధం).

108. విషవిషమపురుషౌపనిషదికయోగోపజాపైః పరోపఘాతానుష్ఠానం తూష్ణీందణ్డః.

అ. విషప్రయోగంచేత, క్రూరపురుషులను పంపడంచేత, రహస్యప్రయోగాలచేత, ప్రజలలో విప్లవం కలిగించడంచేత శత్రువుని నశింపచేయటం "తూష్ణీం దండం" (పైకి కనబడకుండా దండించడం).

109. ఏకం బలస్యాధికృతం న కుర్యాత్, భేదాపరాధశఙ్కయా మేకః సమర్థో జనయతి మహాన్తమనర్థమ్.

అ. సైన్యానికి అంతకీ ఒక్కణ్ణే అధికారినిగా (నాయకునిగా) చేయకూడదు. భేదం శంక గాని, అపరాధశంక గాని కలిగినప్పుడు ఆ ఒక్కడు సమర్థుడైన వ్యక్తి అయితే గొప్ప అనర్థం కలిగిస్తాడు.

110. రాజా రాజకార్యేషు మృతానాం సన్తతిమపోషయన్ ఋణభాగీ స్యాత్, సాధు చ నోపచర్యేత తన్త్రేణ సర్వేభ్యో ధార్మికేభ్యశ్చ.

అ. రాజకార్యం చేస్తూ మరణించిన వాళ్ళ సంతానాన్ని పోషించని రాజు ఋణపడి ఉంటాడు. సమస్తధార్మికులకంటె కూడా తంత్రంచేత బాగా సేవించబడడు. (రెండవవాక్యం అర్థం అస్పష్టంగా ఉంది.)

111. ధార్మికేభ్యోఽపి పరా గతిర్హి శూరాణామ్.

అ. శూరుల గతి (పుణ్యలోకగమనం) ధార్మికులకంటె గొప్పది కదా?

112. యుధి పృష్ఠగం బ్రహ్మహణమాహుః.

అ. యుద్ధంలో వెనక వెనక వెళ్ళేవాడు బ్రహ్మహత్య చేసిన వాడని అంటారు.

113. యుద్ధే స్వామినః పురఃసరణమ్ అశ్వమేధమాహుః.

అ. యుద్ధంలో ప్రభువుకంటె ముందు ఉండడం అశ్వమేధం అని అంటారు.

114. యుధి స్వామినం త్యజతో నాస్తీహాముత్ర చ కుశలమ్.

అ. యుద్ధంలో ప్రభువును విడచినవానికి ఇహలోకంలో కాని, పరలోకంలో కాని సుఖం లేదు.

115. విగ్రహాయోచ్చలితస్య అర్ధం బలం సర్వదా సంనద్ధమాసీత.

అ. యుద్ధానికి కదలినవాని సగం సైన్యం ఎల్లప్పుడూ సన్నద్ధంగా (యుద్ధానికి సిద్ధంగా) ఉండాలి.

116. ప్రయాణమావాసనం చ కుర్వతః చతుర్దిశమనీకాని అనతిదూరేణ సంచరేయుస్తిష్ఠేయుశ్చ.

అ. యుద్ధానికి ప్రయాణం సేనను నిలపడం చేస్తూన్న వాని సైన్యాలు నాలుగు దిక్కులందు దగ్గరగా సంచరిస్తూ ఉండాలి, అక్కడనే ఉండాలి.

117. ధూమాగ్నిరజోవిషాణధ్వనివ్యాజేన ఆటవికాః ప్రణిధయః పర బలాన్యాగచ్ఛన్తి నివేదయేయుః.

అ. గూఢచారులుగా ఉన్న ఆటవికులు పొగ, అగ్ని, పరాగం, కొమ్ములు ఊదడం - వీటి ద్వారా శత్రుసైన్యాలు వస్తూన్న విషయాన్ని తెలపాలి.

118. పురుషప్రమాణోత్సేధమ్, అబహుజననివేశం, చరణాపసరణ యుక్తమ్, అగ్రతో మహామణ్డపావకాశం చ తదఙ్గమధ్యస్య సర్వదా స్థానం దద్యాత్.

అ. నిలువు ఎత్తైన, చాలామంది జనులు నివసించని, రాకపోకలు ఉన్న, ఎదట పెద్దమంటపము, అవకాశమూ ఉన్నదాని అంగాన్ని అధిష్ఠించి ఎల్లప్పుడు స్థానం ఇవ్వాలి. (ఇది అక్షరార్థం; భావం తెలియలేదు.)

119. సర్వసాధారణభూమికం తిష్ఠతః నాస్తి శరీరరక్షా.

అ. అందరికీ సాధారణమైన ప్రదేశంలో ఉన్నవానికి శరీరరక్ష ఉండదు.

120. భూచరో, దోలాచరః, తురఙ్గచరో వా న కదాచిత్పరభూమౌ ప్రవిశేత్.

అ. నడుస్తూ కాని, పల్లకీ ఎక్కి గాని, గుఱ్ఱం సవారీ చేస్తూ కాని ఎన్నడూ ఇతరుల భూమిలోనికి ప్రవేశించకూడదు.

121. కరిణం యన్త్రియానం వాద్యాసీనే న ప్రభవన్తి క్షుద్రోపద్రవాః.

ఇతి యుద్ధసముద్దేశః.

అ. ఏనుగునుగాని, యంత్రంతో నడచే బండి గాని ఎక్కిన వానిని చిన్న చిన్న (ప్రమాదాలు) ఆపదలు బాధించవు.

''బాలానందిని'' అను సోమదేవ నీతిసూత్రాంధ్రవ్యాఖ్యలో యుద్ధ సముద్దేశం సమాప్తం.

## 31. వివాహ సముద్దేశః

1. ద్వాదశవర్షా స్త్రీ షోడశవర్షః పుమాంశ్చ ప్రాప్తవ్యవహారౌ భవతః.

అ. పన్నెండు సంవత్సరాల వయస్సు గల స్త్రీ, పదహారు సంవత్సరాలు గల పురుషుడు స్వతంత్రంగా వ్యవహరించే అధికారం కలవారు అవుతారు. మైనారటీ తీరి మేజర్లు అవుతారు.

2. వివాహపూర్వో వ్యవహారః చాతుర్వర్ణ్యం కులీనతాం నయతి.

అ. వివాహం అయిన తరవాత స్వతంత్రంగా వ్యవహరించడం నాలుగు వర్ణాలవాళ్ళకు కూడ సత్కులీనత్వాన్ని కలిగిస్తుంది. కేవలం వయస్సు వచ్చినది కదా అని కాకుండా పెద్దల అనుమతిచేత వివాహం చేసుకొన్న తరవాత స్వతంత్రంగా వ్యవహరించడం ప్రారంభిస్తే అప్పుడు ఆ యా వర్ణాలవారి కులాలు సత్కులాలుగా ఉంటాయి అని అర్థం.

3. యుక్తితో వరణవిధానమ్, అగ్నిదేవద్విజసాక్షికం చ పాణిగ్రహణం వివాహః.

అ. యుక్తిపూర్వకంగా, అనగా శాస్త్రానుసారంగాను లౌకికాచారాదుల ప్రకారంగాను వధూవరులను వరణం చేసి (ఎన్నుకొని), అగ్నిసాక్షికం గాను, దేవతాసాక్షికం గాను, బ్రాహ్మణసాక్షికం గాను హస్తం గ్రహించడం (వరుడు వధువు ఒకరొకరి హస్తాలు గ్రహించడమే) వివాహం.

4. స బ్రాహ్మో వివాహః, యత్ర వరాయాలఙ్కృత్య కన్యా ప్రదీయతే.

అ. కన్యను అలంకరించి వరుడికి ఇచ్చి చేసిన వివాహం "బ్రాహ్మ వివాహం."

5. స దైవో వివాహః, యత్ర యజ్ఞార్థమృత్విజే కన్యాప్రదానమేవ దక్షిణా

అ. యజ్ఞం చేయించడంకోసం ఋత్విక్కుకు కన్యనే దక్షిణగా ఇవ్వడం "దైవవివాహం."

6. గోమిథునపురస్సరం కన్యాదానమార్షః.

అ. గోమిథునంతో పాటు అనగా ముందుగా ఒక ఆవు, ఎద్దూ దానం చేసి పిదప (అతనికే) కన్యను ఇవ్వడం 'ఆర్షవివాహం.'

7. "త్వం భవాస్య మహాభాగస్య ప్రేయసీ సహధర్మచారిణీ" ఇతి వినియోగేన కన్యాప్రదానాత్ ప్రాజాపత్యః.

అ. "నువ్వు ఈ మహానుభావునికి ప్రియురాలవైన సహధర్మచారిణివిగా ఉండుము" అని ఆదేశించి కన్యాదానం చేస్తే అది ప్రాజాపత్యవివాహం.

8. ఏతే చత్వారో ధర్మ్యా వివాహాః.

అ. ఈ నాలుగు విధాల వివాహాలు ధర్మసంమతములైన వివాహాలు.

9. మాతుః పితుర్బన్ధూనాం చాప్రామాణ్యాత్ పరస్పరానురాగేణ మిథః సమవాయాద్గాన్ధర్వః.

అ. తల్లి, తండ్రి, బంధువులూ - వీళ్ళ ఎవరి అనుమతి లేకుండానే పరస్పరం ప్రేమించుకొని రహస్యంగా స్త్రీ పురుషులు కలిసినట్లయితే అది "గాంధర్వ వివాహం."

10. పణబన్ధేన కన్యాప్రదానాదాసురః.

అ. ఏదో ఒక షరతుపెట్టి కన్యను ఇచ్చినట్లయితే అది 'అసురవివాహం.'

11. కన్యాయాః ప్రసహ్యాదానాత్ (ప్రసహ్య హరణాత్) రాక్షసః.

అ. కన్యను బలాత్కారంగా అపహరించుకొని వెళ్ళి చేసికొన్న వివాహం "రాక్షసవివాహం."

12. సుప్తప్రమత్తకన్యాహరణాత్ పైశాచః.

అ. కన్య నిద్రిస్తూన్నప్పుడు గాని, ఏమరిపాటుతో ఉన్నప్పుడు గాని అపహరించుకొనిపోయి చేసుకున్న వివాహం 'పైశాచవివాహం.'

13. ఏతే చత్వారః అధమా అపి నాధర్మ్యాః, యద్యస్తి వధూవరయోరనపవాదం పరస్పరసంభావ్యత్వమ్.

అ. ఈ నాలుగు విధాలైన వివాహాలు అధమవివాహాలే అయినా, ఎట్టి అపవాదమూ (దాంపత్యజీవితంలో దోషం ఏదీ) లేకుండా వధూవరులు ఇద్దరూ పరస్పరమూ గౌరవంతో ఉంటే ధర్మవిరుద్ధమైనవి కావు.

14. ఉన్నతత్వం కనీనయోః, లోమశత్వం జఙ్ఘయోః, అమాంస లత్వమ్ ఊర్వోః, అచారుత్వం కటినాభిజఠరకుచయుగలేషు, సిరాలుత్వమ్ అశుభసంస్థానత్వం చ బాహ్వోః, కృష్ణత్వం తాలుజిహ్వాధరేషు, విరలవిషమభావో దశనేషు, సకూపత్వం కపోలయోః, పిఙ్గలత్వమక్ష్ణోః, స్థపుటత్వం లలాటే, దుఃసన్ని వేశత్వం శ్రవణయోః, స్థూలకపిలపరుషాతిదీర్ఘభావః కేశేషు, అతిదీర్ఘాతిలఘున్యూనాధికతా, వికటకుబ్జవామనకిరాతాఙ్గత్వమ్, జన్మదేహాభ్యాం స్వేన సమానతా, అధికత్వం చేతి కన్యాదోషాః,

అ. కంటిగుడ్లు ఎత్తుగా ఉండడం, పిక్కలమీద ఎక్కువ రోమాలు ఉండడం, తొడలు మాంసం లేకుండా (చప్పబడినట్లు) ఉండడం, కటి ప్రదే శమూ నాభీ నడుమూ స్తనద్వయమూ అందంగా లేకపోవడం, బాహువుల ఆకారం (Shape) సరిగా ఉండకపోవడమూ, చెవి, నాలుక, అధరోష్ఠం- ఇవి నల్లగా ఉండడం, (నోటిలోని) పళ్ళు ఎడంగా ఎగుడుదిగుడుగా ఉండడమూ, బుగ్గలమీద సొట్ట ఉండడమూ, కళ్ళు పసుపుపచ్చగా ఉండడమూ, నుదురు బాగా ఎత్తుగా గాని పల్లంగా గాని ఉండడమూ, చెవుల తీరు సరిగా లేకపోవ డమూ, జుట్టు స్థూలంగాను, బూడిదరంగుగాను, బిరుసుగాను, చాల పొడవు గాను ఉండడమూ, చాలా పొడవుగా గాని, చాలా పొట్టిగా గాని (అవయవాలు) ఎగుడుదిగుడుగా గాని ఉండడమూ, శరీరం వికృతంగాను, వంకరగాను, పొట్టి గాను, కుదించుకుపోయినట్లుగాను ఉండడమూ, జన్మదేహాలచేత తనతో సమా నంగా గాని అధికంగా కాని ఉండడమూ, అనగా వయస్సులోను, శరీర ప్రమా ణంలోను తనతో సమంగా గాని, అధికంగా గాని ఉండడమూ, ఇవి కన్యా దోషాలు. అలాంటి కన్యను వివాహం చేసికొనకూడదు.

15. సహసా తద్గృహే గతస్య స్వయమ్ అహూతగతస్య వా అగ్రే అభ్యక్తా (వ్యక్తా) (భుక్తా) - వ్యాధిమతీ; రుదతీ - పతిఘ్నీ; సుప్తా - స్తోకాయుష్కా; బహిర్గతా - కులటా; అప్రసన్నా - దుఃఖితా; కలహోద్యతా - పరిజనోద్వాసినీ, అప్రియదర్శనా చ - దుర్భగా భవేదితి నైతాం వృణీత కన్యామ్.

అ. వరుడు తానే స్వయంగా గాని, వాళ్ళు పిలవగా గాని కన్య ఇంటికి వెళ్ళినపుడు ఆమె తైలాభ్యంగనం చేసుకొని తన ఎదుట కనబడితే, లేదా నగ్నరాలుగా గాని, లేదా తింటూ గాని ఎదట కనబడితే ఆమె వ్యాధికలది అవుతుంది. ఏడుస్తూ కనబడితే భర్తను చంపేది వైధవ్యం చెందేది, అవుతుంది. నిద్రిస్తూ కనబడితే అల్పాయుర్దాయవంతురా లవుతుంది. బైటకు వెళ్ళి ఉన్నట్లయితే కులట అవుతుంది. అప్రసన్నురాలుగా (చీకాకుపడుతూ) కనబడితే దుఃఖవంతురాలు అవుతుంది. ఎవరితోనైనా కలహిస్తూ కనబడితే పరిజనాన్ని పంపివేసేది అవుతుంది. అప్రియంగా కనబడితే దౌర్భాగ్యవంతురాలు (గొడ్రాలు అవడం-మొ.) అవుతుంది. ఆ కన్యను వరించకూడదు.

16. శిథిలే పాణిగ్రహణే వరః కన్యయా పరిభూయతే.

అ. చెయ్యి పట్టుకున్నప్పుడు ఆ పట్టు జారిపోతే కన్య వరుణ్ణి తిరస్కరిస్తుంది. అణగద్రొక్కుతుంది.

17. ముఖమపశ్యతో వరస్య సంనిధౌ అనిమీలితదర్శనా కన్యా ప్రచణ్డా.

అ. వరుడు తన ముఖం చూడనప్పుడు అతని సంనిధిలో ఉండి, కళ్ళు మూయకుండా చూచే కన్య ప్రచండురాలు అవుతుంది.

18. సహశయనే తూష్ణీం భవన్ పశువన్మన్యేత, బలవదాక్రమణం కుర్వన్ జన్మవిద్వేష్యో భవతి.

అ. శయనంమీద కలిసి ఉన్నప్పుడు ఏమీ చేయకుండా ఊరికే ఉన్నవాడు పశువుగా చూడబడతాడు; బలాత్కారంతో ఆక్రమించేవాడు జీవించినంత కాలం ద్వేషపాత్రు డవుతాడు.

19. ధైర్యచాతుర్యాయత్తం హి కన్యావిస్రమ్భణమ్.

అ. కన్యకు నమ్మకం కలిగించడం ధైర్యంమీదా (ఓపిక పట్టి ఉండడం మీద) నేర్పుమీదా ఆధారపడి ఉంటుంది.

20. సమవిభవాభిజనయోః అసగోత్రయోశ్చ వివాహసంబన్ధః.

అ. వివాహసంబంధం అనేది సమానమైన ఐశ్వర్యమూ, సమానమైన కుటుంబగౌరవమూ ఉన్నవాళ్ళ మధ్య, ఒకే గోత్రం కానివాళ్ళ మధ్య జరగాలి.

21. కన్యా హి మహతః పితురైశ్వర్యాత్ అల్పం పతిమవగణయతి.

అ. తండ్రి చాలా ఐశ్వర్యవంతుడైన కన్య అల్పుడైన భర్తను లెక్క చేయదు.

22. అల్పస్య కన్యా పితుర్దౌర్బల్యాన్మహతాఽవజ్ఞాయతే.

అ. అల్పుడైనవాని (అల్పధనవంతుని) కన్యను ఆమె తండ్రి దుర్బలుడవడంచేత ఐశ్వర్యవంతుడైన భర్త అవమానిస్తాడు.

23. అల్పస్య మహతా సహ సంవ్యవహారే మహాన్ వ్యయః అల్పశ్చాయః.

అ. అల్పుడికి గొప్పవానితో సంబంధం ఏర్పడితే వ్యయం చాలా అధికం అవుతుంది; ఆయం అల్పం ఉంటుంది.

24. వరం వేశ్యాసంగ్రహోఽపి, న త్వవిశుద్ధకన్యాపరిగ్రహః.

అ. వేశ్యను చేరతీయడమైనా మంచిది కాని పరిశుద్ధురాలు కాని కన్యను వివాహం చేసుకోవడం మంచిదికాదు.

25. వరం జన్మనాశోఽపి న తు కన్యాయాః అకులీనేష్వవక్షేపః.

అ. మరణించడమైనా మంచిది కాని కన్యను చెడ్డవాళ్ళ కుటుంబంలో ఇవ్వడం మంచిది కాదు.

26. సమ్యగ్వృత్తాపి హి కన్యా తావత్ సందేహాస్పదం, యావన్న పాణిగ్రహణమ్.

అ. ఎంత మంచి నడవడిక గల కన్యక అయినా వివాహం అయేవరకూ సందేహాస్పదురాలుగానే ఉంటుంది.

27. వికృతప్రత్యూఢాపి పునర్వివాహమర్హతీతి స్మృతికారాః.

(సూత్రార్థం స్పష్టంగా లేదు.) 'పత్యూఢా' అని పాఠం అయి ఉంటుంది. ఏదో వికారం ఉన్న భర్తచేత పరిణీత అయినా ఆమెకు మళ్లీ వివాహం చేయవచ్చునని స్మృతికారులు చెప్పారు అని అర్థం.

28. ఆనులోమ్యేన చతుస్త్రిద్వివర్ణకన్యాభాజనాః బ్రాహ్మణక్షత్రియవిశః.

అ. బ్రాహ్మణక్షత్రియవైశ్యవర్ణాలవాళ్ళు ఆనులోమ్యంచేత (పై వర్ణాల పురుషులు క్రింది వర్ణాలస్త్రీలని వివాహంచేసుకొనడం ఆనులోమ్యం) నాలుగు మూడు-రెండు వర్ణాల కన్యలను పొందవచ్చును. అనగా, బ్రాహ్మణుడు బ్రాహ్మణ

క్షత్రియ వైశ్య శూద్రకన్యలను, క్షత్రియుడు క్షత్రియ వైశ్య శూద్రకన్యలను, వైశ్యుడు వైశ్య శూద్రకన్యలను వివాహం చేసికొనవచ్చును.

29. దేశాపేక్షో మాతులసంబన్ధః.

అ. మేనరికం దేశాచారాన్ని పట్టి ఉంటుంది. ఇది దాక్షిణాత్యులలో ఉన్నది కాని ఉత్తరదేశీయులలో లేదు.

30. ధర్మసంతతిః, అనుపహతా రతిః, గృహవార్తాసు విహితత్వమ్, ఆభిజాత్యాచారవిశుద్ధిః, దేవద్విజాతిథిబాన్ధవసత్కారానవద్యత్వమ్, నిఃశ్రేయసమార్గేష్వసంకుచితః సంచారః, సాధకానాం హస్తావలమ్బనవిధానం చ దారకర్మణః ఫలమ్.

అ ధర్మసంమతమైన సంతానం, అడ్డం లేని ఆనందం, ఇంటికి సంబంధించిన విషయా లన్నీ నియమబద్ధంగా ఉండడం, వంశమర్యాద ఆచారమూ పరిశుద్ధంగా ఉండడం, దేవతలను. ద్విజులను, అతిథులను, బంధువులను సత్కరించడంలో ఏ లోపాలూ లేకపోవడం, పరలోకంలో సుఖం ఇచ్చే మార్గాలలో నిరాఘాటంగా ప్రయాణించడం, సాధకులకు (బ్రహ్మచారులు సంన్యాసులు మొదలైన వాళ్ళకు) చేయూత ఇవ్వడం - ఇవి వివాహం చేసుకొన్నందుకు ఫలం.

31. గృహిణీ గృహముచ్యతే, న పునః కుడ్యకటసంఘాతః.

అ. గృహం గృహం అంటే గృహిణియే (భార్యయే), అంతే కాని, గోడలూ, చాపలూ కాదు.

32. గృహకర్మవినియోగః,పరిమితార్థత్వమ్, అస్వాతన్త్ర్యమ్, సదాచారః, మాతృవ్యఞ్జనస్త్రీజనావరోధః, స్వరసతః స్వాన్తస్య సద్విషయోన్ముఖతాపాదనం చేతి కులవధూనాం రక్షణోపాయః.

అ. ఇంటి పనులుచేసుకొనడంలో లగ్నమై ఉండడం, ధనం పరిమితంగానే ఇవ్వడం, స్వాతంత్ర్యం లేకపోవడం, సత్ప్రవర్తన, తల్లులవంటి స్త్రీల మధ్య ఉండడం, స్వాభావికంగానే మనస్సు మంచి విషయాల వైపు మరలేటట్లు చేసుకోవడం- ఇవి కులస్త్రీల రక్షణోపాయాలు.

33. రజకశిలాకుర్కురఖర్పరసమా హి వేశ్యాః కస్తాస్వభిజాతోఽనురజ్యేత.

అ. వేశ్యాస్త్రీలు చాకలిబండలు, కుక్కపుట్టెవంటి వాళ్ళు; మంచి వంశంలో పుట్టినవాడు ఎవడైనా వాళ్ళమీద అనురాగవంతు డవుతాడా?

34. దానైరపి దౌర్భాగ్యమ్, సంస్కృత్య సంస్కృత్య పరోపభోగ్యత్వమ్, ఉపభోక్తుః అశక్తౌ పరిభవో మారణం వా, మహోపకారేఽప్యనాత్మీయత్వమ్, బహుకాలసంబన్ధమపి త్యక్త్వా సదైవ పురుషాన్తరగామిత్వమ్ - ఇతి వేశ్యానాం కులాగతా ధర్మాః.

అ. ఎంత ఇచ్చినా దారిద్ర్యంతోనే ఉండడం, అలంకరించుకొనీ అలంకరించుకొని ఇతరుల అనుభవానికి ఉపయోగించేటట్లుగా ఉండడం, అనుభవించేవాడు (ఉంచుకున్నవాడు) అశక్తుడైనప్పుడు వానిని అవమానించడం లేదా చంపించి వేయడం ఎంత గొప్ప ఉపకారం పొందినా మనవాడు అనే అభిమానం లేకపోవడం, ఎంతో కాలంనుంచి ఉన్న సంబంధాన్ని కూడా విడచి ఎల్లప్పుడు మరొకనితో వెళ్ళడం- ఇవి వేశ్యల కులక్రమాగతాలైన ధర్మాలు.

35. వేశ్యా వేశ్యేతి న జాతిరన్వేష్టవ్యా, పతిహృదయాత్ స్వహృదయం వ్యభిచారయన్తీ సర్వాపి వేశ్యైవ.

అ. 'వేశ్య వేశ్య' అంటూ ఒక జాతిని వెదకనక్కరలేదు; భర్త హృదయంనుండి తన హృదయాన్ని వ్యభిచరింపచేసిన ప్రతి స్త్రీ కూడా వేశ్యయే.

36. విటో జార ఇతి న జాతిరన్వేష్టవ్యా; సతీహృదయాత్ స్వహృదయం వ్యభిచారయన్ సర్వోఽపి విట ఏవ, జార ఏవ.

ఇతి వివాహసముద్దేశః.

అ. 'విటుడు' 'జారుడు' అంటూ ఒక జాతిని వెదకవలసిన పని లేదు. ఉత్తమురాలైన భార్యహృదయంనుంచి తన హృదయాన్ని వ్యభిచరింపచేసిన ప్రతీవాడూ విటుడే; జారుడే.

"బాలానందిని" అనే సోమదేవ నీతి సూత్రాంధ్రవ్యాఖ్యలో
వివాహ సముద్దేశం సమాప్తం.

## 32. ప్రకీర్ణక సముద్దేశః

1. అథ ప్రకీర్ణకముచ్యతే - సముద్ర ఇవ విప్రకీర్ణసూక్తిరత్నవిన్యాసనిబన్ధనం ప్రకీర్ణకమ్.

అ. ఇప్పుడు ప్రకీర్ణకం చెప్పబడుచున్నది. సముద్రం వలె సూక్తిరత్నాలు చిమ్మబడినట్లుగా కూర్చిన బంధం ప్రకీర్ణకం. అనగా, అనేక విధాలైన సూక్తులు

(ఒకే విషయానికి సంబంధించినవి అనే నియమం లేకుండా ఉన్న) ప్రకరణం 'ప్రకీర్ణకం' అని అర్థం. (కలగూర గంప.)

2. వర్ణ పదవాక్యప్రమాణయోగవిజ్ఞాననిష్ణాతమతిః, సుముఖః, సువ్యక్తమధురగమ్భీరధ్వనిః, ప్రగల్భః, ప్రతిభానవాన్, సమ్య గూహావధారణాగమకశక్తిసంపన్నః, సంప్రజ్ఞాతసమస్త లిపిభాషావర్ణాశ్రమసమయస్వపరవ్యవహారస్థితిః, ఆశు లేఖన వాచనసమర్థశ్చ ఇతి సాన్ధివిగ్రహికా గుణాః.

అ. సాంధివిగ్రహకుడు ఇతర రాజ్యాలతో సంధిని (శాంతిని) విరోధాన్ని (యుద్ధాన్ని) నిర్ణయించే మంత్రికి, అనగా విదేశవ్యవహారాల మంత్రికి, ఉండ వలసిన లక్షణాలు ఏవనగా - అతనికి వర్ణములు, పదాలు, వాక్యాలు, శాస్త్రాది ప్రమాణాలు, యోగం, లౌకికవిజ్ఞానం-వీటిలో నేర్పు గల బుద్ధి ఉండాలి. మంచి ముఖం (చూడగానే ఇతరులను ఆకర్షించే ముఖం), బాగా స్పష్టమూ, గంభీరమూ, మధురమూ అయిన కంఠధ్వని ఉండాలి. అతడు ప్రగల్భుడై (Bold) ప్రతిభా వంతుడై ఉండాలి. (ఎదుటివానితో మాటలాడేటప్పుడు వెంటవెంటనే యుక్తి పై యుక్తులు స్ఫురించేవాడు ప్రతిభావంతుడు). విషయాలను బాగా ఊహించు కొనడం, నిర్ధారణ చేయడం, విషయం చక్కగా గ్రహించడం - ఈ శక్తి కల వాడై ఉండాలి. సమస్త లిపులు, సమస్త భాషలు, వర్ణాలకు ఆశ్రమాలకూ సంబం ధించిన కట్టుబాట్లు, తమ రాజ్యంలోని వ్యవహారాలు, పరరాజ్యాలలోని వ్యవహా రాలూ బాగా తెలిసినవాడై ఉండాలి. శీఘ్రంగా వ్రాయడంలోను, శీఘ్రంగా చద వడంలోను నేర్పు కలవాడై ఉండాలి. ఇవి సాంధివిగ్రహకునికి ఉండవలసిన గుణాలు.

3. కథావిచ్ఛేదః, వ్యాకులత్వమ్, ముఖే వైరస్యమ్, అనవేక్షణమ్, స్థానత్యాగః, సాధ్వాచరితేఽపి దోషోద్భావనమ్, విజ్ఞప్తే చ మౌనమ్, అక్షమా, కాలయాపనమ్, అదర్శనమ్, మృషాభ్యుప గమశ్చ - ఇతి విరక్తలిఙ్గాని.

అ. మాటలు తుంచివేయడం, వ్యాకులంగా ఉండడం (మరొకటి ఏదో ఆలోచిస్తూన్నట్లు ఉండడం), ముఖంలో విరసత్వం, మనిషికేసి చూడకపోవడం, కూర్చున్న చోటు విడచి వెళ్ళిపోవడం, మంచి పని చేసినా ఏదో వంక పెట్టి

దోషం చూపడం, విజ్ఞాపన చేస్తూండగా మాటలాడకపోవడం, ఓర్పు లేకపోవడం, కాలం గడిపివేయడం, దర్శనం ఇవ్వకపోవడం, చెప్పినది అంగీకరిస్తున్నట్లుగా పైకి కనబడడం - ఇవి విరక్తుని చిహ్నాలు. ఒక సేవకుని విషయంలో సదభిప్రాయం లేని ప్రభువు ఈ విధంగా ప్రవర్తిస్తాడు అని అర్థం.

4 దూరాదేవేక్షణమ్, ముఖప్రసాదః, సంప్రశ్నేష్వాదరః, ప్రియ వస్తుస్మరణమ్, పరోక్షే గుణగ్రహణమ్ తత్పరివారస్య తదనునయవృత్తిః - ఇతి అనురక్తలిఙ్గాని.

అ. దూరంనుండే చూడడం, ముఖప్రసాదం (ముఖంలో చిరునవ్వు), ప్రశ్నలు వేయడంలో ఆదరం, పూర్వం చేసిన మంచి పని స్మరించడం, పరోక్షంలో వానికి సంబంధించినవాళ్ళ గుణాలు చెప్పి ప్రశంసించడం, వానికి అనుకూలంగా ఉండడం ఇవి అనురక్తుని లింగాలు. సేవకుని విషయంలో ఈ విధంగా ప్రవర్తించే ప్రభువు అతనిమీద సద్భావంతో ఉన్నాడని గ్రహించాలి అని అర్థం.

5. శ్రుతిసుఖత్వమ్, అపూర్వావిరుద్ధార్థాతిశయయుక్తత్వమ్, ఉభయాలంకారసంపన్నత్వమ్, అన్యూనాధికవచనత్వమ్, అభివ్యక్తాన్వయత్వమితి కావ్యస్య గుణాః.

అ. (కావ్యం) చెవికి ఇంపుగా ఉండాలి. క్రొత్తది, లోకశాస్త్రాదులకు విరుద్ధం కానిదీ అయిన అర్థం ప్రతిపాదించాలి. శబ్దాలంకారాలు, అర్థాలంకారాలూ కూడా ఉండాలి. మాటలు హెచ్చుతగ్గులు లేకుండా ఉండాలి. అన్వయం స్పష్టంగా ఉండాలి. అనగా, చదవగానే అర్థం అయేటట్లుగా ఉండాలి. ఇవి కావ్యగుణాలు.

6. అతిపరుషవచనవిన్యాసత్వమ్, అనన్వితగతార్థత్వమ్, దుర్బోధానుపపన్నపదోపన్యాసత్వమ్, అయథార్థయతివిన్యాసత్వమ్, అభిధానాభిధేయాతిశయశూన్యత్వమ్ - ఇతి కావ్యస్య దోషాః.

అ. మాటల కూర్పు చాలా పరుషంగా ఉండడం, అర్థం కుదరకపోవడం, చెప్పినదే చెప్పడం, అర్థం కాని అనుపపన్నాలైన (అక్కడ కుదరని)

పదాలు కూర్చడం యతిస్థానం సరిగా ఉండకపోవడం, శబ్దంలో కాని, అర్థంగా కాని విశేషం ఏమీ లేకపోవడం - ఇవి కావ్యదోషాలు.

7. వచనకవిః, అర్థకవిః, ఉభయకవిః, చిత్రకవిః, వర్ణకవిః, దుష్కరకవిః, అరోచకీ, సతుషాభ్యవహారీ చ-ఇత్యష్టౌ కవయః.

అ. మాటలు మాత్రం అందంగా ఉండే కవి, అర్థం మాత్రం బాగుండి శబ్దాలు అందంగా ఉండని కవి, రెండూ బాగుండే కవి, చిత్రకావ్యాలు (పద్మ బంధ చక్రబంధాలు లేదా శబ్దచిత్రాలు) అధికంగా వ్రాసే కవి, వర్ణాల ప్రయో గంలో నేర్పుగల కవి, సామాన్యకవులు రచించజాలని కవిత్వం రచించే కవి, దేన్నీ కూడా మెచ్చుకొనని కవి, పొల్లుతో సహా తినేసే కవి. (ఏ కవిత్వమైనా చాలా బాగుందని మెచ్చుకొనే కవి), అని కవులు ఎనిమిది విధాలు.

8. మనఃప్రసాదః, కలాసు కౌశలమ్, సుఖేన చతుర్వర్గవిషయా వ్యుత్పత్తిః, ఆసంసారం చ యశః, నిగూఢసత్సంస్కారోద్బోధశ్చ - ఇతి కవిసంగ్రహస్య ఫలమ్.

అ. మనస్సుకు ప్రసాదం (హాయి), కళలలో నేర్పు, ధర్మార్థ కామ మోక్షా లనే పురుషార్థచతుష్టయానికి సంబంధించిన విషయాలలో వ్యుత్పత్తి, సంసారం ఉన్నంతవరకు కీర్తి, లోపల దాగిఉన్న మంచి సంస్కారాలను వెలికి తీయడం- ఇవి కవులను పోషిస్తే లభించే ఫలితాలు.

9. ఆలాపశుద్ధిః, మాధుర్యాతిశయః, ప్రయోగసౌన్దర్యవైదగ్ధ్యే, అతీవ మసృణతా, స్థానకమ్పితకుహ(కా)రితాదిభావః,రాగాన్తర సంక్రాన్తిః, పరిగృహీతరాగనిర్వాహః, సహృదయహృదయ గ్రాహితా, స్వాస్థ్యజననం చేతి గీతస్య గుణాః.

అ. రాగం ఆలాపించడంలో శుద్ధి, అధికమైన మాదుర్యమూ, పాడడంలో సౌందర్యమూ నేర్పూ మిక్కలి మసృణత్వం (నున్నగా ఉన్నట్టు మెరుపు) (ధ్వనిలో) నిలకడ, కంపం, మధురధ్వని మొదలైనవీ; ఒక రాగంనుంచి మరొక రాగంలోనికి సంక్రమించడం, ప్రారంభించిన రాగాన్ని చివరివరకు నిర్వహిం చడం, సహృదయుల హృదయాలను ఆకర్షించడం, మనస్సుకు స్వస్థత్వాన్ని కలి గించడం - ఇవి సంగీతంలో గుణాలు.

10. సమత్వమ్, తాలానుయాయిత్వమ్, గేయాభినయానుగతత్వమ్, శ్లక్ష్ణత్వమ్, ప్రవ్యక్తయతిప్రయోగత్వమ్, శ్రుతిసుఖావహత్వం చ ఇతి వాద్యస్య గుణాః.

అ. సమంగా ఉండడం, తాళానికి అనుగుణంగా ఉండడం, పాటని, అభినయాన్ని అనుసరించి ఉండడం, మృదుత్వం, యతిప్రయోగం స్పష్టంగా ఉండడం - ఇవి వాద్యగుణాలు.

11. దృష్టిహస్తపాదక్రియాసు సమసమాయోగః, సంగీతకానుగతత్వమ్, సుశ్లిష్టలలితాభినయాఙ్గహారప్రయోగభావః, రసభావవృత్తిలావణ్యభావః-ఇతి నృత్యగుణాః.

అ. దృష్టి, చేతుల కదలిక, పాదాల కదలిక - ఈ మూడూ ఒకదానికి ఒకటి అనుగుణంగా ఉండడం, సంగీతాన్ని అనుసరించి ఉండడం, పొందికైన లలితాభినయ రూపమైన అవయవచాలనము, రసాలలోను, భావాలలోను, వృత్తులలోను లావణ్యం - ఇవి నృత్యగుణాలు.

12. స ఖలు మహాన్ యః ఖల్వార్తోఽపి న దుర్వచనం బ్రూతే.

అ. కష్టాలలో ఉన్నా (రోగంతో బాధపడుతున్నా) చెడ్డ మాట పలకనివాడే మహాత్ముడు.

13. స కిం గృహాశ్రమీ యత్రాగత్య అర్థినో న భవన్తి కృతార్థాః.

అ. ఎవని దగ్గరకు వెళ్ళి యాచకులు కృతార్థులు కారో ఆ గృహస్థుడు ఏమి గృహస్థుడు?

14. ఋణగ్రహణేన ధర్మః, సుఖమ్, సేవా, వాణిజ్యా చ ఆయతిహీనవృత్తీనాం తాదాత్వికానామ్.

అ. భవిష్యత్తులో ఏ వృత్తీ లేని తాదాత్వికులే (వర్తమానాన్ని గూర్చి మాత్రమే ఆలోచించేవాళ్ళే) అప్పుచేసి ధర్మకార్యాలు చేయడం, సుఖం అనుభవించడం, సేవ, వర్తకం చేస్తూ ఉంటారు.

15. ద్రవ్యం విద్యమానమర్థిభ్యో దేయమ్, నావిద్యమానమ్.

అ. చేతిలో ఉన్న ద్రవ్యమే యాచకులకు ఇవ్వాలి గాని లేనిదానిని ఇవ్వకూడదు. లేనప్పుడు ఎప్పుడో ఇస్తానని మాట ఇవ్వకూడదు అని భావం.

16. ఋణదాతురాసన్నం ఫలం పరోపాస్తిః, కలహః, పరిభవః, ప్రస్తావేఽర్థాలాభశ్చ.

అ. ఋణం ఇచ్చినవానికి ముందుగా లభించే ఫలం ఏమనగా - ఇతరులను సేవించవలసి రావడం, కలహం, తిరస్కారం, అవసరం అయినప్పుడు తన ధనమే తనకు లభించకపోవడం.

17. అదాతుస్తావత్ స్నేహః,సౌజన్యమ్, ప్రియభాషణమ్,సాధుతా చ యావన్నార్థావాప్తిః.

అ. ధనం (లేదా ఋణం) ఇవ్వని వానికి ధనం లభించేవరకు ఇతరుల నుండి స్నేహం, సౌజన్యం, మంచి మాటలు, సాధుత్వమూ లభిస్తాయి.

18, తదసత్యమపి నాసత్యం యత్ర న సంభావ్యార్థహానిః.

అ. ధనానికి హాని కలగకపోతే ఆ అసత్యం కూడా అసత్యం కాదు. ఎవరికీ ఏమీ నష్టం కలగని అసత్యం పలికినా దోషం లేదని భావం.

19. ప్రాణవధే సంప్రాప్తే నాస్తి కశ్చిదసత్యవాదః.

అ. ప్రాణాలకు ముప్పు ఏర్పడినప్పుడు అసత్యం పలికినా-అది అసత్యం కాదు.

"ప్రాణావధిర్నాస్తికస్యాసత్యవాదః" అని మరొక పాఠం కూడా ఇవ్వబడింది. "నాస్తికుడు ప్రాణాలు పోయేవరకు అసత్యమే వలుకుతాడు" అని అర్థం చెప్పవచ్చును.

20. అర్థాయ లోకో మాతరమపి హినస్తి; కిం పునరసత్యం న భాషతే?

అ. మానవుడు ధనంకోసం తల్లిని కూడా హింసిస్తాడు. అలాంటప్పుడు అసత్యం పలకకపోవడం అనేది ఉంటుందా?

21. సత్కలాసత్యోపాసనం హి వివాహకర్మ, దైవాయత్తస్తు వధూవరయోర్నిర్వాహః.

అ. వివాహం చేసుకొనడం అనేది మంచి కళలను, సత్యాన్ని ఉపాసించడమే. వధూవరులు సుఖంగా మనడం అనేది మాత్రం దైవాధీనమే.

22. రతికాలే తన్నాస్తి, యన్న కామార్తో బ్రూతే పుమాన్; న చైతత్ప్రమాణమ్.

అ. రతిసమయంలో కామార్తుడైన పురుషుడు పలకని దంటూ (అది ఇస్తాను, ఇది ఇస్తాను అని చెప్పనిది అంటూ) ఉండదు. అదంతా ప్రమాణం కాదు.

23. తావత్ స్త్రీపురుషయోః పరస్పరం ప్రీతిః యావన్న ప్రాతిలోమ్యం, కలహో, రతికైతవం చ.

అ. ప్రతికూలత్వమూ, కలహమూ, రతివిషయంలో మోసమూ లేనంత వరకే స్త్రీ పురుషుల మధ్య పరస్పరం ప్రీతి ఉంటుంది.

24. తాదాత్వికబలస్య కుతో రణే జయః, ప్రాణార్థస్త్రీషు కల్యాణం వా?

అ. ఆ సమయాని కేదో బలం సంపాదించుకొన్నవానికి యుద్ధంలో జయం ఎలా లభిస్తుంది? అతని ప్రాణాలకు, ధనానికీ, స్త్రీలకు క్షేమం ఎలా కలుగుతుంది?

25. తావత్సర్వః సర్వస్యానునయవృత్తిపరః యావన్న భవతి కృతార్థః.

అ. తన పని పూర్తికానంతవరకూ ప్రతీవాడూ ప్రతీ వానితోనూ మంచి మాటలాడుతూ అనుకూలంగా ఉంటాడు.

26. సహసంభవో దేహోఽపి నాముత్ర సహానుయాయీ కిం పునరన్యః?

అ. కూడా పుట్టిన దేహం కూడా పరలోకానికి తనతో కలిసిరాదు, ఇతరుల మాట చెప్పాలా?

27. అశుభస్య కాలహరణమేవ ప్రతీకారః.

అ. ఏదో విధంగా కాలం వెళ్ళబుచ్చడమే అశుభానికి ప్రతిక్రియ. అశుభం కలిగినప్పుడు ఏదోవిధంగా తలవంచి కాలక్షేపం చేసివేస్తే దాని దుష్ప్రభావం తగ్గుతుంది అని భావం. లేదా - పెద్ద పని చేయవలసివచ్చినపుడు తొందరపడి చేయకుండా కాలహరణం (Postponement) చేయడం మంచిది.

28. పక్వాన్నాదివ స్త్రీజనాత్ దేహతాపోపశాన్తిరేవ ప్రయోజనమ్; కిం తత్రానురాగవిరాగాభ్యామ్.

అ. పక్వాన్నంనుంచి వలె స్త్రీలనుండి కూడా దేహతాపాన్ని శాంతింప చేసుకోవడమే ప్రయోజనం; వాళ్ళ విషయంలో అనురాగమూ అవసరం లేదు, విరాగమూ అవసరం లేదు. ఇది వేశ్యాదుల విషయంలో చెప్పిన మాట. స్త్రీలకు పురుషుల విషయంలో కూడా వర్తిస్తుంది.

29. తృణేనాపి ప్రయోజనమస్తి, కిం పునర్న పాణిపాదవతా మనుష్యేణ.

అ గడ్డిపరకవల్ల కూడా ఏదో ఒక ప్రయోజనం ఉంటుంది; అలాంటప్పుడు చేతులూ కాళ్ళూ ఉన్న మనిషివల్ల ఉండదా?

30. న కస్యాపి లేఖమవమన్యేత; లేఖప్రధానా హి రాజానః. తన్మూలత్వాత్ సంధివిగ్రహయోః, సకలస్య రాజ్యవ్యాపారస్య చ.

అ. (రాజు) ఎవని దగ్గరనుండి వచ్చినదైనా లేఖను అవమానించకూడదు. రాజులకు లేఖ చాలా ప్రధానమైనది కదా? సంధియైనా, విగ్రహమైనా లేఖమీదనే ఆధారపడి ఉంటుంది సమస్తరాజ్యపాలనావ్యవహారాలూ దానిమీదనే ఆధారపడి ఉంటాయి.

31. పుష్పయుద్ధమపి నీతివిదో నేచ్ఛన్తి, కిం పునః శస్త్రయుద్ధమ్?

అ. నీతివేత్తలు పుష్పాలతో కొట్టుకోవడం కూడా ఒప్పుకొనరు; ఆయుధాలతో యుద్ధం చేయడం మాట చెప్పాలా?

32. న ప్రభుః, యః బహూన్ బిభర్తి.

అ. చాలా మందిని పోషించేవాడే ప్రభువు.

33. కిమర్జునతరోః ఫలసంపదా? యా న భవతి పరేషాముపభోగయోగ్యా.

అ. అర్జునవృక్షానికి (మద్దిచెట్టు) ఇతరులు అనుభవించడానికి యోగ్యం కాని ఫలసంపద ఉండి కూడా ఏమి ప్రయోజనం?

34. స త్యాగీ యః మార్గపాదప ఇవ సర్వేషాం సంబాధం సహతే.

అ. మార్గంలో ఉన్న చెట్టు వలె అందరూ వచ్చి కిక్కిరిసి పోవడాన్ని (అందరివల్లా కలిగే బాధను) సహించేవాడే త్యాగవంతుడు.

35. పర్వతా ఇవ రాజానః కేచన దూరత ఏవ సున్దరాః.

అ. కొందరు రాజులు, పర్వతాల వలె దూరంనుంచే అందంగా కన బడతారు.

36. లోకవార్తామాత్రరమణీయాః ప్రాయశః సర్వేఽపి దేశాః.

అ. సాధారణంగా అన్ని దేశాలూ కూడ లోకాల మాటలలో మాత్రమే అందంగా ఉంటాయి.

37. అధనస్య అబాన్ధవస్య చ జనస్య మనుజపూరితాపి భూమిర్మ హాటవీ.

అ. ధనమూ, బంధువులూ లేనివానికి ఎంతమంది మనుష్యులతో నిండిన దైనా ఈ భూమి మహారణ్యమే.

38. శ్రీమతో హ్యరణ్యాన్యపి రాజధానీ.

అ. ఐశ్వర్యవంతునికి మహారణ్యం కూడా రాజధానియే.

39. సర్వస్యాప్యాసన్నవినాశస్య భవతి మతిః ప్రాయేణ విపర్యస్తా.

అ. వినాశం దాపురించిన ప్రతివాని బుద్ధి సాధారణంగా విపరీతంగా ఉంటుంది.

40. పుణ్యవతః పురుషస్య న క్వచిదప్యస్తి దౌఃస్థ్యమ్.

అ. పుణ్యవంతుడైన పురుషుడికి ఎక్కడా కూడ అసౌకర్యం అంటూ ఉండదు.

41. దైవమనుకూలం చేత్ కో వా సమ్పదో న కరోతి, న విఘట యతి వా విపదః?

అ. దైవం అనుకూలంగా ఉంటే సంపదలు ప్రోగుచేసికొననివాడు గాని, ఆపదలను తొలగించుకొననివాడు గాని ఎవడు ఉంటాడు?

42. అసూయకః, పిశునః, కృతఘ్నః, దీర్ఘరోషణః - ఇతి కర్మ చణ్డాలాః.

అ. అసూయకలవాడు, చాడీలు చెప్పేవాడు, చేసిన మేలు మరచినవాడు, దీర్ఘకోపం కలవాడు - వీళ్ళు కర్మచండాలులు. చెడ్డపనులను పట్టి చండాలులు.

43. ఔరసః, క్షేత్రజః, దత్తః, కృత్రిమః, గూఢోత్పన్నః, అపవిద్ధః ఇతి షట్ పుత్రాః దాయాదాః పిణ్డదాశ్చ.

అ. ఔరసుడు (సాక్షాత్తు తన పుత్రుడు), క్షేత్రజుడు (నియోగంచేత తన భార్యకు జన్మించినవాడు), దత్తపుత్రుడు, కృత్రిముడు (తాను పెంచుకొన్నవాడు), రహస్యంగా పుట్టినవాడు, పారవేయబడ్డవాడు (అసలు తలిదండ్రులు విడిచివేయగా దొరికినవాడు) అని ఈ ఆరుగురు పుత్రులూ కూడ దాయాదులు (ఆస్తి పంచుకొనేవాళ్లు), పిండం ఇచ్చేవాళ్లు (అనగా తనకు శ్రాద్ధకర్మ చేయడానికి అర్హులు).

44. కానీనః, సహోఢః, క్రీతః, పౌనర్భవః, స్వయందత్తః, శౌద్రశ్చ ఇతి షట్ పుత్రాః న దాయాదాః, నాపి పిణ్డదాః.

అ. వివాహం కాని కన్యకు పుట్టినవాడు, వివాహసమయానికి గర్భవతిగా ఉన్న స్త్రీకి పుట్టినవాడు, కొన్నవాడు, విధవను వివాహం చేసికొనగా పుట్టినవాడు, తనను తానే కుమారుడుగా అర్పించుకొన్నవాడు, శూద్ర స్త్రీయందు జనించినవాడు. ఈ ఆరుగురు పుత్రులు కూడా దాయాదులు కారు, పిండదులు కారు.

45. దేశకాలకులాపత్యస్త్రీసమయాపేక్షః దాయాదవిభాగః, అన్యత్ర యతిరాజకులాభ్యామ్, తత్ర హ్యేక ఏవ భవతి తత్పదార్హః.

అ. దాయాదుల మధ్య విభాగం (ఆస్తి పంపకం) దేశం, కాలం, కులం, సంతానం, స్త్రీలు, కట్టుబాట్లు-వీటిమీద ఆధారపడి ఉంటుంది అయితే, యతులకు రాజకుటుంబంలోను దాయవిభాగం ఉండదు. ఎందుచేత ననగా, ఆ స్థానానికి ఒక్క వ్యక్తి మాత్రమే యోగ్యుడు. రాజ్యాన్ని ఒక్క కుమారుడు మాత్రమే పొందుతాడు కాబట్టి రాజ్యాన్ని కుమారులు మొదలైన వాళ్ళందరూ పంచుకొనే ప్రసక్తి లేదు. యతులుగా వెళ్ళిపోయిన వాళ్ళకి కూడా ఆస్తిలో భాగం ఉండదని అర్థం అయి ఉంటుంది.

46. అతిపరిచయః కస్యావజ్ఞాం న జనయతి?

అ. అతిపరిచయం ఎవనికి అనాదరం కలిగించదు?

47. భృత్యాపరాధే స్వామినో దణ్డః, యది తం భృత్యం న ముఞ్చతి.

అ. భృత్యుడు అపరాధం చేసినపుడు, ఆ భృత్యుణ్ణి స్వామి (యజమాని) విడిచి పెట్టకపోతే, స్వామిని దండించాలి.

48. అలం తస్య మహత్తయా సముద్రస్యేవ, యః లఘుం శిరసా వహతి, అధస్తాన్నయతి చ గురుమ్.

అ. సముద్రం వలె ఎవడు తేలిక అయినవాణ్ణి (నీచుణ్ణి) శిరసా వహిస్తాడో (నెత్తిమీద పెట్టుకుంటాడో) గురువును (పూజించదగినవాడు, బరువైన రత్నాదికము అని రెండర్థాలు) క్రింద ఉంచుతాడో అలాటివాని గొప్పతనంచేత చాలును. అలాంటివాడు గొప్పవాడైతే మాత్రం ఏమి ప్రయోజనం?

49. రతిమన్త్రహోమాహారకాలేషు న కముప్యుపసేవేత.

అ. రతిసమయంలోను, ఆలోచనలు చేసేటప్పుడు, హోమం చేసేటప్పుడు, భోజనం దగ్గరా పైవాళ్ళ నెవరినీ దగ్గరకు రానీయకూడదు. లేదా, ఆ సమయంలో ఆ పనులు చేస్తున్నవాడిదగ్గరికి వెళ్ళకూడదు.

50. సుష్ఠు పరిచితేష్వపి తిర్యక్షు విశ్వాసం న గచ్ఛేత్.

అ. ఎంత బాగా పరిచయం ఉన్నా తిర్యగ్జంతువులను నమ్మకూడదు.

51. మత్తవారణారోహిణః జీవితవ్యే సన్దేహః, నిశ్చితశ్చాపాయః.

అ. మదించిన ఏనుగును ఎక్కేవానికి జీవితం విషయంలో సందేహమే. అపాయం నిశ్చితం.

52. అత్యర్థం హయవినోదః అఙ్గభఙ్గమ్ అనాపాద్య న తిష్ఠతి.

అ. గుఱ్ఱం ఎక్కి ఎక్కువగా వినోదించడం వల్ల ఏ అవయవమో విరగకుండా ఊరికే ఉండదు.

53. ఋణమాదదానో దాసకర్మణా నిర్హరేత్ అన్యత్ర బ్రాహ్మణయతిక్షత్రియేభ్యః.

అ. బ్రాహ్మణుడు, సంన్యాసీ, క్షత్రియుడు తప్ప మరెవరైనా అప్పు తీసికొని తీర్చలేకపోతే దాస్యం చేసి తీర్చాలి.

54. తస్యాత్మదేహ ఏవ వైరీ యో యస్య యథాలాభమశనం శయనం చ న సహతే.

అ. ఎవని దేహం భోజనశయనాదులు ఎలా లభిస్తే అలా సహించదో వానికి ఆ దేహమే శత్రువు.

55. తస్య కిమసాధ్యం నామ యో మహామునిరివ సర్వాన్నీనః, సర్వక్లేశసహః, సర్వత్ర సుఖశాయీ చ.

అ. మహాముని వలె ఎవడు ఏది లభిస్తే అది తింటాడో, అన్ని క్లేశాలకు తట్టుకుంటాడో, ఎక్కడైనా సుఖంగా నిద్రిస్తాడో వానికి సాధ్యం కానిది అంటూ ఏముంటుంది?

56. స్త్రీప్రీతిరివ కస్య నామేయం స్థిరా లక్ష్మీః.

అ. స్త్రీప్రేమ వలె ఈ లక్ష్మి ఎవనిదగ్గర స్థిరంగా ఉంటుంది?

57. పరపైశున్యోపాయేనైవ ప్రాయేణ రాజ్ఞో వల్లభో భవతి లోకః.

అ. సాధారణంగా మనుష్యులు ఇతరులమీద చాడీలు చెప్పడం అనే ఉపాయంచేతనే రాజుకు ఇష్టులు అవుతారు.

58. పరాపవాదేనాత్మోత్కర్షం మన్యతే నీచః.

అ. నీచుడు ఇతరులను గూర్చి చెడ్డగా చెప్పడం ద్వారా తనకేదో గొప్పతనం వస్తుం దనుకుంటాడు.

59. న ఖల్వన్యపరమాణూనామల్పత్వేన మేరుర్మహాన్ భవతి, కిన్తు స్వగుణేన.

అ. మేరుపర్వతం గొప్పది అయినది అంటే ఇతరపరమాణువు లన్నీ అల్పంగా ఉండడం మూలాన కాదు; తనలో ఉన్న గుణం చేతనే గొప్పదయింది.

60. న ఖలు నిర్నిమిత్తం మహాన్తో భవన్తి కలుషితమనీషాః.

అ. మహాత్ముల మనస్సు నిమిత్తం లేకుండా కలుషం కాదు. కలత చెందదు.

61. స ఖలు వహ్నేః ప్రభావః, యత్ ప్రకృత్యా శీతలమపి జలం భవత్యుష్ణమ్.

అ. స్వభావసిద్ధంగా చల్లగా ఉండే ఉదకం కూడా వేడెక్కుతున్న దంటే అది అగ్నియొక్క ప్రభావమే కదా?

62. సుచిరస్థాయినం కార్యార్థీ వా సాధూపచరేత్.

అ. పని కావాలనుకొన్నవాడు చాలా కాలం స్థిరంగా ఉండేవానికి బాగా ఉపచారం చెయ్యాలి. (భావం స్పష్టంగా లేదు.)

63. స్థితైః సహార్థోపచారేణ వ్యవహారం న కుర్యాత్.

అ. స్థిరంగా ఉన్నవాళ్ళతో ధనంతో సంబంధించిన ఉపచారంతో వ్యవహరించకూడదు.

64. సత్పురుషపురశ్చారితయా శుభమశుభం వా కుర్వతః నాస్త్యపవాదః ప్రాణవ్యాపాదో వా, సమయేషు పరం సంభవీ నీతివాదః.

అ. మంచివాళ్ళను ముందు ఉంచుకొని శుభకార్యం కాని, అశుభకార్యం కాని చేసేవానికి అపవాద కాని, ప్రాణహాని కాని కలగదు. అయితే, కొన్ని సమయాలలో నీతిని గూర్చిన వాదం కలగవచ్చు. చేసిన పని నీతిసంమతమా కాదా అని చర్చ రావచ్చు.

65. సంపత్ సంపదమనుబధ్నాతి, విపచ్చ విపదమ్.

అ. సంపద వెనకనే సంపద వస్తుంది, ఆపత్తు వెనకనే ఆపద వస్తుంది.

66. కో నామ దుగ్ధార్థీవ, కార్యార్థీ, గోరివ పరస్యాచారం విచారయతి.

అ. పాలు కావాలనుకొనేవాడు వలె పని కావాలనుకునే ఎవడు ఆవు యొక్కవలె, ఇతరునియొక్క ప్రవర్తనను విచారిస్తాడు? పాలు కావాలనుకొనేవాడు ఆవు ఎలా ప్రవర్తిస్తుంది అనే విషయం ఏవిధంగా ఆలోచించడో అదే విధంగా పని సాధించుకోవాలనుకొనేవాడు ఎదుటివాని ప్రవృత్తిని గూర్చి ఆలోచించ కూడదు.

67. శాస్త్రవిదః స్త్రియశ్చానుభూతగుణాః పరమాత్మానం రఞ్జయన్తి.

అ. అనుభవించబడిన గుణాలు గల శాస్త్రవేత్తలు, స్త్రీలూ కూడ మనస్సును చాలా రంజింపజేస్తారు.

68. చిత్రగతమపి రాజానం నావమన్యేత, క్షాత్రం హి తేజో మహత్ సత్పురుషదేవతాస్వరూపేణ తిష్ఠతి.

అ. చిత్రరువులో ఉన్న రాజును కూడా అవమానించకూడదు; ఎందుచేత ననగా, గొప్పదైన క్షత్రియతేజస్సు సత్పురుషరూపంలో దేవతాస్వరూపంలో ఉన్నది.

69. కార్యమారభ్య పర్యాలోచనం శిరోముణ్డనమను నక్షత్రప్రశ్న ఇవ.

అ. పని ప్రారంభించేసిన తరవాత ఆలోచన చేయడం క్షౌరం చేయించుకొన్న తరవాత "ఈ వేళ నక్షత్రం ఏమిటి?" అని ప్రశ్నించడం వంటిది.

70. ఋణశేషాద్రిపుశేషాదివ అవశ్యం భవత్యాయత్యాం భయమ్.

అ. శత్రుశేషంవల్ల వలెనే ఋణశేషంవల్ల కూడా భవిష్యత్తులో భయం తప్పదు.

71. నవః సేవకః కో నామ న భవతి వినీతః భీతో వా? యథా ప్రతిజ్ఞం నిర్వాహస్తు దుర్లభః.

అ. కొత్తగా నౌకరీలో చేరినవాడు ఎవడు వినయసంపన్నుడు గాను, భయస్థుడు గాను ఉండడు? చెప్పిన ప్రకారం చివరిదాకా పని చేసేవాడు చాలా అరుదు.

72. అప్రాప్తేఽర్థే భవతి సర్వోఽపి త్యాగీ, ప్రాప్తే తు స ఏవాన్యః పరిణమతి.

అ. ధనం లేనంతవరకు ప్రతీవాడు దానశీలుడే ధనం చేరగానే మాత్రం ఆ వ్యక్తే మరొక విధంగా మారిపోతాడు.

73. అర్థీ న పరేషు నీచైరాచరణాదుద్విజేత్; కిం నాధో వ్రజతి కూపే జలార్థీ?

అ. తన పని పూర్తి చేసుకోవాలనుకొనేవాడు ఇతరుల వద్ద నీచమైన పనులు చేయడానికి వెనుకాడకూడదు; నీళ్ళు కావాలనుకొన్నవాడు నూతిలో క్రిందికి దిగడా?

74. స్వామినోపహతస్య తదారాధనమేవ నిర్వృతిహేతుః.

అ. ప్రభువు తూలనాడినప్పుడు కూడా అతనిని ఆరాధిస్తేనే సుఖం కలుగుతుంది.

75. దైవోపహతస్య దైవారాధనమేవ నిర్వృతిహేతుః.

అ. దైవం ఎదురు తిరిగినవానికి ఆ దైవాన్ని ఆరాధిస్తేనే సుఖం కలుగుతుంది.

76. జనన్యా కృతవిప్రియస్య బాలస్య జనన్యేవ హి భవతి జీవితవ్యకారణమ్?

అ. తల్లివల్ల అపకారం జరిగినవానికి కూడా తల్లే జీవనహేతువు అవుతుంది కదా?

77. సారతః సర్వోఽపి సర్వాస్వవ్యవస్థాసు నీతిపథమ్, ఆత్మపథం చ న విస్మరేత్; తదధ్వనీనశ్చ భవేత్.

అ. ఎవ్వడూ ఎట్టి పరిస్థితిలోనూ కూడా నీతిమార్గసారాన్ని, తాను అనుసరించవలసిన మార్గాన్ని మరవకూడదు. ఆ మార్గంలోనే సంచరించాలి.

78. జయన్త్వేవం ధర్మసంపత్సమృద్ధాః రాజానః ప్రజాశ్చ భారతీయాః.

ఇతి ప్రకీర్ణకసముద్దేశః.

ఇతి సోమదేవీయాని నీతిసూత్రాణి.

అ. భారతదేశంలోని రాజు లందరూ, ప్రజ లందరూ ఈ విధంగా ధర్మసమృద్ధులై, సంపదలతో నిండినవారై సర్వోత్కర్షతో, అనగా ఇతర దేశాలవాళ్ళనందరినీ మించి, ఉందురు గాక!

"బాలానందిని" అను సోమదేవ నీతిసూత్రానువాదంలో ప్రకీర్ణకసముద్దేశం సమాప్తం. సోమదేవీయ నీతిసూత్రాలు సమాప్తం.

"నీతివాక్యామృతమ్" అను సోమదేవీయనీతిసూత్రాలకు పుల్లెల శ్రీరామచంద్రుడు తెలుగులో రచించిన "బాలానందిని" అను వ్యాఖ్యానం సమాప్తం.

3-2-1995

శ్రీః శ్రీః శ్రీః

యత్కృపాలేశసంసర్గాదనువాదః కృతో మయా,
తస్యైవ జానకీజానేః పదయోరర్పయామ్యహం. 

దేవతానుగ్రహః పిత్రోస్తపశ్చాచార్యసత్కృపా,
కర్త్రాస్మద్గ్రంథజాతస్య కరణం కేవలం వయమ్.

